# విస్మృతాంధ్రము - విశాలాంధ్రము

చిగవల్లి వేంకటశివరావు

గొప్ప చరిత్రకారుల అశ్రద్ధవల్లను, చిన్న చరిత్రకారుల అశక్తతవల్ల
విశ్వవిద్యాలయాల ఉపేక్షవల్లను, ప్రభుత్వ [illegible] లవల్ల
ఆంధ్ర చరిత్రలో కెక్కకుండా మరుగుపడిన అనేక ఆంధ్ర
చరిత్రాంశములు క్రమక్రమముగా [illegible] చున్న
సంగతిని నిరూపించు అపూర్వ పరిశోధక గ్రంథ మిది.

ఆదర్శ గ్రంథ మండలి
విజయవాడ-2

ఆదర్శ ప్రచురణ :
ప్రథమ ముద్రణ :
మార్చి : 1975

# Vismrutandhramu – Visalandhramu

by

DIGAVALLI VENKATA SIVA RAO

Published by

Adarsa Grandha Mandali

VIJAYAWADA-2

ముద్రణ :
శ్రీ వేంకటరమణ
విజయవాడ-2.

అంకితం

సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు

కీ. శే. శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారికి

# విజ్ఞాపనము

సుప్రసిద్ధ చరిత్రకారుడైన ప్రొఫెసర్ టోయన్‌బీగారు ప్రపంచములోని ముప్పది జాతుల నాగరికతలను పరిశోధించి మత ధర్మములే మానవ చరిత్రకు పునాదియని, సంస్కృతియే నాగరికతయొక్క సారమని నిర్ణయించారు. భారతదేశ మత ధర్మాలను ప్రశంసించారు. ఆసేతు హిమాచల పర్యంతముగల భారత దేశములో వింధ్య కుత్తరమునగల దేశ చరిత్ర చాలవరకు పునర్నిర్మాణమైనదిగాని దక్షిణ భారతదేశ చరిత్ర, అందు ముఖ్యముగా ఆంధ్ర చరిత్ర యింకా నిర్మాణదశలోనే వున్నది. ఉన్న చరిత్రాధారములనైనా సమన్వయముచేసి చరిత్ర నిర్మాణముచేయు కృషి జరుగలేదు. అనేక చరిత్రాంశము లింకా భూగర్భములోనే మరగుపడి యున్నవి. చాలా చరిత్రాధారములు మన యిరుగు పొరుగు రాష్ట్రాలవారి యధీనములో నున్నవి. దక్షిణ దేశములోని భాషలకు, సంస్కృతి సంప్రదాయాలకు, ఉత్తర దేశములోని వానితోగల సంబంధమునుగూర్చి, దక్షిణ దేశములోనే వివిధ ప్రాంతాలలో నున్న ప్రజల వేష భాషలు, సంస్కృతి సంప్రదాయాలను వానికిగల పరస్పర సంబంధములనుగూర్చి, ఆంధ్ర దేశములో జీవించు వివిధ కులములు, కుల వృత్తులవారు, వారి ఆచార వ్యవహారాలను గురించి, గ్రామీణ వ్యవసాయార్థిక వ్యవస్థనుగూర్చి, దేశ కాల ప్రభావములవల్ల వివిధ ప్రాంతాలవారిలో కలిగిన మార్పులనుగూర్చి ఇంకా ఎన్నో విషయాలనుగూర్చి ఎంతో పరిశోధన చేస్తేగాని మన చరిత్ర నిర్మాణము పూర్తికాదు.

ఈ పరిశోధన చేయించటానికి అర్హతగల సంస్థలు విశ్వ విద్యాలయాలే. కాని అమెరికాలోని విశ్వవిద్యాలయాలు భారతదేశ చరిత్రను గూర్చి, పరిశోధనలు చేయిస్తూ వుండగా మన దేశములోని విశ్వ విద్యాలయాలు కన్నులప్పగించి చూస్తూవుండడము దురదృష్టము.

మన విశ్వవిద్యాలయాలకు తగినంత అర్థబలము చేకూర్చలేదు సరిగదా మన ప్రజా ప్రభుత్వ నాయకులు మన విశ్వవిద్యాలయాలలోనికి, విద్యా విధానాలలోనికికూడా రాజకీయాలు ప్రవేశపెట్టినందువల్ల విజ్ఞాన సముపార్జనకు, పరిశోధనకు, విజ్ఞాన వికాసానికి కృషి చేయవలసిన విద్యాలయాలలో రాజకీయ పక్షాలు కక్షలు, తగవులు కలిగి జీత బత్తెముల కోసము, సౌకర్యాలకోసము ఆందోళన చేయుటలో, సమ్మెలలో కాలము వెళ్ళబుచ్చుచున్నందువల్ల విద్యా ప్రమాణములు తగ్గి క్రమశిక్షణ నశించి, నీతి ధర్మాలపైన, పురుషార్థ సాధనపైన లక్ష్యముపోయి స్వార్థపరత్వము హెచ్చి భోగలాలసత్వము పెరుగుచుండగా, దేశాభిమానముతో పరమార్థచింతతో చేయవలసిన చరిత్ర, శాస్త్ర విజ్ఞాన పరిశోధనలు ఎలా కొనసాగుతాయి? అందువల్లనే మన చరిత్ర యింకా నిర్మాణ దశలోనే యున్నది. మనము ప్రపంచములోని నాగరిక జాతులలో వెనుకబడి యున్నాము.

ఆంధ్ర చరిత్ర నిర్మాణమునకు మన చరిత్ర పరిశోధకులు, చరిత్రకారులు, ప్రభుత్వము, విశ్వవిద్యాలయాలు, అందలి ఆచార్యులు, విద్యార్థులు ఆంధ్ర ప్రజానీకము చేయవలసిన కృషిని దిఙ్మాత్రముగానైనా సూచించడమే యీ గ్రంథముయొక్క లక్ష్యము.

శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారి సంపాదకత్వమున తెలుగు భాషా సమితివారు 1959 సం॥లో ప్రకటించిన విజ్ఞాన సర్వస్వం ఆంధ్ర సంపుటములో ఆంధ్ర చరిత్ర నిర్మాణమునకు కావలసిన చరిత్రాంశములన్నీ వుంటాయని అనుకున్నానుగాని 1960 సం॥లో సంగ్రాహకులుగా నియమింపబడిన శ్రీ శర్మగారికి ఆ సమితిలోని రాజకీయాలవల్ల ఆ సంపుటమును రూపొందించటములో స్వేచ్ఛా స్వాతంత్ర్యములు లేక అందులో వారు చేర్చదలచిన విషయాలన్నీ చేర్చలేకపోయినారు. అంతేగాక శ్రీ శర్మగారు చేసిన పూర్వ చరిత్ర పరిశోధనకు సంబంధించిన విషయాలు కూడా అందులో లేవు. ఈ సంగతి వారు నాకు వ్రాసిన ఉత్తరములవల్ల తెలుస్తుంది. ఆ పుస్తకములోని వివిధ విషయాలు రచించినవారి పలుకుబడినిబట్టి వానికి ప్రాధాన్యమివ్వబడినట్లు కనబడినది శ్రీ శర్మగారు 1963 సంవత్సరం జనవరి 6 వ తేదీన దివంగతులు కాగా మన చరిత్ర పరిశోధనకు తీరని లోటు కలిగి

నది. ఆ సంపుటములో చేర్చని విషయాలు, అందులో స్పృశించి వదలిన విషయాలను వివరించడము మన చరిత్ర నిర్మాణమున కత్యంతా వశ్యకమని నాకు తోచి యిప్పు డీ గ్రంథమును ప్రకటిస్తున్నాను. ఇందులోని విషయాలు, చరిత్రాంశాలు నేను ఉడతా భక్తితో చేస్తూవుండిన చరిత్ర పరిశోధన సందర్భములో సేకరించినట్టివి. ఇందులో కొన్ని భాగాలను అప్పుడప్పుడు వివిధ పత్రికలలో ప్రకటించియున్నాను. మిగిలినవి నేను రచించిన "ఆంధ్ర ప్రదేశ చరిత్ర సమీక్ష" అను పెద్ద గ్రంథములోని ప్రకరణములు. హైదరాబాదు చరిత్ర శాస్త్ర విజ్ఞానముల తెలుగు అకాడమీ వారు దానిని ప్రకటించడానికి నిర్ణయించారుగాని దాని స్థాపకులు శాసన సభాపతి శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు దివంగతులు కావడంతో దాని ప్రకటన ఆగిపోయినది. అయితే అందలి పీఠికా భాగమును ఆదర్శ గ్రంథ మండలి యజమానులు, నా మిత్రులైన శ్రీ గద్దె లింగయ్య చౌదరిగారు 1962 సం॥లో "మన ఆంధ్రత్వము" అను పేరుతో ముద్రించారు. అది జనాదరణము పొంది పునర్ముద్రణము నపేక్షించినది. దానిని యిప్పు డీ గ్రంథారంభ భాగముగా చేర్చడమైనది.

ఇదివరకు వివిధ పత్రికలలో ముద్రింపబడిన నా వ్యాస భాగములనే గాక ఇతర చరిత్ర పరిశోధకులు రచించిన వ్యాస భాగములనుకూడా యీ గ్రంథములో నుపయోగించుటకు దయతో అనుమతించిన వివిధ పత్రికాధిపతులకును, గ్రంథాధారములుగా సూచింపబడిన గ్రంథముల గ్రంథకర్తలకు, వ్యాసకర్తలకు కృతజ్ఞుడను.

దిగవల్లి వేంకట శివరావు

శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు
శ్రీదిగవల్లి వేంకట శివరావుగారికి వ్రాసిన లేఖారూపములు:

# తెలుగు విజ్ఞాన సర్వస్వము

మల్లంపల్లి సోమశేఖర శర్మ
ఆంధ్ర సంపుట సంగ్రాహకులు

తెలుగు భాషా సమితి
౫-౩-౧౯౫౧

ఆర్యవర్య, వందనములు. మీరు వ్రాసిన జాబు అందినది. మీరు దయతో చేసిన సూచన లన్నిటిని గమనించినాను. అవి సూచించినందులకు కృతజ్ఞుడను. మీరు సూచించినవాటి నన్నిటిని ఏదోయొక విధమున ఎచ్చటనో యొకచోట ఇమడ్ప ప్రయత్నించెదను. పీష్వాల కాలములో వారినుండి సమ్మానము లందిన పండితులను గురించి వ్రాయగలవారి నెవ్వరినైన సూచింపగలరా? రామశాస్త్రి ఆంధ్రుడా? అత డాంధ్రుడనుట కాధారములు గలవా? వ్రాయవలసిన విషయములు చాలా వున్నవి. ఆ యా విషయములను వ్రాయగల సమర్థు లెవ్వరో తెలియుటలేదు. దయచేసి మీరు కొందరిని సూచింపగలరా?

తమ జాబుకు నిరీక్షించుచు,

భవదీయుడు
మల్లంపల్లి సోమశేఖర శర్మ

(ఇంగ్లీషు జాబుకు తెలుగు అనువాదము)

మద్రాసు,
28-4-51

ప్రియమైన అయ్యా!

.... మీరు చేసిన సూచనలను వందన పూర్వకముగా గమనించాము. కళావులనుగూర్చి మఱచితిని. ఈ విషయమునుగూర్చి వ్రాయు భారము మీ

పైననే యుంచుచున్నాను. మన సాహిత్యముపైన పాశ్చాత్య సాహిత్యము యొక్క ప్రభావము సాహిత్య విభాగముక్రింద రాగలదు. రచయితలపైననే హెచ్చు బాధ్యత యుండును. తమ కొసగబడిన విషయములనుగూర్చి వారు జాగ్రత్తగా ఆలోచించి వారి కిచ్చిన కొద్దిస్థలములో విషయమును గూర్చి వీలైనంత సమగ్రముగా వ్రాయవలెను. మీరు చేసిన అపూర్వములైన సూచనలకు నేను కృతజ్ఞుడను. ఈ సంపుటము పూర్తి యగువరకును మీరు నాకు తోడ్పడుదురని వాగ్దానము చేయగోరెదను. మీతో తరచుగా ఉత్తర ప్రత్యుత్తరములు జరిపెదను.

మద్రాసు నొక విషయముగా రెండవ భాగమున చేర్చితిని. నాకు స్వంతముగా నెట్టి అభిప్రాయము లున్నను, పరిమితములైన హద్దులలో నేను పని చేయవలసియున్నది.

భారతదేశము స్వతంత్రమైన పిమ్మట బ్రిటిషు ప్రభుత్వమునుగూర్చి మన రచయితలు నూతన దృక్పథము నవలంబింపవలసి యుండునని మీరు చేసిన సూచనతో నే నేకీభవించుచున్నాను. అయితే వ్యాస రచయితలుకూడా మనవలెనే తలంపవలెను కదా! రచనా విధానమునందు వారికి బాధ్యత యున్నది. అయితే ఎంతమంది యీ సంగతిని గ్రహించి రచన సాగింతురు? వారికి నేను సలహాల నిచ్చుట బాగుండదు. అట్లు చేయుట అహంభావముగ నుండును. మీ అభిప్రాయ మేమిటి? భగవంతునిపైన భారము వేసి నేను చేయగలట్టిది చేసెదను.

ప్రతి విషయమును గూర్చియు వ్రాయవలసిన సంగతులెన్నో యుండును. మన మిచ్చిన స్థలము చాలదు. 400 పుటలుగల మొదటి భాగములో ఎన్నో విషయముల నిమడ్చవలసి యున్నది. 400 పుటలు గల రెండవ భాగములో రమారమి వేయి విషయముల నిమడ్చవలసి యున్నది. మరి రెండు వందల పుటలు అకారాది సూచిక నిమిత్తము వినియోగింపబడును. ఈ వేయి పుటల గ్రంథము తక్కిన సంపుటములతో ఏకరూపత (Uniformity) కలిగి యుండవలెను.

## తెలుగు విజ్ఞాన సర్వస్వము

ఎమ్. సోమశేఖర శర్మ,
సంగ్రాహకుడు.

మద్రాసు,
7-7-1951.

ప్రియమైన అయ్యా,

మీ పుత్తరము అందినది. మీ ఆరోగ్యము బాగులేనందుకు చింతించు చున్నాను..... తెలుగు విజ్ఞాన సర్వస్వములో మీ రచనలు ఒకటి రెండేన వుండాలని నా నిశ్చితాభిప్రాయము. ఒకటి రెండు నెలలైనా మీ వ్యాసమును పంపగోరెదను.

భవదీయుడు,
ఎమ్. సోమశేఖర శర్మ

మద్రాసు,
9-2-1952.

ప్రియమైన అయ్యా,

మీ ఆరోగ్యము చక్కబడినదని తలుస్తాను. ఎట్టకేలకు కలువులను గూర్చి వ్రాయడానికి మీ రంగీకరించినందుకు సంతోషించుచున్నాను

## శ్రీ శివరావుగారినిగూర్చి శర్మగారి అభిప్రాయము

"శ్రీ శివరావుగారు అసలు చరిత్రకారులు—వృత్తిచే వారు న్యాయవాదులైనప్పటికీ, ఈ విషయము వారి "కథలు - గాథలు" వలన పాఠక లోకమున కిదివరకే విదితమైనది. ఈ చిన్న పుస్తకము — నవ్యాసుల స్వాతంత్ర్య సమరము (1763-1775) దానిని మరింత రూఢ మొనర్చినది."

వార్తే రు
24-8-1958

మల్లంపల్లి సోమశేఖర శర్మ

# విస్మృతాంధ్రము - విశాలాంధ్రము

## విషయ విభాగ సూచిక

### మొదటి భాగము : మన ఆంధ్రత్వము

## రెండవ భాగము : విస్మృతాంధ్రము

# విస్మృతాంధ్రము - విశాలాంధ్రము

## మన ఆంధ్రత్వము

### 1. ఆంధ్రసంస్కృతి, సంప్రదాయములు

ఆంధ్రత్వమనగా సంస్కృతి సంప్రదాయములందు తెనుగుదనము. సంస్కృతి సంప్రదాయములనగా ప్రజల వేషభాషలందు, ఆహారవిహారము లందు, ఆచారవ్యవహారములందు, మతధర్మములందు, వృత్తివ్యాపారము లందు, చిత్తవృత్తులందు, నిత్యజీవితమునందు కనబడు నాగరికత, నాజూకుతనము, శిష్టత. ఇది, వారి ప్రవర్తనములందు, పద్ధతులందు, రుచులందు కనబడును. వారి భగవద్భక్తియందు, ధర్మనిరతియందు, సౌందర్య రసానుభూతియందుకూడా కనబడును.

స్త్రీ పురుషుల కట్టు, జుట్టు, బొట్టు మొదలగువానిలో కనబరచు నాజూకుతనము, ఔచితి, మర్యాదలు, వారి వేషమునకు సంబంధించిన సంస్కృతి. వారి సంభాషణములందు కనబడు మాటల పొందిక, మర్యాద, ఉచ్చారణమున కనబడు నాజూకుతనము, శ్రావ్యత, మాధుర్యము భాషకు సంబంధించిన సంస్కృతి. ఇది సంభాషణముననేగాక, ఆటపాటలలో, సంగీతసాహిత్యములలోకూడా కనబడును. పదకవిత్వము, పద్యకవిత్వము ఈ సంస్కృతికి బాహ్యరూపములే. తుదకు తెలుగువారు సంస్కృతశబ్దము లను ప్రయోగించురీతిలోకూడా ఒక ప్రత్యేకత యున్నదని విజ్ఞులు చెప్పుచున్నారు. స్త్రీ పురుషులు మాటలలో, ఆటపాటలలో ప్రదర్శించు హావభావచేష్టలు, కనుబొమలు, ముక్కు కదల్చుట, చేతులు త్రిప్పుట లోనగు అవయవ విన్యాసములు, వారి నడకలోని యొయ్యారము, వారి తెనుగుదనమునకు తార్కాణమై అభినయముగ, నృత్యముగ పరిణతి చెందును. సంగీతము, నృత్యము, అభినయము, ఆటపాట మాటలందలి లావణ్యము, తెలుగువారి హరికథలందు, కీర్తనములందు, కూచిపూడి భరతనాట్యమునందు, యక్షగానములందు, మాలదాసరుల వీధినాటకము లందు, తెర్గలనాటకములందు, ఇటీవల సినిమాలయందు పరిపూర్ణత చెందినది,

సంగీతసాహిత్యములు, అభినయము, నృత్యము రసానుభూతికి సంబంధించిన సంస్కృతి. ఇట్లే శిల్పము, చిత్రలేఖనము మొదలగు లలిత కళలును దానికి సంబంధించినవే. మనవారి భోజనపద్ధతులు, శాకపాకములు ఆహారమునకు సంబంధించిన సంస్కృతికి తార్కాణములు. రుచులూరు షడ్రసోపేతమగు భోజనము, సాత్వికాహారవిధానము, వంటయందును, వడ్డనయందును ఆహారమును భుజించుటయందును కనబరచు నాజూకు తనమును దీనికి సంబంధించినవే.

స్త్రీ పురుషులు తమజీవితమును సుఖముగను సంతోషముగను గడపుటకు చేయు ప్రయత్నములు, అందులో వారు ప్రదర్శించు నాగరికత, ఔచితియు విహారమునకు సంబంధించిన సంస్కృతి.

ఇండ్లను చక్కగా కట్టుకొనుట, వానిని శుభ్రముగ నుంచుకొనుట, అలుకుట, ముగ్గులుపెట్టుట, గుమ్మమునకు పసుపుకుంకుమలను పెట్టుట, తోరణములుకట్టుట, సింహద్వారమునకు, దూలములకు లతలు, పువ్వులు, పశుపక్ష్యాదుల బొమ్మలు చెక్కించుట, గోడలకు వెల్లవేసి జేగురుపట్టెలను పెట్టుట, ఇతర అలంకరణములనుచేయుట లోనగు కళాదృష్టి వారి సంస్కృతికి తార్కాణముగ నున్నది. నిత్యజీవితమునందు నిత్యకృత్యముల లోను పండుగలందును పర్వములందును శుభకార్యములందును స్త్రీ పురుషుల సంస్కృతి బహుముఖములుగ వెల్లడియగును.

స్త్రీ పురుషులందు కనబడు దయ, సత్య శౌచములు, దైవచింత, పాపభీతి, ధర్మగుణము లోనగునవి, మతమునకు సంబంధించిన సంస్కృతిలో చేరును. గృహదేవతార్చనమునను, దేవాలయములందును, తుదకు గ్రామదేవతల యారాధనమునందును మనసంస్కృతి కనబడును. నాగరిక ప్రజల నిత్యజీవితములందు విద్యావినోదములందు రసానుభూతియందు కొంత పుణ్యము, పురుషార్థముకూడా చేరియుండును. మన దేవతార్చనమున షోడశోపచారములందేగాక, ఉత్సవములందు మేళతాళములతోడి భజనలందు మధురభక్తి కనబడును. భోగము మేళములందును, భరతనాట్యమునందును, భామకలాపమునందును, గొల్లకలాపమునందును కూడా

రసజ్ఞులకు ఆంధ్రుల సంస్కృతి సంప్రదాయములయొక్క విశిష్టత ద్యోతకమగుచుండును.

పూర్వకాలమునాటి అజంతాచిత్రములందును, అమరావతి శిల్పము లందును మాత్రమేగాక, దేవాలయ శిల్పములందుకూడా లోకజ్ఞానముతో పాటు సౌందర్యరసానుభూతికి దోహదమొసగు చిత్రకళ కనబడును.

సంక్రాంతి పండుగదినములందు మన గ్రామములందు స్త్రీపురుషుల కార్యకలాపములందు ఆటపాటలందు ఆచారములందు తుదకు ముగ్గు లందుకూడా మన ఆంధ్రత్వము ద్యోతకమగును.

భారతదేశమునందలి ప్రజలందరికిని వేదశాస్త్ర పురాణేతిహాసములు పరమప్రమాణములు. ఈ విశాలదేశమునందలి స్త్రీ పురుషులు వాని నాధార ముగాగొని జీవించుటకు ప్రయత్నింతురు. తమ నిత్యజీవితములను దిద్దు కొనుచుందురు. అందువలన భారతీయ సంస్కృతి సంప్రదాయము లేర్పడియున్నవి. అయితే వేరువేరు ప్రాంతములందలి దేశకాలపరిస్థితుల వలన ఆచారభేదము లేర్పడినవి. ఈ వివిధ సంప్రదాయములను ఆశ్వ లాయన, బోధాయన, ఆపస్తంబులు సూత్రీకరించినారు.

ఈ సూత్రకారులనాటినుండి నేటివరకు దేశమున కలిగిన మార్పులు వలన కులకట్టుబాటులందు, కుటుంబమర్యాదలందు, గ్రామజీవనవిధానము నందు మార్పులు కలిగినవి. ప్రజల ఆహార విహారములందు, ఆచార వ్యవహారములందు, మతాచరణమునందు చిత్తవృత్తులందును కూడా మార్పులు వచ్చినవి. పూర్వకాలమునాటి పంచగౌడులకును, పంచద్రావిడు లకును గల భేదములేగాక పంచద్రావిడులందు చేరిన ద్రావిడాంధ్ర కర్నా టక మహారాష్ట్ర ఘూర్జరుల దేశభాషలందు ఆచారవ్యవహారములందు వనేక భేదములు వచ్చినవి. ఆంధ్రుల సంస్కృతి సంప్రదాయములకు ప్రత్యేక లక్షణము లేర్పడినవి.

ఆంధ్రుల ధైర్యసాహసములు ధర్మగుణము చరిత్రప్రసిద్ధము లైనవి. తెలుగువారి వేషభాషలు, ఆహారవిహారములు, ఆచారవ్యవహార ములు తెలుగువారికేగాక ఇతరులకుకూడా ప్రీతికరములైనవి. ఆంధ్రుడై

పుట్టుట, ఆంధ్రభాష మాటలాడుట, పూర్వజన్మసుకృతమని భావింపసాగిరి. మన ఆంధ్రత్వము పరంపరాగతమై చరిత్రప్రసిద్ధమైనది.

## ఆంధ్ర వ్యక్తిత్వము

"ఆంధ్రవ్యక్తిత్వము చిరకాలాగతంబైన సంస్కారఫలము. ఆ వ్యక్తిత్వమునందు నితరవ్యక్తిత్వములందువలె విశేషణములు గలవు, ఆంధ్రహృదయశీల మభివ్యాపకముగాని వ్యావర్తకము కాదు; ఉదారముగాని సంకుచితము కాదు; సరళముగాని వక్రముకాదు. ఆంధ్రహృదయ క్షేత్రమం దీ విశేషణము లాదికాలమునుండియు నప్రతిహతముగ ప్రకాశించుచున్నవి. ఆంధ్రభాష, వాఙ్మయము, మతసాంప్రదాయాచారములు - ఆచారవ్యవహారములు, కళలు శిల్పములు నీ శీలమును విశదముజేయుచున్నవి. దేశవ్యాప్తములైన ప్రతిష్ఠాపనల్లం దీ సహజశీలము గోచరంబగుచున్నది. శ్రీశైలము వేదయుగమున ఋష్యాశ్రమము; బౌద్ధయుగమున విహారము; శంకరయుగమున శివక్షేత్రము; బసవయుగమున జంగమమఠము; ఇప్పుడు శిథిలక్షేత్రము. శ్రీశైలము దశాభేదముల పాలైనను ఇప్పటికిని సుప్రసిద్ధమైన యాంధ్రక్షేత్రమగుచున్నది." అని శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు 1924 లో భారతి పత్రిక మొదటి సంచికయందు "స్వవిషయము" అను శీర్షికలో రచించిన వ్యాసమున వ్రాసియున్నారు.

అందు వారింకను ఇట్లనిరి :—

"ఆంధ్రభాష సంస్కృత సంప్రదాయబద్ధమైనను ద్రవిడ సంప్రదాయబద్ధమైనను ప్రత్యేక సంప్రదాయముల ననుసరించి వికసించినది. ప్రాకృత సంస్కృత ద్రవిడభాషల సంపర్కము భాషాభ్యుదయమునకు తోడ్పడినను భాషాశీలమును శిథిలము చేయలేదు. ఆంధ్రభాష స్వరాంతమై సశవర్ణరంజితమై, మృదుమధురస్వభావమును గాపాడుకొనగలిగినది. ఆంధ్రవాఙ్మయము, ప్రాకృత సంస్కృత కర్ణాటక వాఙ్మయముల సంపర్కమును గలిగినను ప్రత్యేకకీర్తిని వికసించినది. మతాచారములు వైదిక జైన

బౌద్ధ శంకర వీరశైవ రామానుజాది మత సంపర్కమును గలిగియున్నను, జ్ఞానమార్గము నవలంబించుచు వ్యక్తిత్వమును విశదముచేయుచున్నది. కళలు దేశకాలపాత్రల స్థితిగతుల కనుగుణముగను వృద్ధిక్షయములను బొందినను ప్రత్యేకలక్షణములను కలిగియున్నవి. జీవన ప్రవాహము నిమ్నోన్నత తలముల నధిగమించినను నిర్మలాకృతినిగలిగి ప్రవహించు చున్నది. ఆంధ్రవ్యక్తిత్వ పరిణామమును నిరూపించుట కపారమైన విషయావగాహనమును జేయుట కాంధ్రలోకము పూనుకొనవలసియున్నది. విషయావగాహనమునకు సాధనములైన ప్రాచీన మందిరములు, బౌద్ధ స్తూపములు, తామ్రశిలాశాసనములు, తాళపత్ర గ్రంథములు, కళా విచిత్రములు, వాఙ్మయ స్వరూపములు నిగూఢములై ప్రకాశము నపేక్షించుచున్నవి. ఈ విషయావగాహనమునకు దోడుగను ఆంధ్ర ప్రపంచమునందు భావరంగమునందు గలిగిన మహాసంచలనము సాదర పరిశోధనమును ప్రకాశమును గోరుచున్నది. గ్రంథకర్తలు చిత్రకారులు కళా ప్రావీణ్యులు సరసములైన రచనలను జేయుచు నవజీవనోదయమును జేయుచున్నారు. ఈ మహోదయ సమయమునందు యథాశక్తిని భారతిని గొలుచుట కవకాశము లారాధకులకు గలవు."

ఆంధ్రపత్రిక 1922 సంవత్సరాది సంచికలో, వారిట్లు వ్రాసియుండిరి:

"ఆంధ్రదేశము భారతేతిహాసములందు ప్రసిద్ధమైన ప్రాచీన దేశము. దేశమునందు ప్రజల జీవనపోషణములకు సాధనములైన నీటి వసతులు, సుక్షేత్రములు, ప్రకృతిపరిస్థితులుగలవు. ప్రజలు ఉదార శీలముగల భగవద్భక్తులు. భాష, స్వరాంతమైన మధురభాష. ఆంధ్ర దేశము, ప్రజలు, భాష, ప్రాచీన సంప్రదాయేతిహాసవంజాతమైన సంస్కారములనుగలిగి, ప్రత్యేకవ్యక్తిత్వమును దెలుపుచున్నవి. ఆంధ్ర పౌరుషము ప్రతికూలపరిస్థితులయందును గోచరించుచు నాంధ్రోద్యమ స్వరూపమునను సువ్యక్తమైనది."*

---

* ఆంధ్రపత్రిక దుందుభి సంవత్సరాది సంచిక 1922 పే.

తెలుగు దేశపు శీతోష్ణస్థితులు మంచివగుటచేత తెలుగువారి ముఖ ముద్ర స్పష్టవికాసముకలదని, వారి ఆహారవిహారములు బలిష్ఠములగుటచే వారి యుచ్చారము దృఢ గంభీర రీతులు గలదని, ద్రవిడపదముల యచ్చు మెత్తదనముగాని సంస్కృతపదముల ప్రౌఢ గాఢ క్లిష్ట వాక్పర ముబగాని లేక, ఆంధ్రభాష యీ మెత్తదనమును బింకమునుకూడ కలిగి బిలిబిలిపలుకులు గలిగియున్నదని, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'తెలుగుదనము—సంప్రదాయము' అను వ్యాసమున వ్రాసి, దానినిగూర్చి యీ క్రింది పద్యములు రచించిరి.

"క॥ ఆతిథ్య గౌరవంబును
స్వాతంత్ర్యప్రియత, స్వల్పసంతోషము దు
ర్నీతివిహీనత, నైచ్యా
పేతత్వము నంధ్రులందు పేర్పడు గుణముల్.

ఉ॥ ఓర్వరు మాయమర్మమును, నుజ్జ్వలధీమహిమంబు పేర్పడన్
నేర్వరుగాక విద్దియలు, నెయ్యము, తియ్యము చూచుకొంద్రు లో
గర్వము తక్కు వేయయిన గంద్రతనంబు గానవత్తు, రా
యుర్వపురుజ్జ్వలుల్ బలసమున్నతు లెన్నఁగ నాంధ్రపుత్రకుల్."

అజ్జరపు పేరయ కవి ఉదయనంబి విలాసమున ఆంధ్ర ప్రజల నిట్లు వర్ణించెను:

" భామ విను శ్రీమదాంధ్రభూభాగమవెడు
హారహారంబునకు సొంపు దనరుచున్న
మధ్యమణిచందమున మహామహిమదాల్చె
భూరి విభవంబు బెజవాడ పురవరంబు.
క్రొత్తవియ్యము కాయగూర లొబ్బట్లు పై
దంపు బూరెలు పంచదార తాలు

*అజ్జరపు పేరయలింగమను కవి క్రీ. శ. 17 వ శతాబ్దివాటి వాడని శ్రీ వీరేశలింగముగారు వ్రాసియున్నారు.

వడలు వల్లంబు మీఁగడల తియ్యని పెర్గు
కమ్మని సిరివాలు గసగసాలు
చిఱు పెసపప్పును తఱచు పీద్యంబులు
కంబళ్ళు నంబళ్ళు కంచుకములు
ఇంగువ జీలకఱ్ఱ వెనసిన మిరియంబు
మంచివాసననెయ్యి మాటదురుసు

తఱచు రణశీల మొప్పు గంధాక్షతములు
నంద మింపొందు శిఖలు, నొయ్యారినడలు
కలిగి కాంతలు పురుషులు కలసి సిరుల
చెలఁగు నయ్యాంధ్ర దేశంబు చెలువుగాంచె

కదళీఫలంబులు ఖండశర్కరయును
పెను పచ్చిపోకలు పనసతొలలు
మామిడిపండ్లు కమ్మని గోఘృతమ్మును
వంకాయ బెంకాయ వలువుపప్పు
బహువిధ భక్ష్యముల్ పరమాన్నమును బైళ్ళు
కంద పెండలములు కాయగూర
అమృతోపమానంబులైన రసావళుల్
శాల్యోదనము పెర్వు సకల రుచులు

గలుగు నూరుఁగాయలు బానకములు నప్ప
డములు వరుగులు వడియముల్ శ్రమము
దీర ననుభవించిరి వేదశాస్త్రార్థవాద
ములకు నలరుచు కోన భూస్థలమునందు."

## ఆంధ్ర త్వావతరణము.

ఏనాడు దండకారణ్యమధ్యమున నాంధ్రరాజ్యమొకటి యేర్పడెనో గాని, అది పురాణేతిహాస ప్రసిద్ధమును, చరిత్రాత్మకమునైన అంకురారోపణముగా పరిణమించినది. ఒకప్పుడు మనరాజులు వింధ్యకిరుప్రక్కలను

గల దేశము నేలిరి; వింధ్యకు దక్షిణమువగల దేశములన్నింటి నేక దేశముచేసి పాలించిరి.

ఏనాడు పైశాచి మహారాష్ట్రి ప్రాకృతములు, గోండి మొదలగు ఆదిమభాషలు ద్రావిడ తెలుగన్నడము మొదలగు దేశిభాషలును సంస్కృతమును కలిసి తెలుగుభాషను గన్నవోగాని, అది మృదు మధురమై, వింధ్యాచలమునుండి కన్యాకుమారివరకును వ్యాపించి, అసంఖ్యాక జనులకు మాతృభాష గనో, రాజభాషగనో అభిమానభాషగనో ఉండి, సంగీత సాహిత్య నృత్యశిల్పకళలకు కాణాచియై విజాతీయులకు కూడా ప్రీతికరమైనది.

ఏరాజు లెంతెంత దేశము, నేయేకాలములలో, పరిపాలించిరోగాని, తెలుగువారి సంస్కృతి సంప్రదాయములు మహారాష్ట్రి ఉత్కల కర్నాటక ద్రావిడ కేరళదేశములకును దేశాంతరములకునుకూడ వ్యాపించి, మహాంధ్రసామ్రాజ్య స్థాపనమునకు దారితీసినది.

వేషభాషలందు, ఆహారవిహారములందు, సంగీత సాహిత్య నృత్య శిల్పకళాసౌందర్యరసానుభూతియందు, గృహకుల, సంఘ సభా మర్యాదలందు దక్షిణాపథమునకంతకును మేలుబంతియగు సంస్కృతి యవతరించినది.

ఆంధ్ర సంస్కృతి సంప్రదాయముల విశిష్టతను గ్రహించిన రసజ్ఞుల కందఱికిని దేశభాషలందు తెలుగు లెస్సయైనది. తుదకు ఆంధ్రుడుగా జన్మించుటఆంధ్రభాష నభ్యసించుట తపఃఫలమైనది.

ఆంధ్ర మహారాష్ట్రి కర్ణాటక తమిళప్రాంతములు వేరు వేరు రాజులక్రింద నున్నప్పుడుకూడా ఆ ప్రాంతముల ప్రజలందరికిని సన్నిహిత సంబంధము లుండెడివనుటకు చరిత్రయేగాక, మన వేషభాషలలోను ఆచార వ్యవహారములలోను నిదర్శనములు కనబడుచున్నవి.

అయితే ఆంధ్రుల వ్యక్తిత్వము చిరకాలానుగతముగ ప్రఖ్యాతి చెందియున్నది. అది ఆప స్తంబునికాలమునుండి గాంధిమహాత్ముని కాలము వరకు పరిణతి చెందియున్నది.

## ఆంధ్రదేశము

ఇంగ్లీషు ప్రభుత్వకాలమున మద్రాసు రాజధానిలో చేరియుండిన గంజాము మండలములోని శ్రీకాకుళముదగ్గర బయలుదేరి, తూర్పు సముద్రతీరము వెంబడిని చెన్నపట్టణముదగ్గరనున్న పులికాటు అను గ్రామముకావేరి వరకునుపోయి, అక్కడనుండి పశ్చిమముపైపునకు బెంగుళూరు వెళ్ళి అక్కడనుండి బళ్ళారికిపోయి, అచ్చటనుండి యుత్తరమున ఔరంగాబాదుజిల్లాలోని పైఠాను అను ప్రతిష్ఠానపురమునకు వెళ్ళి, అటునుండి గోండ్వనదేశములోనుండి నాగపురమునకును, అటుతర్వాత బస్తరు రాజ్యములోనుండి బయలుదేరినచోటునకు మరలవచ్చినచో నీమధ్యగల దేశమంతయు నొకకాలమున తెలుగుదేశముగనుండెనని తెలిసికొనవచ్చును. ఈ చరిత్ర ఇంగ్లీషు చరిత్రపరిశోధకులు తమ గ్రంథములందు వ్రాసియున్నారు.

## ఆంధ్రుల ప్రశంస

ఋగ్వేదమునందు ఆంధ్రుల ప్రశంసయున్నది. ఐతరేయ బ్రాహ్మణమున విశ్వామిత్రఋషి తనపుత్రులలో నేబదిమందియొక్క సంతతి వారిని ఆర్యాశ్రమములయొక్క సరిహద్దులలో నివసించునట్లు శపించెననియు, వారే ఆంధ్రులు, పుండ్రులు, శబరులు, పుళిందులు అని వ్యవహరింపబడుచున్నారనియు, విశ్వామిత్రుని సంతతిలోనివారే దస్యులలో నధికభాగముగ నేర్పడిరనియు చెప్పబడినది. అందువలన ఆంధ్రులారణ్యక అనాగరకజాతులలో చేర్పబడినట్లూహింపవచ్చును.*

ఆంధ్రదేశము దండకారణ్యభాగముగ నుండెను. ఆంధ్రులు దక్షిణాపథమున నున్నట్లు శ్రీమద్రామాయణమున కిష్కింధాకాండమున కలదు. మహాభారతమునందును ఆంధ్రుల ప్రశంసయు, వారి రాజ్య

---

* ఆంధ్రులనుగురించి భాగవతాదులలో మరికొన్ని కధలూ నున్నవి. అంధకులు యదువృష్ణిభోజుల సంబంధులు. కనుక వారిని కేవలం అరణ్యక జాతులలో చేర్పదగదు. [illegible]

ప్రశంసయు గలవు. ఆంధ్రులు దక్షిణాపథవాసులని పురాణములు చెప్పుచున్నవి.

మహానదికి ఉపనదియగు తెలివాహనదికి దక్షిణమున ఆంధ్రభూమి కలదని బహుపురాతనములగు బౌద్ధగ్రంథములందు చెప్పబడినది. తరువాత సుత్తనిపాతమను బౌద్ధగ్రంథమునుబట్టి అంధకరట్టము గోదావరి యొద్దనున్నట్లు తెలియుచున్నది.

చరిత్రారంభకాలమునాటికే ఆంధ్రులు, వింధ్యపర్వతములకు దక్షిణమున దండకారణ్యప్రాంతములందు నెలకొని, గోదావరి కృష్ణానదీ గర్భసీమలందు రాజ్యము స్థాపించినట్లు తెలియుచున్నది. అశోకుని శిలాశాసనము లాంధ్రులను పేర్కొన్నవి. అవి కర్నూలు బళ్ళారి జిల్లాలలో కనబడినవి.

క్రీస్తుపూర్వము మూడువందల సంవత్సరముల క్రిందట మౌర్య చంద్రగుప్త చక్రవర్తి యాస్థానమునసుండిన గ్రీసుదేశపు రాయబారియైన మెగాస్తనీసు ఆంధ్రుల రాజ్యమును వర్ణించుచు వారికి ముప్పదిదుర్గములు, లక్షకాల్బలము, రెండువేలమంది యాశ్వికులును, వేయిఏనుగులునున్నట్లు చెప్పినాడు.

క్రీస్తుపూర్వము మూడవశతాబ్దమునుండి నాలుగువందలయేబది సంవత్సరములకుపైగా దక్షిణాపథమునేలిన సాతవాహనరాజవంశపు రాజులు ముప్పదిమందియున్నారు. * వీరిని మన పురాణములు ఆంధ్ర రాజులని పేర్కొనినవి. పురాణములందు పేర్కొనబడిన ఆంధ్రరాజులే శాసనములందు కనబడు సాతవాహనరాజులని చరిత్రకారు లంగీకరించుచున్నారు. బళ్ళారిజిల్లాలో కనబడిన ఒక శాసనమువలన క్రీ. శ రెండవ

---

* శాలివాహనులు ఆంధ్రభృత్యులని ప్రతీతి. కాగా వారిప్రభువులైన ఆంధ్రరాజవంశమేదో తెలియదు. ఇక్ష్వాకులగుదురా? ఆంధ్రమున నిక్ష్వాకులు ప్రసిద్ధులైన రాజులే. వీరు వేదకాలంనుండి కలరు. వీరినిగూర్చి శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు భారతిలో వ్యాసము వ్రాసిరి.

శతాబ్దమునాటి కా ప్రాంతము ఆంధ్రపథమని వ్యవహరింపబడినట్లు తెలియుచున్నది.

సాతవాహనరాజులకాలమునాటి గుంటుపల్లి, నాసిక, కార్లీ, కన్హేరి గుహాశిల్పములందలి చిత్రములును, సాంచితూర్పుతోరణము, భట్టిప్రోలు, అమరావతినగరములందలి మహాచైత్యములందలి శిల్పములును, ఆనాటి ప్రజల రూపురేఖావిలాసములు, జీవితవిధానమును, నాగరికతను ప్రదర్శించుచు ఆంధ్రవ్యక్తిత్వమునకు తార్కాణముగ నున్నవి.

సాతవాహనరాజగు హాలుడు సంతరించిన గాథాసప్తశతియు ఆంధ్రవ్యక్తిత్వమును తెలుపుచున్నది.

వింధ్యపర్వతములనుండి దక్షిణమున గోదావరివరకును, పడమర ఖిల్లలదేశమునుండి తూర్పున కటకముపై నాధారపడిన మహాశ్ప అని వ్యవహరించబడిన ఖోందులదేశమువరకును వ్యాపించియుండిన గోండ్వనమను అరణ్యప్రదేశమునందు వసించు గోండులు మొదలైన ఆటవికజాతులవారి వేషభాషలును, మతాచారవ్యవహారములును, ఉత్తరమునుండి దక్షిణమునకు చొచ్చుకొనివచ్చిన ఆర్యుల సంస్కృతభాషయు, వైదికధర్మములును నాగరికాచారములును, దక్షిణమునుండి వ్యాపించిన ద్రావిడభాషయు దాక్షిణాత్యసంప్రదాయములును, దక్షిణాపథమున సాతవాహనులేలిన ఆంధ్రదేశమునందు కారసిల్లుటవలన నక్కడ నొక అపూర్వమైన సంస్కృతిపుట్టి పెరుగుట కవకాశము లేర్పడెను. ప్రాకృత సంస్కృతములు వైదికబౌద్ధమతధర్మములు వివిధభాషలు మాటలాడు ప్రజల పలుకుబడులు, విభిన్నములైన జాతుల యాచారములును, సంస్కృతి సంప్రదాయములును తెలుగువారిలో లీనమైనవను సంగతి మన భాషను ఆచారవ్యవహారములను జాగ్రత్తగా పరిశీలించినవారందరు సంగీకరించుచున్నారు.

తెలుగుభాష సంస్కృతమునకు చాలా సన్నిహితముగానుండి, అందులో సంస్కృతశబ్దములు విశేషముగా కలిసియున్నను, ప్రాకృతశబ్దములును గొండిమాటలును ద్రావిడ పదములు మొదలగు దేశ్యములును వాని

తత్సమములు తద్భవములు రూపాంతరములు నేటికిని తెలుగులో కనబడు చున్నవి. శాతవాహనులకాలమున మహారాష్ట్రిప్రాకృతమే రాజభాషయు, కావ్యభాషగాను వుండెను. తెలుగు నాగరిక భాషగానుండినట్లు కనబడదు.*

మన జాతకర్మలందు, ఉపకర్మలందు, వివాహాచారములందు, వ్రతములందు, నోములందు, పండుగలలో ఆరాధన విధానములలో వైదిక బౌద్ధజైనమత ధర్మములకు ద్రావిడ సంప్రదాయములకు సంబంధించిన ఆచారములేగాక, ఆదిమనివాసుల ఆచారములుకూడా కొన్ని కనబడు చున్నవి. మేనరికము నుతర భారతదేశీయులు హర్షింపరు. అది ఆంధ్ర దేశములో శిష్టాచారమై ద్రావిడదేశమునకూడా అంగీకరింపబడినది. ఇది గోండుజాతివారిలో పూర్వాచారముగానున్నది. నిగమాగమముల ప్రకారము జరుగు దేవతార్చనములతోపాటు మహాయాన బౌద్ధదేవతల యారాధనము ఆగమోక్తములగు మంత్రతంత్రములతోపాటు బౌద్ధజైన సంప్రదాయ ములు, వానితోడు ఆదిమవాసులకు ప్రీతికరములగు దేవతల పూజయు అనేక రూపములు దాల్చినది. దేవాలయములందలి శైవవైష్ణవదైవము లతోపాటు గ్రామదేవతల యారాధనము కొలుపులును ఆంధ్రదేశమున వ్యాపించినవి. దీనితోడు పున్నత కులములందు అద్వైత వేదాంతమును, జనసామాన్యమునందు వేదాంతమునకు తుల్యమైన తత్వబోధలును వ్యాపించియున్నవి. గుంటుపల్లి, నాసిక, కార్లీ, కన్హేరి గుహాశిల్పములును సాంచి స్తూపతోరణము, భట్టిప్రోలు, అమరావతి నగరముల మహా చైత్యములును శాతవాహనయుగమునాటి శిల్పులయొక్కయు, కళాకారుల యొక్కయు అద్భుతకౌశలమునేగాక, ఆ కాలమునాటి ప్రజల రూపురేఖా విలాసములను జీవితవిధానమును సంస్కృతినికూడా తెలుపుచున్నవి. ఆకాలమునాటి నాణెములవలనను, శిల్పచిత్రములవలనను, బృహత్కథ వలనను, హాలుని గాథాసప్తశతివలనను, నాగార్జునాచార్యుని గ్రంథముల వలనను అప్పటి ఆంధ్రసంస్కృతి తెలియుచున్నది.

---

* ఆంధ్రదేశములోవలె మరేదేశభాషయందూ సంస్కృతపదమున్న [illegible] వినబడదు. సంస్కృతపదము [illegible] ఆంధ్ర [illegible] అది ఆంధ్రములో నిముడుతుంది.

తెలుగుజాతిలో వివాహములందు మంగళసూత్రమును కట్టుట అనాదియాచారము, ఈ యాచారము ఉత్తరదేశములలో లేదు. గృహ్య సూత్రములలో లేనందున నిది ఆర్యుల ఆచారము కాదనవచ్చును. ప్రాచీన కాలమునుండి ఆంధ్ర స్త్రీలకు వివాహములందు తాటియాకు చుట్టచుట్టి దానికి పసుపుపూసి నూలిదారముతో కట్టి, వరునిచే మూడుముళ్లు వేయించుట యాచారము. అందువలననే దానికి తాళిబొట్టని పేరువచ్చెను. అట్లే ఆంధ్ర స్త్రీలు చెవులకు కమ్మలను – అనగా తాటియాకులనే చుట్టి పెట్టుకొనుట యాచారము. తాటాకుపదమే సంస్కృతమున తాటంకమైనదని, తాళిబొట్టు కట్టుకొనుటయు, చెవులకు తాటియాకుల కమ్మలను ధరించుటయు తెనుగు వారినుండియే తక్కిన పంచద్రావిడులలో వ్యాపించినదనియు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలవారి యభిప్రాయము. "ఆంధ్ర ద్రవిడ కర్ణాట మహా రాష్ట్రాశ్చగూర్జరాః" అని యీ యైదుజాతులవారును పంచద్రావిడులని పూర్వులు పేర్కొనియున్నారు. కన్నడులకును అరవవారికిని మన తెలుగు వారితో వేషభాషలందు ఆచారములందు గల సన్నిహిత సంబంధము మనము గమనించుచున్నను మహారాష్ట్రులకును గూర్జరులకును మనతో గల సంబంధమును మాత్రము మనము గమనించుటలేదు. వారి వేషభాషల తోను, ఆచారములతోనుకూడా మనకు చాలా దగ్గరచుట్టరికమున్నది.

శాతవాహనులును, వారితరువాత దక్షిణాపథము నేలిన ఇతర రాజ వంశములవారును రమారమి పన్నెండువందల సంవత్సరములు మహా రాష్ట్ర కన్నడ ఆంధ్రప్రాంతములన్నియు కలిపి పాలించుటవలన, ఆంధ్ర సంస్కృతి సంప్రదాయములకు మహారాష్ట్ర కన్నడ సంస్కృతి సంప్రదాయములతో సన్నిహిత సంబంధమేర్పడియుండెను. ఆంధ్రుల వేషభాషలందు ఆచారవ్యవహారములందు సంస్కృతి సంప్రదాయము లందు నిప్పటికిని మహారాష్ట్ర కర్ణాట అధారములు కనబడుచుండును.

శాతవాహనుల తరువాత దక్షిణాపథము నేలిన రాజవంశములవారిలో క్రీ. శ. ఆరవశతాబ్దిలో వాతాపిని రాజధానిగా చేసికొని దేశమును పరి పాలించిన పశ్చిమ చాళుక్యులును, [illegible] - 975 మధ్య మాన్యఖేటమును రాజధానిగా చేసికొని దేశమునేలిన రాష్ట్రకూటులును, ఆటుతరువాత

1189 వరకు మాన్యఖేటమును కళ్యాణిని రాజధానులుగా చేసికొని దేశము నేలిన పశ్చిమ చాళుక్యులును మహారాష్ట్ర కర్ణాటకాంధ్రప్రజలను కలిపి పాలించుచుండిరి. రాష్ట్రకూటులును, పశ్చిమచాళుక్యులును వేంగిరాజ్యమును జయించుటకు యుద్ధములుచేయుచుండిరి పశ్చిమ చాళుక్యులలో త్రిభువనమల్ల ఆరవ విక్రమాదిత్యమహారాజు విక్రమచోళుని కాలములో వేంగిరాజ్యముమీదికి దండెత్తివచ్చినాడు. దేశమును కన్నడఉద్యోగులు పాలించిరి. విక్రమాదిత్యుని ప్రధానమంత్రియైన విజ్ఞానేశ్వరుడు రచించిన మితాక్షరము మహారాష్ట్ర కర్ణాటాంధ్రులు మొదలగు పంచద్రావిడుల కందరికినీ పరమప్రమాణమగు ధర్మశాస్త్రమైయున్నది.

1187 నుండి 1294 వరకును దౌలతాబాదు అనబడు దేవగిరిని రాజధానిగా చేసికొని దేశమునేలిన యాదవరాజుల మంత్రియైన హేమాద్రి రచించిన చతుర్వర్గచింతామణిలోని దానఖండమును వ్రతఖండమును మహారాష్ట్రులు కన్నడులును ఆంధ్రులును వ్రతాచరణమునందు శిరసావహించుచున్నారు. ఇట్లీ మూడుభాషలవారికిని మతాచార వ్యవహారములందు సన్నిహిత సంబంధము లేర్పడియున్నవి.

క్రీ. శ. ఏడవశతాబ్దినుండి యెదువందల సంవత్సరములు వేంగి దేశము నేలిన తూర్పుచాళుక్యులు పశ్చిమచాళుక్య వంశమువారే. ఆ కాలమున రెండుప్రాంతములకు రాకపోకలుండెను. కన్నడదేశమునుండి వేంగిదేశమునకు వచ్చిన కవులు, గాయకులు, పండితులు ఇతరవృత్తులవారు ఆంధ్రనాగరికతను వృద్ధిచేయుటకు తోడ్పడిరి.

సంగీత సాహిత్యములందు ఆంధ్రభాషకు మహారాష్ట్ర కన్నడములతో సన్నిహిత సంబంధ మేర్పడియుండెను.

తూర్పుచాళుక్యులలో ప్రసిద్ధిగాంచిన రాజరాజనరేంద్రుడు కాంచీపురమునేలిన చోళరాజుల యల్లుడు. ఆయనకుమారుడైన రాజేంద్రచోళుడు 1070 లో మాతామహుని రాజ్యమునకుగూడా వారసుడై కులోత్తుంగ చోళ చక్రవర్తియను పేరుతో ఆంధ్ర ద్రవిడదేశముల నేకముచేసి

పాలించెను. ఆయనతరువాత ఆయనవంశమువారు నూరేండ్లు రెండుదేశ ముల నేలుటవలన ఆంధ్రదేశములోని ప్రజలకు తమిళులతో సన్నిహిత సంబంధము లేర్పడెను.

క్రీ. శ. 12, 13 శతాబ్దములలో కాకతీయులకాలమున ఆంధ్ర దేశము ఉత్తరమున బస్తరువరకును, దక్షిణమున కాంచీపురమువరకును వ్యాపించెను.

క్రీస్తుశకము 14వ శతాబ్దములో నుద్భవించిన విజయనగర సామ్రాజ్యము నేలిన ఆంధ్రచక్రవర్తులు కృష్ణానది మొదలు కన్యాకుమారి వరకును గల దక్షిణదేశము నేకఛత్రముగా పరిపాలించుటవలన ఆంధ్ర ద్రవిడ కర్ణాటములకు సన్నిహిత సంబంధములుండెను.

వీరితరువాత గోల్కొండ సుల్తానులు యావదాంధ్రదేశము నేలిరి. హైదరాబాదు నిజామును ఇంగ్లీషువారును కలిసి మనదేశమును మూడు ముక్కలుచేసిరి. ఇట్లు ఆంధ్రులకు మహారాష్ట్ర కన్నడ తమిళప్రజలతో మొదటినుండియు సన్నిహితసంబంధము లేర్పడియుండినందువలన వారి సంప్రదాయములతో పోలికలున్నను ఆంధ్రవ్యక్తిత్వమునకు ప్రత్యేక విశిష్టత కలిగెను.

## 2. వేషభూషణాలంకరణములు

తెలుగువారి కట్టు, జుట్టు, బొట్టు ఎటువంటివని మన నెవ్వరైన ప్రశ్నించినచో దానికి వెంటనే జవాబు చెప్పలేము. దీనికికారణము: ఆంధ్ర దేశములోని స్త్రీ పురుషుల వేషభూషణాలంకరణములు వివిధములై యుండుట—అవి యనుక్షణము మారుచుండుట.

ఇప్పుడు పురుషులలో చాలామంది పెద్దవారు ధోవతిని విశ్చగోచి పోసికొనిగాని, గోచి చెంగున జారవిడిచిగాని కుచ్చెళ్ళు పోసి కట్టుకొను చున్నారు. కొందరు షర్టును ధరించుచున్నారు. కొందరు కంఠమెత్త

చొక్కాలను, లాల్చీలను ధరించుచున్నారు. పైమీద నుత్తరీయము వేసి కొనుచున్నారు. కొందరు బర్నింగుకాలరుగల కోట్లను, నెక్టయిలను ధరించుచున్నారు; మరికొందరు వెస్టుకోటులనుధరించుచున్నారు. కొందరు పాగాలను ధరించుచున్నారు; మరికొందరు గాంధి టోపిని పెట్టు కొనుచున్నారు, కొందరు క్రాఫుజుట్టు పెట్టుకొనుచున్నారు; మరికొందరు జుట్టుముడి నుంచుకొనుచున్నారు. కొందరు గంధాక్షతలు, కొందరు కుంకుమ, మరికొందరు చుక్కబొట్టు ధరించుచున్నారు. యువకులు నాగర కులు పంట్లామును, బుష్షర్టును ధరించి, క్రాపింగుదువ్వుకొని మొగము నందు బొట్టులేకుండా నుందురు. కాళ్ళకు కొందరు చెప్పులను, మరి కొందరు స్లిప్పర్లు ఇంకను కొందరు బూట్సు ధరించుచున్నారు.

ఇప్పుడు కొద్దిమంది మాత్రమే బుగమీసములు, కత్తిరి మీసము లుంచుకొనుచున్నారు. చాలామంది మీసములు తీసివేయుచున్నారు. యువకులు కొంతమంది హిట్లరు మీసములనుగాని, సినీమానటుల సన్నని పంపుమీసములనుగాని ధరించుచున్నారు.

ఇప్పటికిని పల్లెటూళ్ళలోని పురుషులు తలవెంట్రుకలను బాగా పెంచి దువ్వి ముచ్చటముడులుగను, కొండికిశిఖలుగను ముడుచుచున్నారు. గిరజాలుంచుకొనుచున్నారు. పూర్వాచారపరాయణులు తలను క్షౌరము చేయించుకొని, గోష్పాదమంత జుట్టునుంచుకొని ముడివేసికొనుచున్నారు.

ఏబదేండ్లక్రిందటి మన పట్టణములందుకూడ ఇన్ని క్రాపింగు తలలు కనబడెడివికావు. అష్టాదివర్ణములపురుషులకును జుట్టుముళ్ళుండెను. ఆనాటి నాగరికులు గిరజాలనుంచుకొనుచుండిరిగాని, తమ శిరోజములను కత్తిరింపక ముచ్చట ముళ్ళు వేసికొనుచుండిరి ఆ కాలమునను బుగ్గ మీసములను పెంచుట, కోరమీసములను మెలివేయుట అందముగా నెంచు చుండిరి.

పూర్వము తెలుగు దేశమునందలి సంపన్నులు పెద్దరచు జరీ కమ్ములుగల సన్నని నేతపంచలను ధరించుచుండిరి. పట్టుసాలె నూలుతో నేసిన పంచలు, ఉప్పాడ నేతపంచలు, ఉత్తరీయములు నాణెముగా

వెంచుచుండిరి. * పట్టణములందలి నాగరికులు గ్లాస్గోమల్లుపంచ అను కట్టుకొని, తెల్లని లాంగు క్లాతు లేక కేంబ్రేకు కమీజాలను బొత్తాములను ధరించుచుండిరి. ఈ కమీజాలు నేటి షర్టులవలెగాక ముంజేతుల దగ్గరను వక్షస్థలము దగ్గరను చాలా దళసరిగానుండి గంజిపెట్టి యిస్త్రీచేసినప్పుడు అట్టలవలె నిలువబడి యుండెడివి. ఆ కాలమున నీ కమీజాలకు మెడనుండి వక్షస్థలమువరకు బంగారు బొత్తాములు పెట్టుకొనుచుండిరి. ముంజేతులకును బంగారు బిళ్ళల బొత్తాములు లేక బంగారుఖడ్డీ బొత్తాములు పెట్టుకొనుచుండిరి.

ఇంగ్లాండు దేశములో విక్టోరియారాణి కాలమునాటి దొరల బొమ్మలలో కనబడు షర్టులు, కోటులు స్వల్పమైన మార్పులతో మనవారు ధరించుచుండిరని చెప్పవచ్చును. ఉద్యోగులును, నాగరికులును సన్నని జరీఅంచు నేత తలపాగాలనుగాని గ్లాస్గో తలపాగాలనుగాని ధరించి, జరీ ఉండువాలను వల్లెవాటుగా వేసికొనుచుండిరి.

ఆ కాలమునాటి పురుషులు తమ చెవులకు రవ్వల తమ్మంట్లు పెట్టుకొనుచుండిరి. వ్రేళ్ళ కుంగరములు ధరించు చుండిరి, చేతికి మురుగులు, మురిడీగొలుసులు ధరించుచుండిరి. మెడలో ముత్యాలహారములు, పగడాల దండలను వేసికొనుచుండిరి. కొందరు బంగారు చిక్కములుగల రుద్రాక్షలను, స్ఫటికముల పేరులను ధరించుచుండిరి. *

మహమ్మదీయ పరిపాలనకాలమున పురుషులు పాగాలు, అంగరకాలు, షేర్వానీలు ధరించి, గోలకొండ సుల్తానుల దర్బారు మర్యాదల ననుకరించి, ఆనాటి వేషభూషణాలంకరణములను ధరించు

---

* పూర్వము ఫిర్కావిధోవతీ కట్టుటాచారము.

* దండకడియాలు పెట్టుకొనేవారు. పురుషులు చెవికి జంపులు పెట్టుకోవటం, ముక్కుకు కొందరు వత్తులు పెట్టుకోవటం, కాలిబొటనవ్రేళ్ళకు చెల్లాలు పెట్టుకోవటము కలదు.

చుండినట్లు చిత్తరువులవలనను గ్రంథములందలి వర్ణనములవలనను తెలియుచున్నది.

ఆంగ్ల యుగారంభమునాటి విజయనగర సంస్థానము నేలిన రాజుల చిత్రములనుబట్టియు, పెద్దాపురపురాజుల బొమ్మలనుబట్టియు ఆంధ్ర దేశమునం దానాడు రాచవారి వేషభూషణాలంకరణములు తెలిసికొనుటకు వీలున్నది. రాచవారు జుట్టును కొండసిగగా లేక ముచ్చట ముడిగా వేసి కొని, గిరజాలమంచుకొని కోరతలపాగాలు ధరించుచుండిరి. ముఖమున తిరుచూర్ణమునుగాని, కుంకుమనుగాని, గంధాక్షతలనుగాని ధరించుచుండిరి. వారు తమ చెవులకు రత్నములను ముత్యములను తాపిన తమ్మంట్లను బంగారుపోగులను ధరించుచుండిరి. మెడలో ముత్యాలహారములు, చేతి వ్రేళ్ళకుంగరములు, మురుగులు, మురిడీగొలుసులు, భుజబంధులు, దండ కడియములను ధరించుచుండిరి. నడుముకు రత్నముతాపిన బంగారు పటకాయును, పట్టుదట్టియును, అందులో నవరత్నములు తాపిన పిడులు గల బాకులును కరవాలములును ధరించుచుండిరి. వారు బుగ్గమీసములను గాని, మెలిపెట్టిన కోరమీసములనుగాని వీరపురుషోచితముగా నుంచుకొని, తమపంచెలను వెనుకకు విరిచికట్టి, అంగరకాలను ధరించుచుండిరి. పట్టు మాలు జలతారు ఉత్తరీయములను వల్లెవాటుగా వేసికొనుచుండిరి.

మన వెలమదొరల చిత్రములవలన వారి వేషభూషణాలంకరణములు తెలియుచున్నవి. వెలమవారు సాధారణముగా రాచవారి ననుకరించి నను వారి కొండిశిఖలు, బుగ్గమీసములు చాల ప్రసిద్ధిచెందినవి. ఇక రెడ్ల వేషభూషణాలంకరణ విధానములును ప్రత్యేకమైనవే. "తలనిండా జుట్టు, పట్టెడు ముచ్చటముడి, చేతులకు అంగుళము వెడల్పు తోడామురుగులు, చెవులకు అర్ధరూపాయికాసంత లేపి అంతరాళముకమ్మలు, రెండుచేతులకు అన్ని వ్రేళ్ళకు రకరకములయుంగరములు" తమ చిన్నతనమున రెడ్డి యువకులు వేషముగా నుండెనని శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వ్రాసి యున్నారు.

అంతకుపూర్వము తెలుగు దేశములోని వివిధకులముల పురుషుల

వేషభూషణాలంకరణములు మన కవుల గ్రంథములందు వర్ణింపబడి యున్నవి.

ఈ కాలమున మన తెలుగుస్త్రీలు చాలామంది రకరకముల చీరెలను జాకెట్లను నగలను ధరించుచున్నారు. నేడు సినీమాలలో కనబడు వేషభూషణాలంకరణములను ధరించుటకు ముచ్చటపడుచున్నారు. వాయిలు,కాటను జార్జెటు, రేషనుసిల్కు మొదలగు ఉలిపిరి వస్త్రములనే గాక, ఒడలెల్ల కనబడు నైలాను చీరెలను కట్టుకొనుచున్నారు. మన దేశా చారప్రకారము భర్తకుతప్ప పరపురుషులకు కనబరుపరానిమెడ, జబ్బలు, పొట్ట, బొడ్డు లోనగు శరీరభాగములు దారిని పోయెడువారందరికిని కనబడునట్లు తమ చీరెలను రవికెలను ధరించుచున్నారు. ఇందుకు భిన్న ముగా శరీరము నిండుగా వస్త్రములు ధరించువా రనాగరకులుగా పరిగణింపబడుచున్నారు.

మన స్త్రీ లిప్పుడు చెవులకు చిత్రవిచిత్రములైన దుద్దులను కమ్మలను పోగులను లోలాకులను ధరించుచున్నారు. మెడలో నెక్లెసులు ధరించుచున్నారు. ఒకచేతినిండ గాజులజతలను రెండవచేతికి రిస్టువాచీని పెట్టుకొనుచున్నారు. ముఖమున చిత్రవిచిత్రములైన నమూనాలలో తిలక ములను దిద్దుకొనుచున్నారు. ఒక్కొక్క వారమున వచ్చిన సినీమాలో కన బడిన వేషభూషణాలంకరణము లింకొకవారమున మన స్త్రీలు అనుకరించు స్థితి వచ్చినది. కొందఱు మెడలలో హారములు పతకములు ధరించు చున్నారు. ముక్కుపుల్లలును బేసరులును ధరించు స్త్రీలు నేడు తగ్గిపోయి నారు, అడ్డబాసలను, నత్తులను ధరించువారు లేనేలేరు.

నేటి స్త్రీలు ముఖములకు రకరకములపౌడఱుల నలదికొని, పెద వులకు రంగుపూసికొని, చేతిగోళ్ళకు రంగువేసికొనుచున్నారు. స్త్రీలు తమ శిరోజములను వింత చుట్టలుగాచుట్టుచున్నారు. జడలువేసికొనుట, జడ చుట్టలుచుట్టుకొనుట-లేదు పువ్వులు తలవెంట్రుకలనుండి జారవిడుచు నట్లుగా పెట్టుకొందురేగాని, తలలో ముడుచుకొనరు.

మన స్త్రీలిప్పుడు కాళ్ళకు అందెలు, కడియములు, పట్టగొలుసులు

పెట్టుకొనుటలేదు. కాలివ్రేళ్ళకు మట్టెలు ధరించువారు తగ్గిపోవుచున్నారు, కాలికి పసుపు పారాణి పెట్టుకొనుట మోటుగా నెంచుచున్నారు. మన పల్లెటూళ్ళలోమాత్ర మిప్పటికిని బనారసు పట్టుచీరెలును, దక్షిణాది చీరెలును ధరించి, రవికెలుధరించి, ముక్కుపుల్లలు అడ్డబాసలు నత్తులు ధరించువారును, కాసులపేరు చంద్రహారము గజ్జెల యొడ్డాణము పట్టెడ నానుకోళ్ళు కుతిగంటు పూసలు మున్నగు పాతకాలపు నగలు ధరించువారు కనబడుచున్నారు. కాళ్ళకు కడియములు నందెలు గొలుసులు ధరించి, పసుపు పారాణి పెట్టుకొని కాలివ్రేళ్ళకు మట్టెలు ధరించుచున్నారు. జడను చుట్టచుట్టి పైపాయల' పువ్వులు ధరించుచున్నారు. పూర్వకాలపు ముత్తయి దువలు కొప్పు పెట్టుకొని నుదుటను అర్ధణాకాసంత కుంకుమబొట్టును ధరించుచుందురు.

పూర్వము అనగా నెంతో కాలము క్రిందట కాదు, ఏబదేండ్ల క్రిందటివరకును పట్టణవాసములందలి స్త్రీలు సయితము పైన చెప్పిన విధముగనే చీరెలు రవికెలు ధరించి, ఆ విధముగనే నగలు పెట్టుకొను చుండిరి. అయితే, అప్పటికే రాగిడి, చంద్రవంక, సూర్యుడు, చంద్రుడు, తమలపాకు, మొగలిరేకు, పాపిడిబిందీలు, జూకాలు, బంగారుజడ, మొహరీలపేరు, వరహాలపేరు, బావిలీలు, ముక్కుపుల్లలు, దండ కడియములు, అడ్డబాస, నత్తు మొదలైన పూర్వకాలపునగలు, మోటుగానెంచు చుండిరి. ఆ నగలను రాచవారు, ఇతరకులములలోని సంపన్నులును ధరించుచుండిరి. చాలామంది యీనగలను ధరింపక, పెట్టెలో పెట్టి పూజించు చుండిరి.

పూర్వము తెలుగు దేశపు స్త్రీలు బందరు గువ్వకన్ను అద్దకము చీరెలును చుట్టుబెంగాలిచీరెలను పట్టుచీరెలను అద్దాలరవికెలను ధరించు చుండిరి. కొమ్మంచుచీరెలను, చంద్రగిరిచీరెలను నాజూకుగానెంచుచుండిరి. వన్నెవి యులిపిరి తెల్లచీరెలను కట్టుట మర్యాదగా నెంచుచుండిరి. మొగ మునకు పసుపురాచికొని, కుంకుమబొట్టు ధరించుచుండిరి. కాళ్ళకు పసుపు పారాణి పెట్టుకొనుట శుభప్రదముగా నెంచుచుండిరి. కొప్పును పెట్టు

కొనుట, కచ్చవోసి చీరెకట్టుకొనుట మర్యాదగా నెంచుచుండిరి. కట్టు జుట్టు బొట్టులలో కొంచెము నాజూకుతనముచూపువారిని సామాన్యసంసారులు ఎగతాళిచేయుచుండిరి.

తెలుగుదేశమున రాచవారి స్త్రీజనముయొక్క వేషభూషణాలంకరణములు చాలా నాజూకైనవిగ నుండెను. "పొడుగుకుతగిన నిండైన విగ్రహము, పాదాలమీద జీరాడుతూ చారల తాబొందూ, చేతులకు కంకణాలూ, పోచీలూ, మురుగులూ, చెవులకు జూకాలూ, కరిణిపువ్వులూ—వీటితో క్షత్రియసామాన్యస్త్రీగా కాదు, మహారాణిలాగ కనబడేవారామె నాకు" అని శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగా రొక రాచవారియింటి యాడుపడుచునుగూర్చి వ్రాసినారు.

శుకసప్తతిలోను హంసవింశతిలో కరణం, రెడ్డి మొదలైనవారి వేషములూ దెలుపబడినవి.

పూర్వము మన తెలుగుదేశపుస్త్రీలు కొందరు పమిటిపావడాలను కట్టుకొని, రవికెలను ధరించుచుండిరి. చిన్నపిల్లలు పరికిణీలను, ఓణీలను రవికెలను ధరించుచుండిరి. నూరు నూటయేబదేండ్లనాటి స్త్రీల వేషభూషణాలంకరణములు హంసవింశతిలోను, శుకసప్తతిలోను కన్నులకు గట్టినట్లు వర్ణింపబడినవి. మన పూర్వకవులనేకులానాటి స్త్రీల కట్టు, జుట్టు, బొట్టులను అలంకరణములను వర్ణించియున్నారు.

"సీ. కుప్పె, రాగిడిబిళ్ళ, కుంకుమరేఖ పా
పటబొట్టు, కమ్మలు, బావిలీలు
లోలి సూర్యచంద్రవంకలు, సూసకము, కెంపు
రవల పల్లేరుబూవు, రావిరేక
ఉగరలు, నానుదీగె, సొగసైన మెడనూలు,
కుత్తుకంట్లు, సరిపెణ, గుండ్లపేరు
సరిగె, ముక్కర, బన్నసరము, బుత్తెండాలు,
కంకణంబులు, తట్టు కడియములును

సందిదండలు, నొడ్డాణ, మందమైన
ముద్రికలు, హంసకంబులు, క్రమ్మయు గజ్జె,
లలరు బొబ్బిలికాయలు, గిలుకు మెట్టె
లాదియగు సొమ్ము దాల్చి యయ్యబల మెరయ."

అని హంసవింశతిలో నానాటి స్త్రీలనగలు వివరింపబడినవి.

కళాపూర్ణోదయమునందు నానాటి స్త్రీలు ధరించు రకరకముల నగలు వివరింపబడియున్నవి మన కవులు వర్ణించిన వేషభూషణాలంకరణము లను గమనించినచో అవి ఆయా కాలములం దెన్నెన్ని మార్పులు చెందినవో తెలియగలము.

క్రీస్తుశకారంభమునాటికి మన ఆంధ్రదేశ స్త్రీల వేషభూషణా లంకరణము లెట్లుండెనో తెలియుటకు మనయదృష్టవశమున దక్షిణాపథము నేలిన ఆంధ్రరాజవంశమగు సాతవాహనులకాలమునాటి అజంటా మొద లగు ప్రదేశములందలి శిల్ప చిత్రములును బొమ్మలును తోడ్పడుచున్నవి. హాలమహారాజు సంతరించిన గాథాసప్తశతియందలి వర్ణనములు కూడా మన కుపకరించుచున్నవి.

గాథాసప్తశతిలోని వర్ణనములనుబట్టి స్త్రీల వేషభూషణాలంకరణ ములవివరములు తెలియుచున్నవి. స్నానముచేయునప్పుడు పసుపు రాచి కొనుచుండిరి. కాళ్ళకు లక్కరంగు పూసికొనుచుండిరి. ముత్తైదువలు కొప్పుముడిని జడవేసికొనుచుండిరి. సంపన్నులగుస్త్రీలు పచ్చలు, కెంపులు గల కంటెలను ధరించుచుండిరి. మట్టిగాజులను ధరించుచుండిరి. స్త్రీలకు చీర, రవిక ప్రధాన దుస్తులు. కుసుమవన్నె చెంగావిరంగు శ్రేష్ఠమైనదిగ నెంచుచుండిరి. నీలివర్ణము సాధారణమైనది. రవికెను బొడ్డుమీద ముడి వేసికొనుట దాక్షిణాత్యాచారము. ఇవి గాథాసప్తశతియందు కనబడు చున్నవి.

సాతవాహనయుగమునాటి శిల్ప చిత్రములందు స్త్రీ పురుషులు తల పైనను, మెడలోను, మొలకును నగలు హారములు, ఆభరణములు ధరించి నట్లు కనబడుచున్నను, చాలాచిత్రములందు స్త్రీలు పైటలేకుండా చిత్రింప

బడినందువలన నావాడు పైటధరించు ఆచారము లేదని చరిత్రకారు లూహించుచున్నారు ఆ కాలమునాటి స్త్రీలు మధ్యపాపిడితీసికొని, తల వెంట్రుకలను వెనుకకు దువ్వి ముడివేసికొనుచుండిరి. ఆ ముడికి మెలి పెట్టినవస్త్రములను జడకుచ్చులవలె కట్టుచుండినట్లు బొమ్మలలో కనబడు చున్నది. కొందఱు స్త్రీలు తమ శిరోజములను ఫాలముపైన ముత్యముల సరములతో కట్టుచుండినట్లు కనబడుచున్నది. చెవులకు బంగారుపోగులు, చేతులకు మురుగులు మురిడీగొలుసులు ధరించుచున్నట్లున్నదిగాని, ముక్కులకుమాత్ర మెట్టి యాభరణములును లేవు. కాళ్ళ కందెలు కడియ ములు నున్నవి. ఇక ఆనాటి పురుషుల వస్త్రములు, ఉత్తరీయములు శిరోవేష్టనములు కనబడుచున్నవి.

# 3. తెలుగు భాష

నర్మదానదికి దక్షిణముననున్న దేశము నార్యులు దక్షిణాపథమనిరి. తపతీనదీతీరమునుండి గోదావరివరకును దండకారణ్యము వ్యాపించి యుండెను. ఇది దక్షిణాపథములోనిదే. క్రీస్తుశకారంభమునాటికి దక్షిణా పథమునందలి ప్రజలు మహారాష్ట్రి ప్రాకృతమును మాటాడుచుండిరి. ఇది ఉత్తరమున మాల్వదేశము రాజపుత్రస్థానము సరిహద్దులు మొదలు కొని దక్షిణమున కృష్ణానది, తుంగభద్రానదుల వరకును వ్యాపించి యుండెను. దీనికి దక్షిణమునగల ప్రజలు ద్రావిడభాషలను మాటాడు చుండిరి. వింధ్యపర్వతముల నానుకొని గోదావరి, ఇంద్రావతీనదీసంగమ ములవరకు గల గోండ్వనారణ్యభూములందలి ఆదిమజాతులవారు గోండి భాషను మాటాడుచుండిరి.

తమిళము స్వయంభువనియు, దానికి సంస్కృతప్రాకృతములతో సంబంధములేదనియు అరవవారు చెప్పు మాటసరికాదు. ఆ భాష మొదట

యెట్లుద్భవించినను సంస్కృత ప్రాకృతభాషల సంపర్కమువలననే పరిపుష్టిచెంది నాగరిక మైనదనుటకు సందేహములేదు. ఇట్లే దేశభాష లగు కన్నడమును తెలుగును సంస్కృత ప్రాకృతముల సంపర్కము వలన నాగరికములైనవి. మహారాష్ట్రి, గోండి, ద్రావిడభాషలమధ్య పుట్టిపెరిగిన తెలుగులో ఆ భాషల ధ్వనులు శబ్దజాలము, భాషారీతులు నుండుటలో ఆశ్చర్యములేదు.

మహారాష్ట్రి ప్రాకృతము కావ్యరచనకు అనువుగానుండినందున చాలమంది మహాకవు లాభాషలోనే కావ్యములు రచించిరి.

సాతవాహనరాజగు హాలమహారాజు కూర్చిన గాధాసప్తశతి, సేతు బంధనము, గౌడవాహ, కర్పూరమంజరి మొదలగు గొప్పగ్రంథము లా భాషలోనే రచింపబడినవి. ఆకాలమునను అటుతరువాతనుకూడా సంస్కృతకవులు తమనాటకములందలి స్త్రీపాత్రలు, నీచపాత్రలనోట అర్ధమాగధి శౌరసేని పైశాచి ప్రాకృతభాషలను ఆయాపాత్రోచితముగా పలికించుట యాచారముగ నుండెను. మాగధిభాష దక్షిణబీహారునుండి పడమర కాశీవరకును వాడుకలో నుండెను. కాశికిని అయోధ్యకును మధ్య అర్ధమాగధి వాడుకలోనుండెను. బౌద్ధమతమువలన పాళీయను మాగధిభాషయు, జైనమతమువలన అర్ధమాగధిభాషయు భారతదేశమున నన్నిప్రాంతములకును వ్యాపించెను. మొదట మధురానగరప్రాంతమున వాడుకలోనుండిన శౌరసేని తరువాత ఇతరప్రాంతములకు వ్యాపించెను. ఇట్లే పశ్చిమోత్తర భాగమున నుండిన పైశాచియు నితరప్రాంతములకు వ్యాపించెను. ఆకాలమున మహారాష్ట్రి, కర్ణాటక ఆంధ్ర ద్రవిడప్రాంతము లందు ఈ ప్రాకృతములకు భిన్నములగు వివిధ దేశభాషలుకూడా క్రమ క్రమముగా అభివృద్ధి చెందుచుండెను. దక్షిణమున తమిళముమాత్రము గ్రాంథికభాషగ నుండెను. గాని మిగిలిన భాషలు ఏడవ శతాబ్దముదాటికి కూడా గ్రాంథికములు కావు. మహారాష్ట్రికి భిన్నమగు మరాటీభాషలోను తెలుగుభాషలోను సంస్కృత ప్రాకృత తత్సమములు, సంస్కృత ప్రాకృతభవములు, దేశ్యములు గ్రామ్యములు నగు పదములు వచ్చి చేరుచుండెను. సాతవాహన చక్రవర్తులు దక్షిణాపథములోని ఆంధ్ర

మహారాష్ట్ర కర్ణాటక ప్రాంతములన్నిటిని కలిపి కొన్ని వందలేండ్లు పరి పాలించుటవలన నీ ప్రాంతముల ప్రజల భాషలందు ఆచారవ్యవహారము లందు సన్నిహిత సంబంధములేర్పడెను.

క్రీస్తుశకము ఏడవశతాబ్దమునుండి తెలుగు శాసనములు కనబడు చున్నవి. అవి మొదట గద్యములోను తరువాత పద్యములోను కనబడు చున్నవి. పద్యశాసనములందు భాష క్రమక్రమముగా మార్పుచెంది నన్నయ భారతభాషకు సన్నిహితముగా నున్నది. నన్నయకు పూర్వశాసన పద్యము లలో నొక్కటియు సంస్కృత ఛందస్సు ననుసరించి వృత్తరూపమున లేదు. దేశీయ ఛందస్సు ననుసరించియే యున్నవి. చాళుక్య గుణగ విజయాదిత్యుని కాలమునాటి అద్దంకి శాసనమున తరువోజ, అటుతరువాత, మధ్యాక్కరలు కనబడుచున్నవి.

ఏడవశతాబ్దిలో చెక్కింపబడిన చాళుక్య జయసింహ వల్లభుని తెలుగు శాసనములో సంస్కృత ప్రాకృత ద్రావిడ భాషల ప్రభావము స్పష్టముగా కనబడుచున్నది.

"జయసింహవల్లభమహారాజు లాకువ్ ప్రవర్ధమాన విజయ రాజ్యసంవత్సరంబుళ్ ఎణుంబోది అన్నేళ్ల అమ్మిన్ పుణ్యనాణుంబున విండిరాజులముట్టకలిముడిరాజుల్ ప్లావిండి సముద్రరక్షై నాపిండి పేసిన కల్పి పీఱరుల్ల మద్దికదు మూటికి విత్సత్తి ఉత్తరంబున పులొంబున చెఱువ పడుమాటి కొటన్ ఎణుంబోది పుట్టు ఆఱ్ల కట్టు సేను తాటి తోంటలాయు పడువారంబు ఇచ్చిరి" ఈరూపమున మన తెలుగు క్రమ క్రమముగా పరిణతిచెంది సర్వాంగపోషితమైన భాషయైనది. దానికొక స్థిర రూపమును గల్పించి సంస్కృతభాషకు అనుబంధించి నన్నయ వాగను శాసనుడైనాడు. తెలుగు మధురమైన భాషయని ఇతరులుకూడా

ఉల్లేఖనములు:

నన్నయ భట్టారకునికి పూర్వపు శాసనములందు సీసగీతి మధ్యా క్కర పద్యములు కనబడుచున్నవి. యుద్ధమల్లుని బెజవాడశాసనములో

4)

పద్యములు మధ్యాక్కరలు: ఈసీసగీతి మధ్యాక్కరలు పాటలుగా పాడు టకు వీలుగానుండును.

పాల్కురికి సోమనాధుడు బసవపురాణములోను, పండితారాధ్య చరిత్రమునను తుమ్మెదపదములు, పర్వతపదములు, గొబ్బిపదములు మొదలైనవెన్నో యుండినట్లు పేర్కొనినాడు. ద్విపదలందు గణయతి ప్రాసలుండినట్లును చెప్పినాడు. ఇవి దేశిచందస్సూత్రములనుటకు వీలున్న దని శ్రీ ప్రభాకరశాస్త్రిగారి యభిప్రాయము. (నన్నయకు పూర్వపుఛందస్సు) 'ఆదికాలపు కవులు పాటించిన సీస ద్విపద, గీతపద్యములు కొంచెము మార్పుచెందియు చెందకయుగూడ స్త్రీల పామరులు పాడు పాటలోను పదాలలోను కనబడుచున్నవి. శ్రావణమంగళవారపుపాట సీస మాలికయే. ద్విపదయను ఆదికాలపు రచన అనేక పరితిభేదములతో పాటలలోను పదాలలోను కనబడుచున్నది.' కవిత్రయమువారి పద్య ములను పోతన శ్రీనాధాది మహాకవుల పద్యములను గేయముగా పాడు టకు వీలున్నదని శ్రీ ఉన్నవ లక్ష్మినారాయణగారు నాకు పాడిచూపించి నారు. అందువలన తెలుగు పద్యకవిత్వము దేశిఛందోరీతుల ననుసరించి పదకవిత్వమునుండి పుట్టి సంస్కృత ఛందోరీతుల ననుసరించి పరిపుష్టి చెందినదని చెప్పవచ్చును.

> "అప్పుడు రాములవారూ అంగవ సీతనుగూడి
> సంతసమందుచు వేగా స్వపురమునకు చనుదెంచీ
> తమ్ములతోడను గలసీ నెమ్మది రాజ్యము ఏలే
> ధర్మముతో ప్రజలెల్లా తామరతంపరలైరి"

అను పూర్వకాలపు పాట, గణవిభజనచేసి చూడగా మధ్యాక్కర లక్షణములు కలదై యున్నది. అందువలన తెలుగు పద్యకవిత్వము దేశ ఛందోరీతుల ననుసరించిన పదకవిత్వమునుండి పుట్టి సంస్కృతఛందశ్శాస్త్ర మునను సరించిన వృత్తములచే పరిపుష్టినందినదని చెప్పవచ్చునని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి యభిప్రాయము.*

* తెలుగు మెఱుగులు. సింహావలోకనము.

తెలుగుదేశములోని పల్లెటూరిస్త్రీలు పాడు పాటలు, ఏలపాటలు, రామాయణ భారతగేయములు దేశిసంప్రదాయమునకు చెందినవి. ఇవి భావమునందు రాగమునందు ఫణితులందు విశేషలక్షణములు కలిగి యున్నవి. ఆరంభకాలమున ఏలలనుపేరుతో పేర్కొనబడిన చమత్కారపు విడిపాటలే తరువాత కోలలనీ, సువ్వాలులనీ, ఓలలనీ ఇంకా యితరపేర్లతోను విభాగములతోను పేర్కొనబడినవని శ్రీ ప్రభాకరశాస్త్రి గారు వ్రాసినారు.

క్రీస్తుశకము నాలుగవశతాబ్దములోనిదనదగిన మతంగుని బృహద్దేశిలో ఆంధ్ర ద్రవిడ కర్ణాటకభాషల ఏలలు పేర్కొనబడినవి. తరువాతి సంగీతగ్రంథములు సంగీతచూడామణి, అభిలషితార్థ చింతామణి, సంగీత రత్నాకరము మొదలగునవికూడా ఏలలభేదములను విరివిగా పేర్కొనినవి. సంగీతచూడామణిలో తెలుగువారి యేలలు చాలా మనోజ్ఞముగానుండునని ప్రశంసింపబడినది.

సాతవాహనులనాటివాడైన మతంగుడు బృహద్దేశిలో యేలలం దెన్నో భేదములు పేర్కొని, కర్ణాట గౌడ ద్రవిడ దేశముల యేలల గుణదోషములను వర్ణించి తెలుగువారి యేలలను ప్రశంసించినాడు. *

"భారతోక్తి నేలలు పాడెడువారు
నరుదంద జిందుల కాడెడువారు"

అని పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో వ్రాసినాడు.

---

* [ప్రాసైర్మనోహరైర్దివ్యైః ఆదిమధ్యాంత గోచరైః
ఏలాకర్ణాటికా ప్రోక్తా లలితధ్వనిసంయుతా
సర్వత్ర ప్రాససహితా గమకైశ్చవివర్జితా
నాదబిందురసోపేతా ఏలాసాగౌడదేశజా
అనేకరాగసంకీర్ణా మేలా మాంధ్రీం విదుర్బుధాః
భావాభినయతాళాఢ్యా విచిత్రధ్వనిరంజితా
ప్రాసహీనారసస్థాద ఏలాద్రవిడదేశజా"]

ఏలలు అనేకరాగములతో అనేక తాళములతో అనేక ఫణితులతో నున్నవని, ఇవి శృంగారచమత్కారగర్భితములైన పదరచనలని తెలియుచున్నవి. ఏలలు, జోలలు, సువ్వాలలు నింక నెన్నోవిధములైన పదములు మొదలగునవి తెలుగు దేశములో గ్రామసీమలందు స్త్రీలలోను ఆబాలగోపాలములోను వ్యాపించియున్నవి. గానము కవిత్వము దేశవ్యాప్తములై యున్నవి. ఈ సంగతి తెలియనివారు తెలుగువారికన్న అరవవారే సంగీతమునందు హెచ్చు ప్రీతిగలవారనుకొందురు.

నన్నయభట్టారకునికి రెండువందలేండ్ల తరువాత క్రీ. శ. పదమూడవశతాబ్దిలో నుండిన పాల్కురికి సోమనాధుడు తన పండితారాధ్య చరిత్రలో వ్రాసినదానినిబట్టి చూడగా తెలుగుదేశములో నప్పటికే బొమ్మరియాటలు, తోలుబొమ్మలాటలు, పగటివేషములు, వీధిభాగవతములు నుండినట్లు తెలియగలదు.

సోమనాధుడు తన బసవపురాణమున కోలాటమును, బ్రతగొండ్లి పేరణియు దేశిజోకయు లీల నటింప" అని వ్రాయుటవలన కోలాటము గొండ్లి (గర్భనృత్యము), పేరణి (కుంభముపై నృత్యము) మున్నగునవి యాకాలమున గలవని తెలియును. గొండ్లియనునది గోండులనుండి తెలుగువారికి సంక్రమించిన నృత్యము *

తెలుగుదేశములో యక్షగానములు నాటకములకు పూర్వరూపములు. అవి దేశప్రజలను, దేశమునేలు ప్రభువులనుకూడా ఆకర్షించినవి. కొన్నిశతాబ్దములపాటు తెలుగు యక్షగానములు దక్షిణదేశములోని ఇతర ప్రాంతములందుకూడా ప్రదర్శింపబడుచుండెను. అరవములోను కన్నడములోను రచింపబడిన యక్షగానములకు తెలుగు యక్షగానములే మేలుబంతిగా నుండెను. ఆ భాషలలోని యక్షగానములందుకూడా తెలుగు పదములనే పాడుచుండిరి.

* ఇది గుజరాతు రాజస్థానములందూ నున్నట్లున్నది.

చాలా కాలమువరకు భారతదేశమున పండితుడనగా వేదశాస్త్రములు చదివినవాడే. చాలాకాలమువరకు సాహిత్యమనగా సంస్కృతసాహిత్యమే. కవియనగా సంస్కృత కవియే. అందువలన దేశభాషలు వర్ధిల్లలేదు. ఆంధ్ర కవిత్రయమువారును, వారివలెనే సంస్కృత పురాణేతిహాసములను తెలుగుచేసినకవులును వానిని స్వతంత్రకావ్యములవలె నడిపిరి. అటు తరువాత కొందరు సంస్కృతనాటకములను తెలుగులో శ్రవ్యకావ్యములుగ రచించిరి. క్రీ. శ. 1500 తరువాత కృష్ణదేవరాయలకాలము నుండి తెలుగులో ప్రబంధమను అపూర్వ కావ్యరచన ప్రారంభమైనది.

"వస్తువునకు ఐక్యము, రసానికి అంగాంగీభావము కుదిరి, ఉపక్రమోపసంహారాలతో, రమణీయార్థములతో సంవాద చతురతతో నడచిన ఈ కావ్యానికి ప్రబంధమనే నూతన సంకేతం ఏర్పడింది. వలసినంత భావనాసమృద్ధితో అలంకార శిల్పముతో, రసభావనిరంతరంగా, గద్యపద్యాత్మకంగా, రచితమైన ప్రబంధమనే ఈ కావ్యపరిష్క్రియ ఆంధ్ర సాహితికి సొంతమని చెప్పదగును....భారతాదులవలె కథాకథనము ధర్మోపదేశము ఈ కావ్యములందు ప్రధానముకాదు. విభావానుభావాదులచే పరిపుష్టమగు రసనిష్పత్తియే ఇందు ప్రాధాన్యమువహించును. ఈకాలపు కవీశ్వరులు తమయెదుట కన్నట్టు మహారాజ్య విభవాన్ని, అప్పటి రాగభోగాలను, పరత నాగరీకాలను మనసులందు నిల్పికొని, వానికి రూపాంతరాలు కల్పించి, రసమయమైన గంధర్వలోకాన్ని సృష్టించారు" అని శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు తాను సమకూర్చిన తెలుగు కావ్యమాల నివేదనమున వ్రాసియున్నారు.

# 4. భోజన పద్ధతి

తెలుగువారు అరవలు కన్నడులు మహారాష్ట్రులు గుజరాతీలు, కొన్ని స్వల్పభేదములతో ఒకేవిధమైన భోజనపద్ధతికలవారు. ఇటీవల కొంతకాలమునుండి వారి భోజనవిధానము మార్పుచెందుటవలన, తెలుగువారి పద్ధతి వారందరిదానికి భిన్నముగా కనబడుచున్నది.

పూర్వము తెలుగుదేశములో వరియన్నముదొరకని పలనాడు మొదలగు ప్రాంతములందు జొన్నయన్నమునే తినుచుండిరి. జొన్నసంకటిలో కందిపప్పు దోసకాయ, గోంగూర కొరివికారము వారి యాదరువులు. వరియన్నముతినువారు వేయించి ముద్దగావండిన కందిపప్పులో చారెడు నేయి పోసికొని కలిపి దప్పళమును పులుసుగోని ముక్కలనుగాని, ఊరుగాయలు పచ్చళ్ళుగాని నంజుకొనుచు తిని, తరువాత కూరలు పచ్చళ్ళు ఆవకాయ వేరువేరుగా కలుపుకొని, అప్పడము వడియములు నంజుకొనుచు దప్పళమును కలుపుకొని పెరుగుపోసికొని ముగించుట మనవారిపద్ధతి. అరవవారు ముందుగనే సాంబారు కొళంబులు పోసికొని, కూరలు నంజు* కొని తిని, పులుచనిమజ్జిగ పోసుకొందురు. కన్నడులకు పప్పుచేరు ప్రీతికరము. ఇది మైసూరురసమని ప్రసిద్ధిచెందినది. మహారాష్ట్రులు పచ్చికందిపప్పును గరిటెజారుగా నుడికింతురు. జొన్నరొట్టెగాని గోధుమరొట్టెగాని అన్నముతో తిందురు. గుజరాతీల భోజనమునందు అన్నము, రొట్టెలు వివిధములైన వంటకములు పిండివంటలు నుండును, ఇటీవల రైళ్ళరాకపోకలవలన అన్నిప్రాంతములవారి భోజనములందు కొంత మార్పువచ్చినది.

---

* జనసామాన్యపు ఆహారవిధానం పెసరపప్పులో దోసకాయవేసినది, పల్లెలవారి విశిష్టవ్యంజనం. సజ్జలు వరిగెలు అంబలి చకకూర గలిజేరు మొదలైన మాలపల్లెలో పేర్కొనబడినవి. ఆవకాయ పులిహోర ఆంధ్రుల ప్రత్యేకత.

ఆంధ్రుల నేటి యాహారసంప్రదాయమే ద్రావిడులందరియొక్క భోజనపద్ధతిగా నుండెననుటకు శ్రీ శంకరాచార్యులవారు మొదలైనవారు రచించిన పూజాస్తోత్రములందలి నైవేద్యక్రమవర్ణన శ్లోకములవలన నూహింపవీలగుచున్నది. శాల్యన్నము, నెయ్యి, పప్పు, కూరలు, పచ్చళ్లు, దప్పళము, పెరుగు ప్రధానాహారములుగా శ్లోకములున్నవి.

క్రీస్తుశకము పదునొకండవశతాబ్దమున ఆంధ్రమహాభారతమును రచించిన నన్నయభట్టారకుడు ఏకచక్రపురమునందు కుంతీదేవియు పాండవులునుండగా, భీముడు బకాసురుని జంపు ఘట్టమున ఆకాలమునాటి భోజనము నిట్లువర్ణించిరి

తరలము॥ పలుదెఱంగుల పిండివంటలుఁ బప్పుఁగూడును
నేతికుండలు గుడంబు దధిప్రపూర్ణఘటం
బులుం గొనివచ్చి యీ వలఘుసత్త్వుడు
మారుతాత్మజుఁ డన్నిటన్ గడు
తృప్తుడై బలముకలి కదంగె నప్పుడు
బ్రాహ్మణార్థముసేయఁగాన్॥

శ్రీనాథ కవిసార్వభౌముడు భోజనప్రియుడు, ఆయన తన గ్రంథము లన్నిటియందును భోజనమును వర్ణించియున్నాడు.

ఉ॥ పప్పును బిండివంటలును బానకముల్ ఘృతముల్ గుడంబులున్
గుప్పలుగాఁగ జుట్టునను గూర్పఁగఁగూడిన యేరు బ్రాలతో
లప్పరభోగివంటకమ్ము గమ్మని తాలిపుసాడెపిండితో
నొప్పులుగా భుజించిరి బుధోత్తము లాకటిదప్పు పెంపునన్

కాశీఖండమునందు విశాలాక్షిమహాదేవి వడ్డించిన చిత్రవిచిత్రము లైన వంటకములను వర్ణించుచు పెద్ద వచనమును వ్రాసినాడు.

శ్రీకృష్ణదేవరాయలవారు తమ ఆముక్తమాల్యదలో తెలుగువారి భోజనపదార్థముల వర్ణించుటయేగాక చేతవికాలములందు నర్షకాలములందు మనవారు చేసికొని తిను వంటకములనుగూర్చియు వివరించిరి.

వంటలనుగూర్చియు వంటకములనుగూర్చియు చక్రవర్తికిన్ని వివరములెట్లు తెలిసినవాయని విమర్శకు లాశ్చర్యపడుచుందురు.

గారెలు, బూరెలు, ఉండ్రాళ్లు, పూర్ణాలు, పాశం, పులిహోర, పులగం మొదలైనవి ఆంధ్రుల సాహూవ్య విందువంటలు.

## 5. తిట్టు, పెట్టు

శ్రీ వేమూరి విశ్వనాధశర్మగారు 1936 అక్టోబరు భారతిలో ఆంధ్రత్వము అను శీర్షికక్రింద నిట్లువ్రాసిరి.

"ప్రతిజాతికిని కొన్ని విలక్షణమైన చిహ్నములుండును. ఇందు కొన్ని బాహ్యచిహ్నములు, అనగా వ్యక్తినిచూచి యేజాతికిచెందినదని చెప్పవచ్చును. మరికొన్ని మనోవృత్తులకు సంబంధించినవి. మొత్తముమీద ముఖవైఖరినిబట్టియు, వేషభాషలనుబట్టియు, ఆహారవిహారములనుబట్టియు జాతినిగుర్తించుట కవకాశమున్నది.

జుట్టు కట్టు బొట్టు-వీనినిజూచి [illegible] నిర్ణయించుట కొకప్పుడవకాశములుండెడివి. కాని రానురాను, నాగరికత హెచ్చి, యితరజాతుల ననుకరించుట ప్రబలి మన వేషభాషలు తారుమారగుటవలన పై మూడు గుర్తులను పురస్కరించుకొని ఏ దాంధ్రుడు, వా దాంధ్రుడుకాడు అని నిరూపించుట దుష్కరమగుచున్నది. అందుచేత పైనిచెప్పిన మూడు బాహ్య చిహ్నములకుతోడుగ మరిరెండు గుర్తులు [illegible] ఆంధ్రత్వము నిర్ణయించుట సులభసాధ్యమగునని [illegible]. జుట్టు, బొట్టు, కట్టు, తిట్టు, పెట్టు [illegible] చక్కగ పరిశీలించిన

యెడల సర్వసామాన్యమగు ఆంధ్రత్వము విశదముకాగలదు. ఇందు మొదటి మూడును తమ విలక్షణమును కొంతవరకు కోల్పోయినవని చెప్పితిని కాని, తిట్టు, పెట్టులు యిప్పటికిని సజీవములై యున్నవి.

ఆంధ్రులు ప్రయోగించెడి తిట్లు విలక్షణములైనవి, పైకి మార్దవముగనున్నను, గూఢార్థము సూటిపోటువలెమనస్సున నాటుకొని విశేష ఖేదము గలిగించును. సామాన్యముగ నిదియే ఆంధ్రులుపయోగించెడి తిట్లలోగల విశేషత్వము. "దుంపతెగ; కడుపుకాల; పీనిగెళ్ళ; పాడెకట్ట; బండపడ, ' ర్దయాళుత్వమును సూచించెడి యిట్టి కఠినములైనతిట్లు ఇతర జాతులలోతక్కువ." ఇటువంటి తిట్లు తమిళములోను ఇతరభాషలలో కూడా ఉన్నవి. అందువలన దీనినాంధ్రులవిశేషలక్షణముగ పేర్కొనుట న్యాయముకాదు. *

"ఇక పెట్టునుగూర్చి విచారింతము. ఆంధ్రులు భోజనప్రియులు; నిరతాన్నప్రదాతలు. ఈ సుగుణములను ఆంధ్రేతరులుసయితము పొగడిరి. ఇంత భోజనప్రియులగు ఆంధ్రులశాకపాకాదులలోను రుచులందును ప్రత్యేకతయుండితీరవలెను. వివిధప్రాంతములలోనున్న ఆంధ్రుల భక్ష్యభోజ్యములను రుచిభేదములను సంగ్రహించి క్రోడీకరించి యాహార పదార్థమునుబట్టి ఆంధ్రత్వము నిరూపించుటకు రాజమహేంద్రవరమున రెండుసంఘములు కొంతకాలమునుండి త్రీవముగ పనిచేయుచున్నవి.

ఇటీవల కాఫీహోటళ్ళు ప్రబలినతరువాత మనరుచులు ఆంధ్ర

---

* మాటలకివి తిట్టులైనా వీని ప్రయోగ సందర్భమున దుర్భావంతో కాదు, అదొక విశిష్ట లక్షణం. ఇట్టి సందర్భంలో దీవెనలవంటివి ప్రయోగించుటకలదు. అవి : నీయిల్లు నేలగట్టా, నీయిల్లు చల్లగుండ, నీయిల్లు బంగారంగానూ, నీకడుపు చల్లగుండ.

యువకులకు పురాణగాథలగుచున్నవి. పూర్తిగా మరచిపోయెడికాలము సమీపించుచున్నది." అని గోంగూర, కంద, బచ్చలి, వంకాయముద్దకూర ఉల్లిపాయ, దిబ్బరొట్టె, కారపుగారెలు, పెరుగువడ లుదాహరించిరి. వీనికి పకోడీలు, చేగోడీలు, పెసర పుణుకులు, పులిహోర, అటుకులు చేర్చవచ్చును.

## 6. ఆంధ్రుల మతధర్మములు

ఆంధ్రదేశమునందు వివిధకాలములందు బౌద్ధమతము, జైన మతము, శైవము వైష్ణవమును, వీరశైవమును, భైరవార్చనమును, శక్తి పూజలును, గ్రామదేవతల అర్చనములు ఇతరవిధములైన మతధర్మములును కొంతకొంతకాలము విజృంభించి, క్రమక్రమముగా క్షీణించినవి. అయితే వాని ఛాయ లిప్పటికిని మనమతాచారములందు కనబడుచున్నవి.

కొంతకాలము తామసపూజలును జంతుబలులును తెలుగుదేశములో తీవ్రముగా జరుగుచుండినను, క్రమక్రమముగా అవి తగ్గిపోయినవి. ఉన్నతకులములవారియందేగాక, అష్టాదశవర్ణములవారిలోకూడా సాత్విక పూజావిధానమును వేదాంతమును అభివృద్ధిచెందెను. ఇప్పటికిని గ్రామదేవతల కొలుపులందును, జాతరలందును, జంతువులను కోడిపెట్టలను బలియిచ్చుచుండుట, కుంభములు చెల్లించుటయు జరుగుచున్నను, అప్పుడప్పుడు వీరభద్రుని కొలుచువారును భేతాళుని కొలుచువారును ఇతర సందర్భములందు మ్రొక్కుకున్న వారును వీరావేశముతో ప్రభలతో నూరేగుట, ఖడ్గములు చదువుట, శివశక్తులాడుట, నిప్పులగుండములు త్రొక్కుట, నారసములు గ్రుచ్చుకొనుట మొదలైన సాహసకృత్యములు చేయుచుండుట కనబడుచున్నను, పూర్వమున్నంత తీవ్రావేశము కనబడుట లేదు. భీకరమైన వాద్యములు, గావుకేకలు, తలవిరియబోసికొని పసుపు కుంకుమ పూసికొనిన రూపములు, పూర్వకాలపు తామసారాధనకు తార్కా-

ణము జరుగనున్నవి. మనదేశములోని అష్టాదశవర్ణముల స్త్రీ పురుషులలో చాలామంది పండుగలందును పబ్బములందును వ్రతములందును నోము లందును తమ పూర్వాచారమతధర్మమును కనబరచుచుందురు. నదీతీరము లందున్నవారు తప్పక నదిలో స్నానముచేయుదురు; ఉపవాసములుందురు; జాగరణములు చేయుదురు; భజనలుచేయుదురు: శనివారము మొదలగు వ్రతముల నాచరింతురు, కాశికి రామేశ్వరమునకు పోవకపోయినను, శ్రీశైలమునకు, తిరుపతికి, సింహాచలము మొదలగు పుణ్యక్షేత్రములకు, కోటిపల్లి అంతర్వేది మొదలగు పుణ్యక్షేత్రములందు జరుగు తీర్థములకు పోయి తమ యిష్టదైవము నారాధించుచుందురు. పురాణములను వినుచుం దురు. భజనలు తిరునాళ్ళు జరుపుదురు.

అది యెట్లు తటసించినదోగాని, తెలుగుదేశములో ఉపనిషన్మత మును వేదాంతమును అష్టాదశవర్ణములవారిలో వ్యాపించియున్నది. దీనికి ముఖ్యముగా వేమన్న, సిద్ధేశ్వరులు, బ్రహ్మంగారు మొదలగు వేదాంతులే యని చెప్పవచ్చును. గొల్లసుద్దులను గొల్లకలాపమును విన్నవారి కీ సంగతి తెలియగలదు.

తెలుగుదేశములో అష్టాదశవర్ణములవారిలో పుట్టుక మొదలు చ పోవువరకును ఆచరించు మతధర్మములును కులాచారములును కొన్ని కొన్ని భేదములతో కూడియున్నను మొత్తముమీద ధర్మార్థకామమోక్షము లను సాధించుటకు తోడ్పడునట్టివిగానే యున్నవి. తెలుగువారి మతాచార ములు మొత్తముమీద సాత్త్వికవిధానమునకుచెందినవని చెప్పవచ్చును.

శివుని దైవముగా భావించుచు వేదశాస్త్రపురాణముల ప్రమాణము నంగీకరింపక, సర్వశైవసమభావమును ప్రతిపాదించిన భక్తిమతము వీర శైవము. వీరశైవులు జంధెమునకుబదులు లింగమును గట్టుకొందురు. పాల్కురికి సోమనారాధ్యుడు రచించిన బసవపురాణము వీరివేదము. జంగాలు వీరి గురువులు, జంగమదేవరలు నడచుపట్టి దేవతలని విశ్వసింతురు. వర్ణాశ్రమధర్మమును విడవక శైవమతమునవలంబించిన బ్రాహ్మణులు ఆరాధ్యులు, వీరు జందెములుంచుకొని లింగము కట్టుకొందురు. పూర్వము 64 బ్రాహ్మణకుటుంబములవారు మొదట జంగములై, యజ్ఞోపవీతమును

బ్రాహ్మణ్యమును విడిచిపెట్టియుండిరి. తెలుగుదేశములో ఆరాధ్యులుగాక లౌకికులగు లింగధారి బ్రాహ్మణులున్నారు.

ఆంధ్రదేశములో వైష్ణవము విరివిగా వ్యాపించుటకు అద్దంకిపీఠము ముఖ్యకారణము. కర్మకంటె భక్తి యెక్కువయని వాదించు తెంగల శాఖకుచెందినది. మతమును బోధించు అధికారము బ్రాహ్మణులకేగాక, అన్నికులములవారికి నీయబడినది. శూద్రశాఖకుచెందిన వైష్ణవులందరకును హవ్యకవ్యములలోను, మతగోష్ఠులలోను అధ్యక్షతవహించువారు సాతానివైష్ణవులు. వీరుగాక, మరియొకరకపు శూద్రదాసరులు, మాలదాసరులును మాదిగదాసరులును తమతమ కులములవారికి మతమును బోధించుటకును, హవ్యకవ్యములను నిర్వహించుటకు నేర్పాటు చేయబడిరి.

మొత్తముమీద వర్ణాశ్రమధర్మప్రయుక్తమైన వైదికమతము తెలుగుదేశములో స్థిరపడియున్నది. వర్ణవైషమ్యములు భారతదేశములోని ఇతరప్రాంతములందున్నంతగా మన తెలుగుదేశములో లేవు. అయితే, మతాచారములందు విశాలభావములును లేవు. అనులోమ ప్రతిలోమ వివాహములుగాని, గాంధర్వవివాహములుగాని లేవు. అన్నికులములందును బ్రాహ్మవివాహమే అవశ్యప్రాయమై యున్నది. నాలుగుజాతులమధ్యకూడా అస్పృశ్యత, దృష్టిదోషమును ఆచరణలోనికివచ్చినవి. శాస్త్రములనుబట్టి జాతులు నాలుగేయైనను, అష్టాదశవర్ణములను, ఇంకను శాఖోపశాఖలైన చిల్లరకులములు వందలకొలది ఏర్పడినవి. వీరిలో భోజన ప్రతిభోజనములుగాని, పరస్పరవివాహములుగాని లేవు. శూద్రులలో వృత్తులనుబట్టి కూడా కులములేర్పడినవి. వీరిలో హెచ్చుతగ్గులు పట్టింపులు బయలుదేరి, మంత్రిమహానాటికట్టడు లేర్పడినవి.

కృషి వాణిజ్యము పశుపాలనము వైశ్యవృత్తులు. అయితే, వైశ్యులు కృషిని, పశుపాలనమును వదలి ఎక్కువ లాభకారియైన వాణిజ్యవృత్తిని అవలంబించుట ప్రారంభించిరి. అంతట కృషి, పశుపాలనము నితర కులములవారికి చిక్కినవి. కమ్మ, రెడ్డి, వెలమ, తెలగ మొదలగు శాఖలవారీ రెండు వైశ్యవృత్తులను అవలంబించిరి. వీరికి జాతాశౌచమృతాశౌచములు శూద్రులకువలె 30 దినములుగాక, వైశ్యులవలె 15 దినములే

నిర్ధారణచేయబడినవి. ఇదిగాక, దక్షిణదేశమున క్షత్రియసంఘము తక్కువగా నున్నందువలన, అవకాశముకలిగినప్పుడెల్ల వీరు క్షత్రియవృత్తి నవలంబించి, క్షత్రియ వేషభాషల నలవరచుకొని, రాజ్యములను స్థాపించి క్షత్రియులుగా మారిపోయిరి. అందుచేతనే వీరిలో కొందరికి వైదిక గోత్రములును, సూర్యచంద్రవంశములును సిద్ధించినవి. చాళుక్యప్రభువులు మొదట తాము శూద్రులమని శాసనములం దుదాహరించుకొనిరిగాని, కొన్ని తరములు గడిచినతరువాత 11వ శతాబ్దములోని నందంపూడి శాసన కాలమునుండి తాము చంద్రవంశక్షత్రియులమని వ్రాసికొనిరి.

వైశ్యవృత్తి నవలంబించుచు తెలిక సాలెకులస్థులు వైశ్యాచారములనవలంబించి యజ్ఞోపవీతధారణ మొనర్చుకొనిరి. భావనఋషి సాలెకులోద్ధారకుడు.

తెలుగుదేశములో క్రొత్త క్షత్రియజాతులేర్పడిన దినములలో ఉత్తరదేశమునుండి మహమ్మదీయులు దక్షిణమునకు చొచ్చుకొనివచ్చుచున్నకాలములో సనాతనధర్మము నుద్ధరించుటకు కొందరు బ్రాహ్మణులు లౌకికులై, దేశపరిపాలనమునందు తోడ్పడుటకు ప్రభువులకొలువునజేరి నియోగులైరి.

ఆంధ్రదేశమున అచలబోధయను పేరుతో అద్వైతము జనసామాన్యములో వ్యాపించినది. దీనిని నెలకొల్పి వ్యాపింపజేసినవారు పోతులూరి వీరబ్రహ్మంగారు, దూదేకుల సిద్దయ్యగారు, వేమన్నగారు, సాలెకుల జులు, యాగంటివారు, బొందిలి వీరయ్యగారు, గుమళ్ళ, కార్వి కోటయ్యగారు, బెల్లంకొండ మస్తానుగారు, భాగవతుల శివరామదీక్షితులుగారు, వున్నవ నందయ్యగారు, పాకల శేషాచలనాయుడుగారు మొదలైనవారు. బ్రహ్మసత్యము జగన్మిథ్యయనునది వీరిమతమునందలి ప్రధానధర్మము. భక్తియందును వైదికకర్మలందును వీరికి ఆదరము తక్కువ. హఠయోగమునందు వీరి కాదర మెక్కువ. గురువుదగ్గర నుపదేశముపొందుటను కారణమగుట యని చెప్పుదురు. కారణమును పొంది యీ శాఖకుచెందిన స్త్రీపురుషులు కొందరైనను లేని గ్రామము

తెలుగుదేశములో అరుదు. బిచ్చగాళ్ళనేకులు వీరి తత్వములను వీధు లలోను రైళ్ళలోను పాడుచుందురు. *

## శైవ వైష్ణవ క్షేత్రములుగ మారిన జైన బౌద్ధ క్షేత్రములు

భారతదేశచరిత్రలో జైన బౌద్ధమతములు వైదిక మతమును త్రోసిరాజనుటయు, జైన బౌద్ధమతములను వైదికమతము అణగ ద్రొక్కుటయు, వైదిక మతముననే శైవ వైష్ణవశాఖలు ఒందొంటితో పోరాడుటయు, ఇంకను శాఖోపశాఖలు బయలుదేరుటయు కనబడుచున్నది. ఈ మార్పులనుబట్టి, జైన ఆలయములను బౌద్ధారామములను విష్ణు, శివ క్షేత్రములుగా మారుటకూడా జరిగినది. ద్రాక్షారామ దేవాలయములోని గర్భగుడిలో బౌద్ధస్తూపము యొక్క గుఱుతులు స్పష్టముగా కనబడు చున్నవని విజ్ఞులనుచున్నారు. భీమేశ్వరుడు జైనదేవునివలె పైకి పెరిగి పోవుచుండగా నెత్తిపైన చీలను కొట్టిరనియు నొకగాథ యున్నది. *

అందువలన జైన బౌద్ధాలయమే భీమేశ్వరాలయముగ మారినట్లు తోచు చున్నది. ఇట్లే అమరావతికూడా బౌద్ధక్షేత్రమైయుండి, తరువాత శివ క్షేత్రముగా మారినది. పంచారామములన్నియు నిట్లు మారినవేయని పరి శోధకు లనుచున్నారు. ఆరామమనునది బౌద్ధారామమగుటలో నాశ్చర్యము లేదు.

మన పురాణములలోని జైన బౌద్ధ శైవ వైష్ణవగాథలును, ఆచార వ్యవహారములును విడదీయ వీలులేనంతగా కలిసిపోయినవి. జైనుల తీర్థంకరులలో ఋషభుడు ఆదితీర్థంకరుడు భాగవతమున విష్ణ్వంశమున జన్మించిన ఋషభచక్రవర్తిగాథ యొకటి యున్నది. భాగవతమునందు పేర్కొనబడిన పాషండమతము జైనమో బౌద్ధమో అయి యుండునను

---

* ఆధారము: ఆంధ్రసర్వస్వమునందు మతములనుగూర్చి శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు రచించిన వ్యాసము.

* అమరేశ్వర లింగమును గురించియూ కథ గలదు.

టకు సందేహములేదు. జైనఋషభునికిని భాగవతఋషభునికి సంబంధ మున్నట్లు తోచుచున్నది. జైనులకు కేవల జ్ఞానులందఱును పూజ్యులే. వీరశైవులు విష్ణుని అల్పముగా జూచినట్లు జైనులు అల్పముగా చూడరు. వైష్ణవులు ఋషభునియందు విష్ణువు అంశను, జైనులు తీర్థంకరలక్షణములను గమనించియుందురు. వైష్ణవులు పేర్కొను ఏకవింశత్యవతారములలో ఋషభుని దొకటి. ఈ యూహకు తిరుపతిక్షేత్రముయొక్క స్థలపురాణమును ఆచారములును ఉపబలములుగా నున్నవి.

తిరుపతి వేంకటాచలమునకు కృతయుగమునందు ఋషభాచలమను పేరుండెనని శ్రీనివాసకల్యాణమున చెప్పబడియున్నది. ఋషభచరిత్ర మునుగూర్చి జైన వైష్ణవకథాంశములలో భేదములు కనబడుచున్నను, వేంకటాచలముక్రింద బలరామక్షేత్ర ముండుటయు, పద్మావతీదేవి యుండుటయు, కొండపైన క్షేత్రస్వామియైన శ్రీ భూవరాహమూర్తి యుండుటయు, అందులో శ్రీనివాసమూర్తి తరువాత వాసము చేయుటయు క్రమేణ వృషభాచలము, అంజనాద్రి మొదలైన వగుటయు, నేటికిని మ్రొక్కులుచెల్లించు భక్తులు కాషాయాంబరములు ధరించి కొండనెక్కుటయు, కేశఖండనము చేసికొనుటయు, కొండపైన తీర్థప్రసాదములు జాతికులభేదములు లేకుండా అందఱును ఆరగించుచుండుటయు, మహంతులు ధర్మకర్తలుగనుండుటయు, వారు సమాధినిపొందుటయు, జైన తీర్థక్షేత్రసంప్రదాయమును తెలుపుటయేగాక వైష్ణవదైవసంబంధములను కూడా తెలుపుచున్నవి.

వైష్ణవదైవముయొక్క ఏకవింశత్యవతారపురుషులలో ఒకడైన కపిలమహామునియొక్క తీర్థముకూడా అక్కడనే కొండక్రింద నున్నది. వృషభాసురుని జంపి, శ్రీమన్నారాయణుడు అక్కడ వెలసినాడను పురాణోక్తులవలన ఆ స్థలము జైన వైష్ణవకలహములలో వైష్ణవక్షేత్రముగా మారినదని యూహించవచ్చును.

నిజమునకు జైనులకును శైవులకును మూల మత సిద్ధాంతము లలో భేదములేదు. అహింసనే పరమధర్మముగా గ్రహించి, వేదప్రమాణ

ముఖము నిరసించినందువలననే జైనము పాషండమతమనిపించుకొనినది. గాని, జైనులు ద్వైతాద్వైతులవలెనే త్రిమూర్తులను పూజింతురు. వైష్ణవవైరమువలన శైవము జైనమతమును నిరసించినది.

శ్రీనివాసమూర్తి శివనారాయచిహ్నములు గలిగియున్నాడని భక్తలోకోక్తి. తిరుపతిలో శైవసంబంధమైన అర్చనలు కొన్ని జరుగుచున్నవని అందఱు ఎఱుగుదురు. శైవులకును ఋషభుడున్నాడు. ఈ వృషభునికి గణపతి స్థానము విధింపబడినది. ఇతనిని గురువుగ గైకొనినవారు వీరశైవులు. వీరు జైనులవలె శివనారాయణుల సామ్యముగాని అభేదమునుగాని అంగీకరింపరు, సహింపరు. వీరశైవులు వెంకటాద్రికి పోవకపోవుట యిందువల్లనే. ఇప్పుడీ వెంకటాచలము కేవలము వైష్ణవులవలన భూవైకుంఠముగా పరిగణింపబడుచున్నది. *

తిరుపతి వెంకటేశ్వరుని విగ్రహము మొదట వీరభద్ర విగ్రహమనియు, దానిని వైష్ణవవిగ్రహముగాచేసిరనియు కాకతీయులకాలమునాటి శ్రీపతిపండితులు తమ శ్రీకరభాష్యమున వ్రాసిరి. ఇది రామానుజాచార్యుల వారే చేసిరని వారనిరి *

బెజవాడలోని కనకదుర్గ ఒకప్పుడు మంజుశ్రీయను బోధిసత్వుడుగా పూజింపబడిన విగ్రహమని, ఇక్కడ తపస్సుచేసినట్లు చెప్పబడు అర్జునుడు నాగార్జునుడని, నేటి మంగళగిరి మరియొక తాంత్రికశక్తికి ఆవాసమైనదని,

---

* ఆధారము: ప్రజోత్పత్తి సం॥ చైత్రమాసభారతిలో శ్రీ కురిగనూరి నరసింగరావుగారు కన్నడిగలు తెలుగలు అను శీర్షికతో వ్రాసిన వ్యాసము.

* (ఆంధ్రుల సాంఘికచరిత్ర. సురవరము ప్రతాపరెడ్డిగారు. పుట 43)

బౌద్ధతాంత్రికులే భ్రామరశక్తిని శ్రీశైలమున నెలకొల్పిరని, తిరుపతిలో సర్వమంగళను కొండక్రిందను బాలయని పిలువబడు మంజుశ్రీని కొండ మీదను వజ్రయానికులు ప్రతిష్ఠించిరని శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు వ్రాసియున్నారు.

---

ఆంధ్రధార్మికులు : ఆంధ్రప్రదేశ అవతరణసంచిక వెంకట్రామ అండ్ కో ప్రచురణ.

# 7. విద్యాబోధనము, విద్యాభ్యాసము.

శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి విద్యార్థిదశలో తెలుగుదేశంలో విద్యాభ్యాసపద్ధతి యేలాగుండేదో, వెనుకటి పండితులు అను శీర్షికతో వ్రాసియున్నారు.

"గురువులు యే సామాన్యులో తప్ప సుప్రసిద్ధులు భృతకోపాధ్యాయులుగా వుండడానికి యిష్టపడేవారుకారు.

"సంపన్నులైనవారి [illegible] [illegible] త్యాగిస్తూ, పరమార్థబుద్ధితో శిష్యులను మతతత్వవేదంగా [illegible] చెప్పుతూ, వారి నిత్యకృత్యం [illegible] కథాకాలం [illegible] తగినంత వసతి వాలు [illegible] [illegible] [illegible] [అసమగ్రమన్న మాట] గురువుగారి విద్యార్థులు వుతకరం, [illegible] [illegible]

పట్టుకురావడం (అదేనా అనాధ్యాయాలల్లోనే) యింతమాత్రం మట్టుకే. శిష్యులుకొంతరు వారాలు చేసుకొనివిన్నీ, మరికొందరు మాధుకరం చేసుకొనిన్నీ జన్మిష్ట వృత్తికావించుకుంటూ చదువుకునేవారు. మా గురువుగారు (తర్ల బ్రహ్మయ్యశాస్త్రిలుగారు) కడియొద్ద మిక్కిలి అగ్రామంకావడంచేత, శిష్యులపోషణాన్ని గురువుగారే భరించేవారు. మా గురువులకు పూర్వకాలంలో మాట చెప్పలేముగాని, ఆకాలంలోమాత్రం అన్నంకూడా పెట్టి, విద్యాదానం చేసిన గురువులు మా పరమగురువులుమాత్రమే. అయితే, వీరు అగ్రహారీకులుగాని, వసద్దారులుగాని కారు....

మా గురువుగారికి కుటుంబంకంటేకూడా శిష్యవర్గ పోషణ బాధ్యతే హెచ్చు.

---

తెల్లవారుజామున పాఠాలకు ప్రారంభించేసేవారు. తక్కువ పాఠం వాళ్ళకి ముందు ప్రారంభం. ఆ పాఠాన్ని పై తరగతివాళ్ళంతా వినడం అవశ్యకం. ఈ నియమం శాస్త్రపాఠాలకిమాత్రమే. కావ్యపాఠాలవాళ్ళకి గురువుగారు చెప్పడం లేదు. విద్యార్థులలో పెద్దతరగతివాళ్ళే చెప్పేవారు. గురువుగారివద్ద చెప్పుకొన్న శాస్త్రపాఠాన్ని క్రిందితరగతి వాళ్ళకి పై గ్రంథాలు చదువుకునే విద్యార్థులు చింతనచెప్పేవాళ్ళు. అయావిధంగా కష్టిస్తేనేగాని శాస్త్రం స్వాధీనంకాదు. యీ విధంగా అభ్యసించినప్పటికీ యే కొందరికోతప్ప సర్వే సర్వత్ర శాస్త్రం స్వాధీనంకాదు. తర్కపాఠాల కూడా విధానం అంతా యిలాగే వుంటుంది.

వెనుకటిపండితులు చాలా అసిధారావ్రతంగా జీవయాత్ర గడుపుతున్నారని గురువుగారు చెపుతూవుంటే, వినడమేకాదు, కొందరిని నా బాల్యంలో ప్రత్యక్షంగా చూచికూడా వున్నాను. కాలాన్ని వెళ్ళద్దామనేగాని, స్వీష్టసృత్తుగా ఉదరాన్ని పూరించుకుందామనే వాంఛ వీరిల్లో యే కొందరికో కాని ఉండేదికాదు. యెంతసేపూ శిష్యులూ, వాళ్ళపోషణా [illegible] తరగడమే వీరికి కాలక్షేపం!

[illegible] ఇంగ్లీషు పరిపాలన కాలమున [illegible] మన తెలుగు [illegible] శాస్త్రములు [illegible] మనదేశములో న

విద్యలను వ్యాపింపజేసిరి. బ్రహ్మశ్రీ శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిం వారు తమ కాశీయాత్రలో నిట్లు వ్రాసియున్నారు

"పలువు రా క్షేత్రమునకు విద్యాభ్యాసానికి వచ్చి, కొందరు పూర్వపుణ్య వశంచేత చిరకాలానికి మహాపండితులై దేశానికివచ్చి, అనేకులను శిష్యులను పండితులను జేయుటాకలదు. కొందరు అక్కడనే నక్షత్రాలలో పొట్టపోసుకుంటూ, యావత్కాలమున్నూ గడుపుటా కలదు. అందుచేతనే ఆ కాలంలోనేమి, అంతకు పూర్వకాలంలోనేమి, రైలు సాయం లేకుండినా, యెట్లో కష్టపడి పలువురు కాశికి చదువుకని వెళ్ళిన వారిలో ప్రజ్ఞావంతులై వచ్చిన వారిపేర్లు పరిమితంగానే మనకు కనపడతాయి....ఇందులో కొందరు నలుబదియేండ్లు ముప్పదియేండ్లుకూడా కాశిలో నివశించినవారు; ఒక శాస్త్రమేకాక, చతుశ్శాస్త్రములున్నూ వచ్చిన వారు; ఒకశాస్త్రమే చిరకాలం వక్కపారిచదివ్ని, తెలియక మళ్ళా తిరుగతోడి, అంతా చదివి గొప్పవారైనవారు కొందరు. కొందరు చిరకాలం చదివి, పండితులై దేశానికివస్తూ, ఏ సంస్థానంలోనో వాదంలో వోడిపోయి మళ్ళా కాశికి వెళ్ళినవారు...."

"కాశీ గమనమాత్రేణ నాన్నంభట్టాయతే ద్విజః" ఏమైనా వ్యాకరణానికి కాశీ, తర్కానికి నవద్వీపము, మీమాంసకు దక్షిణము, వేదానికి కృష్ణాగోదావరి తీరాలు అనాదిగా ప్రసిద్ధి. ఇలావున్నను వేదశ్రౌతాలు తప్ప తక్కినవన్నీ కాశిలో మనదేశంకన్న నెక్కువగా నున్నవనుటలో సందియో కిమాత్రం లేదు" అని తమకాలమునాటి చదువులనుగూర్చి అనేక విశేషములను వ్రాసియున్నారు

వేగి. విద్యాపీఠం. విజ్ఞానాచార్యులు. కులపతి. కాకరపఱ్ఱు మొదలైనవి విద్యాబోధనా కేంద్రములు.

## విద్యాభివృద్ధి

శాతవాహనులు మొదలుకొని వివిధకాలములందు ఆంధ్రదేశము నేలిన చక్రవర్తులు మహారాజులు, తుదకు చిన్నచిన్న రాజులును సామంత మండలేశ్వరులునుకూడా సనాతన మతధర్మములను వేదశాస్త్రములనేగాక, బౌద్ధ జైనమత విద్యలను లౌకికవిద్యలను చతుష్షష్టి కళలను పోషించుట కనేకాగ్రహారములిచ్చినట్లు దానశాసనములవలన తెలియుచున్నది. ఆనాటి దేవాదాయములు బ్రహ్మాదాయములు ధర్మాదాయములు మహమ్మదీయ పరిపాలన కాలమున కొన్ని నశించినను కొన్ని మిగిలినవి.

ఆంధ్రదేశములోనుండిన బౌద్ధవిహారములన్నియు విద్యాపీఠము లుగ నుండెను. నాగార్జునాచార్యుడు, ఆర్యదేవుడు మొదలగు మహావిద్వాం సులు వారిశిష్య పరంపర ప్రపంచములో వెలుగడలను ప్రఖ్యాతివడసి విద్యార్థుల నాకర్షించుచుండిరి. ధాన్యకటకము, వేంగి, కాంచీపురము, శ్రీశైలము, గొప్ప విద్యాపీఠములుగానుండినట్లు శాసనముల వలనను విదేశములందలి గ్రంథములవలనను కనబడుచున్నది.

తెలుగుదేశములోని ఘటికాస్థానములు అగ్రహారములు, దేవా. లయములు, మఠములు గొప్ప విద్యాకేంద్రములై యుండెను. వేదశాస్త్ర పారంగతులైన మహావిద్వాంసులు నిగమాగమముల నభ్యసించిన మహా పండితులు మత ధర్మములనేగాక, లౌకికవిద్యలనుకూడా బోధించుచుండిరి. వైద్యవిద్యతోపాటు చికిత్సాలయములును స్థాపింపబడెను. భారతదేశము లోని కాశి, నవద్వీపము, ఉజ్జయిని, తక్షశిల, నాలంద విద్యాపీఠములం దాంధ్రవిద్వాంసులు మంచి పేరు సంపాదించిరి.

క్రీస్తు శకము తొమ్మిదవ శతాబ్దమునాటికికూడా జైనులబ స్తీలలో మహాపండితులుండిరి. బెజవాడలోని వడుంబివసతి అట్టిబస్తీలలో నొకటి. కాంచీపురమున వారి ప్రధానకార్యస్థాన ముండెను. భాగీరథీ నర్మదానదుల మధ్యగల డాహలదేశమునందు పాశుపతశాఖకుచెందిన శైవులు స్థాపించిన గోళకీమఠము పదునొకండవశతాబ్దిలో దక్షిణాపథమునే గొప్ప విద్యా

వంశగా నుండెను. దానిశాఖ లాంధ్రదేశమున, కర్ణాటక ద్రావిడదేశము లందును స్థాపింపబడెను. కాకతిగణపతిదేవచక్రవర్తికి చిన్మయదీక్షనొసగిన రాజగురువగు విశ్వేశ్వరశివముని గుంటూరుమండలమున మందర ములో విశ్వేశ్వరగోళకిమఠమును నెలకొల్పెను. గణపతి దేవచక్రవర్తి కొమార్తె శాలివాహనశకము 1183 దుర్మతి సంవత్సరమున నా శివమునికి వెలగపూడి సహితముగ మందర గ్రామమును దానముచేసెను. ఆ శాసనమువలన నచ్చటనొక విశ్వేశ్వరాలయమును, మఠమును, బ్రాహ్మణుల మొదలు చండాలునివరకు వర్ణవివక్షతలేకుండా నిరతాన్నప్రదానముచేయు నొకసత్రమును కట్టించి, బ్రాహ్మణులకు వ్యత్తులు నివేశనములు నిప్పించి, విశ్వేశ్వరగోళకియని పేరుపెట్టెను. విద్యార్థులకు, ప్రసూత్యారోగ్యశాల కును, ఋగ్యజుస్సామవేదములు చెప్పు అధ్యాపకులకును, ఆగమములు శాస్త్రములు బోధించు అధ్యాపకులకును, వైద్యులకును. ఇతరసేవకులకును తగిన వృత్తు లేర్పాటుచేయబడెను

హైదరాబాదురాజ్యములోని వాడిరైలుస్టేషనుసమీపమున నాగాయి అని వ్యవహరింపబడు గ్రామమునకు పూర్వము నాగవావి అని పేరు. క్రీ. శ. 1100 ప్రాంతమునం దచ్చట గొప్ప కళాశాలయుండెనని అందు శైవాగమములు, తర్కన్యాయములు, వేదశాస్త్రములు మొదలగు విద్యలు బోధించుచుండిరనియు, విద్యార్థులకు ఆచార్యులకు వసతులేర్పరచి కొంత భూమియొసగబడెననియు, అక్కడనొక గ్రంధాలయము కూడా ఉండెననియు ఆర్షశాఖవారు ప్రకటించిన శాసనములవలన తెలియు చున్నది. (శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి ఆంధ్రుల సాంఘికచరిత్ర పుట 25)

పూర్వమాంధ్రవిద్యార్థులు కాశి, నవద్వీపము, ఉజ్జయిని మొదలగు విద్యాకేంద్రములకు పోయి, శాస్త్రముల నభ్యసించి, మహాపండితులై భారతదేశములో సంచారము చేయుచు పండిత సభలందు జయించి వచ్చు చుండి . ఆంధ్రుడైన అన్నంభట్టుగారు గొప్ప తార్కికుడేగాక, న్యాయ వ్యాకరణ మీమాంస వేదాంతశాస్త్రములందు మహాపండితుడై, అయా

శాస్త్రములందు గొప్ప గ్రంథములు రచించి, ఆసేతుహిమాచల పర్యంతము కీర్తి గడించినాడు. "కాశీగమనమాత్రేణ నాన్నంభట్టాయతే ద్విజః" అను నానుడి ఆయననుగూర్చి మనదేశములో వ్యాపించియున్నది. ఇటువంటి గొప్పపండితులు కవులు గాయకులు దేశాంతరములకేగి ఆంధ్రులకు పేరుతెచ్చుచుండిరి.

మహారాష్ట్ర సామ్రాజ్యకాలమునందు ప్రధానమంత్రిగనుండి, దేశమును పాలించు పేష్వా పునహానగరమునందు పండితపరిషత్తులను జరిపి, దేశములో నలుప్రక్కలనుండి వచ్చిన విద్వాంసులకు పరీక్షలుజరిపి సమ్మానించుచుండెను. ఆకాలమున నక్కడకు ఆంధ్రవిద్వాంసులనేకులు వెళ్ళి గొప్ప సమ్మానములు పొందుచుండిరి.

ఆంధ్రుల వేదోచ్చారము భారతదేశమునందు చాలా ప్రసిద్ధిచెందినది. శ్రీ రాజా రామమోహనరాయలవారు 1828 లో స్థాపించిన బ్రహ్మసభలో వేదములను ఉపనిషత్తులను అధ్యయనముచేయుట కిరువురు తెలుగుబ్రాహ్మణులను నియమించెను.

భారతదేశమున మహమ్మదీయులేలినకాలమునను, మొగలు సామ్రాజ్యము విచ్ఛిన్నమై అరాజకము వ్యాపించిన కాలమునందుగూడ మన తెలుగువారు విద్యాభ్యాసముగాని దేశసంచారముగాని మానలేదు. వేదశాస్త్ర విద్యలను కాపాడుకొనుచుండిరి.

దక్షిణదేశమునందు చరకసుశ్రుతములు అష్టాంగ హృదయము ననుసరించిన వైద్యసంప్రదాయమును "అగస్త్య సంప్రదాయము నను రెండుపద్ధతుల ఆయుర్వేదము వర్ధిల్లినది. ఆంధ్రదేశమునందలి అనువంశికవైద్యులీ రెండుసంప్రదాయములేగాక సిద్ధనాగార్జునుని రసవైద్య సంప్రదాయమును, అనుభవ చికిత్స మూలికాయోగములనుకూడా కలిపి ఒక ప్రత్యేక వైద్యవిధానము నవలంబించిరి.

సిద్ధనాగార్జునుడు శ్రీశైలమునుండి అక్కడి మహారణ్యమునందు తిరిగి రసవిషగంధకములందు ఓషధులందు పరిశోధనముగావిం

చెను. ఆయనతరువాత నవనాథసిద్ధుడను వైద్యభిక్షువు అక్కడ నివసించి వైద్యశాస్త్రపరిశోధనముచేసి నవనాథసిద్ధీయమును రసాయనతంత్రమును రచించెను. తెలుగువైద్యులు రసమును వాడునంత ధైర్యముగా భరత ఖండములోని ఏప్రాంతపువైద్యులును వాడరని విజ్ఞులందురు. తెలుగు వైద్యులు రచించిన వైద్యగ్రంథములం దనేకఅపూర్వయోగములు కన బడుచున్నవని వైద్యశాస్త్రప్రవీణులు చెప్పుచున్నారు.

## 8. వర్తకవ్యాపారములు, వలసలు

తూర్పుసముద్రతీరమున గంజాముమండలములో మహేంద్రగిరి మొదలుకొని గోదావరినదీతీరమువరకునుగల ఆంధ్రదేశభాగము క్రీస్తుకు పూర్వము చాలాకాలమునుండియు క్రీస్తుశకము పదునారవశతాబ్దమువరకును కూడా కళింగమని వ్యవహరింపబడుచువచ్చినది. ఇక్కడనుండి బర్మాదేశమను బ్రహ్మదేశమునకును, తూర్పుసముద్రములోని ద్వీపకల్పములకును ద్వీపములకును వర్తకముచేయుటకు పోయినవారి నాదేశములవారు కళింగులనియే వ్యవహరించుచుండిరి. *

పురాతనకాలమునుండియు ఆంధ్రదేశాంతర్భాగమునుండిన కళింగ దేశము, కళింగకములను పేరుగల సన్నని మలుపెల్లాలకును, శ్రేష్ఠములగు ఏనుగులకును, దంతములకును ప్రసిద్ధిచెందినట్లు తమిళ సంస్కృతవాఙ్మయమువలన తెలియుచున్నది.

* రెడ్డిరాజ్యాలనాటి వర్తకంలో. అశచితిప్పయ్యశాస్త్రి శిరోమణి.

మన తూర్పుసముద్రతీరమునుండి బర్మాయను బ్రహ్మదేశమునకును, మలయాద్వీపకల్పమునకును. దానికావలనున్న ద్వీపములకును పోయి, వ్యాపారమునుచేయు భారతీయులను చీనావారు చూచినట్లు క్రీస్తుశకారంభమునాటి చీనాదేశ వృత్తాంతమువలన తెలియుచున్నది. వారినందరిని చీనావారు క్లింగు లనిరి. ఆ శబ్దము కళింగు లనుమాటకు రూపాంతరమగుటవలన నానాటికే ఆంధ్రులు సముద్రవ్యాపారముచేయుచుండిరని స్పష్టపడుచున్నది.

క్రీస్తుకుపూర్వము 270 నుండి క్రీస్తుశకము మూడవ శతాబ్ది యారంభమువరకును ఆంధ్రదేశమును పరిపాలించిన శాతవాహన చక్రవర్తుల నాణెములపైన రెండు తెరచాప కొయ్యలుగల చిత్రములున్నవి. వారిపరిపాలనకాలమున ఆంధ్రులు తూర్పుసముద్రతీరమునుండి దూరస్థ ద్వీపములకుపోయి, వ్యాపారముచేయుచు, వలసలుకూడా స్థాపించినందుల కాధారములు కనబడుచున్నవి. వారికాలమున మచిలీ బందరుదగ్గరనున్న గూడూరును, కృష్ణానదీద్వారమునగల ఘంటసాలయును ముఖ్యమైన రేవుపట్టణములుగ నుండెను. ఇటీవల ఘంటసాలలో కనబడిన క్రీస్తుశకము రెండవశతాబ్దినాటి ప్రాకృతశాసనమునం దానాటి మహానావికు డొకడు పేర్కొనబడియున్నాడు. పూర్వ మా రేవుపట్టణమునుండి ఆంధ్రులోడలెక్కి దేశాంతరములకేగుచుండిరనుటకు సందేహములేదు.

తెలుగుదేశములో కృష్ణాజిల్లాలో విజయవాడదగ్గరను, శ్రీకాకుళము జిల్లాలోని సాలిహుండముదగ్గరను, గుంటూరు జిల్లాలో వినుకొండలోను, వేలూరులోను, కడపజిల్లాలోనుకూడా క్రీ. శ. 14 నుండి 217 వరకు రోముసామ్రాజ్యమునేలిన చక్రవర్తుల నాణెములు కనబడినందున ఆనాడు పాశ్చాత్యదేశములతో వ్యాపారముజరుగుచుండెనని తెలియుచున్నది. ఆ కాలమున పెక్కురకములైన నేతబట్టలు, పాషాణ్యవస్త్రములు, అన్నిరకముల రవసెల్లాలు; రంగుబట్టలు తూర్పుసముద్రతీరప్రాంతమునుండి

నేటి పెగూ అను ప్రతిష్ఠానపురమునకును, అక్కడ [illegible]మును, సింహపురి, శ్రీక్షేత్రము మొదలైన చరిత్రప్రసిద్ధములైన నామములే పూర్వసముద్రతీరములోని వివిధదేశములందు ద్వీపములందు కనబడు చున్నవి. దానికితోడు ఆయాదేశములందు లభించిన పురాతన శాసనములు, ఆంధ్రదేశమును పాలించిన పల్లవ, శాలంకాయన, విష్ణుకుండి, వేంగి, చాళుక్యరాజుల శాసనలిపులలో చెక్కబడియుండుటవలనను ఆంధ్రదేశము నందువలెనే ఆ దేశములందును శాలివాహనశకమే వ్యాప్తిలోనుండినందు వలనను, అక్కడి రాజులు వర్మయను మాటను తమ నామములందు వాడినందువలనను, ఆంధ్రదేశములోని అమరావతి శిల్పసంప్రదాయము లును, బౌద్ధ వాస్తుపురీతులును, దానినిబట్టి ఏర్పడిన మహాబలిపుర పల్లవ వాస్తుసంప్రదాయములును ఆయాదేశములందు కనబడుచున్నందున నక్కడ ఆంధ్రులు చాలాకాలముక్రిందట వలసలు స్థాపించినట్లును, ఆంధ్రుల సంస్కృతి యక్కడ నెలకొల్పబడినట్లును స్పష్టపడుచున్నది.

బర్మాలోని అరకాన్ రాష్ట్రముయొక్క రాజధాని పేరు త్రైలింగము. పెగుదేశమును పూర్వము సువర్ణభూమియనుచుండిరి. దాని నేలినవారు తెలింగురాజులు. పూర్వము బర్మాలో నొకభాగమును కళింగమనియు, నొకభాగమును ఉత్కలమనియు వ్యవహరించుచుండిరి.

బర్మాదేశచరిత్రకారుడైన ఫెయిరు హిందూదేశీయులు చాలా కాలముక్రిందటనే గోదావరి కృష్ణానదీముఖద్వార ప్రాంతములనుండియు బంగాళాఖాతమునకు ఉత్తర ప్రాంతమునుండియు వెళ్ళి, ఐరావతీనది ప్రవహించు పల్లపు ప్రదేశములలోను, తత్పరిసరప్రదేశములందును వలసలేర్పరచుకొనినట్లు వ్రాసినారు.

బర్మాలోని ప్రాచీనజాతియగు తలెంగులు తెలుగుదేశమునుండి పోయినవారే. వారు రామణ్యదేశమను రాజ్యమును స్థాపించిరి. దానిరాజ ధాని హంసవతీనగరము. అది క్రీ.శ. 573 నుండి కొన్ని శతాబ్దముల

పాటు వర్ధిల్లినది. ఆ రాజ్యమునకు చేరియుండిన కోస్తాకు కళింగమను పేరుండెను. రామణ్యదేశమునకు ఉత్తరమున వనవాసియను నొక రాజ్యముండెను. దానిరాజధాని శ్రీక్షేత్రనగరము. నేటి పెగూదేశములోని ప్రోముపట్టణమునకు పూర్వపుపేరు శ్రీక్షేత్రము.

బర్మాలో దొరికిన శాసనములు వేంగిలిపిలో వ్రాయబడినవి. ఇక్కడ బంగారపు, రాగిరేకులపైన వ్రాయబడిన పాళీ బౌద్ధగ్రంథము క్రీ. శ. 5-6 శతాబ్దములనాటి తెలుగు లిపిలో నున్నది. ప్రోముజిల్లాలో బయల్పడిన స్తూపములోని బౌద్ధావశేషముల నుంచు పేటికలోని వెండి పూతగల చిన్న స్తూపము ఆంధ్రదేశములోని స్తూపములందు కనబడిన వానిని పోలియున్నది. దీనిమీద ఆంధ్రదేశపు తెలుగు కన్నడ లిపిలో చెక్కబడిన శాసనమున్నది.

దక్షిణబర్మాదేశమును క్రీ. శ. 7-8 శతాబ్దములలో పాలించిన రాజులు తమపేళ్ళలో వర్మయనుపదము నుపయోగించుచుండిరి. పూర్వ చాళుక్యులలో చాళుక్యచంద్రుడను బిరుదుగల శక్తివర్మయొక్కయు, ఆయన తమ్మునికుమారుడైన రాజరాజనరేంద్రునియొక్కయు బంగారు నాణెములు కొన్ని బర్మాదేశపు పశ్చిమసముద్రతీరముననున్న అరకానుకు సమీపమునందుండిన రామ్రిద్వీపమున కనబడినవి.

మలయద్వీపకల్పమునందు పెయాల్ జిల్లాలో వేంగిలిపిలో చెక్కబడిన సంస్కృతశాసనములు దొరికినవి. ఇక్కడి లిగోర్ ప్రాంతమునందు చాలా దేవాలయములున్నవి. వీని వాస్తుశిల్పము ఆంధ్రబౌద్ధ యుగమునాటి పద్ధతులకును, పల్లవులమహాబలిపురవాస్తువులకును అనుకరణములు. ఈ దేశములో స్వర్గలోకమనుచోట దొరికిన కంచువిగ్రహములు ఆంధ్రదేశములోని బుద్ధాంలో దొరికినవానికి ప్రతికృతులే.

సయాములోని ప్రాచీన బౌద్ధనిర్మాణములు సింహళములోని అనూరాధపురమునందును, ఆంధ్రదేశమునందు అమరావతియందును గల

స్తూపముల కనుకరణములుగ నున్నవి. సయాములో ప్రావతోన్ అను చోటగల బౌద్ధాలయమునగల శిల్పము లాంధ్రదేశములోని, శంకరము అను బౌద్ధక్షేత్రమునగల గుహాశిల్పములను పోలియున్నవి. ఇక్కడ దొరికిన విగ్రహములలో అమరావతి మహాబలిపుర శిల్పసంప్రదాయముల సమ్మేళనము కనబడుచున్నది.

సయామునుచేరి పూర్వము ఫ్యూనాన్ అను హిందూ రాజ్యముండెను. నేటి కాంబోడియా కొచ్చిను చీనాదేశములు దానిలోని భాగములు. పూర్వకాలమునాటి కంబుజరాజ్యమునే పాశ్చాత్యులు కాంబోడియా యనుచున్నారు. ఆ రాజ్యము క్రీ. శ. మొదటిశతాబ్దమునుండి వర్ధిల్లెను. ఆరాజ్యమునేలినవారు భారతదేశమునుండి వెళ్ళిన కౌండిన్యుడను బ్రాహ్మణుడు సోమయను రాజకుమార్తెను వివాహమాడగా, నుద్భవించిన రాజవంశమువారని అక్కడి పూర్వగాథలందున్నది. ఇక్కడ క్రీ. శ. 4-5-6 శతాబ్దములనాటి ఆంధ్రలిపి శాసనములు చాలా కనబడినవి. ఇక్కడి ప్రజలారాధించిన అనంతశయనవిగ్రహము ఉండవల్లి గుహలోనున్న విగ్రహమువలె నున్నది.

చంపరాజ్యము నేటి సయాముదేశములో చేరిన అన్నాంరాజ్యము. దాని నేలిన రాజులుకూడా పైనచెప్పిన కౌండిన్య సోమదంపతులవంశమువారే. ఇక్కడ అమరావతి, కథార, విజయ అను తెలుగుపేరులుగల రాష్ట్రములుండెను. ఇక్కడ వోకన్ అను నగరమున దొరికిన ప్రాచీన శాసనము ఆంధ్రశాతవాహనరాజైన నాలుగవ శాతకర్ణికన్నేరి శాసన లిపిలో చెక్కబడియున్నది. ఇక్కడ దొరికిన బౌద్ధవిగ్రహములును; అమరావతీశిల్పసంప్రదాయమునకు చెందినవే.

కాంబోడియా అనబడు కంబుజదేశము మొట్టమొదట నాగుల రాజ్యముగనుండెను. అక్కడి యిసుకయెడారులలోను పర్వతములలోను

కంభుస్వాయంభువనురాజు భార్యావియోగ దుఃఖమున తిరుగుచుండగా నాగ ముఖ్యుడు వచ్చి, తనకుమార్తెనిచ్చి వివాహముచేసి, ఆ దేశమున సర్వస్వామ్య ముగచేసి. దాని కాయనను రాజుగాచేసెనని పూర్వగాథయున్నది. ఆ రాజావంశమువారిని ఖ్మేరులని వ్యవహరించిరి. క్రీస్తుశకారంభమున ఖ్మేరు వంశీయులను జావాయను యవద్వీపమువారు జయించి, ఆ రాజ్యమును ఫ్యూనానురాజ్యములో నొకభాగముగాచేసిరి. అటుపిమ్మట కౌండిన్యుడు క్రీ.శ. 400 ప్రాంతమున సోమరాణిని పెండ్లియాడగా క్రొత్త రాజవంశమేర్పడెను.

అంకోరునగరము కాంబోడియాలో నున్నది. అంకోర్‌థామ్ అంకోర్‌వాట్ అను భాగములందును ఖ్మేరుశిల్పములందును మహానాగములు వింతరూపముల రాక్షసుల బొమ్మలు చిత్రింపబడియున్నవి. శిలాశాసనములన్నియు సంస్కృతమునసే యున్నవి. (చూడుడు : ఆంధ్ర విజ్ఞానసర్వస్వమున శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి వ్యాసములు. The Pageant of India's History, Gertrude Emerson Sen 1949 ప్రమాది సం॥ భారతిలో శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారును, శ్రీ భావరాజు వెంకటకృష్ణారావుగారు వ్రాసిన వ్యాసములు. ఆంధ్రరాష్ట్రావతరణసంచికలో శ్రీ మారేమండ రామారావుగారి మహాంధ్రము అను వ్యాసము.)

# 9. ఆంధ్రసంస్కృతి దిగ్విజయము

తెలుగుభాషయు ఆంధ్రసంస్కృతియు తెలుగువారికేగాక, ఇతర భాషలవారికి ఇతరజాతులవారికికూడా ప్రీతికరమైయుండుట యీనాటిమాట కాదు. క్రీ. శ. 7వ శతాబ్దినుండి 12వ శతాబ్దివఱకును వేంగిదేశమునేలిన తూర్పుచాళుక్య వంశమువారు, కర్ణాటకమునేలిన పశ్చిమచాళుక్య వంశీయులు. అందువలన ఈ రెండుదేశముల ప్రజలకు సన్నిహిత సంబంధము ఉండెను. 10వ శతాబ్దమున కర్ణాటక కవిత్రయమువారిలో ప్రసిద్ధికెక్కిన పంపకవియు, పొన్నకవియు వేంగిదేశమునుండి వెళ్ళిన ఆంధ్రబ్రాహ్మణులు. రాజరాజనరేంద్రుని యాస్థానమున నుండిన నన్నయభట్టును, నారాయణభట్టును తెలుగులోను సంస్కృతములోను కన్నడములోను పండితులు. రాజరాజనరేంద్రుడు భారతకథను బహుభాషలలో వినినప్పటికి, తెలుగులో వినగోరెను. ఆనాటికవులు కన్నడములోను తెలుగులోను కృతులను రచించుచుండినప్పటికి, తెలుగునే హెచ్చుగా సన్మానించినట్లు నిదర్శనములున్నవి. వేములవాడ భీమకవి, పాల్కురికి సోమనాథుడు ఈ రెండు భాషలందు కృతులు రచించినారు. *

పోతనామాత్యుని భాగవతమునందు తెలుగుదనముట్టిపడు ఘట్టములెన్నో కలవు. రుక్మిణీకల్యాణము, కుచేలోపాఖ్యానము, శ్రీకృష్ణ[illegible] వర్ణనము మొదలైనవి ఆంధ్రవ్యక్తిత్వము ప్రదర్శించునట్టివిగ నున్నవి.

బహుభాషాకోవిదుడగు శ్రీనాథ కవిసార్వభౌముడు "జనని

* నన్నెచోడుని కుమారసంభవం కన్నడ పదబహుళం.

సంస్కృతంబు సకలభాషలకును దేశభాషలందు తెలుగు లెస్స" యని నాడు. తనభాష కర్నాటభాషయనినాడు. ఆంధ్రదేశమెల్ల సంచరించిన శ్రీనాథునిరచనలందు తెలుగుదేశములోని వివిధప్రాంతములందలి ప్రకృతి సౌందర్యము, నదీనగములు, పుణ్యక్షేత్రములు, ప్రజల యాచార వ్యవహారములు, ఆహారవిహారములు, స్త్రీపురుషుల వేషభాషలు, చిత్తవృత్తులు కన్నులకు కట్టినట్లు వర్ణింపబడినవి. స్త్రీపురుషుల నాగరికత సంగీత సాహిత్య నృత్య శిల్పకళలయొక్క రసానుభూతియు వివరింపబడినవి. శ్రీనాథు డాంధ్ర సంస్కృతిని దేశదేశములందు ప్రఖ్యాతపరచిన మహానుభావుడు.

1509-1530 మధ్య ఆంధ్ర కర్ణాటక ద్రవిడదేశముల నేకచ్ఛత్రముగా పరిపాలించిన శ్రీకృష్ణదేవరాయలవారు ఆంధ్ర, ద్రవిడ, తమిళ ప్రజలందరిని సమానముగా ఆదరించినను, తెలుగుభాషను, తెలుగుదనమును ముఖ్యముగా అభిమానించిరి. ఆయనకాలమున మనదేశము చూచి వర్ణించినవిదేశీయుల గ్రంథములవలననే తెలియుచున్నది.* తెలుగువారి వేషభాషలు, ఆచారవ్యవహారములు, చిత్తవృత్తులు నీ విదేశీయులు తమగ్రంథములందు వర్ణించి ఆంధ్రత్వము యొక్క ప్రాశస్త్యము నుగ్గడించి మెచ్చుకొనినారు. రాయలవారి ఆస్థానమునందలి కవులు తమ రచనలందు తెలుగుదనమును చూపినారు; రాయలవారి ఆముక్తమాల్యద తెలుగుదనమునకు లక్ష్యగ్రంథముగా నున్నది. రాయలవారే "తెలుఁగ దేల యన్న దేశంబు తెలుఁ గేను దెలుఁగువల్లభుండఁ దెలుఁగొకండ యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి దేశభాషలందు తెలుఁగు లెస్స" యని వచించిరి.

కృష్ణదేవరాయలవారు మహావీరుడు, విద్వాంసుడు, రసికుడు.

---

* "దేశభాషలందు తెలుగు లెస్స" అన్నది రాయలే.

ఆయన ఆస్థానమొక విద్వత్సభ. ఆ సభను రంజించు కవులు, గాయకులు, శిల్పులు, నటులు చరిత్రప్రసిద్ధులై యున్నారు. కొంతమంది తెలుగు గాయకులకు నటులకు నొసగబడిన "విద్వత్సభారాయరంజక" యను బిరుదువల్లనే తెలుగుసంస్కృతియొక్క ప్రాశస్త్యము వెల్లడియగుచున్నది. తెలుగుసంస్కృతి అరవవారికికూడా ప్రీతికరమై కన్యాకుమారి వరకును వ్యాపించినది.

తంజావూరు మధురరాజ్యములు విజయనగరసామ్రాజ్యాంతర్భాగములై తెనుగునాయకరాజులచే పరిపాలింపబడు చుండెను. ఆ రాజ్యములందు తెలుగే రాజభాష. ఆ యాస్థానములందు తెలుగు సంస్కృతి సంప్రదాయములకే హెచ్చుగౌరవముండెను. తంజావూరు మధురరాజ్యములందేగాక, అరవదేశములోని అనేక చిన్న రాజ్యములందును జింజి పుదుకోట మొదలగు సంస్థానములందును తెలుగుభాషకు తెలుగుసంస్కృతికి గౌరవము కలిగెను.

దక్షిణార్కాడుజిల్లాలోని అడియపాళెమున నొక విద్వత్కుటుంబమున జన్మించి, మహాపండితుడై ఆదిశంకరులవారి తరువాత అంతవారని ప్రఖ్యాతిజెందిన అప్పయ్యదీక్షితులవారు 1660 ప్రాంతమున వేలూరునేలిన తెలుగునాయకరాజగు చిన్నబొమ్మనాయకునివలన కనకాభిషేకమును పొంది సంస్కృతమునం దనేకగ్రంథములు రచించియుండెను. ఆయనకు తెలుగుభాషపైన తెలుగుసంస్కృతిపైన చాలా గౌరవము. ఎంతో తపస్సుచేసినగాని, తెలుగువాడై పుట్టుట తెలుగుభాష నభ్యసించుట గలుగదను అర్థముగల ఒక శ్లోకము నాయన చెప్పిరని ప్రతీతి.

ఆంధ్రత్వమాంధ్రభాషాచ ప్రాభాకరపరిశ్రమః
తత్రాపియాజుషీశాఖా ఽనల్పస్యతపసః ఫలమ్.

రాజకీయకారణములవలననేగాక తెలుగుభాషయు తెలుగుసంస్కృతియు అరవదేశములోని జనసామాన్యమునకు ప్రీతికరములైనందువలననే అవి అంత విరివిగా వ్యాపించినవనుటకు సందేహములేదు. త్యాగరాజకృతులును, క్షేత్రయ్య రచించిన మువ్వగోపాలపదములును అరవవారిప్పటికిని ప్రీతితో పాడుచుందురు. తెలుగుసంతతివారేగాక అరవము మాతృభాషగాగల వాగ్గేయకారకులలో సుప్రసిద్ధులైనవారందరును తెలుగు భాషను ప్రత్యేకముగా నేర్చుకొని, తెలుగులోనే గీతములు వర్ణములు పదములు జావళీలు కీర్తనలు తిల్లానములు కృతులు రచింపసాగిరి. భరతనాట్యము వర్ణించిన అరవవిద్వాంసులును, ఆ శాస్త్రమునకు గావలసిన సాహిత్యమునుకూడా తెలుగులోనే రచించిరి. త్యాగరాజు దీక్షితులవారు శ్యామశాస్త్రి కర్ణాటక సంగీతమున త్రిమూర్తులని ప్రసిద్ధిచెందిరి. దీక్షితులవారి మనుమడు సుబ్బరామదీక్షితులవారు కూర్చిన సంగీతసంప్రదాయ ప్రదర్శిని యను ఉద్గ్రంథము ఎట్టియాపురము సంస్థానమువారు అచ్చువేయించిరి. అందులోని వాగ్గేయకారకులజీవితములను చదివినచో, తెలుగు భాష, తెలుగుసంస్కృతి దక్షిణమున నెట్లు వ్యాపించెందినవో తెలియగలదు. అరవము మాతృభాషగాగలవారేగాక, కన్నడము, మలయాళము మాతృభాషగాగలవారుకూడా తెలుగులో కృతులు రచించుట గొప్పగా నెంచిరి. తిరువాంకూరు ప్రభువైన స్వాతితిరునాళ్‌గారు సంస్కృతము లోనేగాక, తెలుగులోకూడా కృతులు రచించెను. అవి యిప్పటికిని విద్వాంసులు పాడుచున్నారు. ఇటీవల మైసూరు వాసుదేవాచార్యులుగారు తెలుగులో రచించిన కృతులు సుప్రసిద్ధములై సంగీత విద్వాంసుల మన్ననల నందినవి.

ఎన్నడో కొంతకాలము ఎవరో కొందరు జనులకు మాత్రమేకాక, వివిధ కాలములలో వివిధభాషలవారికి వివిధజాతులవారికిని తెలుగుభాష తెలుగు సంస్కృతి అభిమాన పాత్రములైనవి.

విజయనగర సామ్రాజ్యము విచ్ఛిన్నమైనపిమ్మట ఆంధ్రదేశము నేలిన గోలకొండ సుల్తానులు ఆంధ్రుల వేషభాషలను, ఆచారవ్యవహారము

లను, మతధర్మములను ఆదరించిరి. 1550 – 1580 మధ్య గోలకొండ రాజ్యమును పరిపాలించిన ఇబ్రహీము కుతుబ్ షా ఆంధ్రభాషను సంగీత సాహిత్య శిల్పకళలను పోషించెను. ఇతడు అద్దంకి గంగాధర కవివలన తపతీసంవరణోపాఖ్యానము కృతినందెను. ఈయనగారిని మన కవులు ఇభరాముడని తమపద్యములందు పేర్కొనిరి. ఈయననుగూర్చిన చాటువు లనేకములు కలవు.

1580 లో గోలకొండసుల్తానైన మహమ్మదు కులీ కుతుబ్ షా ఉర్దూభాషలో గొప్పకవి. ఈయనకు తెలుగు భాషయన్న ప్రీతి. తెలుగులో కవిత్వముచెప్పెనని ప్రతీతిగాని, ఈయన తెలుగురచన లభ్యము కాలేదు. అయితే, ఈయన రచించిన ఉర్దూపద్యములందు తెలుగుమాటలు కలిపి రచించుటవలన ఆయనకు తెలుగుపైన గల అభిమానము తెలియుచున్నది. 1672 మొదలు 1704 వరకును మైసూరు రాజ్యమును పాలించిన చిక్కదేవరాయ ఒడయరు ఆస్థానములో తెలుగుకవు లనేకులుండిరి. ఆకాలమున నా రాజుగారి కొలువులోనున్న ఉద్యోగులలో కళువె వీరరాజు తెలుగువచనమునందు మహాభారతమును రచించెను.

1761 మొదలు మైసూరురాజ్యమునేలిన హైదరాలీ బహద్దురుకు ఏభాషయు చదువను వ్రాయను రాదు గాని, అతడు హిందుస్తానీ, కన్నడము, అరవము, తెలుగు, మహారాష్ట్రభాషలు అనర్గళముగా మాటలాడగలడు. ఆయనకు తెలుగు భట్రాజుల కైవారములన్నను, వారు చదువు తెలుగు పద్యములన్నను చాలా ప్రీతి. అత డేయుద్ధమునకు తరలివెళ్ళినను వీరి నా సైన్యముఖమునందుంచి వీరిచే వీరగీతములు పాడించి, తన సైన్యమునకుత్సాహావేశము కలిగించుచుండెనని మైసూరు చరిత్ర రచించిన కర్నల్ మార్కు విల్క్సు 1810 లో వ్రాసినాడు. మైసూరుగేజటీరును రచించిన లూయీరైస్ 1873 నాటికి మైసూరులో 1200 భట్రాజుల కుటుంబము లుండెనని వ్రాసినాడు. కోలారుజిల్లాయును బెంగుళూరును

కేవలము తెలుగుప్రాంతములే. మైసూరులోని వివిధమతములవారిలో తెలుగుతెగవారని కన్నడతెగవారని విభేదములున్నవని వ్రాసినారు.

మద్రాసురాజధానిలో ఇంగ్లీషుకంపెనీప్రభుత్వమువారి కొలువులో లౌకయుద్యోగిగ నుండి, చాలాకాలము ఉత్తరసర్కారుజిల్లాలలో పని చేసిన విలియం బ్రౌన్ అనునతడు 'జెంటూ' భాషావ్యాకరణము అను పేరుతో రచించిన తెలుగువ్యాకరణముయొక్క పీఠికలో నిట్లు వ్రాసినాడు:

"చెన్నపట్టణమున కుత్తరమునను వాయవ్యదిశను నివసించుజనులు జెంటూ లేక తెలుగుభాషను మాటలాడుదురు. ఈ భాష చాలా నాజూకైన దనియు, శ్రావ్యమైనదనియు అందరును అంగీకరించుచున్నారు. ఈ దేశీయులలో హీనకులజులనోట వినవచ్చు తెలుగుభాషతో శిష్టులు మాటలాడు అరవభాషను పోల్చిచూచినచో తెలుగు చెవి కెంత యింపుగానుండునో స్పష్టముగా తెలియగలదు. తెలుగుమాటలు నాలుకనుండి మృదువుగా ప్రవహించునట్లుండి, మనోహరముగ నుండును. అరవము కటువుగా నుండును.

ఉత్తరసర్కారులలో నున్నతకులమువారు, ముఖ్యముగా విశాఖపట్టణమండలములోని విద్యావంతులగు రాచవారు మాటలాడు తెలుగు ఇప్పుడు దేశములో వాడుకలోనున్న నుడికారములో చాలా సొగసైనదని నా యభిప్రాయము. ఈ రాచవారు ఆత్మగౌరవముకలవారు. వీరిమర్యాదలు చాలా హుందాగానుండును. శిష్టవ్యవహారమందున్న తెలుగులో సంస్కృతపదములు పారశీమాటలు పలుకుబళ్లు హెచ్చుపాలుగ నుండుననుమాట నిజమే" * అని వ్రాసినాడు. ఈ గ్రంథము 1817 లో ప్రకటింపబడినది.

1820-1864 మధ్య తెలుగుజిల్లాలలో మేజస్ట్రేటుగను, జిల్లా జడ్జిగను పనిచేసిన చార్లెస్ ఫిలిప్ బ్రౌనుదొరగారు తెలుగుభాష వ్యాక

* A Grammer of the Gentoo language—William Brown (181 7).

నుంచి తన స్వంతధనమును చాలా వ్యయముచేసి పురాతన తెలుగుగ్రంథములను సేకరించి, వానికి శుద్ధప్రతులు వ్రాయించి, కొన్నిటిని ముద్రించి, తెలుగులో అకారాదినిఘంటువును రచించి మనభాషకు మహోపకారము చేసినాడు. తెలుగుభాషపైన ఆయనకు గొప్ప అభిమానముండుటవలననే ఇంతపనిచేసినాడు. తెలుగులోను ఇంగ్లిషులోను కొన్ని గ్రంథములను రచించిన హెన్రీ మారిస్ దొరగారు 1874 లో ప్రకటించిన గోదావరిజిల్లా మాన్యూలులో తెలుగుభాషనుగూర్చి యిట్లు వ్రాసినారు:

“ద్రావిడభాషలన్నిటిలోను తెలుగు చాలా మధురమైనట్టిది: సంగీతమువలె శ్రావ్యమైనట్టిది. పామరులనోట వినవచ్చు తెలుగునుడికారము కూడా మంచినీటిప్రవాహమువలె మధురమై, శ్రావ్యమై యుండును. దీనిని “తూర్పుదేశపు ఇటాలియన్” అనుట చాలా సమంజసముగనున్నది. తమిళము గొప్పభాషయే కావచ్చునుగాని తెలుగుభాషయే మనకు హెచ్చు ప్రీతికరముగనుండును. *

ఆంధ్రప్రదేశము వింధ్యకు దక్షిణమున, ఉత్తరదక్షిణ భారతదేశ మధ్యమున నున్నందువలన ప్రాచీన సంస్కృత ప్రాకృతభాషలందలి మంచిగుణములనేగాక, ఉత్తర దక్షిణ రాష్ట్రభాషలలోని మంచిగుణములనుకూడా ఆత్మీకరించుకొన్నది. అందువలననే మనభాషలో గాంభీర్యము, లాలిత్యము, మాధుర్యము మొదలగు గొప్పలక్షణము లున్నవి. అన్నిటి కన్నను గొప్ప విశేషమేమనగా, ఫ్రెంచి ఇంగ్లీషు మొదలగు పాశ్చాత్య భాషలలోని పదములనుకూడా ఆత్మీకరించుకొనగలిగినది. స్వభావమునుబట్టి ప్రాచ్య పాశ్చాత్య భాషలలోని యేపదమునైనను తనలో లీనమొనర్చుకొనగల శక్తిమంతమైన భాషయగుటవలన, అనుక్షణము నభివృద్ధి చెందుచున్న శాస్త్రవిజ్ఞానమును ప్రకటనచేయుట కిది తగినభాషయని సుప్రసిద్ధ

* Descriptive and Historical Account of the Godavari District—Henry Morris (1814)

విజ్ఞానశాస్త్రవేత్తయగు ప్రొఫెసర్ జె.బి.ఎస్. హాల్డేన్‌గారు 1958 లో చెప్పియున్నారు.

తెలుగుదేశములో చాలాకాలము పనిచేసి ఇంగ్లాండుకు వెళ్ళిన, డాక్టర్ టి. హోంపిల్లు మెక్లియాడ్, పి.హెచ్.డి గారు 16-7-58 తేదీన మద్రాసు హిందూపత్రికలో ప్రకటించిన లేఖలో హాల్డేన్‌గారు చెప్పిన మాటలు నిజమనియు, తెలుగుభాష వ్యాకరణమునుబట్టి సులభమైనదనియు, శబ్దమాధుర్యమున అద్వితీయమైనదనియు, అన్యభాషీయపదములనైనను సులభముగాలీనముచేసికొనగలట్టిదనియు, ఏపరిస్థితికైన సరిపుచ్చు వీలు కలటివనియు, ప్రాంతీయాభిమానములవలని సంకుచితభావములు లేనట్టి దనియు, ఇది శక్తిమంతమైన జీవభాషయనియు వ్రాసి, సైన్సు, ఇంజ సీరింగు, వైద్యము మొదలైన యాధునిక శాస్త్రవిజ్ఞానమును ప్రచారము చేయుటకు తెలుగుభాషలో ఎంతయైన యవకాశమున్నదనియు, పాశ్చాత్య దేశములందలి యేభాషతోనైనను తెలుగు సరితూగగలదనియు, ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వనిర్వాహకులు ఈ యవకాశమును వినియోగించుకొనినచో దేశభాషలలో శాస్త్రవిజ్ఞానప్రకటనసమస్య సులభముగా పరిష్కారమగు ననియు వ్రాసియున్నారు.

కలకత్తావిశ్వవిద్యాలయమున 'ఫైలాలజీ' లేక భాషా విజ్ఞాన శాస్త్రమున ఆచార్యులుగ పనిచేయుచున్న శ్రీ సుకుమారసేనుగారు చారుచంద్ర కాలేజీలో ఆంధ్రేతరులకొరకేర్పడిన తెలుగుతరగతులకు ప్రారంభోత్సవము చేయుచు 6-11-1960 తేదీన ఇట్లు చెప్పిరి:

"తెలుగుభాషయొక్క మాధుర్యమును వంగదేశీయులకు మొట్ట మొదట రుచిచూపించిన సాహితీవేత్త మధుసూదనదత్తుగారు.* భారతీయభాషలలో తెలుగుకు ప్రత్యేకస్థానమున్నది, ప్రొఫెసర్ హాల్డేన్ గారు చెప్పినట్లు తెలుగు దక్కినభారతీయభాషలలో ప్రతిదానికి అతిచేరు

* ఈయన చెన్నపట్టణమున కొన్నిసంవత్సరము లుద్యోగముచేసి తెలుగునేర్చుకొనెను.

వగనుండును. దీనికి ప్రధానకారణము దీనిలోని ఆర్యద్రవిడభాషాలక్షణములు. ప్రాచీనచరిత్రను పరిశోధించినచో, వంగ, కళింగ త్రిలింగదేశముల అవినాభావసంబంధములు, సాహిత్యములోని దగ్గరసంబంధము కనబడును. ఈ మూడుదేశభాషలలో చాలా పోలికలున్నవి. వైష్ణవమత ప్రాబల్యము హెచ్చుగానుండినకాలమున ఆంధ్రదేశ సాంస్కృతికసాహిత్య సంప్రదాయములయొక్క ప్రభావము తక్కినదేశములపైన వ్యాపించినది. ముఖ్యముగా చైతన్యప్రభువు తెలుగుదేశమును దర్శించి రాగానే, తెలుగుల ప్రభావము వంగీయులపైనను వంగసాహిత్యముపైనను విశేషముగా ప్రతిబింబించినది. ఈ రెండుభాషలును సంస్కృతభూయిష్ఠములగుట వని మఱింత సన్నిహితములుగనుండుటకు కారణమైనది. భారతదేశమున నడిబొడ్డుననున్న ఆంధ్రప్రదేశము ఉత్తర దక్షిణదేశముల సాహిత్య సంస్కృతిసంప్రదాయములను రెంటిని తనలో లీనముచేసికొని ఈ రెండు ప్రాంతములమధ్యను వారధివలె నిలిచియున్నది. తెలుగుభాషకుగల మఱియొక ప్రత్యేకలక్షణము—అది మఱి యేయితరభాషనైనను సాదరముగా తనలో నిముడ్చుకొనగలుగు స్వభావము,

తెలుగుఉచ్చారము సొంపుగానుండి, వినుట కెంతో యింపుగనుండును. సంస్కృతసారస్వతములోని విశేషములనన్నిటిని మొట్టమొదట బయటకుతీసినది తెలుగుభాషయే. ముఖ్యముగా పద్యరచనను అనువదించుటలో తెలుగుభాషయె తక్కినభాషలకు మార్గదర్శకమైనది.

వివిధభాషలకు, విభిన్న సంస్కృతులకు నిలయమైన మనదేశములో ఐక్యతను పెంపొందించవలసిన యవసరమెంతయైన కలదు. అది భాషాసాహిత్యములద్వారముననే కలుగును. సంకుచితభావములను వర్జించి, వివిధరాష్ట్రముల ప్రజలు ఇతర భాషల నభ్యసించి, ఆ సాహిత్యములను చదివి, ఆయాప్రజలను అర్థముచేసికొనుటకు ప్రయత్నింపవలెను. ముఖ్యముగా మృదుమధురమైన తెలుగుభాషలోని రుచులను అందఱును ఆస్వాదించవలెను" అని పేన్‌గారు హెచ్చరించిరి.

శ్రీ కాంచీ కామకోటిపీఠాధిపతులైన శ్రీ చంద్రశేఖర భారతి స్వాములవారు కొంతకాలముక్రిందట చెన్నపట్టణములో వేదశాస్త్రములను గూర్చియు సంస్కృతభాషనుగూర్చియు దేశభాషలనుగూర్చియు నుప న్యసించు సందర్భమున తెలుగుభాష చాలా మధురమైనదని, తెలుగు అక్షర ములు ఆణిముత్యములవలె గుండ్రనై యుండుట గొప్పవిశేషమని పేర్కొనియున్నారు.

దక్షిణహిందూదేశములో చర్చిమిషనరి సొసైటివారు స్థాపించిన క్రైస్తవమతప్రచారకకేంద్రములను చూచుటకై దేశములో తిరిగిన ఎస్. టక్కర్ అను మిషనరీ "సౌత్ ఇండియన్ స్కెచెస్" అను పేరుతో 1862లో ప్రకటించిన గ్రంథమునందు తిరునల్వేలి, మధురజిల్లా ల్లలో చూచిన దాక్షిణాత్యాంధ్రులనుగూర్చి యిట్లు వ్రాసినారు:

"తమ పూర్వులు హిందూదేశములో పశ్చిమోత్తర భాగమునుండి ఇక్కడికి వచ్చినారని ఈదేశపు బ్రాహ్మణులు చెప్పుకొందురు. తిరు నల్వేలిజిల్లా బ్రాహ్మణులందరును తమయిండ్లబయట వ్యవహారములందు అరవము మాట్లాడుచున్నను, తమయిండ్లలోను ఒకరితోనొకరు మాట లాడుకొనునప్పుడును తెలుగే మాటలాడుదురు. తంజావూరులోకూడా ఇట్లే జరుగుచున్నదని వింటిని. తెలుగువారిదేశము చెన్నపట్టణమునకు ఉత్తరమున పులికాటు మొదలుకొని, గంజామువరకును, దేశములో బళ్ళారి, హైదరాబాదు వగైరా ప్రదేశములవరకును వ్యాపించియున్నది. అరవదేశములో వంతటనుకూడా ఈ తెలుగువారు తిలతండుల న్యాయ ముగా వెదజల్లినట్టున్నారు. తెలుగువారి గ్రామములుకూడా చాలా ఉన్నవి. ఇండ్లలో పనులుచేయు నౌకరులలో కొంతమంది తెలుగువారు. పల్లకులు మోయు బోయీలందరును తెలుగువారే.

"వీరు మాటాడు తెలుగుభాషకును దేశములోని తక్కినవారు మాట లాడు అరవభాషకును చాలాతారతమ్యమున్నది. వీరొక ప్రత్యేకమైనజాతి

వారైనట్లుగా కనబడుచున్నారు. అరవులకన్న వీరు ఎక్కువ సంతుష్టి కలవారుగను, బుద్ధిబలముకలవారుగను ఉన్నారు. అరవలవలెనే వీరును బంధుప్రేమకలవారును, స్నేహపాత్రులును. అయితే వారికన్న వీరు ఎక్కువ పౌరుషవంతులును, నిష్కపటులును, విశ్వాసపాత్రులును."

## 10. హిందుస్థానీ నాగరకత

హిందూదేశముపైన దండయాత్రలుచేసిన వివిధదేశములకు చెందిన మహమ్మదీయులలో కొందఱు అరబ్బీ పారశీక తురుష్కనాగరకతలకు చెందినవారునై యుండిరి. వారు మొదట మతావేశపరులై కొన్నిదౌర్జన్యములనుచేసినను, మనదేశీయులను బలవంతముగా తమ మతమున కలుపుకొన్నను, తరువాత వారీ దేశములో స్థిరపడి శాంతముగా జీవించుచు వివిధవృత్తులను చేసికొనుచు ఈదేశములోని ముసల్మానులతో సంబంధబాంధవ్యములనుచేయుచు, ఈదేశ ప్రజలలో కలిసిపోయి, ఈ దేశమునే తమ మాతృదేశముగానెంచిరి. వారు జీవించుచున్న భారతదేశ నైసర్గిక పరిస్థితులును వారిచుట్టునుండు ప్రకృతియు, దేశీయుల ఆచారవ్యవహారములును వారియందు గొప్ప మార్పుకలిగించెను. వారి క్రూరస్వభావమెల్ల అణగిపోయెను. ఈ మహమ్మదీయుల చిత్తవృత్తులయందు, ఆచారవ్యవహారములందు, సంస్కృతి సంప్రదాయములందు గొప్ప మార్పుకలిగెను. ౬

అనేక భాషలం దపార పాండిత్యమును సంపాదించి అరబ్బీనాగరకతనుగూర్చి ఫ్రెంచిభాషలో వ్రాయబడిన గ్రంథమును ఉర్దూభాషలోని

తమువదించి, మద్రాసు విశ్వవిద్యాలయమున సంస్కృతమున పరీక్షాధి కారిగా నియమింపబడి, 1910లో దివంగతులైన సయద్ అలీ బిల్‌గ్రామీ గారు సికిందరాబాదులో నుపన్యసించుచు నిట్లు చెప్పిరి:

"హిందూదేశపు ముసల్మానులమైన మనము తురుష్కదేశమందును ఇతర మహమ్మదీయరాజ్యములందును గల ముసల్మానులందఱు మనలను ముసల్మానులనక "హిందీ"లని వ్యవహరించునంతగా భారతీయసభ్యతలో లీనమైనాము. 'హిందీ'లనగా హిందువులనియె అర్థము."

హిందూమహమ్మదీయు లిట్లు చిరకాల మొకచోట జీవించినందు వలన హిందువులు మహమ్మదీయులు నను భేదములేకుండా సర్వజనుల కును ప్రీతికరములైన వేషభాషలును ఆచారవ్యవహారములును, సంగీత సాహిత్యములును, శిల్పసంప్రదాయములును బయలుదేరినవి. అవి యన్నియు కలిసి యొకవిధమైన నూతనసంస్కృతి యేర్పడినది. దీనికి ఉత్తర హిందుస్థాన సంస్కృతియని చరిత్రకారులు నామకరణముచేసి యున్నారు.

కేవలము సనాతనమతధర్మములకు సంబంధించిన దేవాలయము లును, కేవలము ఇస్లాము మతమునకు సంబంధించిన మశీదులునుగాక, ఉత్తరహిందుస్థానములోని మొగలాయి రాజధానినగరములందేగాక దేశము లోని ఏభాగమున నున్న మహానగరములకు పోయి చూచినను తుదకు రాజపుత్రస్థానము, మధ్యరాష్ట్రములు, అయోధ్య ఆగ్రాపరగణాలయం దును రాజనగరుల్లను, బిజాపూరు, హైదరాబాదు రాజ్యములందును రాజ నగరులును వీధులలోనికి కట్టబడియున్న ఇండ్లు వాకిండ్లను, బాటసారుల కొఱకు నిర్మింపబడిన సరాయిలు సత్రములు, స్నానఘట్టములు మొద లైన లౌకికప్రజాజీవనమునకు సంబంధించిన కట్టడములను పరిశీలించి నచో అందలి శిల్పము నందు హిందూమహమ్మదీయప్రజలందఱియొక్క రుచులను కన్పడుచున్న వేగాని, కేవల మొక్క ప్రజాసంఘమునకు ఒక మత సంప్రదాయమునకు చెందినట్టివిగా కనబడుటలేదు.

హిందువులకట్టడములపైన గల గాలిగుమ్మటములును, వికసించిన పుష్పములవంటి స్వరూపములును, అష్టభుజముల కట్టడములును, స్తూపీలు, బురుజులు, గోడలపైన కిటికీలపైన చెక్కిన శిల్పమును హిందువులశిల్పములు కావని అనుకొనుటపొరపాటు.* అయితే మహమ్మదీయుల సంప్రదాయమునకుచెందిన శిల్పములు కొన్ని యున్నవి. ఇట్లే మహమ్మదీయుల కట్టడములలో అందముగా చెక్కిన రాతిపోటీ వలకలస్తంభములును; ముందుకువొచ్చుకొనివచ్చు మండపములును, నలుపలకల స్తంభములును, అడ్డముగా వేయబడిన తనాబీలు, బల్లపరుపుగానుండు కప్పులు, అతిసున్నితముగాను చిత్రవిచిత్రముగాను చెక్కిన నగిషీలును మహమ్మదీయుల శిల్పసంప్రదాయమునకుచెందిన వనుకొనుటయు గొప్ప పొరపాటే. అవి కేవలము హిందువులశిల్పమేయని శాస్త్రజ్ఞులందరును అంగీకరించుచున్నారు.

ఇట్లునగర భవన నిర్మాణములందలి శిల్పమునందువలెనే ప్రజల వేషభాషలందును, రుచులందును, సంగీత సాహిత్యములందును ఆటపాటలందును ప్రజాజీవనమునందును హిందూమహమ్మదీయ సంప్రదాయములు ఏది ఎవరిదో తెలిసికొనవీలులేనంతగా కలిసిపోయి, ఒక అపూర్వమైన హిందూస్థానీ నాగరకతయు సంస్కృతియు నేర్పడి దినదినాభివృద్ధి గాంచినవి. ఇది తెలియనివారు ఉత్తర హిందూస్థానము నందును దానికి ప్రతిరూపమైన బీజాపూరు, హైదరాబాదు నగరములందును కనబడు శిల్పము, సంగీత సాహిత్యములు, వేషభాషలు చూచి, ఇవి కేవలము

---

* ఇవి ముస్లిం సంప్రదాయపువి కావు. గుమ్మటాలు ఆర్చిలు హైందవములే. అందుకు తార్కాణములున్నవి.

మహమ్మదీయసంప్రదాయమునకుచెందిన నాగరకతయు సంస్కృతియు ననుకొని పొరబాటు అభిప్రాయపడుచుందురు. *

ఉత్తర హిందుస్థానమునందువలెనే దక్షిణాపథమున హిందూ మహమ్మదీయుల చిరకాల సాహచర్యమువలన నుభయమతముల ప్రజలకును ప్రీతికరమైన యొక 'దక్షానీ నాగరకత'యు సంస్కృతియు నేర్పడినవి. హైదరాబాదులోని హిందువులు మహమ్మదీయులు నివసించు గృహములును, వారు ధరించు దుస్తులును ఉత్తర హిందుస్థానమునందువలెనే ఒకేమాదిరిగా నుండును. హిందువులైనను మహమ్మదీయులైనను బయటకు పోవునప్పుడు పాయిజామాలను షర్గీలను ధరించి, కాళ్ళకు ఛడావు చెప్పులు ధరింతురు. ఇండ్లలో ముఖ్యముగా గ్రామసీమలందు నీ యుభయ మతములవారును ఎట్టిభేదము లేకుండా ధోవతియు, ఉత్తరీయమును ధరింతురు.

చాలాప్రాంతములందు ఈ రెండుమతములవారి స్త్రీజనమును అంగియా యును, పోషాకొలకు మేలిముసుగుగా వేసికొను జలతారుఅంచు ఓణి యును, కుచ్చెళ్ళుపోసి కట్టుకొను పమిటిపావడాయును, రవికలును ఎట్టి భేదమునులేకుండా ధరింతురు. ఇట్లే కండ్లకు కాటుకపెట్టుకుని, చేతులకు గాజులు నగలు ధరింతురు.

ఉత్తరహిందుస్థానమునందు హిందూ మహమ్మదీయుల ఇండ్లలో జరుగు శుభకార్యములలోను పండుగలలోను బాలబాలికల పుట్టినరోజుల పండుగలలోను పెండ్లిండ్లలోను స్త్రీలందఱును ఒకేవిధములైన పాటలు పాడుదురు. పిండివిసరునప్పుడు, దంపునప్పుడు, బరువుమోయునప్పుడు పడవలులాగునప్పుడు, ఇండ్లడాబాలపైన సున్నమునకు జిగివచ్చుటకు కొట్టునప్పుడు, ఇంకను నలుగురుకలిసి కాయకష్టముచేయు అన్ని సందర్భములలోకూడా దంపుళ్ళపాటలు, రోకంటిపాటలు, పడవపాటలు నొకేవిధమైనవానిని పాడుదురు. ఇందులో హిందూమహమ్మదీయభేదము లేదు.

---

* The Hindu-Moslem Civilisation of India, Rabindra Narayan Ghosh. Dawn Society's Magazine 1911.

ఉత్తర హిందుస్థానమున మహమ్మదీయుల ఇండ్లలో పాడు లాలిపాటలు బాలకృష్ణునిగూర్చిన లాలిపాటలే.

మొగలాయిసామ్రాజ్యకాలమున పారశీభాషను నాగరకతను ఆ చక్రవర్తులు, వారి సామంతులు నాదరించి గౌరవించిరి. ఇట్లే బహమనీ సుల్తానులును దక్షిణాపథమునందును వాని నాదరించిరి. గోలకొండరాజ్యమునను ఇట్లే జరిగెను. పారశీ రాజభాషగా నుండెను. వ్రజభాషలోను హిందీభాషలోను పారశీకపదము లనేకములు వచ్చిచేరెను. అంతట మన దేశములోని సైనికశిబిరములందును బజారులందును దర్బారులందును ఉర్దూ అను నాజూకైన వాడుకభాష యొకటి ఉద్భవించి, ప్రజాదరణమును పొందెను. ఇందులోని పదములు వివిధభాషలకుచెందినను, దీని వ్యాకరణము మన దేశభాషయైన హిందీభాషసంప్రదాయమునకు చెందినదే. ఆకాలమున చాలామంది మహమ్మదీయులు హిందీభాషలోను, హిందువులు ఉర్దూభాషలోను కవిత్వముచెప్పుచు, రాజసమ్మానమును పొంది ప్రజలచే మన్ననలందుచుండిరి.

హిందువులైనను మహమ్మదీయులైనను హైదరాబాద్‌లో పారశీ భాషలోను ఉర్దూభాషలోను విద్వాంసులై సాహిత్యవ్యాసంగముచేయుటయు గౌరవముగ నెంచుచుండిరి.

## గోలకొండ, హైదరాబాదు రాజ్యముల స్థితిగతులు

ఉత్తరహిందుస్థానమున మొగలాయిచక్రవర్తి దర్బారులోవలెనే హైదరాబాదు నేలిన గోలకొండసుల్తానుల యాస్థానమునగూడా అరబ్బీ పారశీక తురుష్క దేశముల విజాతీయసంప్రదాయముల ననుకరించు ప్రభువులును, దేశీయమైన దక్కనీసంప్రదాయముల నవలంబించిన ప్రభువులుమండిరి. హిందువులైనను మహమ్మదీయులైనను 'ఫెజ్' రూమీ కుచ్చుటోపిలను తలపాగాలను ధరించి, పాయిజామాలను షెర్వాణీలను ధరించి,

పారశీ ఉర్దూ భాషలను మాటలాడుచు, వంగివంగి సలాములుచేసికొనుచు ఒకరి నొకరు ఆలింగనములుచేయుట ఆచారమయ్యెను. * ఒకరిండ్లకొకరు పోవునప్పుడు అత్తరు తాంబూలముల నిచ్చి, ఆదరించుట హుక్కాల నందించుట మర్యాదయని యెంచిరి. హిందూ మహమ్మదీయ స్త్రీజనము ఘోషాపద్ధతినవలంబించి పరపురుషులకంటబడకుండ ఇండ్లలో పరదాలు కట్టించి బయటకువచ్చినప్పుడు బురఖాలనువేసికొని పల్లకీలతలుపులు మూసికొనుచుండిరి. బలవంతులగు నవాబులయొక్కయు ప్రభువుల యొక్కయు కంటబడినచో కన్యలుదక్కరని యెంచి, హిందువులును మహమ్మదీయులునుకూడా వయసురానిపిల్లలకు పెండిండ్లుచేయసాగిరి. ఇది హిందువులలో మితిమీరెను.

మహమ్మదీయ పీర్లకును దర్గాలకును హిందువులు మ్రొక్కుబడుల చెల్లించుటయు, హిందువుల గ్రామదేవతలకు మహమ్మదీయులు మ్రొక్కుబళ్ళు చెల్లించుటయు జరుగుచుండెను. హిందువులతోపాటు మహమ్మదీయులును వారము వర్జ్యము శకునము చూచుకొనుటయు, అన్ని పనులకు మంచి ముహూర్తములుపెట్టించుకొనుటయు, జాతకములు చెప్పించుకొనుటయు ఆచారమయ్యెను.

కచ్చేరీలలోను న్యాయస్థానములలోను బజారులలోను పారశీ అరబ్బీ ఉర్దూమాటలను విరివిగా నుపయోగించుచుండిరి. ప్రజల జీవన విధానమునకు సంబంధించిన విజాతీయ పదములు వాడుకలోనికి వచ్చినవి. హిందువుల పాఠశాలలందు పారశీభాషను నేర్చుకొని తెలుగు మాటలాడుట పరిపాటియయ్యెను.

తెలుగుదేశములోని మహమ్మదీయులు ఇండ్లలో చేసికొను జాతకర్మలందు వివాహాది శుభకార్యములందు పండుగలయందు హిందువుల ఆచారములనేకములు స్వీకరించిరి. పెండ్లిండ్లలో పెండ్లికొమార్తెకు పసుపు

---

* ఆలింగనము పురాతన ఆర్యాచారము.

నలుగుపెట్టుట మొదలు, పెండ్లికుమారుని గుఱ్ఱముపైన కూర్చుండబెట్టి కత్తి చేతికిచ్చి ఊరేగించుటవఱకును, వివాహమహోత్సవములోను ఇతర ఆచారములందును మహమ్మదీయులు మన క్షత్రియాచారములను స్వీకరించిరి.

బహమనీరాజుల కాలమునను గోలకొండ సుల్తానుల రాజ్యకాలమునను, తరువాత మొగలాయి ప్రభుత్వకాలమునను దర్బారు మర్యాదలను హిందువులు మహమ్మదీయులను భేదములేకుండా అవలంబించిరి. హైదరాబాదులోనేగాక, రాయలసీమలోను ఉత్తరసర్కారుజిల్లాలలోను కచ్చేరీలయందు బజారులందు జనసామాన్యము నేటికిని వందలకొలది ఉర్దూ పారశీ అరబ్బీమాటల నుపయోగించుచున్నారు. పాదుషా, నవాబు, సర్దారు జమీన్‌దారు, అర్జీలు, ఫిర్యాదులు, ముద్దాయి, శిస్తు, దస్తులు, ఇజారా జప్తు, అమలు, మునసబు, గుమాస్తా మొదలైన మాటలు, జిలేబి, లడ్డు, అత్తరుదాను, అగరువత్తి, పాన్సుపారీ, సుర్మా, పాంజేబు, బాజాబందు, కంఠి, నత్తు, బులాకి, జిగినీ మొదలగు మాటలు కచ్చేరీలలోను, బజారులలోనేగాక, ఇండ్లలో స్త్రీపురుషులనోట వినబడుచుండును. కవుల రచనలందును కనబడును. హిందువులు మహమ్మదీయులు వరుసలుపెట్టి పిలుచుకొనుట, ఒకరిండ్లకొకరు పోయి, శుభకార్యములందు మర్యాదలు పొందుటయేగాక, పీర్లపండుగలలో హిందువులు పాల్గొనుటయు, పులివేషములను హిందువులు మహమ్మదీయులు వేయుటయు, దీపావళిలో మహమ్మదీయులు బాణసంచా కాల్చుటయు అందఱు నెఱిగిన విషయమే.

—o—

# 11. పాశ్చాత్య నాగరికత

## ఫ్రెంచి నాగరికత

ఐరోపాఖండమునుండి మనదేశమున వ్యాపారము చేయుటకు వచ్చిన వివిధ పాశ్చాత్యజాతులవారందరిలో ఫ్రెంచివారు చాలా నాగరికులుగా నుండిరి. ఆకాలమున ఫ్రెంచివారి వేషభాషలు, సంస్కృతి సంప్రదాయములు, ఆచార వ్యవహారములు ఐరోపాలోని ఇతరజాతులవారికి మేలుబంతిగా నుండెను. ఇంగ్లాండులోని స్త్రీపురుషులుకూడా ఫ్రాన్సుదేశము ముఖ్యపట్టణమైన ప్యారిసునగరములోని నాజూకుతనము ననుకరించుచుండిరి. ఇంగ్లీషువారి గృహాలంకరణవిధానము, దుస్తులు, జుట్టుకత్తిరింపులు, వంటలు, ఆటపాటలు, సైనికకవాతులు ఫ్రెంచివారి అనుకరణములే. ఇంగ్లాండులోని శ్రీమంతులయిండ్లలో జరుగు విందులందు స్త్రీపురుషులు ఫ్రెంచిభాషలో మాటాడుచుందురు. తుదకు ఫ్రెంచి సామెతలనైన ఉపయోగింపనివారిని విద్యావంతులుగా పరిగణింపకుండిరి. ఆనాటి గ్రంథములయందు ఫ్రెంచిమాటలు, పద్యములు విరివిగా నుపయోగించుచుండిరి.

మనదేశమునకు వచ్చిన ఫ్రెంచివారు దేశీయులతో కలసిమెలసి ప్రవర్తించుచుండిరి. వారు దక్కను సుబాదారుడగు హైదరాబాదు నిజాము దర్బారులో పలుకుబడి సంపాదించిరి. ఉత్తరసర్కారుల నెనిమిదేండ్లు పాలించిరి. ఆకాలమున నిజాముదర్బారులోనేగాక, ఆ రాజ్యమునందంతటను ఉద్యోగులును, గొప్పవారును ఫ్రెంచివారి మర్యాదలను గౌరవించి, వాని ననుకరించుటలో నాశ్చర్యములేదు. ఇంగ్లీషువారు ఫ్రెంచివారిని త్రోసిరాజని మనదేశమును పాలింపసాగిరి. అయితే ఫ్రెంచి సంస్కృతి సంప్రదాయములుమాత్రము మిగిలినవి.

తెలుగువారు ధరించు దుస్తులలో "కమీజు" అను చొక్కా, విలువ
గల సకలాతు ముఖమల్ వస్త్రములు, గృహోపకరణములలో అల్మారు,
బీరువా, చీట్లపేకయాటలో జాకీ మదాములు, కుదేలు బేస్తులు, సైనిక
వ్యవహారములందు కెప్తాను, జెండ్రాలు, సోల్దారు, మయూరు, గరండీలు
కుమంద్రము అనుమాటలు తెలుగుకవుల గ్రంథముల కెక్కినవి. దొరల
వంటవానిని మనవా రిప్పటికినీ కుసినీవాడని యందురు. టీ అను మాటకు
బదులుగా తేనీ రను పదము ఫ్రెంచివారివల్ల వచ్చినదే.

బొబ్బిలియుద్ధమునుగూర్చి మన తెలుగులో వ్యాప్తిలోనున్న
పాటలో బుస్సీదొరగారు గొప్పగా వర్ణింపబడియున్నారు. బొబ్బిలియుద్ధము
నితివృత్తముగా గైకొని, దిట్టకవి నారాయణకవి రచించిన రంగరాయ
చరిత్రమందును బుస్సీగారిని, ఫ్రెంచివారినిగూర్చిన ప్రశంసలున్నవి.
పుదుచేరి గవర్నరైన డూప్లేగారి దుబాషి ఆనందరంగపిళ్ళగారియాస్థాన
కవి కస్తూరి రంగకవి తన ఆనందరంగరాట్ఛందమునందు ఫ్రెంచివారి
కతను వర్ణించినాడు. పాండుచేరి ప్రభుత్వమువారి యుత్తరువులు ఫ్రెంచి
భాషలోను అరవములోను మహారాష్ట్రములో మాత్రమే గాక తెలుగు
భాషలోకూడా ప్రకటింపబడుచుండెను.

## ఆంగ్లేయనాగరికత ప్రభావము

ఆంగ్లేయనాగరికత ప్రభావమున వేషభాషలలో వచ్చిన మార్పును
శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగా రిట్లు వర్ణించినారు:

"ఈ నూరేండ్లలో మనము గుర్తుపట్టరాని విధముగా మారిపోయి
నాము. మన జుట్లు ఎగిరిపోయినవి. కొంతకాలము ఇంగ్లీషు క్రాఫులను
జుట్లను సమానాదరముతో ఎక్కువగా నుత్తరసర్కారులవారు పోషించిరి. ఇతరులజుట్లు సన్నగిలసాగెను. తుదకు నిర్భయముగా నెగురగొట్ట
బడెను. బొందులయంగీలు 1900 వరకు నుండెను. అవి క్రమముగా

పోయెను. ఇప్పు డవి కానరావు. అందరును నానావిధములగు అంగీలను షర్టులను తొడిగికొందురు. కోట్లు ఇంగ్లీషువారినుండి మనకు వచ్చినవి. అంతకుపూర్వము పార్శీ షేర్వానీలను జమీన్‌దారులు, పెద్దయుద్యోగులు, తురకలును వేయుచుండిరి. ఇంగ్లీషు సంపర్కమువల్ల షేర్వానీలరూపము మారి, యప్పటి హైదరాబాదీ హిందుస్తానీ షేర్వానీలుగా నేర్పడెను. ఫెల్టుటోపీలు విరివియయ్యెను. తుదకు పూర్తిగా ఇంగ్లీషువేషమే పసంద నియు, మర్యాదహేతువనియు పలువురు ఇంగ్లీషువిద్యావంతులు దొకాల రులను ధరించిరి. స్త్రీల యాభరణములలోకూడా మార్పులువచ్చెను. నత్తు, ముక్కర, వంకి, పగడాలదండలు, కాలికడెములు, చెంపబిళ్ళలు, వెత్తి కొప్పుబిళ్ళలు, జడకుచ్చులు, బులాకులు, బావిలీలు, బొబ్బిలికాయలు మాటయ్యెను. అవి యించుమించుగా నంతరించి పోయినవి. గొలుసు (తెయిన్-చీనాగొలుసు) పతకము, బంగారుగాజులు మున్నగునవి ప్రచా రములోనికి వచ్చినవి. రవికలలో చిల్లరమార్పులు, చీరకట్టులో నాజూకు తనము వ్యాపించినవి. *

ఆంధ్రుల భోజనవిధానము కొన్ని శతాబ్దములపాటు మారలేదు. అన్నము, నెయ్యి, పప్పుకూరలు, పచ్చళ్ళు, దప్పళము, పెరుగు ప్రధా నాహారపదార్థములుగా నున్నవి.

శ్రీనాధుడు తెలుగువారి భోజనమును చిత్రవిచిత్రముగా వర్ణించి నాడు. ఆముక్తమాల్యదలోకూడా తెలుగువా్రి భోజన వర్ణనము లున్నవి. తరువాత కవులును మన భోజనపద్ధతిని వర్ణించినారు. ఆంగ్లేయ ప్రభుత్వ కాలమునందు ప్రయాణసౌకర్యమువలన దక్షిణదేశములో నితరప్రాంతము లందుగల బంగాళాదుంపలకూర, మైసూరురసము, సాంబారు, కొళంబు మొదలగు వంటకములేగాక, ఇడ్లీ, సాంబారులు, ఉపమావు, కాఫీ, ఫల హారములు, నాన్‌రొట్టి, బిస్కత్తులు, చోకలెట్లు తెలుగుదేశములో వ్యాపిం

---

* తెలుగుసంస్కృతి-విజ్ఞానసర్వస్వము, 3 వ సంపుటము పుటలు 1140—41.

చినవి. ఇటీవల సోడాలు, లైమ్‌జూసు మొదలైన పానీయములు, ఐస్ క్రీములున్ను వచ్చిచేరినవి.

పూర్వము రాకపోకలకు సరియైన రాజబాటలుగాని, రోడ్లుగాని లేకుండినకాలమున పల్లకియు, ఎడ్లబండ్లును మనకు ప్రయాణసాధనములుగ నుండెను. ఇంగ్లీషుయుగమున గుఱ్ఱపుసార్టుబండ్లును రైళ్ళును మోటారులును వచ్చినవి.

పూర్వము గొప్పనగరములందుమాత్రమే పూటకూటిండ్లుండగా నిప్పుడు చిన్న పట్టణములందు పల్లెలందు కాఫీహోటళ్ళు వెలసినవి. పూర్వకాలమునాటి గురుకులములు వేదశాస్త్రపండితులు శిష్యులకు తమతమ ఇండ్లలో చదువుచెప్పు పద్ధతికి బదులుగా వీధిబడులు, ఎలిమెంటరీ స్కూలు, హైస్కూలు, కాలేజీచదువులు వచ్చినవి. పూర్వము తాటియాకుల పుస్తకములకు బదులు కలము, కాగితములు, సిరా, వ్రాతపుస్తకములు, అచ్చుపుస్తకములు వెలసినవి.

వినోదములందు పూర్వకాలమునాటి చెడుగుడు, ఉప్పట్లు, గోటీబిళ్ళ మొదలగు ఆటలకు బదులుగా ఫుట్‌బాలు, క్రికెట్టు, బ్యాడ్‌మింటన్ ఆటలు వచ్చినవి. పూర్వకాలపు వీధిభాగవతములు, యక్షగానములు, బుర్రకథలు, తోలుబొమ్మలు మొదలైనవానికి బదులుగా తెరల స్టేజినాటకములు, సినిమా టాకీలును వచ్చినవి. తంతి తపాలాసౌకర్యములు టెలిగ్రాఫ్‌ద్వారా వార్తాప్రచారములువచ్చినవి. రేడియోకూడా గ్రామములందు వెలసినది.

పూర్వము గ్రామములందలి గృహవైద్యము అనువంశిక ఆయుర్వేద వైద్యులు, మంగలివాండ్రు చేయు చికిత్సకుబదులుగా అపొతకరీలు, డ్రెసరులు, డాక్టర్లు, సర్జనులు వచ్చిరి. ఆసుపత్రులు, చికిత్సాలయములు స్థాపింపబడినవి. పూర్వకాలమునాటి కుప్పెకట్టులు, మాత్రలు, కషాయములు, ఇతరౌషధములకు బదులుగా టేబ్లెట్లు, పౌడర్లు, ఇంజెక్షనులు, [illegible]డ్రగ్గులు, ఆంటిబయాటిక ఔషధములు వచ్చినవి.

పూర్వకాలమునాటి పంచాయితీ తీర్పులకును, రాజసభ నవాబు దర్బారు న్యాయవిచారణలకును బదులుగా ఇంగ్లీషు ప్రభుత్వము సివిలు క్రిమినలు న్యాయవిచారణ పద్ధతులు వచ్చినవి.

సుప్రసిద్ధ చరిత్రపరిశోధకులగు శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు ఆంధ్రులచరిత్రలో నిట్లు వ్రాసియున్నారు:

"ఉత్కలదేశ ప్రాంతములవా రొకరీతిగను, ద్రావిడదేశప్రాంతములవారు వేరొకరీతిగను, కర్ణాటకదేశ ప్రాంతములవారు మఱొకరీతిగను, మహారాష్ట్రదేశ ప్రాంతములవారింకొకరీతిగను వేషభాషలయందు వేఱుపడి, ఆయా దేశ సంప్రదాయములను విశేషముగాఁ గలిగియుండి భిన్న జాతులట్లు గన్పడెదరుగాని, నిక్కమాలోచింప వీరెల్లరు నాంధ్రులేగాన వేఱుగ భావింపరాదు.

నదుల కానకట్టలుగట్టఁబడి కాలువలు త్రవ్వబడి దేశమునందంతట నదీజలములు ప్రవహింపజేయబడి యూషరక్షేత్రములు సహితము వరిపండునట్టి దివ్యక్షేత్రములుగ మార్చబడి, నానావిధములైన పంటలు పండింపబడుచున్నవి, ఇట్లు దేశము జలపూరితమై, సర్వ సస్య ఫలప్రదంబగుటజేసి, జనాభివృద్ధిగలిగి, వానితోఁబాటు పట్టణములు, పల్లెలు ద్విగుణముగా త్రిగుణముగా నధికముకాఁగా వాణిజ్యము హెచ్చినది. వాణిజ్యము హెచ్చినకొలది సౌకర్యము లెక్కువ సమకూర్పబడినవి. మహానదులకు వంతెనలు గట్టబడి, పర్వతములు తొలువబడి, అయోమార్గములు నిర్మింపబడి పొగబండ్లు నడుపబడుచున్నవి, ప్రతి పెద్ద పల్లెయందును లేఖావహన కార్యస్థానములు నెలకొల్పబడినవి. ప్రతి పట్టణమునందును తంత్రుల మూలముగా వార్తలనుబంపు కార్యస్థానములు నెలకొల్పబడినవి.

బ్రిటీషు పాలనమున నాంధ్రులు విద్యాపరిజ్ఞానమునసంపన్నులై నానాటి నాగరకతాభివృద్ధులను గాంచి వర్ధిల్లుచున్నారు. అభివృద్ధిఁబడయుటకుపయుక్తములగు సుగుణముల ననేకములు కలిగియుండి యాత్మస్వాతం

త్ర్యమునందభిలాష గలిగియుండియు, సుద్రేకులుగాక ధైర్యముచూపవల
సిన సత్కార్యసమయముల వెనుకంజవేయక శాంతమతులై, నాగరికత
యందు హిందూదేశమునందలి ఏజాతివారికిని దీసిపోక సదా సంస్కరణాభి
రతులయి మెలంగుచున్నారు. బ్రిటీషుపరిపాలనమునందింకను సత్యో
న్నతస్థితి కాంధ్రులు వత్తురని విశ్వసించుటకు ప్రబలహేతువు లనేకములు
కలవు." * అని వ్రాసిరి.

నిజమునకు ఆంగ్లేయ ప్రభుత్వకాలమున ఆంధ్రులు వారుచెప్పినంత
యభివృద్ధిచెందలేదు. ఆకాలమున భారతదేశ స్వాతంత్ర్యముకొరకు
బ్రిటిష్‌వారితో జరిగిన పోరాటములందు ఆంధ్రు లఖండత్యాగముచేయు
చుండినందువలన ఇంగ్లీషువారు ఆంధ్రుల ఆర్థికాభివృద్ధికి తోడ్పడక వారిని
మద్రాసు రాజధానిలోని వివిధభాషలకు సంబంధించిన తగవులందును,
జాతి మత కుల వర్గ వివాదములందును ముంచి బాధించిరి. భారతదేశము
నకు స్వాతంత్ర్యముసిద్ధించిన చాలాకాలమునకుగాని ఆంధ్రరాష్ట్రము
సిద్ధింపలేదు.

ఆంగ్లేయు లీదేశమును పరిపాలింపనారంభించిన కొలది కాలము
లోనే భారతదేశములో రాజకీయ సాంఘిక మతాచార వ్యవహారములందు
గొప్పమార్పుకలిగినది. ఈమార్పుయొక్క నిజస్వభావమును గ్రహింప
వలెనన్నచో నిది కలుగుటకు కారణములనన్నిటిని గ్రహింపవలెను.
ఇంగ్లీషు కుంపిణీ ప్రభుత్వమువలన రాజకీయ ఆర్థిక సాంఘిక మతవిష
యములందు వచ్చిన మార్పులు, పాశ్చాత్యనాగరికత, పరిపాలకజాతి
యొక్క జీవితవిధానము, క్రైస్తవ మతప్రచారము, ఇంగ్లీషుసారస్వతము,
ప్రకృతిశాస్త్రవిజ్ఞానము లోనగువానివలన కలిగిన భావపరివర్తనల చరి
త్రను చర్చించవలసియుండును. అనగా బ్రిటీషుయుగారంభము నాటి
దేశపరిస్థితుల చరిత్రనే చర్చింపవలెను.

---

* ఆంధ్రులచరిత్ర, శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు ప్రథమభాగము
1910. పుటలు 4-5.

ఇంగ్లీషువారితోడి పరిచయము, స్నేహము, ప్రజలరుచి వారిరుచు లందు మర్యాదలందు పెక్కుమార్పులు కలిగించుచుండెను. ఇంగ్లీషువారి వలె బంగాళాలను మేడలను కట్టుకొని దానిలో కుర్చీలు బల్లలువేసి అలంకరించుట, చక్కనిగుఱ్ఱపుబండ్లనెక్కి షికారుకుపోయి పిల్లలకు ఇంగ్లీషు లాగులు చొక్కాలువేయుట, టోపీలను బూట్సులుధరించుట, కులాచారములు సడలించి చరించుట మెల్లగా ప్రారంభమయ్యెనని, ఒకటి రెండు వార్తాపత్రికలుకూడా బయలుదేరి రాజకీయములను చర్చించుచుండె నని 1823 డిశంబరులో బిషప్ హెబరుగారు వ్రాసినారు.

ఇంగ్లీషు భోగద్రవ్యముల నుపయోగించుట ప్రారంభమైనదని విలియం బెంటింకు 30-5-1829 తేదీన వ్రాసెను. సీమసారాయముల నుపయోగించుట వాచీలు గడియారములు గుఱ్ఱపుబండ్ల నుపయోగించుటను గూర్చి హోల్టు మెకంజీ కామన్సుసభలో 23-2-1832 తేదీన చెప్పినాడు.

ఐరోపాదేశపు సారస్వతము పాశ్చాత్య ప్రకృతివిజ్ఞానమును కల కత్తాలోని నేటి యువజనసంఘమునందు నూతన భావములను వికారము లను కలిగించెను. వారు పూర్వమునుండి అలవాటుపడిన పాతపంథలను వీడి ప్రాతసిద్ధాంతములను విసర్జించి క్రొత్త ఆలోచనలతో విపరీతబుద్ధు లతో ప్రవర్తింపసాగిరి. శాస్త్రప్రమాణములు ప్రయోగములును అనుశ్రుతములైన విశ్వాసములను పోగొట్టి మతధర్మములందును పూర్వాచారము లందును అపనమ్మకము కల్గించి, సంఘమర్యాదలందు నీతిధర్మము లందు గౌరవమును పోగొట్టి ఇంగ్లీషుచదివినవారిలో నొకక్రొత్తప్రచారము చేయించుచుండెను.

కలకత్తాలో ఇంగ్లీషుచదువుచెప్పు హిందూకాలేజిలో చదువు విద్యార్థులు విజృంభించి దేశీయులలో మతధర్మములను సంఘాచారములను తీవ్రముగా విమర్శింపసాగిరి. వర్ణాశ్రమధర్మములను భక్ష్యాభక్ష్య ఆహార నియమములను తృణీకరించి మతాచారములను బహిరంగముగా విమర్శింప

సాగిరి. క్రొత్తగా ఆంగ్లేయవిద్య నేర్చినవారెల్లరు ఈ పాశ్చాత్య విద్యా విధానమును భారతదేశములో నింకను బాగా వ్యాపింపచేయవలెనని ప్రచారము చేయుచుండిరి.

ఈ దేశప్రజల కింగ్లీషువిద్యయందభిరుచికలుగుట కనిపెట్టి క్రైస్తవమిషనరీలు అనేక ఇంగ్లీషుపాఠశాలలు కాలేజీలు స్థాపించి మెల్లగా బాలురకు తమమతాచారములందు హేయభావముకలిగించి వారి మనస్సులందు క్రైస్తవభావములనెక్కించుచుండిరి. దీనిఫలితముగా బాలురు క్రైస్తవమతమవలంబించినను అవలంబింపకపోయినను ముందుగా హిందూమతాచారములందు నమ్మకము గోల్పోవుదురనివారియాశయము. ఇది నిజమేయయ్యెను. చాలామంది యువకులలో నాస్తికభావములుదయించెను. యువకులు మతధర్మములతోపాటు పుణ్యపాపములనుగూడ విడనాడి స్వేచ్ఛావిహారులైరి. పైనచెప్పిన పరిస్థితులనుగూర్చి బ్రహ్మసమాజ నాయకుడగు కేశవచంద్రసేను జీవితచరిత్రనురచించిన మజుందారుగారును బంగాళీశాస్త్రజ్ఞుని జీవితము అనుభవములు అను స్వీయచరిత్రను రచించిన ప్రఫుల్లచంద్రరాయిగారును వ్రాసియున్నారు. ఇంక ననేక గ్రంథములందు దీనినిగూర్చి వ్రాయబడియున్నది.

భారతదేశము రాజకీయముగా స్వాతంత్ర్యమును గోల్పోయి ఇంగ్లీషువారి అధికారమునకు లోబడిపోవుటయేగాక ఆర్థికముగను, వైజ్ఞానికముగనుగూడా వారికిలోబడినది. దేశము నింత సులభముగా చేజిక్కించుకొని పరిపాలించుచున్న ఈ ఆంగ్లేయుల ఆధిక్యతముందు భారతీయులు తేజోవిహీనులై బలహీనులై పడియుండిరి. ఆంగ్లేయులముందు మన నాగరికత పనికిమాలినదైనది. వారిముందు మనవారల్పజ్ఞులుగనుండిరి. ఇంగ్లీషుబడులలో చదివినవారి కింగ్లీషువారి భావములు అలవడి మన వేషభాషలపైన మతధర్మములపైన గౌరవము పోవుటలో నాశ్చర్యములేదు. నిజముగా మనకొక ప్రాచీన నాగరికతయనునదే లేదని.

మన పూర్వులు తెలివితక్కువవారని, మూఢవిశ్వాసములందు పడియుండిరని మనదేశమును ప్రజలును బాగుపడవలెనన్నచో పాతదారులు కట్టిపెట్టి పాశ్చాత్యనాగరికత జూపుమార్గముల ననుసరింపవలెనని ఆంగ్లవిద్యాధికులు తలంపసాగిరి.

క్రైస్తవమిషనరీలు మనదైవములను మతధర్మములను నిందించి అపహాస్యముచేయసాగిరి. ఇంగ్లీషువిద్య నేర్చినవారిలో మన మతధర్మముల పైనను నాగరికతపైనను అసహ్యముకూడా కలుగుచుండెను, కొందరు శుష్కవేదాంతులైరి. కొందరు నాస్తికులైరి. చాలమంది స్వేచ్ఛా విహారులైరి.

వంగరాష్ట్రమునందు రాజారామమోహనరాయలవారు స్థాపించిన బ్రహ్మసభ, దేవేంద్రనాథఠాగూరుగారు స్థాపించిన బ్రహ్మసమాజమును తాత్కాలికముగా క్రైస్తవమతబోధకుల ప్రచారము నరికట్టెనుగాని దేశములో జరుగుచున్న మార్పు నరికట్టలేకపోయెను.

వంగరాష్ట్రమునందు బయలుదేరిన బ్రహ్మసమాజ సంఘసంస్కరణోద్యమము క్రమక్రమముగా సనాతనధర్మమును పూర్వాచారములను తృణీకరించి క్రైస్తవ మతధర్మములకు సరిపోలిన పద్ధతులతో మన మతధర్మములను సంఘాచారములను సంస్కరించుటకు ప్రయత్నించెను.

ఇంగ్లీషు గ్రంథములను గుడ్డిగాచదివి కొంత భాషాజ్ఞానమును పొందుటయే పాండిత్య సంపాదనమనుకొనిరి. ఎవ్వరైన నేదైననొక పత్రికలో నొకవ్యాసమును వ్రాసినచో నతడొక ప్రతిభాశాలియని మెచ్చుకొనిరి. ఎవరైన వింటిలో నొక యుపన్యాసమును తయారుచేసికొనివచ్చి సభలో మాటలాడినచో నతడు మహావక్తయని సంతోషించిరి.

వంగదేశములో జరిగిన మార్పులే భారతదేశములోని ఇతర ప్రాంతములందును క్రమక్రమముగా వ్యాపించుచుండెను.

వంగరాష్ట్రములోని బ్రహ్మసమాజనాయకులలోనే అభిప్రాయ భేదములు కలిగెను. ఆ సమాజము సాధారణ బ్రహ్మసమాజము నవవిధాన బ్రహ్మసమాజము అని రెండుగా చీలిపోయెను.

"భారతీయ మహర్షుల మహోపదేశములకంటె పాశ్చాత్య తత్వ శాస్త్రవేత్తల యభిప్రాయములు ఉపూలే దేశీయులలోని ఆంగ్ల విద్యా వంతులకు విశేష ప్రామాణికముగా తోచుచుండెను. యోగమును భోగముతో జతపరుపబూనిన విద్యావంతుల విచిత్రమైన కలగలుపు భావములను తొలగించుట రామకృష్ణపరమహంసకు కష్టసాధ్యముగాఁ దోచెను" అని శ్రీ రామకృష్ణుని జీవితమును రచించిన శ్రీచిరంతనానంద స్వామివారు బ్రాహ్మసామాజిక సంసర్గము అను ప్రకరణమున వ్రాసిరి.

బ్రహ్మసమాజ నాయకులైన శ్రీ కేశవచంద్రసేనుగారు 1864లో చెన్నపట్టణమువచ్చి యుపన్యసించిరి. అటు తరువాత ఇతరబ్రహ్మసమాజ నాయకులును మద్రాసులోను ఆంధ్రదేశములోని ఇతరపట్టణములలోను ఉపన్యాసములిచ్చిరి. [illegible]

ఆకాలమునాటి బ్రహ్మసమాజనాయకులు ఆంగ్ల ప్రభుభక్తులు. ఆంగ్లేయ విద్యావంతులు ఆంగ్లేయనాగరికతను సారస్వతమును ఆంగ్లే యాచారములను ప్రేమించువారుగ నుండిరి. అందువలన వారి మత సంఘ సంస్కరణవిధానములు పాశ్చాత్య సిద్ధాంతములపై నాధారపడుటలో నాశ్చర్యములేదు.

ఒకవంక పాశ్చాత్య మతబోధకులు వింకొకవంక బ్రాహ్మసామాజి కులును సనాతనధర్మమును తృణీకరించుచుండగా కొంతకాలమువరకు వేదశాస్త్రములను ఆచారములను సంస్కృతిని సమర్థింపగలవారే లేక పోయిరి. కొందరు పాశ్చాత్యులు సంస్కృతము నభ్యసించి వేదశాస్త్రము లను సంస్కృత సాహిత్యమును పరిశీలించి భారతీయవిజ్ఞానముయొక్క ప్రాశస్త్యమును ప్రశంసింపగా క్రమక్రమముగా మనవారును కండ్లు తెరచిరి.

సనాతనధర్మమనగా దేశములో ప్రబలిన అవిద్యయు అనాచారములు కావని బోధించిన దయానందసరస్వతి 1824లో జన్మించి 1883లో దివంగతుడయ్యెను. మిషనరీలును బ్రాహ్మసామాజికులును తృణీకరించిన విగ్రహారాధనములో విశేషమున్నదనియు సనాతనధర్మమును విడనాడకుండగనే పాశ్చాత్య విజ్ఞానముయొక్క లాభము పొందవచ్చుననియు శ్రీ రామకృష్ణపరమహంస ఆచరించిచూపెను. శ్రీరామకృష్ణపరమహంస 1836లో జన్మించి 1886లో స్వర్గస్థుడయ్యెను. అయితే ఈ పాశ్చాత్య విద్వాంసుల ప్రశంసలును దయానందుని బోధలును శ్రీరామకృష్ణుని చరిత్రమును తెలుగుదేశములో వ్యాపింపకముందే బ్రాహ్మసామాజికుల ప్రచారము విద్యాధికులతలకెక్కినది. ఆంధ్రులు భావోద్రేకులు. అందువలన నీ బ్రాహ్మసమాజికుల విమర్శలును బోధలును తెలుగువారిలో అతి త్వరితముగా వ్యాపించెను. బ్రాహ్మసమాజమునందు చేరిన ఆంధ్రప్రముఖులలో శ్రీ వీరేశలింగముగారును, రఘుపతి వేంకటరత్నంనాయుడుగారు నగ్రగణ్యులు.

ఆంధ్రదేశములోని ప్రజాసంఘమునందుగల లోపములను దురాచారములను తొలగించి సంఘసంస్కరణము చేయవలెనని ఏకేశ్వరారాధనమును స్థాపించవలెనని కృతనిశ్చయులైన కందుకూరి వీరేశలింగము పంతులుగారు గొప్పవారిలో దుర్నీతిని మాన్పుటకు ఉద్యోగుల లంచములు మాన్పుటకు వేశ్యాప్రియత్వము మాన్పుటకు అనేక ప్రహసనములు వ్రాసిరి. వ్యాసములు వ్రాసిరి. ఇట్లే అతి బాల్యవివాహములనుగూర్చి అతివృద్ధవివాహములనుగూర్చి కన్యాశుల్కములను గూర్చియు వ్రాసిరి. మతాచార్యుల బాహ్యవేషములను విమర్శించిరి. పూర్వాచారములను ఖండించిరి. ఆంగ్లేయుల గుణశీలములను వారి మతధర్మములలోని ప్రాశస్త్యము నుగడించిరి. స్త్రీవిద్య యావశ్యకతను ప్రచారముచేసిరి. వితంతూద్వాహములను ప్రోత్సహించిరి.

వీరేశలింగముగారు సంఘమును సంస్కరింపవలెనన్న యుత్సాహముతో ప్రజల లోపములను అవగుణములను గోరంతలు కొండంతలుగా

ప్రదర్శించి ఎగతాళిచేసి నవ్వుపుట్టించి వానినిగూర్చి సిగ్గుపడునట్లుచేసిరి. వారికృషి యింతటితో ఆగలేదు. మనపూర్వాచారములను విమర్శించుటలో పురాణేతిహాసములందలి కథలను స్త్రీ పురుషులను ఎగతాళిచేసిరి. మత ధర్మములను వేదశాస్త్రములనుకూడా తూలనాడి వానిపట్ల గౌరవములేకుండ చేసిరి. అంతేగాని మన వేదశాస్త్ర పురాణేతిహాసములందలి ఉత్తమధర్మము లను వివరించి మన ప్రజల పూర్వనాగరికతలోని విశేషములను వర్ణించి ఉత్తమాదర్శములను చిత్రించి పూర్వులవలె సాహసౌదార్యాది సద్గుణముల నలవరచుకొని అభివృద్ధిచెందవలెనను భావము కలిగింపలేదు. వారివిమర్శలు మన మతధర్మములను ఆచారవ్యవహారములను విధ్వంసమొనర్చుటకే తోడ్పడినవి.

ప్రజలలో పూర్వాచారములపై నభిమానమునశించినదేగాని నూతన సత్సంప్రదాయములు వ్యాపింపలేదు. వీరేశలింగముగారి విమర్శలు సంఘ సంస్కరణోద్యమము తలకెక్కిన నవనాగరికులు కన్యాశుల్కములోని గిరీశమువలె పూర్వాచారములను లెక్కచేయని అవినీతిపరులై పనికిమాలిన వారై పోయిరేగాని ఉత్తమగుణములుగలిగిన ప్రజాసేవకులు కాలేదు. వీరేశలింగముగారి విమర్శలవలన తెలుగువారు తమలోని లోపములను చూచుకొని కృంగిపోయిరేగాని లోపములను సవరించుకొని నూతనో త్సాహము కలిగి అభివృద్ధిచెందలేదు.

మహారాష్ట్ర వంగదేశములందలి నాయకులు భండార్కరు, రానడె, లోకమాన్యతిలకు మొదలగువారును, వంగదేశములో బంకించంద్ర చటర్జీ మొదలగువారును వీరేశలింగంగారివలెగాక, మన వేదశాస్త్ర పురాణేతి హాసములందలి ఉత్తమ సంప్రదాయములను ప్రజలలో ప్రచారముచేసిరి. పురాణేతిహాసములందు ప్రసిద్ధులైన స్త్రీ పురుషులయొక్కయు, చరిత్ర ప్రసిద్ధులైన మహావీరులయొక్కయు సాహసౌదార్యాది సద్గుణములను వర్ణించు హరికథలు, జంగముకథలు నాటకములు ఉపన్యాసములు ప్రదర్శ నములు ప్రోత్సహించిరి. గణపతినవరాత్రములు దుర్గాపూజలు మొదలగు

పండుగలను ఉత్సవములను ఆటపాటలను దేశకాలపాత్రానుసారముగా నుపయోగించి వానికి క్రొత్తరూపమిచ్చి, ప్రజలలో ఉన్నతాదర్శములను కలిగించి, దేశాభిమానము కార్యశూరత్వమును కలిగించిరి. మహారాష్ట్ర దేశమున తిలకుమహాశయుడు ప్రారంభించిన గణపతియుత్సవములు శివాజీయుత్సవములు ప్రజలలో నూతనోత్సాహము కలిగించినవి.

వంగరాష్ట్రమునందును మహారాష్ట్రమునందును తెలుగుదేశమునందువలె దురాచారములులేకపోలేదు. అక్కడను వేశ్యాలోలత్వముండెను. అక్కడను అతి బాల్యవివాహములు అతివృద్ధవివాహములు కన్యాశుల్కము నుండెను. అక్కడను లంచగొండితనము అవినీతియుండెను. అక్కడను వామాచారము మంత్రతంత్రములు మూఢవిశ్వాసములు ప్రబలియుండెను. అయితే అక్కడి సంఘసంస్కర్తలు గ్రంథకర్తలు దేశనాయకులు ఈ దురాచారములను ఖండించిరేగాని, వీనితోపాటు దేశప్రజల మతధర్మములను పూర్వాచారములను అపహాస్యముచేయలేదు. దేశీయుల నాగరికతను సంప్రదాయములను ఎగతాళిచేయలేదు. పైగా మన వేదశాస్త్ర పురాణేతిహాసములను ప్రశంసించి అందలి ఉపనిషన్మతమును పునరుద్ధరించుటకు కృషిచేసిరి. మనపూర్వనాగరికతను సత్సంప్రదాయములను వివరించి, ప్రజలలో మతభక్తిని దేశభక్తిని ఆత్మగౌరవమును కార్యదీక్షనుకలిగించిరి. పూర్వాచారములను నిరసించి పాశ్చాత్యసంప్రదాయములను ప్రచారము చేయుటకు ప్రయత్నించిన బ్రహ్మసమాజనాయకుల దృక్పథమును రామకృష్ణపరమహంస మార్చివేయగలిగెను.

పందొమ్మిదవ శతాబ్దిలో పాశ్చాత్యుల తాకిడివలన నాగరికులు తారుమారైపోవుచుండగా సనాతనధర్మ మీగకయె పాశ్చాత్యసభ్యతను జీర్ణించుకొనగల శక్తిని శ్రీరామకృష్ణుడు అనుగ్రహించెనని శ్రీ శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు వ్రాసియున్నారు. ఆంధ్రదేశమునం దీ పరిణామము కలుగలేదు.

"ఆంధ్రదేశములో బ్రాహ్మసామాజికులు సంఘబహిష్కారమునకు వెఱవక యోధులై నిలిచి ప్రతికూలశక్తుల హింసలకోర్చి, తమ

నైతికబలముతో ఉద్యమములను నడిపించి నేటి సంఘసంస్కరణలకు పునాదులు వేసిరి.

బాల్యవివాహములకు ఎరయై దుస్సహ వితంతుజీవితమున కుమిలి కృశించిన నిరాశాజీవులకు సుమంగలీత్వ భాగ్యమును ప్రసాదించి సంఘములో ఆనందమయజీవనమును గల్పించిరి. తరతరములనుండి పరంపరగా వచ్చు సాంఘికాచారమువలన గడపు అపవిత్రజీవితమే తమ కులవృత్తిగా భ్రమించి సంఘమునకు చేటుకలిగించు వేశ్యలను పతితవృత్తినుండి మరల్చి యెన్నియో కుటుంబములకు గౌరవ పవిత్రజీవితమును గడపు భాగ్యమును ప్రసాదించిరి. జాతీయజీవనమునకు భంగకారియైన కులతత్వమును ఖండించి జందెమును విసర్జించు ధైర్యమును కులముల కట్టుబాట్ల నెదిరించు సాహసమును ఎందరిలోనో పురికొల్పిరి; అగతికులకు అనాధులకు శరణాలయములను నెలకొల్పిరి; అస్పృశ్యతను రూపుమాపి, నిమ్నజాతుల యభ్యున్నతికి పాటుపడిరి. పరమేశ్వరునికి మానవునికి మధ్య నేయంతరములేనివిధమున ఆధ్యాత్మిక సాంఘికోపాసనజరిపి నిత్య జీవితమునందు ఈశ్వరభక్తి భావము పెంపొందించుటకు పాటుపడిరి" అని విజ్ఞానసర్వస్వమున మతసంప్రదాయములు అను వ్యాసమున వ్రాసినారు. (పుట 575-6.)

దేశములోకలిగిన మార్పునకంతకు బ్రాహ్మసామాజికులే మూల కారకులనుకొనుట సరికాదు. దీనికి ముఖ్యమైన కారణము ఆంగ్లనాగరికతా ప్రభావమే. వీరేశలింగముగారు తాము దురాచారములని అనుకొనినవానిని సంస్కరించుటకై సభలలో ఉపన్యాసములిచ్చి పత్రికలలో వ్యాసములు వ్రాసి ప్రహసనములను నాటకములనురచించి గ్రంథములలోని కెక్కించి, సంస్కారసంఘములను స్థాపించి చాలాకృషిచేసిరి. ఆకాలమునాటికి వీకాలమునాటికిని కొన్నిమార్పులు కలిగినమాట నిజము. అప్పటి కుల కట్టుబాటులు కొన్ని సడలినవి. ప్రజల అభిప్రాయములోను దృక్పథము లోను కొంతమార్పుజరిగినది. కొన్ని సంస్కరణములుజరిగినవి. వానికి

వీరేశలింగం ప్రభృతుల కృషి కొంతతోడ్పడినమాట నిజము. అయితే ఈమార్పునకుగల అసలుకారణము కాలమహిమ, పాశ్చాత్యనాగరికత యొక్క ప్రభావము.

దేనివల్లకలిగినను కొంత మార్పు కలిగినమాట నిజమేకాని ఆకాలమున దురాచారములనుకొనినవానిలో కొన్ని యిప్పటికిని కొన్ని రూపములలో నిలిచియేయున్నవి. అధికారులును గొప్పవారును ఏమి చేసినను ఇప్పుడు అది చలామణియగుచున్నది. ఆకార్యమే ఒక బీదవాడు చేసినచో నలుగురు విమర్శింతురు. అధికారముగాని ధనముగాని ఉన్నచో ఒకరిప్రమేయములేకుండా జీవింపవచ్చును. ఇష్టమువచ్చినవారితో భోజనము చేయవచ్చును. రజస్వలనుగాని వితంతువునుగాని భోగముపిల్లనుగాని పెండ్లి యాడవచ్చును. అడుగువారుండరు. ఇప్పటికిని ప్రభుత్వోద్యోగులలో లంచగొండితనము ఎక్కువగనేయున్నది. అక్రమములు జరుగుచునే యున్నవి. ఇప్పటికిని దేశములో అతిబాల్యవివాహములు అతివృద్ధ వివాహములు కన్యాశుల్కములు వరవిక్రయములు జరుగుచునేయున్నవి. రజస్వలా వివాహములు హెచ్చినను స్త్రీ పునర్వివాహములు హెచ్చలేదు. స్త్రీవిద్య పూర్వముకన్న అభివృద్ధియైనను జనసంఖ్యకు తగినట్టులేదు. రైలుప్రయాణములవల్లను, నాగరికజీవనమువల్లను భోజనములందు కుల విచక్షణ తగ్గినదిగాని సంఘములోను, కులములలోను తగ్గలేదు. వేశ్యల నుంచుకొనుట గౌరవముగా నుండురోజులు పోయినను భోగముమేళముల వారికి కట్నములిచ్చుట లేకున్నను అది యింకొకరూపములో ప్రత్యక్షమగుచున్నది. మద్యపానముగాని, వ్యభిచారముగాని తగ్గకపోవుటయట్టులుంచగా నవి హెచ్చిపోయినవి. సినిమాలవల్లను, డిటెక్టివు కథలవల్లను, క్లబ్బులవల్లను, నాగరికజీవనమువల్లను స్త్రీ పురుషుల వేషభాషలందు ఆహారవిహారములందు క్రొత్తరుచులు క్రొత్తభోగములు రేకెత్తినవి. చిన్నపిల్లలందుకూడా అవినీతి వ్యాపించినది. అజ్ఞానము దారిద్ర్యము జనులను పీల్చి పిప్పిచేయుచున్నవి. మతాచారములందు క్రొత్తపద్ధతులు

బయలుదేరినవి. క్రొత్త మూఢవిశ్వాసములు బయలుదేరినవి. ధనవంతు
లను జూచి బీదవారు దురాచారములందు దిగుచున్నారు" అని చిలకమర్తి
లక్ష్మీనరసింహముగారు తమ స్వీయచరిత్రలో సింహావలోకనమున
వ్రాసినారు.

ఆంగ్లనాగరికత తెలుగువారి వేషభాషలందు ఆచారవ్యవహారము
లందు చిత్తవృత్తులందు చాలామార్పులు కలిగించినది. గాంధిమహాత్ముని
యుద్యమములు దేశములో వ్యాపించువరకు దానికి హద్దుపద్దులులేవు.
మహాత్ముని బోధలవలనను ఉదాహరణమువలనను పాశ్చాత్యనాగరికతా
వ్యామోహము కొంత తగ్గినది. అయితే ఆయన చనిపోయినపిమ్మట,
ఆంగ్లేయులు మనదేశమును వదలి మనకు స్వాతంత్ర్యమిచ్చినపిమ్మట
భారతదేశమందు తక్కిన ప్రాంతములందువలెనే ప్రభుత్వమంత్రులు
ప్రభుత్వోద్యోగులు మొదలు సామాన్య ప్రజలవరకును మరల పాశ్చాత్య
నాగరికతావ్యామోహము వృద్ధియగుట ప్రారంభమైనది. పూర్వమువలె
ఆంగ్లేయ వేషభాషలను ఆచారములను సంప్రదాయములను అనుకరించుట
మాత్రమేగాక ప్రపంచములోకెల్ల సంపన్నులగు అమెరికావారిని అనుక
రించుట కూడా ప్రారంభమైనది. క్రొత్త నాగరికత ఢిల్లీలో దినదినాభి
వృద్ధిగాంచుచు దేశములో నలుగడల వ్యాపించుచున్నది. ఆంధ్రప్రదేశ
మేర్పడినపిమ్మట హైదరాబాదులో నివసించు మన మంత్రులు ఉద్యోగులు
క్రొత్త జీవనవిధానమును, మర్యాదలను అవలంబించుచున్నారు. అక్కడి
భోగవిలాసములను చూచి తెలుగుదేశములోని ఇతరప్రాంతములవారనుక
రించుచున్నారు. దీనివలన మనలో మార్పులు కలుగుచున్నవి.

ఆంగ్లేయులు తెలుగుదేశము నాక్రమించునాటి కిక్కడి దేశీయులలో
సంపన్నులు పారశీభాషను వ్రాయను చదువను నేర్చి మహమ్మదీయ
ప్రభుత్వోద్యోగములుచేయుచుండిరి. సామాన్యులుకూడా బజారులలోను

కచ్చేరీలలోను హిందుస్తానీభాషలో వ్యవహారములు జరుపవలసివచ్చు చుండెను. తెలుగులో కొన్నివందల హిందుస్తానీపదములు వచ్చిచేరి వాడుకలోనుండెను.

1852 లో బ్రౌణ్యనిఘంటువును రచించిన సి.పి.బ్రౌను దొరగారు అప్పటికి తెలుగులో వాడుకలలో నుండిన పారశీ, అరబ్బీ, హిందుస్తానీ, ఫ్రెంచి, ఇంగ్లీషు మాటలను ప్రయోగములను చేర్చి 1854 లో నొకమిశ్ర నిఘంటువు అను అనుబంధమును ప్రకటించి దాని పీఠికలో నిట్లు వ్రాసిరి : "మహమ్మదీయు లీ దేశమును చాలాకాలము పరిపాలించుటవలన విజాతీయ పదము లనేకములు దేశ భాషలలోనికి వచ్చి చేరినవి. అందువలన నిప్పుడు వాడుకలో నున్న తెలుగు భాషలో అనేక విధములైన పారసీ, అరబ్బీ ప్రయోగము లున్నవి తరువాత కొన్ని ఇంగ్లీషుమాటలుకూడా వచ్చిచేరినవి. అందువలన ఆ పదజాలము తెలుగుభాషా నిఘంటువునకు అనుబంధముగా చేర్పవలసిన అవసరమున్నది.

ప్రస్తుతము దేశీయుల వాడుకలో నున్న నుడికారములు మాత్రమే ఇందులో చేర్చబడినవి. గ్రాంథికభాషకు భిన్నముగ నున్నప్పటికిని ఈ పదములు ప్రయోగములుగల తెలుగుభాష వ్యవహారములందుపయోగ బడుచు దేశీయు లందరికిని అర్థమగుచుండును" అని ఈ క్రింది యుదాహరణము నిచ్చిరి.

ఈ నెంబరులో డిఫెండెంటు సమ్మెను చూచి పైను (దస్కత్తు) చేసి వాయిదా చొప్పున కోర్టులో హాజరు అయి అప్పరు యియ్యకపోయి నందున ఇందులో యెక్సపార్టీ దర్యాప్తుచేయవలెనని ప్లేంటిఫ్ప్లీడరు మోషన్ చేసినాడు. గనుక ఆ మోషన్ రికార్డులో దాఖలుచేసి (ఫైలుచేసి) అందులో దరిఖాస్తుచేసిన చొప్పున నడిపించేలాగున ప్రొసీడింగ్సులో ఆర్డరు యెంటరుచేయడం అయినది."

విజాతీయపదములు తెలుగువారి నోళ్ళలో క్రొత్తరూపమునుదాల్చు చుండుటను కూడా బ్రౌన్గా రుదహరించినారు. ఇంగ్లీషులో కలెక్టర్ అను

మాట కల్కటరు అనియు అసిస్టెంటు అను మాట అసిస్టాంట్ అనియు దేశీయు లుచ్చరించుచున్నా రనిరి.

సంస్కృతాంధ్రములందు పాండిత్యము కలిగి 1819 మొదలు 1835 వరకు మద్రాసులోని సుప్రీంకోర్టు అను ఉన్నత న్యాయస్థానము నందు తెలుగు ఇంగ్లీషు తర్జుమాలను చేయు ఇంటర్ప్రిటర్ అను నుద్యోగము చేసిన ఏనుగుల వీరాస్వామయ్యగారు రచించిన కాశీయాత్ర చరిత్ర 1838 లో అచ్చుపడినది. అందులో కొన్నివందల ఇంగ్లీషు పదముల సాయన వాడుటవలన నవి యానాటికే వాడుకలోనికి వచ్చిన వెంచవచ్చును.

అటుతరువాత నీ నూటపాతిక సంవత్సరములలో ఇంగ్లీషువారు మనదేశము నేలిన కాలమున గ్రామపంచాయితీ, పరపతి సంఘములు, మునిసిపాలిటీలు మొదలు శాసనసభలవరకును గల క్రొత్త రాజ్యాంగ పరిపాలనా సంస్థల సమావేశములందు మీటింగులందు ఇతర వ్యవహారము లందు వాడు మాటలుగాక రాజ్యాంగ సంస్కరణమువలనను ఎన్నికలవల నను క్రొత్తక్రొత్త రాజకీయ భావములవలనను అనేక ఇంగ్లీషు పద ములు వాడుకలోనికి వచ్చినవి. ఇక ఇంగ్లీషు చదువులందు, రైళ్లలో మోటారులలో ప్రయాణములందు, పోస్టాఫీసు టెలిగ్రాపు ఆఫీసులందు, బ్యాంకులందు, భీమావ్యాపారములందు, ఆసుపత్రులందు, సర్కారు కచ్చే రీలయందు, కోర్టువ్యవహారములందు ముద్రణాలయములందు వార్తాపత్రికా నిర్వహణమునందు, రైల్లెసుకు రేడియోలకు సంబంధించిన విషయము లందు, ఫ్యాక్టరీలు యంత్రాగారములు మొదలైనవానియందు, సినిమా టాకీసులు చిత్రకళలకు సంబంధించిన వ్యవహారములందు, విమాన యానమునకు సంబంధించిన విషయములందు మన ముపయోగించు ఇంగ్లీషు పదములు లెక్కకు మీరియున్నవి. ఇక ఖగోళ భూగోళ గణిత రసాయన పదార్థ విజ్ఞాన శాస్త్రములకు వైద్యశాస్త్రములకు ఆధునిక నాగరికతకు సంబంధించిన ఇంగ్లీషు పదములమాట చెప్పనక్కరయేలేదు.

ఈ పరిస్థితిలో 1914 మొదలు 1918 వరకును, 1939 మొదలు 1945 వరకును జరిగిన ప్రపంచ సంగ్రామముల సందర్భమున మన దేశీయులకు పాశ్చాత్య దేశములతోటి సంబంధములు పెరిగిపోయి ప్రపంచ విజ్ఞానమునకు సంబంధించిన అనేక క్రొత్త భావములను గూర్చిన ఇంగ్లీషు పదములు మనము వాడుకొనవలసివచ్చినది. ఆ సమయమున దేశరక్షణమునకును దేశక్షేమలాభములకొరకును దేశముయొక్క రాజకీయార్థికసాంఘిక ప్రజాజీవనమును కట్టుబాటులోనుంచవలసిన అవసరము కలిగి కంట్రోళ్ళేర్పడినవి. వానిని అమలుపరచుటలోను క్రొత్తక్రొత్త పదము లుపయోగించవలసివచ్చెను. అందువలన నీ క్రొత్త ఇంగ్లీషు పదములను ప్రజలు వాడసాగిరి.

ప్రపంచ సంగ్రామానంతరము ప్రపంచములోని రాజకీయ ఆర్థిక సాంఘిక పరిస్థితులందు మార్పుగలుగుటయేగాక, శాస్త్ర విజ్ఞానమునందు క్రొత్త పరిశోధనలు బయలుదేరినవి. దీని ఫలితముగా పాశ్చాత్యదేశీయులే క్రొత్త పదజాలమును వాడవలసివచ్చినది. ఆసందర్భములో నింగ్లీషు భాషలో కొన్నివేల క్రొత్త పదములు వచ్చి చేరినవని కన్సైజ్ ఆక్స్ఫర్డు డిక్షనరీని సమకూర్చిన సంపాదకులే వ్రాసిరి.

“కొంత కాలము క్రిందటనుండి ఇంగ్లీషువారి శబ్దజాలము చాలా అభివృద్ధిచెందినది. దీనికి కారణము, వారు ప్రపంచములో నలుప్రక్కలనుండి వచ్చు రేడియో ప్రసారములను వినుటకు అలవాటుపడుట. ముఖ్యముగా రాజ్యతంత్ర వ్యవహారములకు, రాజకీయములకు, తత్వశాస్త్రమునకు, ప్రకృతిశాస్త్రములకు, వైద్యశాస్త్రమునకు సంబంధించిన పదము లభివృద్ధి చెందినవి. మాటలాడు సినిమా వచ్చిన తరువాత అమెరికావారి నుడికారము అర్థమగుచున్నది. ఆంగ్లరాజ్య వ్యవహారములను తెలిసికొనుటకు ఇంగ్లీషువారు హెచ్చు ఆసక్తిని చూపుచు పత్రికలను చదువుచుండుట వలన ఇదివరకు వారికి తెలియని హిందూదేశములోని దేశీయ ఆంగ్లోఇండియన్ పదము లనేకములు వారికా పత్రికలద్వారా తెలియుచున్నవి. అందు

వలన నీ విషయములను ముఖ్యముగా మనసునందే ఉంచుకొని ఈ అను బంధమును తయారుచేయడమైనదని ఆ నిఘంటు సంపాదకులు దాని పీఠికలో వ్రాసిరి.

ఇంగ్లీషులో వలెనే ఇటీవల కొంతకాలమునుండి మన తెలుగులో కూడా కొన్నివేల ఇంగ్లీషు పదములు వాడుకలోనికి వచ్చినవి. అయితే ఈ పదములను, వీని నిర్వచనములను అర్థములను ఒక్కచోచేర్చి ప్రకటించిన తెలుగు నిఘంటువు ఇంకను మనకు లేనందున సామాన్యులేగాక విద్యాధికులును విద్యార్థులునుకూడా చిక్కులుపడుచున్నారు.

దినదినాభివృద్ధిగాంచుచున్న నూతన పారిభాషిక పదములను అర్థముచేసికొనిన తప్ప పదిమందిలో మాటలాడుటకుగాని, ఒక యుపన్యాసము నిచ్చుటకుగాని విని అర్థముచేసికొనుటకుగాని, ఒక పత్రికను చదివి పట్టుమని పది పంక్తులు అర్థముచేసికొనుటకుగాని సాధ్యముకాదు.

ఈ స్థితిలో భారతదేశము స్వతంత్రమై ఆంధ్రప్రశ్న మవతరించినది. తెలుగువారికి బాగుగా ఉపయోగింపగల సరియైన విజ్ఞానసర్వస్వముగాని సమగ్రమైన నిఘంటువుగాని రచింపజేసి ప్రకటించుటకు మన ప్రజా ప్రభుత్వాధికారు లింకను పూనుకొనలేదు.

# 12. ఆంధ్రుల గుణశీలములు

దక్షిణాపథము నేలిన ప్రథమాంధ్రరాజవంశమగు శాతవాహనుల కాలమునుండి నేటివఱకును జరిగిన రెండువేల సంవత్సరాల చరిత్రలో మనకు లభించిన శాసనములవలనను, గాథాసప్తశతి మొదలగు గ్రంథములవలనను, దేశీయ విదేశీయ యాత్రికుల రచనలవలనను వివిధకాలములనాటి కవుల గ్రంథములవలనను ఆంధ్రుల స్వభావమునందలి విశేషలక్షణములు తెలియుట కవకాశము కలిగినది.

ఆంధ్రులు సాహసౌదార్యాది సద్గుణములు కలవారు; శూరులు, ధర్మనిరతులు, రసజ్ఞులు. అట్లని మనలో లోపములు లేకపోలేదు. ఆంధ్రులు ధైర్యసాహసములు కలవారే గాని భావోద్రేకులు. పౌరుషవంతులేగాని కార్యశూరులు కారు. వారికి స్థైర్యగుణము తక్కువ. ఆంధ్రులమాయకులు, సంఘీభావము కలవారు కారు. అందువలన వివిధ కాలములందు వివిధ మతధర్మములు, సంస్కృతి సంప్రదాయములు వారి నుర్రూతలూగించినవి. వారిలో కొంత ధర్మచ్యుతి కలిగినది. వారు కొంత అధోగతిని పొందిరి.

ఆంధ్రులు నివసించు ప్రదేశములకును వ్యాచుట్టును గల ద్రావిడ కర్ణాటక మహారాష్ట్ర ఉత్కలదేశములకును, తుదకు గోండులు వసించు గోండ్వనమునకును మధ్య దాటశక్యముగాని పర్వతపంక్తులుగాని మహానదులుగాని దుర్గమారణ్యములుగాని లేవు. ఆంగ్లేయులును హైదరాబాదు నిజామును కలిసి మన దేశమును మూడుముక్కలు చేయువరకును దక్షిణాపథము నేలిన వివిధ రాజవంశములవారీ వివిధ ప్రాంతములందలి ప్రజలనందరిని కలిపి పాలించిరి. అందువలన రాజకీయ సాంఘిక మతధర్మములందు, ఆహారవ్యవహారములందు, సంస్కృతి సంప్రదాయములందు నీ వివిధ ప్రజలందరకిని సన్నిహిత సంబంధము లుండెను.

ఆంధ్రులు సాత్వికస్వభావము కలవారును, ఉదారులు నైనందు వలన ఇతరుల సంస్కృతి సంప్రదాయములను సహృదయ ముతో స్వీక రించి తమలో లీనమొనర్చుకొనిరి. వివిధ మతధర్మములను ఆదరించినను అందలి పరమార్థమును పరతత్వమును విస్మరింపలేదు. అందువలననే ఆంధ్రులు దక్షిణాపథమునందలి ప్రజలకందరికిని ప్రీతికరమును అపూర్వ మునైన సంస్కృతిని కలిగియున్నారు.

" తెలుగులది సహజముగ భావోద్రేకముగల జాతి. ఐహికప్రీతి వారికి హెచ్చు. ఇవి రెంటిని అణచి శుష్కింపజేయు మతావేశము దుర్బ లముగ నుండినందున వారెన్నడు మానుష్యముయొక్క హద్దుమేరలను పూర్తిగ దాటినవారుకారు. ఐహిక జీవనపు లోతుపాతులను బాగుగ చూచి విడువవలయునను దృష్టి వారికి గలదు. అందలి స్థూల సూక్ష్మభావములను తీవ్రముగ గమనించు హృదయమును, దాని లోపము నరకంటితో జూచు నుదాసీనమును వారికి సహజములయియున్నవని నిస్సందేహముగ చెప్ప వచ్చును" అని శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు "రాయలనాటి తెలుగు సాహిత్యము" అను వ్యాసమున 1937 ఫిబ్రవరినెల భారతిలో వ్రాసినారు.

భారతదేశమందంతటను పలుమారు సంచరించి వివిధ ప్రాంతము లందు వసించుచు వివిధ భాషలను మాటలాడు ప్రజల గుణశీలములను జాగ్రత్తగా పరిశీలించిన గాంధీమహాత్ముడు ఆంధ్రుల స్వభావమునుగూర్చి వివరించి యున్నాడు.

గాంధీమహాత్ముడు 16-6-1927 తేది యంగ్ ఇండియా పత్రికలో నిట్లు వ్రాసినాడు :

"ఆంధ్రు లుత్తమగుణ సంపన్నులు. గాఢమైన దేశాభిమానము కలవారు. అయితే ఆంధ్రదేశములోని దేశసేవకులు కొందరు, తాము సేవకులమని చెప్పుచున్నను అక్కడివా రందరునునాయకులే. వీరి పద్ధ తులు నా మనస్సునకు కొంతనొప్పికలిగించుచుండు ననుమాట నిజము. అంద రును నాయకత్వము వహింపదలచినచో ఒకరు చెప్పినమాట వినువారును

చెప్పినపని చేయువారు నుందరు. ఇటువంటి స్వతంత్రప్రవృత్తిలో సామాన్య ప్రజలు నిస్సహాయులై పోవుదురు. నే నెవరి నుద్దేశించి యీ మాటలు చెప్పుచున్నానో ఆ దేశసేవకులు ఈ లోపము ఆ రాష్ట్రమునకేగాక తక్కిన రాష్ట్రములలో కూడా ఉన్నదని చెప్పి సరిపెట్టుకొనరాదు. భారత దేశములో శాసనోల్లంఘన ఉద్యమమునం దొకప్పుడు ప్రథమశ్రేణిలో నుండగలరని యెంచబడిన ఆంధ్ర స్త్రీ పురుషులు, తక్కిన ప్రాంతముల వారివలెనే మేము నెనుకబడి యున్నామని తృప్తిచెంది యుండరాదు. శాసనోల్లంఘనమున ఇతరులతో పోటీచేయదలచినవారు విధేయతయందు, నిగ్రహమునందు, క్రమశిక్షణమునందును, తమ శక్తి సామర్థ్యములను ప్రదర్శింపవలెను. ఖద్దరు విషయమునను దానికి సంబంధించిన అన్ని శాఖలలోను, ప్రథమస్థానము వహింపతగిన ఆంధ్రదేశము, ఇంకను ఆ స్థానము నాక్రమింపలేదు. నా విమర్శల నన్నింటిని యిప్పుడే ప్రకటింపను. నా ఆంధ్రదేశ పర్యటనములో చెప్పెదను."

గాంధీమహాత్ము డారంభించిన సహాయనిరాకరణోద్యమమునందు 1922 లో ఆంధ్రనాయకులు గుంటూరుజిల్లాలో సమష్టి శాసనోల్లంఘనమును, పన్నుల నిరాకరణమును ప్రారంభింప దలచిరి. ఆ సందర్భమున గాంధీమహాత్ముడు 2-2-1922 తేది యంగ్ ఇండియా పత్రికలో నిట్లు వ్రాసెను :

"ఆంధ్రు లిదివరకే గొప్ప త్యాగ ధైర్యములను ప్రదర్శించి యున్నారు....ఆంధ్రులు పౌరుషవంతులు. పరంపరాగత మర్యాదలపైన గౌరవము గలవారు. ధర్మపరులు, త్యాగశీలురు. వా రెన్నో ఘనకార్యములను సాధింపగలరని మన దేశీయుల యాశయము. అయితే సంపూర్ణముగా సంసిద్ధులగు పరకును వారు యుద్ధము నారంభింపరాదు. వారు ఆగినందువలన నష్టములేదు. తొందరపడినందువలన అన్నియు నష్టములే." అని ఆయన హెచ్చరించిరి.

సుప్రసిద్ధాంధ్ర నాయకులును ప్రతిభాశాలియు నగు డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులుగారు 1948 లో ఆంధ్రసర్వస్వమున

కాంగ్రెసు ఉద్యమమును గూర్చి వ్రాయుచు ఆంధ్రుల స్వభావమునుగూర్చి ఇట్లనిరి :

"ఆంధ్రులు ఎంత త్వరగా క్రొత్తభావములను స్వీకరింతురో అంతత్వరగాభావవిసర్జనచేయగలరు. బహిష్కారోద్యమమునందు వెంటనే రాజీనామాలు యిస్తారు.అందుకు సందేహము పొడసూపినదో,వెంటనే బహిష్కారమును మానుకుంటారు. వీరి స్వభావము గడ్డివామివంటిది. భగ్గున మండి చట్టున చల్లారుతుంది. సత్యాగ్రహమున ప్రవేశించుటయందుకూడా ఇట్టి స్వభావమునే చూపియున్నారు. (జైలుకు) వెళ్ళదలచుకున్న వారంతా ఒక్కపట్టున వెళ్ళడము, తరువాత దేశము గొడ్డుపోయినట్లు ఎవరూ లేక పోవడమూ ఇంతవరకు సంభవించిన విషయమే"

ఆంధ్రుల సంస్కృతి సంప్రదాయములను చిత్తవృత్తులను వివరించు కధలను రచించుటలో సిద్ధహస్తులగు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు చాలాకాలముక్రిందట అనగా 1932 - 1933 సంవత్సరములలో భారతిలోని మీగడతరకలు అను శీర్షికక్రింద ఆంధ్రుల పురోభివృద్ధిని గూర్చి "శాస్త్రి" అను మారుపేరుతో కొన్ని వ్యాసములు వ్రాయుచు అందులో ఆంధ్రుల స్వభావమునుగూర్చి వివరించిరి :

"మనము భావోద్రిక్తులము. మనకు వర్తమానమే సజీవము, గతము గతమే. మరి భవిష్యత్తు అయోమయము. మనకు అలసత మెండు. ఉద్బుద్ధులమైతిమా - ఆరంభశూరులము. మనకు స్వయం నిర్ణయశక్తి లేదు. ఏ ప్రాంతమునుండియైన యొక నవీనోద్యమము వచ్చి సదా - ప్రవృత్తిలోనున్న కార్య మెక్కడిదక్కడ విడచి, ఆ క్రొత్త దానిని స్వీకరింతుము. మరల కొన్ని దినములు అందు మునిగిపోదుము.

మన మే యుద్యమమును సాంతముగా పరమావధిని చేర్పలేదు.

ఆంధ్రోద్యమము ప్రారంభమై యిరువదియేండ్లయినది. గాని ఆంధ్రరాష్ట్రి మేర్పడలేదు. తక్కిన ఆశలును ఫలింపలేదు; తుదకు ఆంధ్రోద్యమమే సన్నగిల్లిపోయినది. కారణము ?

అయితే జాతియంతయు నిట్టిదగుట సంభవమా ? ఇది గొప్ప ప్రశ్న. నిజమే. కాని తత్వవిచారము నట్లుంచిన మన కగపడునదట్టిదే - మన జాతియంతయు నొక్కతీయననే యున్నది. అటు బరంపురము మొదలు ఇటు బెంగుళూరు వరకును, మరియు నిటు మదరాసు వరకును ఈ నిర్వచనమునకు పూర్వపక్షముచేయు సన్నివేశములేదు.

ఆంధ్రు డిప్పుడు తన్ను తా నెరుగడు. తనమాట తనకు లెక్కలేదు. తన భాషమీద లక్ష్యములేదు; తన సంప్రదాయము నెడల నభిమానములేదు.

ఒకనివేషము తాల్చుట, ఒకని భాష మాట్లాడుట, ఒకని యాజ్ఞలు చెల్లించుట, ఒకని గులామై యుండుట, ఒకనిని మెప్పింపగోరి తన సర్వస్వమును భస్మము చేసికొనుట - ఇది నేటి ఆంధ్రుని దినచర్య."

"ఆంధ్రదేశము మేల్కొన్నది. ఆంధ్రజాతి ముందంజవేసినది. ఆంధ్రుడు కటిబద్ధుడైనాడు - ఎక్కడచూచినను ఇదియె కనబడునట్లు, ఎక్కడజూచిన నిదియె వినబడునట్లు,పత్రికలు పరవళ్ళు ద్రొక్కను. కాని ప్రదర్శనములలో ఆంధ్రునకు స్థలమేదీ? అంగడులలో ఆంధ్రునిచేయి యేదీ? గృహములలో ఆంధ్రుని ప్రతిభయేదీ?" అని 1932లో వ్రాసిరి.

మద్రాసులో స్థిరపడియున్న ఆంధ్రులనుగూర్చి 1932 మేనెల భారతిలో వ్రాయుచు శ్రీ శాస్త్రిగారిట్లు వ్రాసిరి:

ఆంధ్రునకు ఉత్సాహశక్తి యధికమేగాని అరవకుగల ఓపికలేదు. ఆంధ్రునకు ప్రభుశక్తి మిక్కుటమేగాని అరవకుగల పురుషకారములేదు. ఆంధ్రునకు మంత్రశక్తియు హెచ్చేగాని అరవకుగల ప్రయోగకౌశలము లేదు.

ఆంధ్రునికి తెలివియున్నదిగాని శ్రద్ధలేదు. ప్రతిభయున్నదిగాని దీక్షలేదు. ఆసక్తియున్నదిగాని, ఏకాగ్రత లేదు. ధైర్యమున్నదిగాని సాహసములేదు.

ఆంధ్రుల కలహభావ మధికము. నేటిపని రేపటికి నిలువసేయును. అరవ రేపటిపనిగూడ నేడే ప్రారంభించును.

ఆంధ్రుడు ఖడ్గవాది; నిత్యశంకితుడు. అరవ కార్యవాది; పట్టినపట్టు విడువడు. ఆంధ్రుడు చొరుచుకొనిపోడు, పోయి కాలునిలువద్రొక్కుకొనడు. అరవ శరవేగమున పోవును, పోయి స్థిరపడును.

అరవ ఎస్కిమోలనడుమకుగూడ పోయి వ్యాపారముచేయును. ఆంధ్రుడు మదరాసునగూడ నుండలేడు. అరవ క్రియాసిద్ధికిచేయరానివియు చేయును. ఆంధ్రుడు కార్యము చెడుచున్నను చేయవలసినవి చేయడు. అరవ స్వస్థాన వేషభాషాభిమాని. ఆంధ్రుడు అనుకరణపరాయణుడు.

ఉభయులతత్వమున నింత వ్యత్యాసమున్నది. ఈ వ్యత్యాసము ప్రవృత్తిలో సంకితమై, పర్యవసానమునగూడ ప్రతిఫలించుటలో నాశ్చర్యమేమున్నది? ఇట్టిస్థితిలో ఆంధ్రుడు మద్రాసున తనసంఖ్యకు తగిన ప్రాజాపత్యమును తనయైశ్వర్యమునకు తగిన పలుకుబడిని తన ప్రతిభకు తగినపదవిని ఎట్లు పొందగలడు?"

# 13. ఆంధ్రాభ్యుదయమునకు అడ్డంకులు

"మన జాతి పునరున్నతిని పడయజాలకుండుటకు స్వాభావికము లగు అసౌకర్యములు కొన్ని యున్నవి. ఇరుగుపొరుగుజాతుల ప్రవృత్తిని పరిశీలించిన మనకు అవి విశదములగును.

మహారాష్ట్రులనుచూతము: వారిసామ్రాజ్యము అస్తమించి యెంతో కాలము కాలేదు. శివాజీపదాంకములు వారి కింకను స్ఫుటముగనే కనిపించు

చున్నవి. పేష్వాలయాస్థానమున రాజకార్యములు నవరించిన ముసద్దీలు వారికిప్పటికిని అక్షరాభ్యాసము కావించుచునేయున్నారు.

ప్రతికుటుంబమువారును, మా నాయన, మా తాత ఫలానా యుద్ధమున అంతపరాక్రమమును చూపినాడని చెప్పుకొని ఉబ్బెంగు అదృష్టము వారికింకను దూరముకాలేదు.

ఇట్లు, "నేను", "నాది", అను మమత విస్మృతముకాకపూర్వమే, ఆ దేశమున తిలకు అవిర్భవించి ఆ జాతికి నవశక్తి సంఘటించినాడు.

గుజరాతీలను చూడుడు ; తురకలతోడి సంఘర్షణము వారికిని మాంద్యమురాకుండజేసినది. పార్శీలతోడి సాహచర్యము, వారిని జాగ్ర దవస్థలోనుంచినది. కరాచీ బొంబాయి రేవులు ఆంగ్లేయులతో ముందు వారికే పరిచయముకలిగించినవి. సహజముగ వారు ధనవంతులు. వారు సోమరులుకారు. సంపాదనాచతురులు. ఇట్టిస్థితిలో నౌరోజి, పటేలు, గాంధీగారు, వారికి తత్వదర్శనముగావించినారు.

బంగాళీలసంగతి : తురకలకు వారికి, తురకలకు ఆంగ్లేయులకు అక్కడ జరిగినంత సంఘర్షణము మరియెక్కడను జరుగలేదు. వారి ముఖ్యపట్టణము భారతదేశమునంతకును ప్రధాననగరముగానుండినది. బ్రిటిషిండియాకంతకును పెద్దయుద్యోగి వారినడుమ కొలువుతీర్చినాడు. కోట్లకొలది పెట్టుబడులతో వ్యాపారముసాగించు విదేశీయవర్తకులక్కడ అంగడులు తెరచినారు. ఆంగ్లేయపండితు లక్కడ తమ విజ్ఞానము వెద జల్లినారు. వివేకానందుడు, సురేంద్రనాథుడు, విపినచంద్రుడు, ఆశుతోషు, చిత్తరంజనుడు వారికి వెన్నెముకగా నిలిచినారు.

అన్నిటికిని జీవగఱ్ఱగా కర్జనుప్రభువు కశాఘాతము వారినిఉద్బుద్ధు లను గావించినది. నేడు బంగాళము భారతదేశమునకు జ్యోతినలెనున్నది.

అరవలసంగతియు చూడతగినదే : మొన్న మొన్నటివరకును నాయకరాజులు వారిని దిద్దినారు. అత్యద్భుత శిల్పచాతుర్యముగల

అసంఖ్యాక దేవాలయములు, ప్రోతలను చిగిరింపజేయు త్యాగరాయల వారి గానలహరి, వారిని తాదాత్మ్యమును గావించినవి.

తురకలకు, ఫ్రెంచివారికి, ఆంగ్లేయులకు, అక్కడ సంకుల సమరములు సాగినవి.

సహజమగు ప్రాగమనింత ఆంగ్లేయులతో వారికెక్కువ పరిచయము కలిగించినది.

ఇన్ని కారణములవలన ఇంతవరకు వారిలో నొక్క మహాపురుషుడైన నవతరింపకపోయినను జాతియంతయు తనమేలు తాను గుర్తెరిగి సాధించుకొనగల స్థితిలోనున్నది.

ఇక మనసంగతి : మన ఘనత పూర్వచరిత్ర చాల గంభీరమైనదే గాని, దాని ప్రభావము ఇంతవరకును ప్రసరింపజాలదు. మన విజయనగర సామ్రాజ్యము నశించి అనేక శతాబ్దములైనది. మనపేరుగా నొక్క స్వతంత్రస్థానమున్ను లేదు. మనదేశమున లక్ష జనసంఖ్యగలదైన నొక్క నగరమును లేదు.

మహమ్మదీయుల కాలమున ప్రభువు మనసడుమ నివసింపలేదు ఆంగ్లేయప్రభువుగూడ మనకు దూరమునందే ఉండిపోయెను.

దక్షులగు యూరపియనులతో మనకు పరిచయము లేదు.

రాజధానిలో నివసించుటకు మనకు సాహసము లేదు. ఇప్పటికిగూడ రాజధానిలో మన కేవిషయమునను పలుకుబడిలేదు.

మనలకు ఎంతసేపు గుడుగుడుగుంచములాడుకొనవలసిన పరిస్థితులే అవతరించినవి. వీటికన్నిటికిని సాయము మనకు అలసత మెండు. మాంద్యము హెచ్చు. అయితే, మనకు గొప్ప ఆశయములు, పెద్ద ఆశలు గలవు. గాని వాని నాచరణలో పెట్టుటకు అవకాశములు లేవు. ఇక మనకు నవీనోన్నతి యెట్లు కలుగును? చూచినకొలది కన్నులు అశ్రుపూరితములగుచున్నవి. తలచినకొలది హృదయము విదారితమైపోవుచున్నది.

స్వాభావికములగు నిట్టి అసౌకర్యములను సరిపుచ్చుకొనలేని మనము; అరవల ప్రతిఘటనలను, ఉత్కలుల దురాక్రమణలను జయింప గలమా?" అని 1933 జులై నెల భారతిలో మీగడతరకలు అను శీర్షిక క్రింద "శాస్త్రి" అను పేరుతో స్వాభావిక అసౌకర్యములు అనునొక వ్యాసము ప్రకటింపబడినది. దీనిని వ్రాసినది తామేయని శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అనుభవాలూ-జ్ఞాపకాలూ అను తమ స్వీయచరిత్రము నందు వ్రాసినారు.

వారి యూహలు నిజమేయైనవి. మన బరంపురము పర్లాకిమిడి మన చేయి జారిపోయినవి. చెన్నపట్టణము మనకు లేకుండ పోయినది. తుదకు బళ్ళారికూడా మనకు దక్కకుండా పోయినది. ఇంగ్లీషువారిచే, అరవలచే ఉత్కలులచే కన్నడులచేతకూడా పరాభవించబడి తుదకు 1953 లో కర్నూలు రాజధానిగా ఆంధ్రరాష్ట్రము నొకదానిని సంపాదించితిమి. అటు తర్వాత హైదరాబాదు రాజధానిగా నేర్పడిన ఆంధ్రప్రదేశ్ మన ప్రయోజకత్వముచే గాక కేవలము మన అదృష్టవశమున నేర్పడినది.

# విస్మృతాంధ్రము - విశాలాంధ్రము

## 1. చరిత్ర పరిశోధన

స్వతంత్ర భారత రాజ్యసమితిలోని అగ్రగణ్యరాజ్యములలో ఆంధ్రదేశ మొకటి. దీనిని పాలించిన - పాలిస్తూవున్న మంత్రులు సమర్థులే. ఇక్కడ విశ్వవిద్యాలయాలు గొప్పవే. అయితే మహారాష్ట్ర, వంగ, తమిళ, ప్రభుత్వాల మంత్రులూ అక్కడి విశ్వవిద్యాలయాలూ ఆయా దేశ చరిత్ర పరిశోధనకు సంస్కృతికి చేసిన కృషి, వారు సాధించిన కార్యములు, ప్రకటించిన గ్రంథాలు చూస్తే ఆంధ్ర చరిత్ర పరిశోధనను సంస్కృతిని మనవా రెంతగా ఉపేక్షించారో తెలుస్తుంది.

కీ. శే. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు సంతరించి 1959 సం॥లో ప్రకటించిన విజ్ఞాన సర్వస్వం తెలుగు సంస్కృతి సంపుటములో వారు వ్రాసిన సంగతులు చదివితే మన ప్రభుత్వమువారు విశ్వవిద్యాలయాలు తమ కర్తవ్య నిర్వహణలో ఎంతగా ఉపేక్షచేశారో బాగా తెలుస్తుంది.

ప్రాచీన ఆంధ్ర చరిత్రకు సంబంధించిన సాధన సామగ్రి అధికంగానే ఉన్నది. అయితే అది ఒక్కచోట లేదు. అక్కడక్కడ తునకలు తునకలుగా నున్నది. ఆంధ్రప్రదేశ్ సరిహద్దులలోనేగాక దేశాంతరాలలో కూడా వున్నది. కాలమహిమవల్ల మాటుమణిగి యున్నది. దీనిని పరిశోధించి సమన్వయముచేసి సమగ్ర చరిత్ర రచించు కార్యము సామాన్యమైనది కాదు. రాజకీయ ఆర్థిక కార్యక్రమాలను నిర్వహించుటలో వలెనే దీనికిని ప్రభుత్వమువారు పూనుకొంటేగాని ఇది సఫలము కాదు.

అందువల్లనే "ప్రాచీనాంధ్ర చరిత్ర ఇంతవరకు నిర్మాణదశలోనే ఉన్నది" అని శ్రీ శర్మగారు అన్నారు. ఆ మాటలు వారని 14 సంవత్సరములు దాటినా అది ఇప్పటికిని ఆ స్థితిలోనే ఉన్నది. ఇంతవరకు రచిం

పబడిన ఆంధ్ర చరిత్రలలో ఏదీ సమగ్రమైనది కాదు. ఇంతేకాదు. ఆంధ్ర చరిత్రకు సంస్కృతికి సంబంధించిన చరిత్రాంశాలపైన పి. హెచ్. డి. బిరుదాలు పొందిన వారు రచించిన ఏ సిద్ధాంత గ్రంథముకూడ సమగ్రమైనది కాదు.

నేటి మహారాష్ట్ర ప్రదేశములోని ఔరంగాబాదు జిల్లాలో గోదావరి నదీ తీరమున నున్న పైఠాను అనే ప్రతిష్ఠానపురమును రాజధానిగా చేసికొని క్రీ. పూ. 181 మొదలు క్రీ. శ. 157 వ సంవత్సరమువరకు దక్షిణాపథములోని మహారాష్ట్ర, కర్నాట, ఆంధ్ర, ప్రాంతాలను కలిపి పరిపాలించిన ఆంధ్ర శాతవాహన చక్రవర్తులు ఆంధ్ర రాజవంశము వారనే సంగతిని చరిత్రకారులందరూ అంగీకరిస్తున్నారు. అయితే అనాటి ఆంధ్ర సంస్కృతి స్వరూప స్వభావములను గూర్చి తెలిసికొనుటకు తగిన పరిశోధనము జరుగలేదు.

"ప్రతిష్ఠానపురము ప్రాచీన భారతదేశములో గొప్ప వర్తక వ్యాపారములకు కేంద్రముగా నుండినట్లు ఆధారములున్నవి.

నిజాంరాష్ట్ర పురాతత్వశాఖవారు 1937 సంవత్సరములో జరిపించిన త్రవ్వకములలో 18 అడుగుల లోతున ఒకదాని క్రింద నొకటి ఏడు పొరల క్రింద వేరు వేరు కాలమునాటి చారిత్రక శిథిలములు బయల్పడినవి. అవి ద్రావిడ నాగరికతకు పూర్వకాలమునుండి వివిధకాలములలో దేశమునేలిన హిందూ మహమ్మదీయరాజుల కాలమునాటి వరకుగల మధ్య కాలమునాటి చారిత్రక శిథిలములని చరిత్ర పరిశోధకులు నిర్ణయించినారు. అయితే ఆ పరిశోధన మింకను పూర్తికాలేదు. కుంతల శాతకర్ణికాలమున సంస్కృత ప్రాకృత భాషలలో మహాపండితులైన గుణాఢ్య శర్వవర్మల మధ్య జరిగిన వివాదము ఆ రెండు సంస్కృతుల పరిణతి చరిత్రకు సంబంధించినదే. గుణాఢ్య పండితుడు ప్రతిష్ఠానపురమువాడే. ఇట్టి పండితులింకా ఎంతమంది ఉండేవారో!

గుణాఢ్య పండితుడు రచించిన అసలు బృహత్కథ చాలా భాగము నశించగా అందులోని కొన్ని కథలు కథా సరిత్సాగరరూపము దాల్చినవి. అందులో ఆనాటి రాజకీయ సాంఘిక మత సాంస్కృతిక, చరిత్ర కనబడు చున్నది. ఆనాటి మహానగరములు వేలపట్టణములు వర్ణింపబడినవి. దీనిని గూర్చిన పరిశోధన మింతవరకు పూర్తికాలేదు.

శాతవాహన రాజవంశములోని హాల మహారాజు సంతరించిన గాథాసప్తశతిలోని గాథలు రచించిన మహారాష్ట్రి ప్రాకృత కవులు 347 మంది ఉన్నట్లు తెలుస్తున్నది. ఈగాథాసప్తశతిలో వర్ణింపబడిన ప్రజాజీవనములో ఆంధ్ర సంస్కృతి ద్యోతకమగుచున్నది. ఆ గాథలలో కొన్ని తెలుగు మాటలుకూడా ఉన్నవి. ఈ గాథలు కొన్ని సంస్కృత వాఙ్మయమున అలంకార శాస్త్రములో లక్ష్యములుగా గ్రహింపబడినవి.

మహారాష్ట్రి ప్రాకృతము యొక్క ప్రభావము తర్వాత పరిణతిచెందిన మహారాష్ట్రి, తెలుగు, కన్నడము మొదలయిన దేశభాషలపైన దాగా వున్నదని భాషాశాస్త్రజ్ఞులంగీకరించిన సంగతి. అయితే మహారాష్ట్ర కర్ణాటక దేశ చరిత్రలను వారి వాఙ్మయములను పరిశోధించి తెలుగుతో పోల్చి చూస్తేతప్ప ఈ సంస్కృతుల సంబంధములను గూర్చిన వివరములు తెలియవు. దీనిని గూర్చిన పరిశోధనకు ఆంధ్ర మహారాష్ట్ర కన్నడ విశ్వవిద్యాలయములు, ప్రభుత్వములు పూనుకుంటేగాని ఈ పరిశీలనము సాధ్యముకాదు.

శాతవాహనుల దక్షిణ రాజధానియైన ధాన్యకటకమును గూర్చిన కొన్ని విశేషములు త్రివిష్టపదేశములోను చీనాదేశములోను ఉన్నవని చరిత్ర పరిశోధకులు చెపుతున్నారు. ఆ పరిశీలన ఇంతవరకు జరగలేదు.

"కథ కంచికెళ్ళింది మన మింటి కొచ్చాం" అని తెలుగుదేశంలో మారుమూలగ్రామాలవారు కూడా ప్రతికథ చివరా చెప్పుకునేటంత సన్నిహిత సంబంధమున్నది. కాంచీపురానికి మన తెలుగు సంస్కృతితో, కంచి చెన్నపట్టణానికి 45 మైళ్ళదూరంలో నున్నది.

కాంచీపురము కాశీతో సమాన గౌరవము పొందిన పుణ్యక్షేత్రము. శివక్షేత్రమేగాక విష్ణుక్షేత్రముకూడా. ప్రాచీనకాలమునుండి వేదశాస్త్రాలు బోధించే మహావిద్యాలయాలకు కేంద్రస్థానము. ఘటికాస్థానములనే ఈ మహా విద్యాలయాలను గూర్చిన శాసనాలు పల్లవులకాలమునుండి కనబడు తున్నవి.

మొన్న మొన్నటివరకు తెలుగుదేశంనుంచి విద్యార్థులు చదువుకో డానికి కాంచీపురము వెళ్ళేవారు. బ్ర॥ శ్రీ వేదం వెంకట్రాయశాస్త్రిగారి తండ్రి వెంకటరమణశాస్త్రులుగారు కూడా అక్కడికి వెళ్ళి చదువు కున్నారు.

కాంచీపురంతో మనకింత సన్నిహిత సంబంధం ఎప్పటినుండి కలి గినది అనే అంశాన్ని పరిశోధించినవారు తక్కువ.

కాంచీపురం వైదిక మతానికేగాక జైన బౌద్ధమతాలకు కూడా కేంద్రమే. కాంచీపుర జైనబసదికి చెందిన ఆచార్యపురుషులు బెజవాడ నడుంబి వసతిలో నుండేవారని ప్రాచీన శాసనాలు తెలుపుచున్నవి. పల్లవ రాజులాంధ్ర ద్రవిడ దేశములను కలిపి పాలించారు. రాజేంద్రచోళుడు కూడా ఆంధ్ర ద్రవిడ దేశములకు చక్రవర్తి. కాంచీపురానికి తెలుగు సంస్కృతితో గల సన్నిహిత సంబంధము ద్రవిడదేశములోని చరిత్ర సామగ్రిని పరిశోధిస్తేనేగాని తెలియదు. అరవదేశపు చరిత్ర పరిశోధకుల కేమిపట్టినది ఈ విషయాన్ని పరిశోధించడానికి ?

తామ్రలిప్తినగరము ప్రాచీన భారతవర్ష చరిత్రలో ప్రసిద్ధివహిం చిన రేవు పట్టణము. ఇది ఉత్కళ గౌడ (వంగ) రాష్ట్ర సరిహద్దుదగ్గర బంగాళాఖాతము సముద్రతీరాన ఉన్నది. ఇక్కడనుండి గొప్ప గొప్ప ఓడలు బయలుదేరి బర్మా మలయ ద్వీపకల్పము, యవద్వీపమనే జావా సువర్ణద్వీపము, కంబుజమనే కాంబోడియా చీనాదేశాలకు పోయేవి. ఆంధ్రు లైన కళింగదేశీయులు, ఉత్కళులు వంగదేశీయులు సముద్ర వ్యాపారము చేసేవారు. సముద్రయాన నిషేధము ఇటీవల నెప్పుడో వచ్చినది. క్రీస్తు

క్రమ 5 వ శతాబ్దిలో తామ్రలిప్తినుండి ఓడనెక్కి వెళ్ళిన చీనాయాత్రికుడైన ఫాహియాను తన ఓడలో బ్రాహ్మణులున్నట్లు పేర్కొన్నారు.

తామ్రలిప్తిలో కోటీశ్వరులైన వైశ్యవర్తకు లుండేవారు. వీరు సముద్ర వ్యాపారము చేసేవారు. ఈ సంగతి చీనా మొదలైన దేశాంతరములలోని వారి వాఙ్మయములోనేగాక మన దేశములోని జైన బౌద్ధ వాఙ్మయములో కూడా కథలలో వర్ణింపబడియున్నది. ఆరాధనసారము సమయసారము మొదలైన జైనమత గ్రంథాలలోనుండి కొన్ని కథలను శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు తెలుగులోనికి అనువదించినారు. శ్రేష్ఠి చారుదత్తుని ధర్మాశ్రయకథ 1925 అక్టోబరు నెల భారతిలో ప్రచురింపబడినది. అందులో తామ్రలిప్తినుండి జరుగుచుండిన ఓడవ్యాపారము వర్ణింపబడియున్నది. వంగదేశానికి గౌర లేక గౌడ దేశమని పేరు. అక్కడనుండి తెలుగుదేశానికి వలస వచ్చిన వైశ్యులనే మనవారు గౌర కోమట్లు అనిరి.

కథాసరిత్సాగరములో తామ్రలిప్తినగరములోని ధనదత్తుడనే గొప్ప వైశ్య వర్తకుని కుమారుడు గుహసేనుడు ధర్మగుప్తుడనే వైశ్య ప్రముఖుని కుమార్తె దేవస్మితను వివాహమాడతాడు. ధనదత్తుడు చనిపోయిన తరువాత గుహసేనుడు తామ్రలిప్తినగరమునుండి కటహదేశంలో వ్యాపారం చెయ్యడానికి వెడతాడు. ఈ కటహము మలయ ద్వీపకల్పములోనిది.

తామ్రలిప్తికి సముద్రాంతరములలోని ద్వీపకల్పాలకు ద్వీపాలకు చీనాకు చాలా తరచుగా రాకపోకలు జరిగేవి. ఆంధ్ర కళింగ ఉత్కళ వంగ దేశముల తీరముల నున్న భారతీయులు తామ్రలిప్తినుండి రాకపోకలు చేస్తూ దేశాంతరాలలో వలసలు స్థాపించారు.

బర్మా మలయ ద్వీపకల్పము కాంబోడియా, జావా సుమిత్ర బలి ద్వీపములలోను సయాము కొచ్చిను చీనా ఇండోనేసియాలని వ్యవహరించే ప్రాంతాలలోను మన దేశీయులు వలసలు స్థాపించి మన మత ధర్మాలను సంస్కృతిని భాషను వ్యాపింపజేశారు, అనేక రాజ్యములు స్థాపించారు.

గత శతాబ్దమునుండి ఆయాదేశములలో జ్యగిన పరిశోధనలవల్ల మన దేశానికి ఆ దేశాలతో గల సన్నిహిత సంబంధములు బయల్పడినవి. కళింగ దేశములోను ఆంధ్రదేశములోను ఆకాలములోగల వేలా నగరములనే గొప్పరేవు పట్టణాలనుండి దేశాంతరాలతో వ్యాపారం జరిగేది.

దేశాంతరాలలోని ఆంధ్రులు వలస లేర్పరచుకొన్నారు. ఈ దేశాంతరాలలోని ఆంధ్ర సంస్కృతిని గూర్చి బాగా పరిశోధించి సమగ్రాంధ్ర చరిత్ర నిర్మింపవలసియున్నది.

ఆకాలములో ఆంధ్రదేశములో నుండిన వేలా నగరములనే రేవుపట్టణములనేకములు రూపుమాసిపోయినవి. కొన్ని నదీపాలైనవి. కొన్ని సముద్రము పొంగినపుడు ఉప్పెనలలో మునిగిపోయినవి. కొన్ని మహమ్మదీయుల కాలములో నాశనమైనవి. కాకతీయ రాజ్యకాలమున ఆంధ్రనగరమని ప్రసిద్ధిచెందిన ఓరుగల్లును మహమ్మదీయులు రూపుమాపినారు. ప్రతాపరుద్రుని కాలమునాటి ఓరుగంటి వైభవము క్రీడాభిరామములో వర్ణింపబడినది. ఇప్పుడు పూర్వపు కోటగోడలుగాని దివ్యభవనములుగాని దేవాలయములుగాని లేవు.

కొండవీటి రెడ్డిరాజుల కాలమున రాజధానిగా నుండిన కొండవీటి వైభవమును శ్రీనాధ కవిసార్వభౌముడు వర్ణించినాడు. ఆ దుర్గముగాని ఆనాటి నగరముగాని కనబడవు. ఆ పట్టణము పాడుపడి ప్రక్క నొక చిన్న ఊరు ఆ పేరుతో నున్నది.

1423 సం॥లో రాజమహేంద్రవర రెడ్డిరాజ్యమునకు పట్టాభిషిక్తురాలైన అనితల్లి పేర నామె భర్త వీరభద్రారెడ్డి, బావ వేమారెడ్డిగార్లు పాలించిననాటి రాజమహేంద్ర వైభవమును ఆస్థానకవియైన శ్రీనాధమహాకవి భీమఖండములోను, కాశీఖండములోను కన్నులకు గట్టినట్లు వర్ణించినాడు. ఆనాటి కోట రూపుమాసిపోయినది. గోదావరి రైలుస్టేషను గేటుదగ్గర కొన్ని ప్రాంతములు నేటికిని కోటగుమ్మం అంటారు. శ్రీనాధమహాకవి వర్ణించిన దేవాలయములు మేడలు మిద్దెలు గొప్ప రాజవీధి ఇప్పుడులేవు.

జరుపుచుండిరి. గ్రామములోని భూములను అమరిక పరచుట, పల్లపు పొలములు మిట్టపల్లములు, పంటలను అజమాయిషీచేసి అంచనా వేసి గ్రామో ద్యోగులకు గ్రామ ఆయగాండ్ర భాగమును, ధర్మాదాయ, బ్రహ్మాదాయ దేవాదాయముల భాగమును పంచియిచ్చుట, గ్రామపంటలోని రాజ భాగమును చెల్లించుట, గ్రామరక్షణమునకు శాంతిభద్రతలకు కట్టుబాటులుచేయుట, వివిధ జాతుల మత కుల వర్గముల వారి మధ్యగల తగవులు విచారించి పరిష్కరించుట, చిన్న నేరములను విచా రించి శిక్షించుట, గ్రామములో పండుగలందు జాతరలందు ఉత్సవము లందు జరుగు కార్యకలాపముల కట్టుబాటుచేయుట. వీధిభాగవతములు, తోలుబొమ్మలు హరికథా కాలక్షేపములు, మల్లవిద్యలు, సాము కసరత్తులు మొదలగువాని ఏర్పాటుచేయుట మొదలగు కార్యముల నన్నింటిని పంచా యతీలే చేయుచుండెను.

భారతదేశము నేలిన హిందూ చక్రవర్తులు రాజులును, మహమ్మ దీయ పాదుషాలును సుల్తానులును గ్రామముల యొక్క అంతరంగిక పరి పాలనమునందు జోక్యము కలిగించుకొనక పంటలో తమకు రావలసిన రాజభాగమును పుచ్చుకొని గ్రామప్రజలకు యుద్ధభయములేకుండా కాపా డుచు గొప్పనేరములను విచారించి న్యాయపరిపాలనము చేయుచుండిరి. అందువలన భారతదేశమును హిందూ ప్రభువు లేలినను మహమ్మదీయ ప్రభువులేలినను గ్రామపంచాయతీలు చెక్కు చెదరక నిలచినవి. 1794 లో గ్రామపంచాయతీల యధికారములను రద్దుచేసి ఇంగ్లీషు కలెక్టర్లక్రింద రివిన్యూ పరిపాలనా విధానమును స్థాపించగా గ్రామ పంచాయతీలు క్రమ క్రమముగా రూపుమాసిపోయినవి.

తాము చేతులారా నాశనముచేసిన గ్రామ స్వరాజ్య విధానమును గూర్చి ఆంగ్లేయోద్యోగులును చరిత్రకారులును వర్ణించియున్నారు.

భారతదేశములో నన్ని ప్రాంతములందును గల గ్రామములు [illegible] ముగా నిర్మింపబడి యుండెను. ప్రతి గ్రామమునకును మధ్య నొక దేవా లయ ముండెను. సాధారణముగా నొక తటాకముకూడా నుండెను. గ్రామ మధ్యమునగల విశాలప్రదేశమున నొక రచ్చ చావడియు నుండెను.

గ్రామమునందు తూర్పు పడమర వీధులు ఉత్తర దక్షిణ వీధులు నుండెను. గ్రామము చుట్టును పొరకతల్లవు సాగుభూములు పచ్చికబయళ్ళు నుండెను.

ప్రతి గ్రామమునకు నొక పటేలు, రెడ్డి, కాపు లేక మునసబు అను అధికారియు, పట్వారి, కరణము అను నొక గణకుడును, గ్రామ రక్షణమునకు ఆర్థిక క్షేమ లాభములకు నావశ్యకములైన పనులు నిర్వహించు ఇతర ఉద్యోగులును సేవకులు నుండిరి. గ్రామములోని భూముల పంటలో వీరికి భాగములుండెను. వీరిని ఆయగాండ్రను చుండిరి.

గ్రామములోని సామాన్య వ్యవహారముల నన్నిటిని గ్రామాధికారులే నిర్వహించుచుండినా నిర్వహణము ధర్మవిరుద్ధముగ నున్నచో గ్రామస్థు లెవ్వరు కోరినను గ్రామాధికారులు పెత్తనదారులు గల పంచాయతీ సభ సమావేశమై ధర్మ నిర్ణయముచేసి వ్యవహారములను చక్కబెట్టును. నిజమునకీ పంచాయితీ సభలే గ్రామ పరిపాలనము చేయు ప్రజా ప్రభుత్వ సంస్థలుగ నుండెను. ఇవి అవసరమైనపు డెల్ల సమావేశమగును. ఎవ్వరు కోరినను గ్రామాధికారి ఈ సభను సమావేశ పరచును. గ్రామ వ్యవహారములను, వ్యక్తుల వ్యవహారములను కూడా పంచాయితీలు విచారించి ధర్మ నిర్ణయములు చేసి పరిష్కరించును. అందువలన నివి న్యాయ స్థానములుగ కూడా పనిచేయుచుండెను.

దేశమునేలు రాజులతో రాజభాగమును నిర్ణయించుకొనుట, గ్రామములోని భూములను అమరక పరచుట, పల్లపు సాగుకు నీటి సరఫరా చేయుట, భూముల పైన పంటను అంచనా వేయించి రాజభాగము క్రింద ఆయగాండ్ర భాగము క్రిందను చెల్లవలసిన దానిని నిర్ణయించుట, దేవాలయములను బ్రహ్మదాయములను నిర్వహించుట, విద్యా వినోదముల యేర్పాటు చేయుట, శాంతి భద్రతలను గూర్చిన కట్టుదిట్టములు చేయుట, ప్రజల క్షేమ లాభముల కావశ్యకములైన అన్ని పనులను జరిగించుట పంచాయితీ సభలు నిర్వహించు కార్యములు. అందువలన భారత దేశములోని గ్రామములు స్వపరిపాలనముగల ప్రజాసత్తాకములుగ నున్నవని ఆంగ్లేయ చరిత్రకర్తలు వ్రాసిరి.

విజయనగర రాజులు పంటలో ఆరవ భాగమును రాజభాగముగ తీసి కొనుచుండిరి. మహమ్మదీయ సుల్తానులు మూడవ వంతును గ్రహించు చుండిరి. ఈ రాజభాగములలో కొంత స్థానికావసరముల కొరకు, కరువు లలో ప్రజలను రక్షించుటకు, దగ్గరనున్న ముఖ్య పట్టణములలో నిలువ యుంచుచుండిరి. క్రొత్తపంటను చూచి గాని ప్రాత పంటను వినియో గింపక పోవుట మనదేశ ప్రజలు, ప్రభువులు అవలంబించిన సంప్రదా యము. పట్టణ పరిసరముల భూములను మహమ్మదీయ సుల్తానులు తమ యుద్యోగుల కొరకు సైనికుల కొరకు ప్రత్యేకించిరి. రాజభాగము సొమ్ముగా పుచ్చుకొన్నను వ్యవసాయాభివృద్ధికి తోడ్పడుచుండిరి. తూర్పు ఇండియా ఇంగ్లీషు వర్తక సంఘము వారి కొలువులో చాలకాలము పని చేసి మద్రాసు గవర్నరై 1827 లో దివంగతుడైన సర్ థామస్ మన్రో గారు రాయలసీమ ఇంగ్లీషువారి వశమైన పిమ్మట కమిషనరుగా పనిచేసి అక్కడి పరిస్థితిని గూర్చి 15-5-1806 తేదీన పంపిన నివేదికలో నిట్లు వ్రాసిరి.

"అవిచ్ఛిన్నధారాయ గాంభీర్యతతో నీ దేశమున వర్ధిల్లుచున్న గ్రామములొక విధముగా చిన్న చిన్న ప్రజాస్వామికములుగ నుండినవి. గ్రామమున కధిపతి గ్రామ పెద్దలు లేక మునసబు. భారతదేశము ఇటువంటి ప్రజా సత్తాకముల సముదాయముగా నున్నది. దేశములో యుద్ధములు జరుగు చున్నను, రాజ్యములు విచ్ఛిన్నములై రాజులుమారుచు ప్రభుత్వ విధానములు తారుమారైనప్పుడు కూడా గ్రామములలోని ప్రజలు ఆ సంగతిని పట్టించు కొనకుండా తమ గ్రామ రక్షణ భారమును దాని పరిపాలనా భారము మొద లగు సమస్త విషయములను తమ గ్రామ మునసబునకే వదలి నిశ్చింతతో నుందురు. రాజకీయ విప్లవములందు గ్రామ మెవరి వశమైనను దాని అంత రంగిక వ్యవహారములం దెట్టి మార్పులును జరుగవు. గ్రామ వ్యవస్థ చెక్కు చెదరక నిలిచియుండును. గ్రామ మునసబు ఇప్పటికిని గ్రామముల లోని భూముల రెవిన్యూ ఆదాయమును వసూలుచేయు కలెక్టరువంటి అధి కారిగాను, శాంతి భద్రతలను కాపాడి న్యాయ పరిపాలనము చేయు మే-

సేటు[illegible]అధికారిగాను మన్నాడు. అతడు గ్రామములోని వ్యవసాయ కృషి యంతటికిని బాధ్యత వహించిన ప్రధాన కృషీవలుడు లేక రైతు పెద్దగా నున్నాడు. దేశములోని భూమి అమరకము యావత్తు గ్రామమున సభులతోనో గ్రామ మునసబులద్వారనో మనువుకాలమునాటినుండి నేటి వరకును జరుగుచున్నది" అని వ్రాసిరి.

రాష్ట్రము నెవరు పాలించుచున్నను గ్రామములను గ్రామ మునసబులే పరిపాలించుచున్నారని మన్రోగా రింకొక రిపోర్టులో వ్రాసియున్నారు. మద్రాసు రాజధాని రెవిన్యూబోర్డువారు కూడా ఈ విషయములను 1808 లో ధృవపరచి యున్నారు. భారతదేశములోని గ్రామములందలి వ్యవహారముల నన్నిటిని పటేలు, రెడ్డి, కాపులను పేర్లతో వ్యవహరింపబడిన గ్రామ మునసబును పట్వారీ మొదలైన పేళ్ళతో వ్యవహరింపబడిన గ్రామ కరణమును నిర్వహించుచుండినట్లు తమకు రూఢియైనదని ఇంగ్లీషువర్తక కంపెనీ డైరెక్టరులు మద్రాసు కోటకు పంపిన డిస్పాచిలో వివరించిరి.

గ్రామ పటేలు లేక మునసబు గ్రామములోని జడ్జి లేక న్యాయాధిపతిగను, మేజస్ట్రేటుగను కలెక్టరుగను అధికారము వహించి, వ్యవహరించుచుండెను. న్యాయాధికారి గ్రామములోని తగవులను పరిష్కరించుచుండెను. వివాదపడిన వారు కోరినప్పుడు తగవులను గ్రామములోని పెద్దలుగల పంచాయితీ సభల సహాయముతో తీర్మానించి పరిష్కరించుచుండెను. ఈ పంచాయతీ తీర్పు పైన దేశమును పాలించు రాజు లేక నవాబు నియమించిన మండలాధికారులు లేక రాష్ట్రపరిపాలకులకు అప్పీలు పునర్విమర్శనలు చేయు అధికార ముండెను. ఈ మండలాధికారులును రాష్ట్ర పరిపాలకులును సామాన్య పరిపాలన వ్యవహారములను నిర్వహించు రాజోద్యోగులుగ నుండుటయెగాక దేశములోని న్యాయపరిపాలనా వ్యవహారముల పైనను శాంతి భద్రతలకు సంబంధించిన పోలీసు వ్యవహారముల పైనను పర్యవేక్షణాధికారము కలిగియుండిరి.

గ్రామ కరణము లేక పట్వారీ గ్రామముయొక్క ప్రభుత్వ వ్యవహార సంబంధములైన లెక్కల నన్నిటిని వ్రాసి పటేలుకు సహాయము

చేయును. గ్రామములోని భూముల వ్యవసాయమునకు సంబంధించిన లెక్కలు, రాకపోక రవాణా లెక్కలు వృత్తులను గూర్చిన లెక్కలుకూడా వ్రాయును.

గ్రామముయొక్క సమస్త వ్యవహారములను చక్కబెట్టి గ్రామ ప్రజల క్షేమ లాభముల కొరకు పనిచేయుటకు వివిధ గ్రామోద్యోగులు, గ్రామ సేవకులు నుండిరి. వారి సంఖ్య ఆయా గ్రామముల యొక్క విస్తీర్ణమును బట్టియు జనసంఖ్యను బట్టియు ప్రజల ఆవశ్యకతలను బట్టి యేర్పడి యుండెను. సాధారణముగా పండ్రెండు గురుండిరి: వీరిని పన్నిద్దరాయగాండ్రనిరి.

ఆయగాండ్రలో గ్రామ మునసబు, కరణము, తలారి నీరుకట్టు, జారిక, చేను కాపరి, షరాబు, పురోహితుడు, పంచాంగ బ్రాహ్మణుడు, కంగలి, కమ్మరి, చాకలి, మాదిగ మొదలైనవారు చేరియుండిరి.

మునసబు కరణములు మొదలైన గ్రామాధికారులకును, ఆయగాండ్రకును గ్రామములోని కొన్ని భూములపైన పండుపంట ప్రత్యేకముగా నిచ్చుటయేగాక గ్రామస్థులనుండి కూడా పంటలో కొంత ప్రాప్తిని ఇచ్చుచుందురు. దేశములో శాంతి భద్రతలు లేక, యుద్ధములు కల్లోలములు జరుగుకాలమునందీ విధముగా గ్రామ భూములందు స్థిరమైన రాబడి యేర్పరుపబడి గ్రామములం దభిమానము కలిగియున్న గ్రామాధికారులకు ఆయగాండ్రకు గల పరపతియు పలుకుబడియు అసాధారణమైనదిగ నుండెనని మన్రోగారు వ్రాసియున్నారు.

తల్వారి గ్రామ సంహద్దులను, పొలముల సరిహద్దులను కాపాడును. పంటలను కాపాడును. పోకను అధికారములను కలిగియుండును. గ్రామస్థులకు, పరదేశీయులకు మార్గదర్శిగాను వార్తావహుడుగాను కూడా పనిచేయును. ఈ పనులయందే తన కుటుంబములోని వారందరును పాల్గొందురు. షరాబు గ్రామమునసబుకు లావాదేవీలలో తోడ్పడు నుద్యోగి. పన్నులు అంచనా వేయును. ద్రవ్య వ్యవహారములందు మంచి చెడ్డలను పరీక్షించి విలువకట్టును. నీరుకట్టు అను ఉద్యోగి వరిసాగుకు పంటలప్రకా·

ంము నీరిచ్చు బాధ్యత కలిగియుండును. చేనుమీద నున్న పంటను కాపాడు పని బారికవానిది. గ్రామమునకు గ్రామ జనులకు పనులు చేయవలసిన గ్రామాధికారులు, కమ్మరి, కుమ్మరి, మాదిగ మొదలైన పనివారు, ఆయ గాండ్రుగా పరిగణింపబడి, గ్రామాదాయము లేక పంటలో భాగములు కలిగి యుండిరి.

దేశ పరిపాలనముచేయు రాజులు నవాబులు సామంత ప్రభువులు వారి సేనాధిపతులు ఇతర రాజోద్యోగులు గ్రామముల అంతరంగిక పరిపాలనమునందు జోక్యము కలిగించుకొనక, గ్రామములకు శత్రుభయము లేకుండాచేసి శాంతిభద్రతలను కాపాడి రాజభాగమును రాబట్టుకొనుటకు మాత్రము ప్రయత్నించుతురు. ఇందుకొరకు గ్రామాధికారులతో నేర్పాటు చేయుటకు ప్రత్యేకోద్యోగులు నియమింపబడిరి.

దక్షిణాపథము నందలి తెలుగు జిల్లాలలో గ్రామసీమలందలిభూములపైన రాజభాగము రాబట్టుకొనుటకు మహమ్మదీయ నవాబుల కాలమున దేశముఖులు, దేశపాండ్యాలు మొదలగు నుద్యోగులు నియమింపబడుచుండిరి. గ్రామాధికారులైన పటేలు, రెడ్డి లేక మునసబును, కరణమును రాజోద్యోగులతో ఆయా గ్రామములనుండి చెల్లవలసిన రాజభాగమును నిర్ణయము చేసికొని, భూములపైన పంటలనుండి గ్రామాధికారులకును, గ్రామసేవకులకును చెల్లవలసిన భాగములతోపాటు రాజభాగమునుకూడా గ్రామస్థుల యెదుట కొల్పించి జాగ్రత్తగా విడదీసి అప్పగించుచుండిరి. రాజభాగమును చెల్లించుటలో పేచీలుపెట్టి బకాయి పెట్టినచో రాజోద్యోగులు తమ పైయధికారులకు ఫిర్యాదు చేయుదురు. అప్పుడా ప్రాంతముల నున్న ఫౌజుదారు, సైనిక బలముతో వచ్చి రాజభాగమును వసూలు చేయ పంపించును. అధికారులు లంచగొండులైనచో గ్రామప్రజలకు కొంతబాధ కలుగుచుండును. మొగలాయి ప్రభుత్వకాలమున చివరిభాగమునందు పన్నులు శిస్తులు వసూలుచేయు హక్కులను ఇజారాల కిచ్చుచుండిరి. అట్టి ఇజారా పొందిన టకాలీలు కొందరు బలవంతులై వంశపారంపర్యపు హక్కుగా ఇజారాలను పొందుచు తుదకు స్థిరముగా కొంత పేష్కషు

వెళ్లించుచు ఏ ప్రాంతముల వేలు జమీందారులై ప్రజాపీడనము చేయ సాగిరి.

రాజులు నవాబులు నిరంకుశులై దుష్టులై వారి యుద్యోగులు దుర్మా ర్గులును లంచగొండులై పైనిత బలముతో ప్రజాపీడనము చేయుట మితి మీరి దుర్భర పరిస్థితులేర్పడినప్పుడును లేదా వారు దేశములో శాంతి భద్ర తలను కాపాడజాలక పోవగా శత్రురాజుల సైన్యములు ఆకతాయిమూకలు వచ్చిపడి గ్రామప్రజలను బాధించుట ప్రారంభమై, దుస్సహ పరిస్థితులేర్ప డినప్పుడును, గ్రామాధికారులు, పెత్తనదారులు పంచాయితీ సభలో సమా వేశమై, ఆలోచించి గ్రామము వదలిపెట్టిపోవుటకు నిశ్చయింతురు. అప్పు డా గ్రామము నందలి యాబాల గోపాలమును తమ పశువులను చరాస్తి ని ధనము మాత్రము తీసికొని యిండ్లు వాకిండ్లు పొలములు వదలిపెట్టి గ్రామాంతరములకు పోవుదురు. తమ గ్రామ పరిసరములందు శాంతిభద్ర తలు, క్రమ పరిపాలనము నేర్పడు వఱకును తిరిగిరారు. అంతవఱకు నా గ్రామములట్లు పాడుపడియుండును. ఇతరు లా గ్రామములోనికి వచ్చి ఆ యిండ్లను పొలములను ఆక్రమింపరు. ఒక్కొక్కప్పుడు కొన్ని సంవత్స రములు గాని చాలాకాలము వఱకుగాని ఇట్లు జరుగుటయు కలదు. అప్ప టికి గ్రామస్థులలోని అసలు కుటుంబముల వారిలో కొందరు మరణింతురు. ఒక తరముకూడా గతచిపోవచ్చును. అటుపిమ్మట నా పూర్వపు గ్రామస్థుల సంతతి వారువచ్చి, తమ తండ్రి తాతలు కాపురముండిన ఇండ్ల నివేశనము లందు గొడ్ల శాలలందు మరల నిండ్లను శాలలను నిర్మించుకొని, తమ పిత్రార్జితములైన భూములలో నెప్పటివలెనే వ్యవసాయము చేసికొనుచు పూర్వపు గ్రామ కట్టుబాటులతో జీవించుట ప్రారంభింతురు. ఇక నివేశన ములు లేక భూమి తమ తండ్రి తాతలనుభవించిరని ఎవ్వరేని రుజువుచేసి నట్లో కాలావధితో నిమిత్తము లేకుండా అది వారి సంతతి వారికి చెందవలె ననునది భారతదేశములోని పూర్వాచారము. గ్రామస్థులిట్లు తమ గ్రామము లను చాలాకాలము పాడుపెట్టి మరల వచ్చి పూర్వస్థానములను చేరికొని గ్రామ పంచాయితీ పరిపాలనము నేర్పరచుకొనిన యుదాహరణము లనేక

ములు కలవని భారతదేశము నాక్రమించిన ఇంగ్లీషు తూర్పు ఇండియా వర్తక సంఘమువారి కొలువులో పనిచేసిన అనుభవజ్ఞులైన దొరలు వ్రాయుటయే గాక, పైన చెప్పిన కారణము వలననే భారతదేశములోని రాజులు నవాబులు వారిరాజ్యములు నశించినను, గ్రామరాజ్యములు చెక్కు చెదరక నిలిచినవనియు కూడా వ్రాసియున్నారు. *

మనువు కాలమునుండి మన దేశమునేలిన హైందవ చక్రవర్తుల కాలముననగాని అటు తరువాత మనదేశమును పాలించిన తురుష్క మొగలాయి ప్రభువుల కాలమునగాని భారతదేశ గ్రామము లందలి పంచాయితీ రాజ్య విధానమునందెట్టి మార్పులును కలుగలేదు. ఉత్తరి సర్కారు లింగ్లీషువారి వశమైన పిమ్మట వర్తక కంపెనీ వారు 1769 లో (ప్రొవిన్షియల్ చీఫ్ అను) రాష్ట్రీయ పరిపాలకులను వారికి (ప్రొవిన్షియల్ కవున్సిల్ అను) సలహా సంఘములను నియమించి దేశముయొక్క రాజకీయ, సివిలు రెవిన్యూ పరిపాలన మంతయు వారి ద్వారా జరిగించిరి. వారు పూర్వపు పద్ధతులను మార్చరు. అంతకు పూర్వము నిజాముగారి పరిపాలనము క్రిందనుండిన దేశీయోద్యోగుల ద్వారానే పరిపాలించు చుండిరి. గ్రామములోని అంతరంగిక పరిపాలనమునందు మార్పులు

కారన్‌వాలీసు గవర్నరు జనరలైన పిమ్మట 1794 లో నీ విధానమును మార్చివేసెను. పాత రాష్ట్రీయ పరిపాలకులను వాని సలహాసంఘములను రద్దుచేసి జిల్లా కలెక్టరుల పరిపాలనమును స్థాపించెను. జిల్లాలోని సివిలు, రెవిన్యూ, క్రిమినలు, న్యాయపరిపాలన మంతయు జిల్లా కలెక్టరే

* Sri C. T. Metcalfe : Report of the Select Committee of the House of Commons 1832 Vol. (iii). Appendix 84 p 331. History of India (Hindu Mohammoden periods Mount Stuart Elphinston (1841).

Torrens Empire in Asia. Chapter VIII.

§ 15)

చేయును. జిల్లాలోని ముఖ్యమైన అధికారులందరు తెల్లవారే. దేశీయులకు తాశిల్దారీ మొదలగు చిన్నచిన్న యుద్యోగములను మాత్రమిచ్చుచుండిరి. వారిని చీటికి మాటికి పోట్లు పెట్టుచు శిక్షించుచుండిరి. అందువలన వారికి గౌరవము లేకుండెను. గ్రామ పంచాయితిల యధికారముల నన్నిటిని తీసి వేసిరి. గ్రామోద్యోగులకు పూర్వముండిన పంటలోని భాగములను తీసి వేసి వారికి నెలజీతములిచ్చి గౌరవహీనముగా చేసిరి. న్యాయపరిపాలనము దేశభాషలుగాని ఆచారములుగాని తెలియని దొరలు వశము చేసిరి. వారు కేవలము సాక్ష్యాధారము పైన నాధారపడి ఇంగ్లీషువారి న్యాయశాస్త్ర విధుల ప్రకారము విచారణ చేయుచుండిరేగాని దేశాచార ధర్మములను ఆలోచింప రైరి. అందువలన స్వార్థపరులు అబద్ధపు సాక్ష్యములనిచ్చి వ్యవహారము లందు లాభము పొందసాగిరి. న్యాయ విచారణ మొక జూదముగా పరిణమించెను. అవినీతి వర్ధిల్లెను. గ్రామములోని పెద్దమనుషులకు పెత్తనదారులకు గౌరవము పలుకుబడి నశించెను. దొరలను వారిక్రింది తొత్తుల నాశ్రయించు వారికి లాభము కలిగెను. ప్రజలేమనుకొందురో యను సిగ్గు బిడియములు పాపభీతియు నశించెను. సర్కారుకు చెల్లవలసిన పంటలో రాజభాగము తీసికొను పద్ధతిని తీసివేసి గ్రామములోని భూములకు ప్రతి యేటను అమరిక పరచి భూములను కౌలు పొందువారు ఏర్పాటు చేయబడిన శిస్తును కిస్తీల ప్రకారము రొక్కముగా చెల్లించు పద్ధతి నేర్పరచిరి. శిస్తు చెల్లింపలేని వారిని బాధించి భూమి పంటను ఇండ్ల వాకిండ్లను, పశువులను చరాస్తిని జప్తు చేసి అమ్మించుట ప్రారంభమయ్యెను. శిస్తులు వసూలుచేయు ప్రభుత్వోద్యోగులగు వారు రైతులను చిత్రహింసలు పెట్టుచు కారాగారము లందుంచి నిర్బంధింపసాగిరి. కంపెనీవారి రెవిన్యూ బోర్డును అధికారము నిచ్చుటవలన యుద్యోగులలో లంచగొండితనము ప్రబలి రైతుల బాధలు మితిమీరెను.

కొన్ని ప్రాంతములలో కంపెనీవారు రైతుల వలన శిస్తులు వసూలు చేయు దళారీలను పూర్వపు ఇజారాదారులను ఆ భూములపైన పేష్కషు చెల్లించు పద్ధతిని శాశ్వత పట్టా ఇచ్చి జమీందారులుగా చేసిరి.

దీనికే శాశ్వత పైసలా అని పేరు.అట్టి ప్రాంతములందు రైతులభూములు కొంపలు గోడులు జమీందారు దయాధర్మముల పైన నాధారపడియుండెను. శిస్తు బకాయకు వారి చరాస్తిని భూములను జప్తుచేసి అమ్మించుటకు భూమి నుండి తొలగించుటకు జమీందారులకు హక్కు కలిగెను. జమీందారులను రైతులను కోర్టులలో త్రిప్పి బాధింపసాగిరి.

తూర్పు ఇండియా వర్తక సంఘమువారి పరిపాలన మారంభమైన ఏబదేండ్లలో దేశములోని భూస్వామ్య విధానమేగాక ఆర్థికవ్యవస్థ కూడా మారిపోయెను.

పూర్వకాలమునాటి నీతి మత ధర్మములు సాంఘిక మర్యాదలు ఇంగ్లీషు రాజ్యకాలమున క్రమక్రమముగా సడలిపోవుట వలన ప్రజలలో విపరీత చిత్తవృత్తులు కలిగెను. ఇంగ్లీషు విద్యవలన మన మత ధర్మములందు విశ్వాసములు క్షీణించి పాపభీతి నశించెను. ధనము నార్జించినవానికే సంఘమున రాజకీయములందు గౌరవము కలుగుచున్నందు వలన అవినీతికరములైన పద్ధతుల నవలంబించియైన ధనార్జనము చేయుట ప్రారంభమయ్యెను.

న్యాయ విచారణ పద్ధతి ప్రకారము సాక్ష్యబలమునుబట్టి తీర్మానించు పద్ధతి స్థాపింపబడినందు వలన అబద్ధపు సాక్ష్యములనిచ్చి జయము పొందుటకు వీలుకలిగెను. దీనివలన ప్రజలలోని నీతి ధర్మము లడుగంటెను.

గ్రామములందు ధనార్జనమున కవకాశములు లేనందున పట్టణములకుపోయి ఇంగ్లీషువారి కొలువులో చేరిగాని వ్యాపారముచేసిగాని ధనార్జన చేసి గొప్పవారము కావలెనను కోరిక ప్రబలెను. పట్టణవాసమువలన ఇంగ్లీషు నాగరికత వ్యామోహము కలిగి గ్రామప్రజలను అనాగరీకులని నీచముగా చూడసాగిరి. పల్లెటూరి వాడనిపించుకొనుట తలవంపుగ నుండెను. పట్టణవాసులు పల్లెటూరివారితో సంబంధ బాంధవ్యము చేయుట మానిరి. గ్రామములోని కుటుంబముల వారితో పట్టణములకు పోయినవారి

కిని గ్రామములందున్నవారికిని గౌరవమునందు ధనమునందు ఏర్పడు తారతమ్యమువలన గ్రామములోని కుటుంబములందలి ఐకమత్యము నశించెను. కుటుంబములే విచ్ఛిన్నములయ్యెను. పూర్వము గ్రామాధికారులందరు పెత్తనదారులుగ నుండి గౌరవము పొందినవారు ఇంగ్లీషు పరిపాలనమున గౌరవ హీనులైరి. గ్రామ క్షేమ లాభములకు తోడ్పడిన ఆయగాండ్రు నీచ సేవకులుగను నీచవృత్తులవారుగను పరిగణింపబడిరి.

గ్రామములందు జీవనములు జరుగనివారు పట్టణములకుపోయికూలి నాలియైన చేసుకొని బ్రతుకవచ్చునని గ్రామములు వదలిపోవసాగిరి.

భూములను సేద్యముచేసి జీవించు రైతులు మాత్రము గ్రామములు వదలిపెట్టలేక ఎట్లో జీవనము చేయుచుండిరి. వ్యవసాయము నానాటికి గిట్టుబాటుకాని పరిస్థితులు దాపురించుచుండెను. భూములు సారహీనములగుచుండెను. వానిని మరమ్మతుచేసి బలము వేయుటకు పాటిమట్టి కరవగుచుండెను. రసాయనిక ఎరువుల నుపయోగించుటకు శక్తి చాలకుండెను.

పట్టణవాసములందలిదాబాయిండ్లు, కంకరరోడ్లు, కొళాయినీరు, విద్యావినోదములుగాని, వైద్య సౌకర్యములుగాని, పుర పారిశుద్ధ్యపద్ధతులుగాని, ఇతర సౌకర్యములుగాని లేకపోవుట యటులుండగా సామాన్య సౌకర్యములుకూడా గ్రామములకు లేకుండెను. అందువలన గ్రామములు అజ్ఞానమునకు అనారోగ్యమునకు పుట్టినిండ్లుగ నుండెను. గ్రామముల దుస్థితిని గ్రామస్థుల బాధల నాలోచించినవారు లేరు. దేశప్రజలలో బహుసంఖ్యాకులు గ్రామములందే జీవింతురని, ఆ ప్రజలు అజ్ఞానమునను అనారోగ్యమునను మునిగినచో భారతదేశమే దుస్థితిలోనికి దిగుననియు నాగరీకులకు గాని ఇంగ్లీషు ప్రభుత్వము వారికిగాని తోచలేదు. ఇట్లొక శతాబ్దము గడచునప్పటికి ఘోరమైన ఉపేక్షవలన మనగ్రామములు అధోగతిలోనికి దిగిపోయెను.

భారతదేశము నింగ్లీషువారు నూట ఏబది సంవత్సరములు పరిపా

లించి 1947 లో దేశమును రెండుగా విభజించి భారతదేశమునకు స్వాతం
త్ర్యము నొసగి వెడలిపో యిరి.

# 3. అగ్రహారములు - మాన్యములు

అగ్రహారము, మాన్యము, ఇనాము, జాగీరు, మిరాసీ అనే మాట
లను పన్ను లేకుండా లేక స్వల్పమైన పన్నుతో అనుభవించడానికి ఇచ్చిన
గ్రామాలు, భూములు, అందులోని వృత్తులు లేక భాగాలు వర్షాశనాలు లేక
ఇతర వరుంబడులు అనే అర్థంలో వాడుతున్నాము.

మనదేశంలో సర్వంసహా చక్రవర్తులు, మహారాజులు నశించి
దేశాన్ని విజాతీయులైన ఇంగ్లీషువర్తక కంపెనీవా రాక్రమించి పాలించ
డం ప్రారంభించిన కాలంలో ఆంధ్రదేశంలో 11 మంది సామంత ప్రభు
వులుగల గొప్ప సంస్థానమైన విజయనగర రాజ్యాన్ని రాజుగారి అన్నగా
రైన సీతారామరాజుగారు పరిపాలిస్తున్న కాలం నాటి దేశ పరిస్థితులను
వర్ణిస్తూ అడిదము సూరకవి తన రామలింగేశ శతకంలో ఇలాగ వాపో
యాడు.

సీ. అగ్రహారములు నామావశిష్టములయ్యె
మాన్యంబు లన్నియు మంటగలిసె
బత్తెంబునకు దొంటి పడికట్లు తప్పెను
బుధజనంబులు రాకపోక లుడిగె

వర్షాశనంబులు వరదపా లయ్యెను
మలకతిలను బ్రజ మాసిపోయె
నశియించిపోయె వంటరులు,సిరస్తాలు
గజ తురంగములు తాకట్టు వడియె
ధార్మికాస్థానముల కిట్టి తప్పుపుట్టె
గతినచితుని రాజ్యాధికారిజేసి
యెంత పీడించితివి సత్కృంపీంద్ర కోట
రామలింగేశ రామచంద్రపుర నివాస.

ఇంగ్లీషువారి ప్రభుత్వ కాలంలోనే చాలా అగ్రహారాలు, మాన్యాలు, జాగీరులు, మిరాసీలు, వర్షాశనములు నామావశిష్టములైనవి. మిగిలినవి స్వతంత్ర భారత పరిపాలనలో పూర్తిగా అడుగంటినవి.

ఈ అగ్రహారాలు, మాన్యాలు మొదలైన వాని యుత్పత్తి,ప్రయోజనాలు, పరిణామాలు చరిత్ర మన దేశ ఆర్థిక రాజకీయ మత సాంస్కృతిక ప్రజా జీవనముతో పెనవేసుకుని యున్నది.

వీని నన్నింటినీ ఇంగ్లీషువారు ఇనాము లన్నారు. 1858 లో ఇంగ్లీషు ప్రభుత్వము వారు నియమించిన ఇనాము కమిషను వారి విచారణవల్ల మద్రాసు రాజధానిలోని తెలుగు, కన్నడ, తమిళ, మళయాళ ప్రాంతాలలో 350 రకాల ఈనాము లున్నట్లు తేలినది.

వీటిలో అసలే పన్ను చెల్లింపనక్కరలేనివి కొన్ని, కొద్దిపాటి పన్ను లేక శిస్తు చెల్లింపవలసినవి కొన్ని, దేవాలయానికో, మఠానికో, ధర్మసంస్థకో, గ్రామానికో, సంస్థానాధిపతికో, నవాబుకో ఏదో సేవచేసే పద్ధతిలో ఇచ్చినవి కొన్ని. ఏ విధమైన సేవా చేయనక్కరలేకుండా అనుభవించడానికి ఇచ్చినవి కొన్ని ఉన్నట్లు తేలింది.

ఇనాములను అనుభవిస్తున్న వారిలో తమ హక్కులను రుజువు చేసుకోలేనివారి ఇనాములను రద్దుచేసి పూరా శిస్తు వసూలుచేస్తామనిరుజువు చేసుకున్నవారి ఇనాములకు క్విట్ రెంటు లేక విడుదల పన్ను పుచ్చు

కుంటూ వాటిని ఖాయపరచి పట్టాలిస్తామనిన్నీ ఇంగ్లీషు ప్రభుత్వం వారు నిర్ణయించారు. అలా ఖాయకరచిన ఇనాములన్నీ ఇనాముదారు అమ్ముకొన వచ్చును. ఖాయపరచనివి అమ్ముకున్నా చెల్లదు. ఇనాము కమిషను వారి విచారణవల్ల దేశంలో వున్న లెక్కలేనన్ని ఇనాములు తొమ్మిది తరగ తుల క్రింద విభజించారు.

1. దేవాలయాలు, మఠాలు మొదలైన మత సంస్థలకు, వాటికి సంబంధించిన సేవలు చేయుటకు ఏర్పడిన ఇనాములు.

2. ప్రజోపయోగ కరములైన కార్యముల నిమిత్తం ఇచ్చినవి. ఉదాహరణకి : సత్రములు, చెరువులు, బావులు, వనములు, తోటలు, పూదోటలు, వారధులు, పీఠిందులు, పాఠశాలలు.

3. బ్రాహ్మణులు, బైరాగులు, జంగములు మొదలైన మత సంబంధ సంప్రదాయాలవారు అనుభవించడానికి ఇచ్చినవి.

4. పల్లపు నీటివనరులు, బావులు, ఆనకట్టలు, కాలువలు, కళింగలు మొదలైన ఆదాయము రాగల నిర్మాణముల మరమ్మత్తులో నుంచుట కిచ్చినవి.

5. వంశపారపర్యముగా పూర్వ రాజులక్రింద సైనికోద్యోగాలు, ఇతర ఉద్యోగాలుచేసిన నాయకులు, పాలెగాండ్రు, దేశముఖు, దేశపాండ్యాలు మొదలైనవారి కుటుంబాలవారు అనుభవిస్తూ వున్నవి.

6. పాలెగాండ్రు, నాయకులు, జామీనుదారులు మొదలైనవారి జ్ఞాతులు, వారి ఆశ్రితులు, వారిపై ఆధారపడి వారి కుటుంబాలవా రనుభ విస్తు న్నట్టివి.

7. దేశరక్షణ, కావలికి సంబంధించిన పూర్వకాలమునాటి పోలీసు వ్యవస్థకు సంబంధించినవి.

8. సామాన్య గ్రామ రెవిన్యూ పోలీసు సేవలకు సంబంధించి నవి.

9. గ్రామ సముదాయమునకు సేవచేయు వివిధ వృత్తులవారనుభవించు నట్టివి.

పూర్వకాలమునాటి చక్రవర్తులు, మహారాజులు, రాజులు కట్టించిన దేవాలయాలలో నిత్య ధూప దీప నైవేద్య అర్చనలకు కల్యాణోత్సవములకు, ఇతర ఉత్సవాలకు వినియోగించ గలందులకు గాను మాన్యములు, భూములు దానమిచ్చి చెక్కించిన తామ్రశాసనాలు శిలాశాసనాలు చాలా కనబడుతున్నవి. అట్టి దాన శాసనాలు కనబడనివి చాలా వున్నవి. దేవాలయానికి, దేవునికి సంబంధించిన సేవల కోసమిచ్చిన భూదానాలన్నీ దేవాదాయాలని అంటారు. దేవాలయ వ్యవహారాలను చక్కబెట్టే స్థానికుడైన ధర్మ వ్యవహర్త కిచ్చినది స్థానిక మాన్యము.

దేవాలయంలోని ప్రధాన అర్చకున కిచ్చిన మాన్యము ఆచార్య పురుష మాన్యము. ఇతర సేవలుచేసే వారికి ఇచ్చిన వానికి పరిచారిక మాన్యాలుండేవి.

దేవాలయంలో వేదపఠనము చేయు బ్రాహ్మణుల కిచ్చినది స్వస్తి వాచక మాన్యము.

దేవుని ఉత్సవములో నృత్యముచేస్తూ పాటలు పాడి, అభినయించే భోగము వారికిచ్చినది దేవదాసి మాన్యము.

దేవుని ఉత్సవములో దాడాసంచా కాల్చుట కిచ్చినది అధిర్వేది మాన్యము.

ఇవిగాక దేవాలయం నిర్మించిన పనివారికి, దానిని మరమ్మత్తుచేసే పనివారికి, ప్రత్యేక మాన్యాలుండేవి. బాజా బజంత్రీలకు, పువ్వులుకోసి తెచ్చేవారి కిచ్చేవి వివిధములైన ఇతర సేవలుచేసే వారికి ప్రత్యేకమాన్యాలుండేవి.

రాయలసీమలోను, తిరుపతి చుట్టుపట్లగల ప్రతి జిల్లాలోను శ్రీ వేంకటేశ్వరస్వామి మాన్యము లున్నవి. విజయవాడలోను, కృష్ణాజిల్లా

జిల్లాలోని అనేక గ్రామాలలోను దుర్గా మాన్యా లున్నవి. విశాఖపట్నం జిల్లాలోను, చుట్టుపట్ల ప్రాంతములలోను. సింహాద్రి అప్పన్న మాన్యా లున్నవి. అవి పూర్వకాలంనాటి శిలా శాసనాలలోను, తామ్రశాసనాలలోనే గాక గ్రామలెక్కలలోకూడా కనపడతాయి. అయితే, చిరకాలం నుంచి ఆ దేవుని ధర్మకర్తల అశ్రద్ధవల్ల వాటి ననుభవించే వారు వాటికి హక్కుదారులై దాన దమన విక్రయాది హక్కులతో అనుభవిస్తున్నారు. అయినప్పటికీ వాటిని దేవుని చేను అనీ, మాన్యమనీ, ప్రజలు వ్యవహరిస్తారు. కీర్తిశేషులైన వల్లూరి సూర్యనారాయణరావు పంతులుగారు కొన్ని దేవాలయాలను, ధర్మాదాయాలను బయటకుతీసి, ప్రాజ్యములాది నిలువబెట్టారు.

ఇలాగే ప్రతి గ్రామములోను ఆ గ్రామదేవత నిత్యదీపారాధనకు అర్చనకు, కొలుపులకు, జాతరలకూ ఏర్పడిన మాన్యాలున్నవి. బిడలకు పిడిమ్రానునెక్కి రక్తము ధారపోయడానికి మాన్యాలున్నవి. పిడి అనగా డొక్కలలోగాని, పిప్పలోగాని గాలమును గ్రుచ్చి వూడిపోకుండా గుడ్డలు చుట్టి బిగించి ఎత్తైన మ్రానుమీదనుంచి వ్రేలాడుతూ గిరిగిర తిరిగే మ్రొక్కుబడి దీనిని చేయలేని వారు ఇతరులచేత చేయించడానికి మాన్య మిచ్చేవారు. బ్రహ్మాదాయా లనేవి వేదశాస్త్రిలు అధ్యయనము, అధ్యాపనము చేసేవారి కిచ్చిన అగ్రహారాలు, శ్రోత్రియాలు, మంగళములు మొదలైనవి. వారు వాటి ననుభవిస్తూ వేదశాస్త్రిలు శిష్యులకు బోధించేవారు.

కొన్ని వేదపాఠశాలలు, ఘటికా స్థానాలకు ఇచ్చిన మాన్యాలు పున్నవి. ఘటికాస్థానమనగా వేదశాస్త్రిలలోని ఏ భాగములోని ముక్కలనైనా తీసి తాటిఆకుల ముక్కలపైన ఘంటముతో వ్రాసి ఆ ముక్కలనొక ఘటములో వేసి గిలకరించి ఒక ముక్కను తీయగా ఆ ముక్కగల వేదశాస్త్ర భాగాన్ని గడగడ వప్పగించగల ఘటికులకు జయపత్రమిచ్చు విద్యాపీఠములు.

వివిధ శాస్త్రములలో జ్యోతిషము, మంత్రశాస్త్రము, ఆగమ శాస్త్రములు, ఆయుర్వేదము మొదలైన వాటిని పోషించడాని కేర్పడిన మాన్యాలున్నవి.

గుంటూరు జిల్లాలో మందడము దగ్గర గోళకిమఠములో ఆయుర్వేదము బోధించడానికి, ఔషధములు తయారుచేయడానికి, ఆతురాలయములులేక ఆసుపత్రులు నడపడానికి ఏర్పాటు చేయబడినట్లు కొన్నివందల ఏండ్లనాటి శాసనములు దొరికినవి. ఆ గ్రామములు, అందలిభూములు దాని పోషణకోసం ఇచ్చారు.

రాయచూరు జిల్లాలో వాగాయి శాసనము వలన అక్కడ పండ్రెండ్రవ శతాబ్దిలో గొప్ప విశ్వవిద్యాలయ మున్నట్లు దానికి వసతులు, మాన్యములున్నట్లు కనబడుతున్నది.

కాశీ, గయ, ప్రయాగలలోను, ఉజ్జయినీ, నవ ద్వీపములలోను, వివిధ శాస్త్రములను పోషించడాని కిచ్చిన మాన్యాలు, వాటి ననుభవిస్తూ ఆ శాస్త్రాలను శిష్యుల కుచితముగా బోధించిన మహా పండితులు ఇంగ్లీషు విద్యావిధానం విజృంభించే వరకూ జరుగుతూ వచ్చినట్లు మనదేశములోని పూర్వకాలమునాటి వారందరూ చెబుతారు.

కాశీలోనూ, ఇతర పుణ్యక్షేత్రాలలోనూ, అహల్యాబాయి పునా శ్రీమంతులైన పేష్వాలు, యతులకు, అభ్యాగతులకు, విద్యార్థులకు, బ్రాహ్మణులకు ఉచితముగా భోజనము పెట్టడానికి అన్నసత్రము లేర్పరిచారు. అవి ఇంగ్లీషు పాలన సాగుతున్న చాలాకాలం వరకు నిలిచియున్నవి.

పూర్వకాలంనాటి మాన్యాల స్వరూప స్వభావాలు పరిశీలిస్తే,ఆకాలంనాటి రాజకీయ ఆర్థిక మత సాంస్కృతిక పరిస్థితులు, ప్రజా జీవనము, ఆనాటి ప్రభువుల, ప్రజల చిత్తవృత్తులు తెలుస్తాయి. పూర్వం దేశ రక్షణ

కోసం తమ రక్తాన్ని ధారపోసిన యుద్ధవీరులకుదోపిడీగాంగ్ర నెదుర్కొని ప్రాణములు బాసిన వారి కుటుంబాలకు, రక్తకోడిగ లేక "నెత్తురుకట్టు" మాన్య మిచ్చేవారు.

మొగలాయి సామ్రాజ్యము విచ్ఛిన్నమై, ఇంగ్లీషు కంపెనీ వారు దేశాన్ని ఆక్రమించి తమ ప్రభుత్వాన్ని స్థాపించే సంధికాలంలో అరాచ కము ప్రబలగా దేశములో పిండారీలు, మొదలైన ఆతతాయి జనము, దోపిడీగాంగ్రు విజృంభించిన కాలములో గ్రామరక్షణ కోసం తమరక్తాన్ని ధారపోసిన వారి కిటువంటి ఇనాము లిచ్చిన ఉదాహరణ లున్నవి.

దేశ రక్షణకు, గ్రామ రక్షణకు కావలికాయు ఆయుధ జనమునకు కావలి మాన్య లుండేవి. ఉదాహరణకు : దేశకావలి, మెన్కావలి, అరసు కావలి. తలయారి, గ్రామకావలి. పడికావలి, వాతకావలి, చేను కావలి మాన్యాలు 1858 నాటి ఇనాముల కమిషనువారి విచారణలో కన పడినవి. గ్రామ పరిపాలనకు కొన్ని గ్రామములు కలసిన సమితులను, మండలములను, సీమలు, నాడులు ......... మొదలైన పూర్వకాలపు దేశ విభాగములను, మహమ్మదీయ పరిపాలనా కాలంలో ఏర్పడిన సమితులు, ముఠాలు, పరగణాలు, సర్కారులు ............ మొదలైన దేశభాగము లను సంరక్షించుటకు, పరిపాలించుటకు అవసరమైన పైనిక పరిపాలక ఉద్యోగులకు, శిస్తుల నిర్ణయము దాని ......... వసూలు లెక్కలు ......... మొదలైన వాటినిచేసే దేశముఖ్, దేశపాండ్య, ముజుందారు వుద్యోగు లకు, న్యాయపరిపాలన చేసే వారిని ఇంకా యితర విధాలైన వుద్యోగు లకు, జీవనం నిమిత్తము జీతబత్తెములతో పాటు మాన్య లిచ్చేవారు. గ్రామంలో కాపు, రెడ్డి, పటేలు, మునసబు అనే గ్రామాధికారికిని, కర ణము, పట్వారీ, అనే లెక్కలువ్రాసే అధికారికిని, తలారి, బాలిక, పిర్గంటి, చేనుకావలి మాలిగ ......... మొదలైన గ్రామ ఉద్యోగులకు, కుమ్మరి, కమ్మరి, చాకలి, మంగలి, పంచాంగ బ్రాహ్మణుడు ...............

మొదలైన గ్రామ సాముదాయక సేవకులకు, కూడా మాన్యాలుండేవి.

పైనికోద్యోగులైన సేనాపతి లేక దళవాయిలకు, మంత్రులైన రాయసములకు, ఇతర ప్రభుత్వోద్యోగులకు మాన్యాలుండేవి. మహమ్మదీయ సుల్తానుల కాలంలో సేనాధిపతులుగా, పరిపాలకులుగా, పనిచేసే ఫౌజుదారులకు, నవాబులకు జాగీరు లుండేవి.

హిందూ రాజుల కాలములో గ్రామ తగవులు పరిష్కరించే గ్రామ పంచాయతీగాక ధర్మశాస్త్ర ప్రకారము పెద్ద వ్యాజ్యములు, నేరములు విచారించుట కేర్పడిన ధర్మాసనములుగా పరివేష్టించు వారికి "ధర్మాసనం" మాన్యా లిచ్చేవారు. మహమ్మదీయ పరిపాలనలో తగవులు పరిష్కరించి న్యాయ పరిపాలనచేసే అదాలతు దరోగాలకూ జాగీరు లుండేవి

పోలీసు పనులుచేసే తలారికిని, అతనిక్రింద పనిచేసే వారికినీ, జీవనం నిమిత్తం మాన్యా లిచ్చేవారు. మహమ్మదీయ ప్రభుత్వంలో నేరాలు విచారించే కొత్వాలుకు జాగీరులుండేవి. ఒక వరగణా నుండి రాజుకు చెల్లవలసిన శిస్తులు వసూలు చేయడానికి పనిచేసే పెత్తనదారులను చౌదరి అనేవారు. అతడే గ్రామసీమలో ఒక కులములోగాని, వివిధ వృత్తులలోగాని, వ్యాపారములలో గాని పనిచేసే వారిమధ్య వచ్చే తగవులు సభా ముఖమున విచారించి పరిష్కరించేవాడు. ఇతని కిచ్చిన మాన్యానికి చౌదరి మాన్యం అనిపేరు. ఒక కులములో నేదైనా అక్రమముగాని, అన్యాయముగాని జరిగితే, దానిని గురించి చౌదృకి చెప్పి ఆ కులము వారిని సమావేశపరచి, తగవు పరిష్కరించేవారు. అలా సమావేశపరిచే నౌకరుకు గణాచారి మాన్యం ఇచ్చేవారు. గ్రామ సరిహద్దులు పొలముల సరిహద్దులు, నిష్పక్షపాతంగా నిర్ణయించే కార్యానికి పూనుకున్న మనిషి తడిబట్టలు కట్టుకుని నెత్తిమీద కుంపటి పెట్టుకుని సరిహద్దు త్రొక్కాలి. అందులో పొరపాటు జరిగితే వంశనాశన మవుతుందని దీనిని

చేయడానికి చాలామంది భయపడేవారు. ఇలాంటిపని చేసేవారి కిచ్చిన మాన్యమునకు ఎల్ల మాన్యమని పేరు.

గ్రామ సముదాయమున కవసరమైన పనులు చేయడానికి రైతులను పోగుచేయటమునకు, గ్రామంలో పొలాలకు నీటిని సక్రమంగా సరఫరా చేయడానికి కట్టుబడి బంట్రోతుకిచ్చే మాన్యానికి అంగజాలవృత్తి ఇనాము అనేవారు. గ్రామస్థుల ఉపయోగం నిమిత్తం త్రవ్విన చెరువులు, వగైరా లను శాశ్వతంగా మరమ్మత్తులో పనిచేయడానికి దశబంధపు ఇనామునిచ్చే వారు. ఇలాగే దేవాలయం కట్టిన పనివాళ్ళకు, మరమ్మత్తు చేసే వాళ్ళకు మాన్యాలుండేవి. నదులు పొర్లి గ్రామాలను నష్టపరచకుండా కాపుదల కోసం రెల్లుపాతి, గట్లు కాపాడడానికి రెల్లు మాన్య మిచ్చేవారు. గ్రామం లోని పల్లం సాగుకు కావలసిన నీటిని సక్రమంగా సరఫరా చేసే గ్రామో ద్యోగికి నీరంటి యినాము లిచ్చేవారు. గ్రామ పొలాలమీద కుప్పలను ఎవ్వరూ ఎత్తుకొని పోకుండా కావలియుండి శిస్తులు వసూలు కోసం ఆయ గాండ్ర భాగాలు వగైరాలు విడదీసే వానికి స్థలం కావలి యీనాముండేది.

గ్రామంలో ఆర్థిక వ్యవసాయ పారిశ్రామికాభివృద్ధి కోసం కొత్త వృత్తులవారి నాహ్వానించి యీనాము లిచ్చేవారు.

కొత్త రైతు కుటుంబాలు వచ్చి గ్రామంలో స్థిరపడగలందులకు వారికిచ్చే ఇనాములను మేటి మాన్యా లనేవారు. ఇలాగే నూలు బట్టలు నేసే నేతగాండ్రు వచ్చి గ్రామంలో స్థిరంగావుండే వారికి జూలా హాళ గారు ఇనాము లిచ్చేవారు. ఒక గ్రామమునకు సమిష్టి హక్కుగలకుటుం బములవారు భూమిని విడదీసుకొని ముక్కలు చేయకుండా ఉమ్మడిగా వుంచుకొని సాగుచేస్తే వ్యవసాయ మభివృద్ధియగుననే వుద్దేశ్యంతోను, శిస్తులు సులభంగా వసూలవుతాయనే వుద్దేశ్యముతోను దానిని ప్రోత్సహిం చడానికి సంగువలి మాన్యము లిచ్చేవారు. ఒక బస్తీకి దగ్గరలో సంతజరిగే గ్రామంలో చేనేతగాండ్రు. మొదలైనవారు వచ్చి స్థిరనివాస మేర్పరచు కునే మొదల వారికి పేటగాడు మాన్య మిచ్చేవారు. పంట జరుగుటకు

... జరిగిన తరువాతను ఆ ప్రదేశముకు ... క్రమముగా

ఊర్చి బాగుచేయడానికి "సంతకసవి" మాన్య ముండేది. దరిద్రులకు, అనాథలకు, అశక్తులకు, అన్నవస్త్రములిచ్చి గాపాడడానికి కొన్ని ధర్మ మాన్యాలుండేవి. అన్నగావడి అనా మనేది ఊరిలో కావడి వేసుకుని అన్నము ప్రోగుచేసి, ఉన్న చోటునుండి కదలలేని కుంటి గ్రుడ్డివారికి అనాథలగు జబ్బువారికి అన్నదానము చేయడాని కేర్పడినది. గ్రామములోనికి వచ్చే బీద బాటసారులకు అన్నము వండుకొనడానికి బియ్యముపప్పు మొదలైన భోజన సామాగ్రి నివ్వడానికి సదా వృత్తి మాన్యము లేర్పడినవి. ఇలాగే బైరాగులకు, సన్యాసులకు సదావృత్తి నివ్వడానికి మాన్యాలున్నవి ఇలాగే దరిద్రనారాయణ ప్రీత్యర్థము ప్రజల క్షేమ లాభముల కోసము వారికవసరమైన సేవలకోసం, దాన ధర్మము లీ విధంగా మనదేశంలో నున్నట్లు ఇతర దేశాలలో లేవనే చెప్పాలి.

బీదవారికి అంబలి పోయడానికి అంబలి మాన్య ముండేది. వేసవి కాలంలో నూతులు చెరువులులేని రహదారులలో బాటసారుల కోసం చలి పందిళ్ళ నేర్పరచి, బాటసారులకు మజ్జిగను, మంచినీటిని యివ్వడానికి మాన్యాలుండేవి.

పైన చెప్పినవికాక, మనదేశంలో రాజులు సంస్థానాధిపతులు, నవాబులు, జమీందారుల్లు తమ దాబు దర్పాలకోసం భోగముల కోసము. పల్లకీలు మోసేవానికి, గొడుగు పట్టేవానికి, బాణా సంచా కాల్చేవానికి, బొబ్బ ఛటింత్రీలకు, భోగము వాండ్రకు, కవులకు, నాయకులకు, చాకళ్ళకు, మంగళ్ళకు, అత్తరువుల్లు మొదలైన సుగంధద్రవ్యాలు, తమల పాకుల్లు, మొదలైనవి సరఫరా చేసేవానికి, తమ బడియ జనులకు, ఆశ్రితులకు రకరకాల సేవల్లు చేసేవార్కి లెక్కలేనన్ని మాన్యాలు, ఇనాముల్లు ఇచ్చారు.

ఇంగ్లీషు వర్తక కంపెనీ ప్రారంభమైన నాటికి ఈ జాగీరులు, మాన్యాలు, ఇనాముల్లు, మిరాసీల్లు, మొదలైనవి లెక్కకు మిక్కిలి ఉండేవి. ఆ కాలంలో గ్రామాలలో భూముల పంటను అంచనావేసి, ఆయగాండ్ర భాగం మినహాయించి, ఇనాములు వగైరాల విషయంలో శిస్తు మినహా

యింపులు గమనించి, రాజభాగం తేల్చవలసి ఉండేది. అందుకోసం చాలా మంది ఉద్యోగులు సిబ్బంది కావలసి వచ్చేవారు. అందుక్రింద చాలా వ్యయమయ్యేది.

విజాతీయులైన ఇంగ్లీషువారికి మాన్యాలు, జాగీరులు, ఇనాములు, మిరాసీలు అర్థరహితంగా కనబడినవి. పైగా ఆ నాటి కా మాన్యాలలో చాలా వాటిని ఇనాముదారులు అక్రమంగా అనుభవిస్తూ, తాము చేయవలసిన ధర్మాలను, సేవలను చేయక ఉపేక్షించేవారు. చాలా ఇనాములను ఇతరులకు అమ్ముకున్నారు. ఇదంతా చూసి ఈ ఇనాములు, మాన్యాల వల్ల తమకు రావలసిన రివెన్యూ ఆదాయం రాకుండా పోతున్నదని వీటిని రద్దుచేయాలని ప్రయత్నించారు.

1786 లో గవర్నరు జనరలుగా వచ్చిన కారన్‌వాలీసు ప్రభువు వంగరాష్ట్రాన్ని జిల్లాలుగా విభజించి, కలెక్టరుల పరిపాలన స్థాపించాడు. అన్ని పెద్ద ఉద్యోగాలూ దొరల కివ్వాలన్నాడు. గ్రామ పంచాయతీ పరిపాలన రద్దు చేశాడు. కారన్‌వాలీసు వంగరాష్ట్రంలో సంస్థానాలవారి అధికారాలు తీసివేసి వారు దేశంలో పన్నులు వసూలు చేయకూడదని, ఆజ్ఞాపించి వారు సర్కారుకు చెల్లించవలసిన శిస్తును శాశ్వతంగా నిర్ణయించి జమీందారీ విధానం స్థాపించాడు. ఆ కాలంలో దళారి భూస్వాము లందరికీ పట్టాలు లభించినవి. సాక్ష్యము ఋజువుపైన నేరములు విచారించి న్యాయపరిపాలనా పద్ధతి స్థాపించాడు.

అప్పట్లో వంగరాష్ట్రంలో రకరకాల ఇనాములు ఉండేవి. ఎవరియీనామైనా సరియైనదికాదని కలెక్టరుకుతోస్తే అది చెల్లదని సివిలు కోర్టులో దావా దాఖలు చేసిగాని ఇనాము రద్దుపరచకూడదని 1793 లో 19 వరిగ్యులేషను ఒకటి చేశారు. పైకి న్యాయంగా కనబడినా దీనివల్ల ఇనాములను రద్దుచేయడానికి కలెక్టరు కొత్త అధికారం ఏర్పడినది. వంగరాష్ట్రంలో చేసిన రాజ్యాంగం విధానాలన్నీ 1794 లో మద్రాసు రాజధానిలో కూడా చేశారు. మన ఉత్తర సర్కారులను జిల్లాలుగా విభజించి కలెక్టరులపరిపాలన మేర్పరిచారు.

గ్రామ పంచాయతీల అధికారాలు తీసివేశారు. గ్రామ కరణమును కలెక్టరు క్రింద తాసిల్దారులు చెప్పిన ప్రకారము చేయవలసిన వెలజీత గాడిగా చేశారు.

1802 లో జమీందారుల అధికారాలను తీసివేసి వారిని భూస్వాములుగాచేసి శాశ్వత పట్టాలిచ్చారు. హవేలీ భూములు కొన్ని సామాన్య వ్యక్తులను వారితో సమానులైన ప్రొప్రయిటర్లుగా చేశారు. ఎన్ని మార్పులుచేసినా జమీందారీ గ్రామాలలో పూర్వకాలపు పద్ధతులు కొన్ని మిగిలినవి. పాత ఇనాములు మాన్యాలు చెక్కుచెదరలేదు. గవర్నమెంటు గ్రామాలలో రైత్వారీ పద్ధతిని స్థాపించి అనవసరమైన వుద్యోగులూ, వాటికి సంబంధించిన యీనాములు తీసివేశారు.

ఇంగ్లీషు వర్తక కంపెనీ అధికారులకు ఈ యీనాములను రద్దు చేయాలనే సంకల్పమున్నా, ఒక్కసారిగా చేయలేకపోయారు. కలెక్టరుల దగ్గర తమ యీనాములకు గల హక్కులు రుజువు చేసుకోవాలనీ, అలా రుజువు చేసుకోలేని వారి యీనాములు తీసివేస్తామని 1828 లో వంగ రాష్ట్రములో ముందుగా ఒక రెగ్యులేషను చేశారు. ఇది అన్యాయమని రాజా రామమోహనరాయలు, కుమార టాగూరు మొదలైన వంగరాష్ట్రం లోని దేశనాయకులంతా ఆందోళన చేశారు, ఇంగ్లండుకు అర్జీలుకూడా పంపించారు. రామమోహనరాయలు యింగ్లాండుకు వెళ్ళి పార్లమెంటు వారికి తన సాక్ష్యము సమర్పించడంలో దీనిని గురించి కూడా చెప్పారు. అంతట కంపెనీ వారప్పటికి ప్రయత్నం నిలుపుదల చేశారు. గాని 1837 – 38 సంవత్సరములలో మళ్ళీ పన్నులులేని ఇలాటి రాజా సర్వీసు యీనాములను గూర్చి విచారించి వారిని లాగికొనడానికి స్పెషల్ డిప్యూటీ కలెక్టరులను నియమించారు. అంతట కలకత్తాలో జమీందారి అసోసియేషన్ అనే ప్రజా సంఘ మేర్పడి ఆందోళన చేశారు. 1838 లో ఇలాటి రాజాదార్ల మహాసభ జరిగింది. దీనిని ప్రతిఘటిస్తూ తీర్మానాలు చేయగా విచారణలో నుంచి 50 బీఘాల విస్తీర్ణంగల ఇనాములను మాత్రం మినహా

యించారు. [ విఘూ అనగా ఎకరములో 5/8 వ వంతులు ] మద్రాసు రాజధానిలో ఇనాములను గూర్చి విచారించడానికి 1858 లో ఇనాము కమిషనేర్పరిచారు. వీరి విచారణ ఫలితంగా పైన చెప్పిన ఇనాముల వివరాలు తెలిసినవి. మద్రాసు ప్రభుత్వం వాటి కొన్ని యీనాములను రద్దుపరిచి కొన్నిటిని ఖాయపరచి వాటికి క్విట్ రెంట్ విధుదల పన్ను కట్టి అమ్ముకొనే హక్కుతో పట్టాలిచ్చారు.

## ఘ టి కా స్థా న ము లు

దాదాపు రెండువేల సంవత్సరాల క్రితం దక్షిణ దేశంలో కంచి అనే కాంచీపురములోను మరికొన్ని ఇతర పట్టణాలలోను ఉత్తర భారత దేశంలో ప్రపంచ విఖ్యాతి పొందిన తక్షశిల, నలంద మహా విద్యాలయములకు తీసిపోని ఘటికాస్థానములనే విద్యాలయము లుండేవి. కాంచీపురమున కాంధ్రసంస్కృతిచరిత్రతో సన్నిహిత సంబంధమున్నది.

మైసూరు రాజ్యంలో షిమోగా జిల్లాలో శికార్‌పూర్ తాలూకాలో తలగండ అనే గ్రామంలో ప్రణవేశ్వర స్వామి ఆలయంలో పల్లవరాజైన కకుస్థవర్మ నాటి శిలాశాసన మొకటి యున్నది. కకుస్థవర్మ పూర్వీకుడు మయూరవర్మ క్రీ. శ. 305 — 307 సం॥లో తన గురువు వీరశర్మతో పాటు శాస్త్రాలన్నీ క్షుణ్ణంగా అభ్యసించాలని కాంచీపురంలోని ఘటికాస్థాన

మునకు వెళ్ళినాడని ఆ శాసనము చెప్పుతున్నది. అప్పటికే కొద్దిగానో గొప్పగానో గురువు దగ్గర విద్య నభ్యసించిన మయూరవర్మ ఆ గురువుతో పాటు కాంచీపురానికి వెళ్ళినాడంటే అక్కడి ఘటికాస్థానము ప్రసిద్ధి, అక్కడి విద్యా బోధ ప్రాశస్త్యమూ వెల్లడి యవుతున్నవి. ఈ ఘటికాస్థానములలో వేదాధ్యాయనమే గాక స్మృతులు, పురాణములు, మీమాంస, వ్యాకరణము మొదలైన శాస్త్రాలన్నీ బోధించేవారు.

దక్షిణఆర్కాటు జిల్లాలో ఆర్కాటునకు ఏడుమైళ్ళ దూరములో నున్న వేలూరుపాళయ మనే చోట దొరికిన విజయనందివర్మ కాలమునాటి శాసనమున్నది. కాంచీపురమునేలు పల్లవరాజు స్కంధవర్మ శిష్యుడు. క్రీ. శ. నాల్గవ శతాబ్దారంభములో సత్యసేనరాజు అధీనములో నుండిన ఘటికాస్థానమును జయించినట్లు ఆ శాసనములో వ్రాసియున్నది. ఆ కాలములో ఒకరాజు ఇంకొక రాజ్యమును జయించినప్పుడు, ఆ రాజ్యమునేలు రాజుగారి బిరుదములను తాను తీసుకొనేటట్లు ఆ రాజు స్థాపించిన ఘటికాస్థానములను కూడా స్వాధీన పరచుకొనేవారు. వేలూరిపాళ్యము శాసనములో నరసింహవర్మ కాంచీపురములో నొక ఘటికాస్థానమును స్థాపించి కైలాసనాధాలయము కట్టించినాడని యున్నది.

ఒకప్పుడు కాంచీపురానికి రాజు లేకపోగా ఊరిలోని పెద్దలు పల్లవ రాజైన హిరణ్యవర్మ దగ్గరకు వెళ్ళి ఆయన కుమారుడైన పరమేశ్వర వర్మను కంచికి రాజుగా చేయవలసినదని కోరగా ఆయన అంగీకరించినాడట. ఆ రాయబారములోను తరువాత జరిగిన పట్టాభిషేకములోను, కాంచీపుర ఘటికాస్థానములోని మహాజనులు పాల్గొన్నారట. ఈ విషయము వైకుంఠనాధ పెరుమాళ్ళ ఆలయములోని శాసనము చెప్పుతున్నది. నందివర్మ కాలము క్రీ. శ. 710 — 715 అని చరిత్రకారులు నిర్ణయించినారు.

కంచి కైలాసనాధాలయములోని మహా మంటపమునకు పడమర నున్న స్తంభముపైనగల శాసనాలు విక్రమాదిత్య సత్యాశ్రయుని కాలము

(క్రీ. శ. 533 — 545) నాటిది. దీనివల్ల కాంచీపురంలోని ఘటికా స్థానము లోనివారి నా కాలంలో గౌరవపురస్సరంగా "మహాజనులు" అని వ్యవహరించే వారని తెలుస్తుంది.

ఘటికా స్థానములను నిర్మూలించిన వారిని, మహాజనులను హత్య చేసిన పాతకము చుట్టుకుంటుందని ఈ శాసనములలో వ్రాయబడినది.

ఈ ఘటికా స్థానములలో పందలకొలది విద్యార్థు లుండేవారు. అందులో ఉద్దండులైన వేదశాస్త్ర పండితులు ఆచార్యులుగా నుండేవారు. దేశదేశములనుంచి వచ్చిన పండితులనక్కడ పరీక్షించేవారు. అది అసదృశమైన పరీక్ష. వేదములలో నుండిగాని, శాస్త్రములలో నుండిగాని ఒక చిన్న వాక్యమును తాటియాకు మీద ఘంటముతో వ్రాసి, అటువంటి తాటియాకు ముక్కల నొక ఘటము [కుండ] లో పోసి కలగలిపి అందులోనుండి ఒకదానిని తీసియిస్తే పరీక్షకు వచ్చిన పండితుడు దాని పూర్వాపరములను చెప్పాలి. *

కాంచీపురము భారతదేశములో కాశీ మొదలైన ఏడు మహా పుణ్య క్షేత్రములతో సరిసమాన గౌరవము పొందినది. ఆ ఏడింటిలో మూడు శివక్షేత్రములు, మూడు విష్ణు క్షేత్రములు కాగా కంచి శివునికి, విష్ణునికి కూడా ప్రధాన క్షేత్రము. కాశి, ఉజ్జయిని, నవద్వీపము మొదలైన ఉత్తర భారత దేశ విద్యాకేంద్రములతో సరిసమాన గౌరవము పొందిన విద్యాకేంద్రము.

దేశము మ్లేచ్ఛాక్రాంతమైన తరువాత కూడా కాంచీపురము విద్యలకు నిలయముగనే యున్నది. ఆంధ్ర, మహారాష్ట్ర, కన్నడ, ద్రవిడ దేశములలో నుండి వేదశాస్త్రములుగాని, సంస్కృత సాహిత్యములు గాని అభ్యసించడానికి పందొమ్మిదవ శతాబ్దము వరకూ విద్యార్థులు కాంచీపురా

---

* శ్రీ కాంచి కామకోటి శంకరాచార్యులవారు చెప్పిన సంగతుల నుండి వ్రాసిన వ్యాసము. ఆంధ్రప్రభ 26—9—1965

పురానికి వెళుతూనే వున్నారు. అక్కడి పండితులు చెన్నపట్టణము మొదలైన నగరములలో కొంతకాలము ప్రముఖులుగా నుండేవారు. కంచిఇంటి పేరుగల మహాపండితుడైన రామానుజాచార్యులవారి దగ్గర చిన్నయ సూరి ( 1809 — 1862 ) విద్య నభ్యసించారు. 1818 సం॥లో జన్మించిన వేదము వెంకటరాయ శాస్త్రిగారు ( వెంకటరాయ శాస్త్రిగారి తండ్రి ) నెల్లూరు జిల్లాలోని తమ గ్రామము నుండి కంచి వెళ్ళి నివసించి వెంకటరాయశాస్త్రిగారి దగ్గర విద్య నభ్యసించినారు.

కాంచీపురములోనే గాక దక్షిణ దేశములో నింకా కొన్నిచోట్ల ఘటికాస్థానము లుండేవి. తెలుగుదేశములో కూడా కొన్ని ఘటికాస్థానము లున్నట్లు శాసనముల వల్ల తెలుస్తుంది. తూర్పు గోదావరి జిల్లాలోని సిక్కాల అగ్రహారములో అవిరామాణి అనేచోట తటాకం త్రవ్వుతుండగా విష్ణుకుండిన వంశమునకు చెందిన విక్రమేంద్రవర్మ క్రీ. శ. 525 నాటి తామ్రశాసనము బయల్పడినది. ఆ రాజు శాస్త్రసంప్రదాయానుసారముగా ఘటికాస్థాపనచేసి పుణ్యం సాధించినాడని అందులో వ్రాసి యున్నది.

ప్రాచీనాంధ్ర శాసనములలోను, కన్నడ శాసనములలోను, గ్రంథములలోను ఘటిక, ఘటికాస్థానము, ఘటశాసి, అనేపదము లున్నవి. ఘటికాశాల, ఘటశాసి అనేపదములు కూడా వున్నవి. ఘటికాస్థానముల చరిత్ర విస్మృతమైనందున పాశ్చాత్య పరిశోధకులు మొదట ఈ మాటలకు ఏవేవో అర్థములు చెప్పినారు. కొందరు మాత్రము ఇవి విద్యాలయములని అభిప్రాయమిచ్చినారు. Dr. Hultzch మాత్రము దీనిని దశాశాల అని అన్నాడు. కొంత చరిత్ర పరిశోధన జరిగిన తర్వాతదీనిని గూర్చిన శాసనములు కొన్ని ప్రకటింపబడిన తర్వాత సూర్యరాయాంధ్ర నిఘంటువులో ఘటిక విద్యాసంస్థయన్నారు. శబ్దరత్నాకరములో ఘటికాసి యనగా తార్కికుడను అర్థము వ్రాసినారు.

1930 సం॥ మార్చి నెల భారతిలో నిజాం రాజ్య ప్రభుత్వ శాఖ వారు ప్రకటించిన నాగాయి శాసనములను గూర్చి శ్రీ మల్లంపల్లి సోమ

శేఖర శర్మగారు సమీక్షిస్తూ ఘటికాస్థానములనుగూర్చి ఒక గొప్పవ్యాస
ము వ్రాసినారు ( పుట : 505 – 509 ). ఆ శాసనములను బట్టి
గుల్బర్గలోని వాడి రైలు జంక్షను సమీపమునగల చితాపూర్ రైలుస్టేషను
దగర నాగాయి అనే గ్రామము పూర్వము నాగవావి అని వ్యవహరింప
బడిన నాగవావి అనే సుప్రసిద్ధ విద్యాకేంద్రముగ నుండెనని, అక్కడ
11 – 12 శతాబ్దములలో గొప్ప ఘటికాస్థాన ముండెనని తెలుస్తున్నది.

పూర్వము కళ్యాణపురిని రాజధానిగా చేసికొని, ఆంధ్ర, మహారాష్ట్ర
కన్నడ ప్రాంతాల నేలిన పశ్చిమ చాళుక్య రాజవంశములో 1040 – 1068
మధ్య పాలించిన త్రైలోక్య మల్లరాజు 1076 – 1126 మధ్య పాలించిన
త్రిభువన మల్లరాజు, 1138 – 39 మొదలు 1149 వరకు పాలించిన
జగదేక మల్లరాజుల కాలమునాటి ఈ దాన శాసనముల
వలన వేయి "మత్తర్ల" భూమి విద్యాసంస్థయైన ఘటికాస్థానమునిమిత్తము
వినియోగింపబడినట్లు, అక్కడ ఘటికాస్థానము స్థాపింపబడినట్లును అం
దులో రెండువందల మంది వేదాధ్యాయులు, ఏబది యిద్దరు శాస్త్రాధ్యా
యులు నున్నట్లును, వారికి వేదశాస్త్రములు బోధించుటకు ముగ్గురు
శాస్త్రోపాధ్యాయులు, భట్టి దర్శన న్యాయప్రభాకర వ్యాఖ్యాతలు ముగ్గురు
వేదోపాధ్యాయులు ముగ్గురు సరస్వతీ భాండారికులు ఆరుగురు మొత్తము
267 మందికి అన్నవస్త్రములతో ఏర్పాటు జరిగినట్లు యున్నది.

దేవాలయ జీర్ణోద్ధారణకు, గంధాక్షత ధూప దీప నైవేద్యములకు
కూడా పైనచేర్చిన భూమిని వినియోగించ నేర్పాటు చేయబడెనని రెండవ
శాసనము వలన తెలుస్తున్నది.

నాలుగవ శాసనము త్రిభువన మల్లు విక్రమాదిత్యుని కాలంనాటిది
విద్యాలయమున నాలుగు వందలమంది విద్యార్థులున్నారని చెప్పినారు.
అధ్యయనము చేయు స్మృతులు, పురాణములు, సూత్రములు వివరించు
చున్నది. *

....o....

# 5. ప్రాచీన లిఖిత గ్రంథములు

రైళ్ళు, రవాణాలు, తపాలా, వార్తాపత్రికలు, ఆధునిక విశ్వవిద్యాలయ పీఠములు లేని కాలములో విజ్ఞాన మెలా వ్యాపించేదో తెలిసికోవడము అవసరము. పూర్వం రాజాధిరాజులు, వేదశాస్త్ర పండితులను, కవులను, గాయకులను, శిల్పులను, చతుష్షష్టి కళల నభ్యసించిన వారిని పోషించేవారు. ప్రతి ఆస్థానములోను ఆ యా శాస్త్రములందు విద్యలందు గడితేరిన విద్వాంసు లుండేవారు. గొప్పరాజుల ఆస్థానములో విద్యాధికారి ఉండేవారు. శ్రీనాథమహాకవి ఆ పదవిని అలంకరించాడు కదా! ఏ శాస్త్రమునైనా విద్యనైనా నభ్యసించుటకు కాశి, ఉజ్జయిని, నవద్వీపము, కాంచీపురము మొదలైన విద్యాకేంద్రము లందుగల ఉద్దండ పండితుల దగ్గర కొన్ని సంవత్సరములపాటు శుశ్రూషచేసి విద్యనేర్చి దేశములో వివిధ ప్రాంతములందు మహాపండితులు పరివేష్టించి యున్న ఘటికా స్థానములందు అసదృశమైన పరీక్షలనిచ్చి వారిచ్చిన జయపత్రములతో ఘటికులనిపించుకుని దేశములో వివిధ ప్రాంతముల నేలు రాజాధిరాజుల ఆస్థానములలోను గొప్ప బిరుదములు పొందియున్న విద్వాంసులతో వాగ్వాదముచేసి వీలైనచో వారి బిరుదములనులాగికొని లేదా వారితో సరిసమాను లనిపించుకొని ఆ మహారాజులిచ్చిన అగ్రహారములతో అసిధారావ్రతముగా జీవించుచు శిష్యులకు విద్యనేర్పుచు కాలము గడుపు ఉద్దండ పండితులు, కవులు, సంగీత, సాహిత్య, శిల్ప కళాకారులు దేశములో నుండేవారు.

శ్రీనాథ కవిసార్వభౌముడు, గౌడ డిండిమభట్టును వాగ్వాదము నందు ఓడించి ఆయన కంచుఢక్కను పగుల గొట్టించిన సంగతి ఆయన

చాటువులవల్ల తెలుస్తూనే యున్నవి కదా ?

మొన్నమొన్న 1936 సంవత్సరములో దివంగతులైన అయ్యల సోమయాజుల గణపతి శాస్త్రిగారు 1900 సంవత్సరములలో నవద్వీప పండిత సభలో పరీక్షలిచ్చి "కావ్యకంఠ" బిరుదును పొందినారు.

## తాళపత్ర గ్రంధాలు

పూర్వం అచ్చులేని కాలంలో ఎవరివద్దనైనా లిఖిత తాళపత్ర గ్రంథము లున్నట్లు తెలిస్తే వారి నాశ్రయించి ప్రతికలు వ్రాయించేవారు. ఈ సంగతి బ్రౌను సేకరించిన జాబులవల్ల తెలుస్తుంది. శ్రీమదు భయ వేదాంత ప్రవర్తకులైన శ్రీ పరవస్తు వేంకట రంగాచార్లు గారికి దాట్ల విజయరామరాజుగారు 1850 సం. ములో వ్రాసిన ఒకజాబును శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు గద్య చింతామణిలో ముద్రించినారు. (పుటలు 233 – 76)

"సాధారణ సంవత్సర జేష్ఠశుద్ధ 13 స్థిరవారం వరకు మద్దివల్సలో క్షేమము. అక్కడి యోగక్షేమములు వ్రాయించి పంపిస్తూ వుండవలెను. త॥ మీవద్దనున్న "బ్రహ్మవిద్యాభరణం" ప్రథమపాదంపుస్తకం వ్రాయించగలందులకు శ్రీ వేదమూర్తులైన శ్రీధరరామస్వామి శాస్త్రిగారితోనైనం మిమ్ములను అడిగివున్నాము. ఇప్పుడు ఆ పుస్తకం మద్దివల్సలో వ్రాయించుటకు సంపుటం తయారు చేయించడమైనది. లేఖరిన్నీ ఇక్కడే వుండ దమయినది. ఈ మనిషి మారీభతున సదరు పుస్తకం యిప్పిస్తే ఆ పుస్తకం యిక్కడ మేము వ్రాయించి తిరిగి మీ పుస్తకం జాగ్రత్తగా మీకు అందేలాగున మేము పంపిస్తున్నాము గనుక ముఖ్యంగా యీ మనిషిమార్పి

భత్తున ఇప్పించవలెను. శ్రీ వేదమూర్తులైన శ్రీ చెందుకూరి జానకిరామ శాస్త్రిగారుతో పైనం మీవద్ద తీసుకున్నా రసగంగాధరం సంచిక పదివత్ర ములు పంపించడమైనది. తరువాయి సంచికలు పంపించ ........... శాస్త్రిగారివద్దనున్న చిత్ర మీమాంస పుస్తకం మీరు చూడగలందులకు పంపించినాము గనుక ప్రవేశమయిన సంగతి వ్రాయించవలెను. అంతర్యా మునకు తేవలెను.

పైజాబువల్ల పత్రికలు వ్రాయుటలో పుస్తక యజమానులు పదేశి పత్రములు చొప్పున ఇచ్చేవారనికూడా తెలుస్తుంది.

భారతదేశంలో ఇతర ప్రాంతములలోనే ఆంధ్రదేశం పూర్వంలో కూడా వేదశాస్త్రములను కాపాడుతూ వచ్చినవారు బ్రాహ్మణులే. వారికి రాజులు ప్రభువులు అనేక విధాలుగా తోడ్పడినారు. అలా తోడ్పడినందు నందువలననే యీ సంస్కృతిని, భారత భారతిని కాపాడగలిగారు. కాపా డడమే కాదు తమ ఇష్టదైవములతో పాటు సరస్వతీ స్వరూపములైన గ్రంథములను పూజాపీఠములయందుంచి అర్చించారు. పురాణములు, శాస్త్ర ములు, కావ్యములు, మొదలైన గ్రంధములను ప్రతి సంవత్సరము సర స్వతీపూజలోను, వినాయకచవితినాడు పూజించడం సంప్రదాయం అనే సంగతి అందరకు తెలుసు. దేశంలో రాజకీయ కల్లోలాలు కలిగినా అగ్ని ప్రమాదాలు కలిగినా, చదస్తురుగులు దాధ కలిగినా ఎలాగో యీ గ్రంధ ములను తమ ప్రాణములతో బాటు దక్కించుకొంటూ వచ్చారు. సంస్కృ తంలోను దేశభాషలలోను లిఖింపబడిన తాళపత్ర గ్రంథాలు ప్రతికుటుం బంలోను వారసత్వముగా సంక్రమిస్తూ వచ్చినవి. ఈలాగా అనేక గ్రామా లలోను ముఖ్యంగా కాశీ, నవద్వీపం మొదలగుచోట్ల చదువుకొని వచ్చిన పండితుల ఇండ్లలో చిన్నచిన్న పుస్తక భాండాగారములే ఏర్పడినవి. ఇవి గాక దేశభాషలలో ప్రాకృత మహారాష్ట్రిలోను గాథాసప్తశతి నుండి నేటి వరకు చాలామంది కవులు రచించిన కావ్యములు చాటువులు, మొదలైన గ్రంధములు ఆయా కుటుంబములవారి ఇండ్లలోనేగాక, విజ్ఞానమనందుగల

అభిమానముతో పత్రికలు వ్రాసుకొని వెళ్ళినవారి ఇండ్లలోను ఉండేవి. •

బ్రాహ్మణులే గాక సాతానులని వ్యవహరింపబడుతున్న చాత్తాద వైష్ణవులు, వీరశైవమత ప్రవిష్టులైన జంగములు, మాలదాసరులు, మాదిగ దాసులున్నూ, ఆయా కాలలో శుభాశుభములు జరిగించుచూ గురువులుగా నుండినందున ఇతిహాస పురాణములు, కావ్యములు, కొన్ని శాస్త్రములు, తత్వగ్రంథములు మొదలైనవి పారంపర్యంగా కాపాడుతూ వచ్చినారు. శంకర మతములోను, రామానుజకూటములలోను, జంగమమఠములందు ప్రాచీన గ్రంథసంచయము లున్నవి. తూర్పుఇండియా వర్తక కంపెనీ వారికాలంలో తరువాతను ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునకు క్యూరేటరును ఏర్పరచినపుడు పైనచెప్పిన ప్రైవేటు గ్రంధాలయములనుండిన గ్రంథములకు జాబితాలు వ్రాయించినారు. ‡

విశాఖపట్టణంలోని పరవస్తువారి గ్రంధాలయము ఆంధ్రదేశములో ప్రఖ్యాతి వహించినది.

[ ఆంగీరసనామ సం॥ర ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక చూడుడు ]

మండపాక కామేశ్వరశాస్త్రి పార్వతీశ్వరశాస్త్రి గార్లవద్దను ఇంకా

---

• 1831 సం॥ డిశంబరు 15 వ తేదీన ఏనుగుల వీరాస్వామయ్యగారు మచిలీపట్నంలో జిల్లాజడ్జిగా నుండిన బ్రౌను దొరగారికి వ్రాసిన ఉత్తరంలో మచిలీపట్నంలో 1809 సం॥లో కీర్తిశేషులైన లంగరు పాపయ్యగారి భార్యాను, కొమాళ్ళను కలుసుకొని వారిదగ్గర వున్న స్కాందం అనే గ్రంధముయొక్క వివరాలను తెలుసుకొన్నామని వ్రాసినారు.

‡ [illegible] 18) [illegible]

నిడదవోలు సుందరం పంతులు మొదలైన పండితుల వద్దను, కవులవద్దను అనేక శాస్త్రగ్రంథములు కావ్యములు ఉండేవి.

1806 – 68 మధ్య చెన్నపట్టణ కాపురస్థులైన ఆంధ్రులు శ్రీ గాజుల లక్ష్మీనరుసు సెట్టిగారు అనేక సంస్కృతాంధ్ర గ్రంథములు సంపాదించి ఒక పెద్ద గ్రంథాలయమును అభివృద్ధి పరచినట్లును బహుజనపల్లి సీతారామాచార్యులుగారు శబ్దరత్నాకరము కొరకు చేసిన ఇరువది సంవత్సరములకృషిలో ఆ గ్రంథాలయము బాగా ఉపయోగపడినట్లును శబ్దరత్నాకరం పీఠికలో వ్రాసియున్నారు.

మహమ్మదీయ పరిపాలనా కాలంలో కొన్ని దేవాలయములతో బాటు గ్రంథాలయములు దగ్ధమైనవి. శాంతి భద్రతలు లేని అరాజక దినములలో కొన్ని నాశనమైనవి. ఆంగ్లేయ పరిపాలన స్థాపింపబడిన తరువాత భారత విజ్ఞానము సాహిత్యములోగల విశేషములను గమనింప గలిగిన కొందరు పాశ్చాత్య ఉద్యోగులు తమ దగ్గర పనిచేయు దేశీయులను పండితులను బుజ్జగించి వారికి కొన్ని లాభములనుకూడ కలుగజేసి ఆశ బెట్టి వారిద్వారా కొన్ని సంస్కృత గ్రంథములను తెనుగు మొదలైన దేశ భాషా గ్రంథములను సంపాదించి తమ దేశమునకు తీసుకొనిపోయిరి. అక్కడ వానిని గూర్చి పరిశోధనలుజేసి భాషాంతరీకరించి ప్రకటించుట వలన మన సంస్కృతినిగూర్చి సాహిత్యమునుగూర్చి పాశ్చాత్య లోకమునకు తెలిసినది. గొప్పగొప్ప పాశ్చాత్య విద్వాంసులు మన సాహిత్యమును పఠింపసాగిరి. ఈ సందర్భములో ఇంగ్లండులోను, జర్మనీలోను అమెరికా మొదలైన దేశములలో కూడా సంస్కృతగ్రంథ భాండాగారములు వెలసినవి.

•••○•

## మద్రాసు కాలేజిబోర్డు

మదరాసు రాజధానిలోను, బంగాళా రాజధానిలోను బొంబాయిలోను పనిచేయుటకు వచ్చిన ఇంగ్లీషుదొరలకోసం తూర్పు ఇండియా ప్రభుత్వం కళాశాలలను స్థాపించి ఆ దొరలకు తమ ఉద్యోగముల నెరవేర్చుటలో కావలసిన విషయములలో తర్ఫీదు నివ్వసాగిరి. మద్రాసు ఫోర్టుసెంట్ జార్జి కాలేజిబోర్డు 1 మే 1812 వ తేదీన ఏర్పడింది. ఈ కాలేజిబోర్డు కర్తవ్యములను నిర్ణయించారు.

1 వివిధ ఉద్యోగులకు అవసరమైన [ సివిలు సర్వీసులో ] తర్ఫీదు నివ్వడము, వారికి దేశభాషలను బోధించు మున్షీల నేర్పరచి వారిపైన అజామాయిషీ చేయడం.

2 1802 వ సంవత్సరము నుండి స్థాపింపబడిన వివిధ న్యాయస్థానములలో పనిచేయు హిందూ మహమ్మదీయ లా ఆఫీసర్లకు అవసరమైన బోధనము (Instruction) విషయంలో అజ్మాయిషీ చేయడం.

3 దేశభాషలలోను ఇంకా కొన్ని ప్రత్యేక విషయముల గూర్చిన్నీ గ్రంధములు ప్రకటించడము.

4 అందుకు సంబంధించిన కాలేజీ ముద్రాక్షరశాల పనిని గూర్చిన అజ్మాయిషీ చేయుట.

5 ప్రాచ్యదేశపు గ్రంధముల విక్రయమునకును లేక వాటిని ఎరువు ఇచ్చుటకును ఒక భాండాగారమును లేక డిపోను ఏర్పరచుట.

6 1817 సం॥లో స్థాపింపబడిన మద్రాసు లిటరరీ సొసైటీవారిమ్యూజియములో నున్నట్టిన్ని ఓరియంటల్ మాన్యుస్క్రిప్టును కాలేజీ వారికి ఇవ్వబడినయెడల వాటిని భద్రపరచుట.

1828 నవంబరులో కాలేజీబోర్డుతోబాటు దేశప్రజల విద్యాభివృద్ధి కొరకు ఒక కమిటి ఏర్పరచబడినది. ఈ కమిటీయు బోర్డును కలిసి ఒక బోర్డుగా కొంతకాలం పనిచేసినది. కాని 1836 లో విడదీయబడినది. 1854 జూలై లో కాలేజీ రద్దుచేయబడి ఉద్యోగులైన దొరలను పరీక్షించుటకు ఒక కమిటీ ఏర్పడినది. 1861 లో యీ ఎగ్జామినర్ల బోర్డును లైబ్రరీని సెంట్రల్ బుక్ డిపోను కలిపివేసిరి. 1862 లో కాలేజీహాలు భవనములు డైరక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రిక్షన్స్‌గారికి ట్రాన్సుఫర్ చేసిరి.

దొరల తరిఫీదుకు పరీక్షల విషయములో తరువాత కొన్ని మార్పులు జరిగినవి.

పైన చెప్పిన కాలేజీని స్థాపించగానే అక్కడ సంస్కృత పండితులకు తెలుగు అరవ భాషలను బోధించు పండితులను నియమించారు. తెలుగులోను అరవములోను కొన్ని పుస్తకములను ముద్రించడం ప్రారంభించారు. ప్రాచీన గ్రంథములను సేకరించి భద్రపరచడము ప్రారంభించారు. మద్రాసు లిటరరీ సొసైటీవారు సేకరించిన ప్రాచీన గ్రంథములను ఈ కాలేజీ గ్రంథాలయములో నుంచారు.

పైన చెప్పిన కాలేజీ బోర్డువారి ఆజ్ఞాయిషీక్రింద స్థాపించబడిన దొరల కాలేజీలో తెలుగు విద్వాంసులైన ఉదయగిరి వెంకట నారాయణ గారు హెడ్ ఇంగ్లీషు మాస్టరుగా నుండేవారు. వేదం పట్టాభిరామశాస్త్రిగారు ప్రధాన సంస్కృతాంధ్ర పండితులు. రావిపాటి గురుమూర్తిశాస్త్రి గారు సహాయాంధ్ర పండితులు. పట్టాభిరామశాస్త్రి గారి అనంతరము 1819 లో ప్రధాన పండితులైనారు.

ఈ కాలేజీబోర్డు అధ్యక్షులైన ఫ్రాన్సిస్ ఎల్లిసుదొర బహుభాషావేత్త. ఆయనకు తెనుగుపైన అభిమానము. మద్రాసు సివిలు సర్వీసు ఉద్యోగి కలెక్టరైన ఎడిక్యాంబెల్ తెలుగు అభ్యసించి 1816 సం॥ ప్రకటించిన వ్యాకరణమునకు ఎల్లిసు పీఠిక వ్రాశాడు. క్యాంబెల్‌గారి తెలుగు ఇంగ్లీషు నిఘంటువు 1820 లో రచించబడినది.

ఈ కాలేజీబోర్డును అంటి ఒక ముద్రాక్షరశాల ఒక పుస్తకాలదిపో వుండేవి. 1817 సం. న స్థాపించబడిన మద్రాస్ లిటరరీ సొసైటీ రాయల్ ఆసియాటిక్ సొసైటీ శాఖయైన విజ్ఞాన పరిశోధక సంఘము వారు సేకరించిన ప్రాచీన సంస్కృతాంధ్ర గ్రంథములు కాలేజి గ్రంథాలయములో నుంచారు.

మద్రాసు ఇంజనీరుగా పనిచేసిన కాలిన్ మెకంజీగారు 1796 సం॥ నుండి కావలి వెంకట బొర్రయ్య లక్ష్మయ్యగార్ల తోడ్పాటుతో తెనుగు దుమాసీలచేత అనేక తాళపత్ర గ్రంథములు సంపాదించి, కైఫీయతులు, శాసనప్రతులు మొదలైనవి వ్రాయించాడు. ఇతర భాషాప్రాంతాల సమాచారాలుకూడా తెలుగులోనే వ్రాయబడియున్నవి.

1821 సం॥ నాటికి మెకంజీదొర 1568 సంస్కృత గ్రంథములు తెలుగు కన్నడ తమిళ మహారాష్ట్ర భాషల గ్రంథములు, 2070 స్థానిక వార్తాపత్రికలు 6218 నాణెములు 2630 శిల్పములు సంపాదించినాడు. వీనిని కంపెనీ ప్రభుత్వము వారాయన భార్యదగర కొని 1828 సం॥లో కాలేజి లైబ్రరీలోనే యుంచిరి. 1817 సం॥లో మద్రాసు సివిలు సర్వీసుఉద్యోగిగా వచ్చిన సి. పి. బ్రౌనుదొర 1820 నుండి పంద్రెండేళ్ళు తెలుగుజిల్లాలలో కలెక్టరుగా పనిచేసి తెలుగు పండితుడై అనేక ప్రాచీన తాళపత్ర గ్రంథాలు సంపాదించి పండితులచేత పరిష్కరింపజేసి ప్రమాణప్రతులు తయారుచేయించాడు. అతడు సేకరించిన 2440 గ్రంథసముదాయము కూడా కాలేజి గ్రంథాలయములో నుంచాడు. బ్రౌనుదొర 1834 – 37 మధ్య ఇంగ్లాండుకు వెళ్ళినపుడు పూర్వము లేడెన్‌దొర సంపాదించిన 2106 సంస్కృతాంధ్ర గ్రంథములను చెన్నపట్నమునకు తెప్పించు ఏర్పాట్లుచేసి వానినికూడా కాలేజి గ్రంథాలయములోనే చేర్పించినాడు. ఈ ప్రకారము అభివృద్ధియైన ప్రాచీన గ్రంథసముదాయమే మద్రాసులోని ఓరియంటల్ లైబ్రరీగా రూపొందినది. దీనిని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమనిరి.

మెకంజీగారి ప్రాచీన లిఖిత గ్రంధములకు 1836 లో విలియం టెలరుదొర 570 పుటల క్యాటలాగు తయారుచేశారు. ఈ గ్రంధ సామాగ్రి చివికి పాడై పోతున్నదని సి. పి. బ్రౌను మంచి ఇంగ్లీషు కాగి తములపైన వీటికి ప్రతులు వ్రాయించినాడు. వీటికే లోకల్ రికార్డులు అను పేరు వచ్చినది. పైవిధముగ ఏర్పడి వృద్ధినొంది ఏర్పడిన ప్రాచ్యలిఖిత గ్రంధ భాండాగారము 1867 లో డి. పి. ఐ. గారికి ట్రాన్స్ ఫర్ చేయబడినది.

కేంద్రప్రభుత్వమువారు ప్రాచీన సంస్కృత గ్రంధములలో క్రొత్తగా బయల్పడిన వాటి విషయములోను వాతగ్రంధములను (రికార్డులను) కాపాడు విషయములోను కొన్ని ఉత్తర్వులు జారీచేసిరి. 1868లో పైనచెప్పిన ఉత్తర్వులనుగూర్చి చర్య తీసుకొనవలసినదని మద్రాసు ప్రభుత్వమువారు రాజధాని కళాశాల సంస్కృత ప్రొఫెసర్‌గారిని కోరిరి. అప్పట్లో ఒక దొరగారే ప్రొఫెసరు.

దేశంలోనే ప్రైవేటు వ్యక్తుల వద్దను సంస్థల వద్దను ఉన్న సంస్కృత లిఖిత గ్రంధములలో అచ్చుకానట్టిన్ని గ్రంధముల జాబితాలను తయారుచేసి ముద్రించే ఏర్పాటు చేయవలసిందని పైని చెప్పిన వివిధ వ్యక్తుల సంస్థల పుస్తక భాండాగారములను తనిఖీచేయించి సదరు జాబితాలను పరిశీలించి లోగడ బైటపడని గ్రంధములకొరకు అన్వేషణ చేయించి వాటిని కొనవలసినదని అపూర్వమైన పురాతన గ్రంధములను ఇతరవిధములుగా విలువగల గ్రంధములను సదరు గ్రంధములు కలవారు అమ్ముటకు అంగీకరించనిచో వాటికి ప్రతులను వ్రాయించుటకు లేఖరులను నియమించవలసినదని, పైన చెప్పిన పనులు జరిపించుటకు పర్యటనము చేయవలసినదని, యీ సందర్భములో చారిత్రికముగాను సాహిత్యరీత్యాను విలువగలట్టివని తనకుతోచిన దేశభాషలలోని [వర్నాక్యులర్] పురాతన గ్రంధములను కూడా అన్వేషించి సంపాదించవలసిందని పై సంస్కృత ప్రొఫెసరుగారిని ప్రభుత్వము ఆదేశించినది.

ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమును ప్రభుత్వమువారు 1869 లో రాజధాని కళాశాల సంస్కృత ప్రొఫెసరుగారి * ఆధీనములో నుంచిరి. అప్పటినుండి దానిని ఆయనే నిర్వహించుతూ వచ్చినారు. 1873 లో ప్రెసిడెన్సీ కాలేజి సంస్కృత ప్రొఫెసరుగారికి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార క్యూరేటరు పదవినిచ్చి నెలకు నూరురూపాయలు ఎలవెన్సుకూడా మంజూరు చేసిరి. [ గస్టవ్ ఆపర్టు Gustov Oppert Ph.D. 1872 —— —— 1893 సంస్కృత ప్రొఫెసరు ]

దేశములోని ప్రైవేటుభాండాగారములలోని సంస్కృతపుస్తకముల జాబితా ప్రకటించిరి. అందులో 8376 సంస్కృత లిఖిత గ్రంథములున్నట్లు కనబడుచున్నది. రెండవ సంపుటంలో 9వేల సంస్కృత గ్రంథములతో రెండవ సంపుటములో జాబితాయున్నది.

1873 నాటికి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము కట్టుదిట్టముగా జరుగుచుండెను. అనేకపండితులు గ్రామములలో పర్యటించి అనేక ప్రాచీనసంస్కృతాంధ్ర గ్రంథములు సంపాదించుట ప్రారంభించినారు. § మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునకు ట్రైయీనియల్ కేటలాగులు ప్రకటించినారు. దీనికితోడు తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరీలో అనేక సంస్కృతాంధ్రగ్రంథములు భద్రపరుపబడి యున్నవి. పాశ్చాత్యశోధకుల కృషివల్ల దక్షిణ భారతదేశ శాసనములు ప్రకటింపబడినవి. అందువల్ల మనచరిత్రకారులకు ఆంధ్ర కవి జీవితములను రచించుటకు ఆంధ్ర చరిత్ర రచించుటకు అవకాశము లేర్పడినవి.

§ [illegible]

* Professor. J. Pickford 1865 — 70

# 6. ఇంగ్లాండులో తెలుగు వీధిబడిపద్ధతి

పూర్వకాలంనుంచీ ఇప్పటికి రెండు మూడు తరాల క్రిందటివరకూ కూడా మనదేశంలో ప్రతిగ్రామంలోనూ, పట్టణాలలో ముఖ్యవీధులలోనూ వీధిబడులు వుండేవి. వీధిబడిల్లో ఒక బడిపంతులు చిన్నపిల్లలకు ఓనమాలు మొదలుకొని భారత భాగవతాల వరకూ పాఠాలుచెప్పి చదవడమూ, వ్రాయడమూ, లెక్కలు చెయ్యడమూ బోధించేవారు.

ఇప్పుడు పెద్దబాలశిక్షలో కనపడే విషయాలన్నీ ఆయన పిల్లలకు పాఠాలుగాచెప్పి వ్రాయించి కంఠస్థము చేయించి వాళ్ళచేత వప్పగించుకొనే వాడు. గుంట ఓనమాలు దిద్దించి యిసకలో వ్రాయించి అక్షరాలు కుదురుగా వ్రాయడం అలవాటు కాగానే పలకమీద బలపంతో వ్రాయడమూ గంటంతో తాటియాకులమీద మంచికత్తులో వ్రాయడమూ బాతు కలముతో కాగితముమీద మంచిదస్తూరీతో వ్రాయడమూ పిల్లలకు నేర్పేవాడు.

ఇలాగ వ్రాయించడంలోనూ, చదివించడంల్లోనూ భారత భాగవతాది ఉద్గ్రంధాలలోనుంచి ముఖ్యమైన ఘట్టాలను, ప్రధానంగా పఠాపర్వమూ సప్తమ స్కంధము మొదలైన వాటిలో నుండీ దాశరధీశతకము సుమతీ శతకము మొదలైన వాటిలోనుండీ పాఠాలుచెప్పి కంఠస్థముచేయించడంవల్ల పిల్లలకు మంచి భాషాజ్ఞానము, సాహిత్యమూ అలవడేవి. ఆ కాలంలో గ్రంధాలూ పత్రములూ వుత్తరములూ వ్రాతలోనే వుంటూ వున్నందువల్ల గొలుసుకట్టు దస్తూరీ చదివి వ్రాయడము కూడా బాగాఅలవాటు చేసేవారు.

ప్రారంభములోనే ప్రభవ విభవలు, మానములు, నోటిలెక్కలు, అనర్గళంగా వచ్చేటట్టు చేసినందువల్ల క్రమక్రమంగా ఎంతటిచిక్కులెక్కలైనా పిల్లలు అవలీలగా చేయగలిగేవారు.

ప్రతిదినమూ మధ్యాహ్నం రెండుగంటలవేళ పిల్లలు ఆ మర్నాడు చదవవలసిన పాఠాలను పంతులుగారి పుస్తకంలోనుంచి తమ పలకల మీదికి యెక్కించుకుని అది చదివి సరిచూపించుకుని యింటికి తీసికొనివెళ్ళి ఆ పాఠాన్ని కంఠసముచేసి మరునాడు పుదయం బడికిరాగానే దానిని పంతులుగారికి ఒప్పగించేవారు.

పాఠం ఒప్పగించే పిల్లలు పలకమీద వ్రాసుకున్న పాఠం పంతులుగారికి కనబడేటట్లు ఆ పలకను తమ బొమ్మకు ఆనించిపట్టుకుని పంతులుగారిదగ్గరకు ఒకరి తర్వాత ఒకరువెళ్ళి ఆ పాఠాన్ని ఒప్పగించేవారు.

"ఇలాగ పాఠాలను వ్రాసుకుని చదివి ఒప్పగించే పద్ధతివల్ల వ్రాయడములోను చదవడములోను మంచి ప్రావీణ్యము కలగడమేగాక జ్ఞాపకశక్తి అభివృద్ధి అయ్యేది. అంతేగాక తమ పూర్వులు రచించిన ఉత్తమ సాహిత్య గ్రంథాలను పఠించి అందులోని నీతిమతధర్మాలను లేతవయసులోనే మనస్సుకు నాటి - రికి విద్యాబుద్ధులు అలవడడానికి అవకాశం ఏర్పడేది. ఈ లాభాలన్నీ ఇంకొక పద్ధతిలో కలగడానికి అవకాశం కలుగుతుందని తోచదు" అని చెన్నపట్నం రాజధాని పరిపాలనను గురించి ఒక నివేదికను తయారుచేసిన పి. డి. మెక్లిన్‌గారు వ్రాశారు.

(Manual of the Administration of the Madras Presidency Vol. I PP 591 — 2. (1885)

## బడి పెద్దలు

పూర్వము వీధిబడులలో ఇప్పటిలాగ పిల్లలకు ఓనమాలు చెప్పే తరగతి మొదలుకొని పై తరగతులన్నింటికీ వేరువేరుగా పాఠాలు చెప్పే ఉపాధ్యాయులు ఉండేవారుకారు. ఓనమాలు మొదలుకొని పెద్దపాఠాల

వరకూ చదివేపిల్లలందరికీ కలిపి బడికంతా ఒక్కడే బడిపంతులుండేవాడు. ఈపిల్లలకు చదువు చెప్పడంలోనూ పాఠశాలను నిర్వహించటంలోనూ బడిపంతులు ఒక ఉపాయం అవలంబించేవాడు. తన దగ్గర చదువుకుంటూ వున్న పిల్లలలో త్వరగా పాఠాలను నేర్వగలిగిన చురుకైన పిల్లలనుకొందరిని యేరి, వాళ్ళచేత వాళ్ళు నేర్చుకున్న పాఠాలను తమ కిందతరగతి పిల్లలకు చెప్పించి తాను పైన జాగ్రత్తగా కనిపెట్టిచూస్తూ అప్పుడప్పుడు తానే పాఠాలను ఒప్పగించుకొంటూ వుండేవాడు. ఇలాగ ఉపాధ్యాయుడికిసహాయకత్వం వహించే తెలివితేటలుగల విద్యార్థులను "బడిపెద్ద" అనేవారు. "బడిపెద్ద"అనేమాటకు శబ్దరత్నాకరంలో ఈ అర్థమే నిర్వచింపబడివుంది. ఈపద్ధతివల్ల ఇప్పటిలాగ చాలాసొమ్ము ఖర్చుచేసి ఓనమాల తరగతి మొదలుకొని ఎనిమిదో తరగతి వరకూ ప్రతి తరగతికీ ఒక్కొక్క ఉపాధ్యాయుణ్ణి నియమించి పిల్లలకు పాఠాలు చెప్పించే అవసరం లేకుండానేపిల్లల సహాయంతోనే అనేక తరగతులుగల ఒక పెద్దపాఠశాలను సులభంగా నడపడానికి వీలయ్యేది. ఒక బడిపంతులుకు జీవనం జరగడానికిపూర్వపు. రాజులుగాని జమీందారులుగాని, ఒక్కొక్క గ్రామంలో ఏర్పాటు చేసిన ఈనాములు, వార్షికాలు, అనుభవిస్తూ బడిపంతులు గ్రామపాఠశాలలనునడిపేవాడు. శ్రీమంతుల పిల్లలు చదువు పూర్తిచేసి వెళ్ళేటప్పుడిచ్చే గురుదక్షిణలు, బీదవారి పిలలిచ్చే ఆటవిడుపు డబ్బులు, బడిపంతులుగారికి అదనపు ఆదాయంగా వుండేవి. అనేక గ్రామపాఠశాలలను ఆగ్రామస్థులే పోషించేవారు. మన వీధిబడులు ఇలాగ అవిచ్ఛిన్నంగా జరుగుతూ జనసామాన్యానికి అందుబాటులో వుండేవి.

## మనదేశంలో ఇంగ్లీషు విద్యావిధానం

హిందూదేశంలో వివిధప్రాంతాలు ఇంగ్లీషువారి వశమయ్యేనాటికి ఆ ప్రాంతాలన్నింటిలోనూ పైనచెప్పిన చౌకబారు దేశీయవిద్యావిధానం

అమలు జరుగుతూ వుండేది. * ఇంగ్లీషు ప్రభుత్వంవారు చాలా కాలంవరకూ దేశీయులవిద్యను గురించి శ్రద్ధతీసుకోవడం తమపని కాదని ఉపేక్షించారు. పూర్వపు గ్రామపంచాయితీల అధికారం తీసివేసి ఇంగ్లీషు కలెక్టర్ల పరిపాలన స్థాపించడంవల్లను పూర్వము బడిపంతుళ్ళకుండే ఈనాములు వార్షికములు పోయినందువల్లను గ్రామాలలోవుండే పాఠశాలలు, వీధిబడులూ ప్రభుత్వాదరణములేక పాడై పోయినవి. బడిపంతుళ్ళ జీవనాలు జరుగక గ్రామాలు విడిచిపోవడంవల్ల చాలా పాఠశాలలు నశించాయి. ఇలాగు వుండగా ఆఖరికి ఇంగ్లీషువారీ దేశములో తొలుత విద్యాభివృద్ధి చెయ్యడానికి పూనుకున్నారు. అయితే పూర్వకాలపు వీధిబడిచదువులను ప్రోత్సహించక ఇంగ్లీషుభాషనూ, పాశ్చాత్యవిజ్ఞానమునూ బోధించే కొత్త పాఠశాలలను స్థాపించడానికి నిశ్చయించారు. ఈ నిరయం 1835 లో జరిగింది. ఇది జరిగి చాలాకాలం అయినా దేశప్రజలలో ఎక్కువ విద్యాభివృద్ధి కలగలేదు, అంతేకాదు దేశంలో వీధిబడిచదువులుండే కాలంలో వుండ్డపాటి అక్షరజ్ఞానంకూడా యిప్పుడులేదు. దీనికికారణం ఇంగ్లీషువారు కొత్తగా స్థాపించదలచిన విద్యావిధానం చాలాధనవ్యయకారణం కావడమూ, అందువల్ల ప్రజలందరికీ విద్య సులభసాధ్యంకాకపోవడమూను. ఈ కొత్త పాఠశాలలు స్థాపించడానికి వాటిబల్లలకూ, కుర్చీలకూ, కట్టడాలకూ, అందులో చదువుచెప్పే బడిపంతుళ్ళకూ, వారిపైన అజమాయిషీచేసే ఇనస్పెక్టర్లకు చాలాసొమ్ము ఖర్చుఅవుతూ వున్నందువల్ల దేశంలో ఎక్కువగా పాఠశాలలు స్థాపించడానికి వీలుపడలేదు.

---

చెన్నపట్నంలోని వీధిబడి పంతుళ్ళందరూ ఉత్తరాది జిల్లాలనుండ వచ్చిన తెలుగువారేనని 1820 సం॥లో మద్రాసు స్కూలుబుక్కు సొసైటీ సెక్రటరీకి సదర్ అదాలతు కోర్టు ఇంటర్ ప్రిటర్ వెన్నెలకంటి సుబ్బారావుగారు ఆ కాలమునాటి విద్యను గురించి వ్రాసిన లేఖలో నున్నది.

స్థాపించిన పాఠశాలలో బీదవారి పిల్లలు చదువుకోవడానికి సౌకర్యాలులేవు. అందువల్ల ఈ ఇంగ్లీషు విద్యావిధానంవల్ల దేశంలో విద్యాభివృద్ధి కలుగ లేదు. అక్షరజ్ఞానమైనా అభివృద్ధికాలేదు.

## చెన్నపట్నం కోటలో తెలుగు వీధిబడి పద్ధతి

మన వీధిబడిపద్ధతులలో వుండే విశేషాలను లాభాలనూ మన ఇంగ్లీషు ప్రభువులు గ్రహించక పోలేదు. ఈ పద్ధతివల్ల ఎక్కువఖర్చు లేకుండా పాఠశాల నడిపి బీదవాళ్ళకు ఉపకారం చెయ్యవచ్చుననే సంగతి ఇంగ్లీషు వర్తకకంపెనీవారు త్వరలోనే గ్రహించారు. చెన్నపట్నం కోటలో తల్లిదండ్రులులేని ఇంగ్లీషు పిల్లలకోసం చాలాకాలం క్రిందటనే స్థాపించిన శరణాలయం పాఠశాలలో దేశీయ పద్ధతినే వారు అవలంబించారు. ఆ పాఠశాలలో ఒక ఇంగ్లీషు ఉపాధ్యాయుణ్ని నియమించి ఆయనకు సహాయంగా ఆ పాఠశాలలోని తెలివితేటలుగల పిల్లలచేతనే కింది తరగతుల పిల్లలకు పాఠాలు చెప్పేపద్ధతిని స్థాపించారు. ఇలాగ ఆ ఉపాధ్యాయునికి సహాయంచేసే బడిపెద్దలను ఇంగ్లీషులో మానిటర్స్ **(Monitors)** అనేవారు.

ఈ అనాధశరణాలయానికి 1789 మొదల్కు 1797 వరకూ అధిపతిగా వుండి సీమకు తిరిగి వెళ్ళిన ఆండ్రూ బెల్ అనే స్కాట్లాండ్ దేశీయుడు ఇక్కడ చెన్నపట్నంలో తెలుగు వీధిబడిపద్ధతుల ప్రకారం చౌకగా పాఠశాలను నడిపేపద్ధతిలోని లాభాలను బాగాగ్రహించి ఇంగ్లాండులో అప్పట్లో విద్యావిషయంలో చాలా వెనుకబడియున్న బీదవారి పిల్లలకోసం ఇలాంటి చౌకబారు పాఠశాలలను స్థాపిస్తే ఆ దేశంలో జనసామాన్యానికి విద్యసులభసాధ్యం అవుతుందని ఒక కరపత్రాన్ని ప్రకటించి బాగా ప్రచారం చేశాడు.

## ఇంగ్లాండులో బడిపెద్దల విధానం

ఇంగ్లాండులోని కొందరు ధర్మాత్ములూ, అధికారులూ బెల్‌గారు చెన్నపట్నంలో అనుభవంమీద చేసిన సూచనలలోని స్వారస్యాన్ని గ్రహించి ఆ పద్ధతుల ప్రకారము విద్యాభివృద్ధి చేయదలచి అలాంటిపాఠశాలలను స్థాపించవలసినదని బెల్‌గారినే 1811 లో నియమించారు.

ఆ ప్రకారం కొన్ని పాఠశాలలను స్థాపించగా ఈ చాకబారు విద్యావిధానంయొక్క లాభాలనుచూచి ఇతరులుకూడా అలాంటి పాఠశాలల్ను స్థాపించారు. ఈ పద్ధతి ఇంగ్లాండులో బాగా వ్యాపించి అక్కడ జనసామాన్యంలో విద్యను అభివృద్ధి చెయ్యడానికి బాగా తోడ్పడింది. ఈ విద్యావిధానానికి [చెన్నపట్నం విధానం] మద్రాసుసిస్టం అనిన్నీ, బెల్సిస్టం అనిన్నీ పేరు వచ్చింది. ఈ పాఠశాలలో చదువుచెప్పే ఉపాధ్యాయులకు సహాయకారులుగా వుండే బడిపెద్దలనే విద్యార్థులకు ఇంగ్లీషులో మానిటర్లు అన్నందు వల్లనే దీనికి "మానిటోరియల్ సిస్టం" అనికూడా పేరు వచ్చింది. Memories of Madras By Sir Charles Lawson pp 2?-ff) * ఇలాగ బడిపెద్దల సహాయంతో ఒక ఉపాధ్యాయుడు నిర్వహించే చాకబారు విద్యావిధానం మనదేశంలో నుంచి ఇంగ్లాండు దేశానికి కూడా వ్యాపించి అక్కడి ప్రజలకు చాలా ఉపకరించగా ఈ పెరటిచెట్టు మనదేశంలో మందుకు పనికిరాలేదు. "మ్రింగమెతుకు లేదు మీసాలకు సంపంగినూనె" యనేటట్లు ఈ బీదదేశానికి పెద్దపెద్ద జీతాల జిల్లావిద్యాధికారులు ఇనస్పెక్టర్లూ, వారి అజమాయిషీక్రింద కుర్చీలుబల్లలుగల బిల్డిం

---

* చెన్నపట్నంనుండి ఇంగ్లాడు తీసుకొని వెళ్ళి ప్రవేశపెట్టిన విద్యావిధానము నిజానికి తెలుగువారి వీధిబడి చదువుల పద్ధతే. దానిని ఆంధ్ర విద్యావిధాన మనడమే న్యాయం.

గున్నూ, ఓనమాల తరగతి నుంచి ఎనిమిదో తరగతి వరకూ పిల్లలుభరించ లేనన్ని పుస్తకాలూ, ఆ పాఠాలు చెప్పడానికి వేరువేరు ఉపాధ్యాయుల్లూ గలిగి అత్యధిక వ్యయానికి కారణమైన ఇంగ్లీషు విద్యావిధానం కావలసి వచ్చింది ।

# 7. వర్తక వ్యాపారాలు - సంతలు

ఇప్పటివలె గూడ్సు రైలుబళ్ళు, మోటారు లారీలు రాకపోక రవాణా మార్గాలు లేనికాలములో మనదేశములో వర్తక వ్యాపార్లాలెలా జరిగేవో తెలిసికొనవలెనను కుతూహలము కలగడం సహజము.

మన పురాణేతిహాసాలలో వర్తక వ్యాపారాలను గూర్చిన ప్రశంసలున్నవి. నలమహారాజు తన రాజ్యం వదలి దమయంతితో కొంత దూరం ప్రయాణము చేసిన తరువాత నాలుగు దిక్కులకు పోతూవున్న మార్గాలను గురించి ఆమెకు చెపుతాడు. దమయంతికి వర్తకుల బిడారు కనపడుతుంది. మన కథాసరిత్సాగరం కథలలో ప్రాచీనమైన బౌద్ధగ్రంథాలలో ఇతర గ్రంధాలలోకూడా వర్తక వ్యాపారాల సంగతి వున్నది. ఆ నాడు సరుకులు రవాణాచేసే బిడారులను గురించి, రాజాధిరాజుల రాజధానులలో ప్రజలనిత్యావసరాలకుసంబంధించిన సరకులేగాక, భోగద్రవ్యాలు దేశదేశాంతరాలనుంచి వచ్చేసరకులు, అపూర్వ వస్తువులుఅమ్మే అంగళ్ళ బజారులనుగురించీ రేవు పట్టణములలో దేశాంతరవాసులతో వ్యాపారం చేసే ఓడ వర్తకులను గురించి వర్ణనలున్నవి.

ఈ గ్రంధాలలోని వర్ణనలు కవుల కల్పనలని త్రోసివెయ్యడానికి వీలులేదు. పూర్వంనుండి మనదేశానికివచ్చిన బౌద్ధయాత్రికులు పాశ్చాత్య

దేశాలనుండి వచ్చిన యవన పారసీక ఐరోపా దేశీయులుకూడా మన దేశములో తయారయ్యే అపూర్వ వస్త్రములు, ఇతర వస్తువులు మొదలైన వానిని గురించి ఇక్కడ జరిగే వ్యాపారమును గురించీ సంతలను గురించీ వీరి గ్రంథాలలో వర్ణించియున్నారు. రాజాధిరాజుల రాజధానులలోనే గాక కాశీ మొదలైన గొప్ప పుణ్యక్షేత్రాలు, మత ధర్మములకు విద్యలకు కేంద్రములేగాక వర్తక వ్యాపారములకు, పరిశ్రమలకు కేంద్రస్థానములుగా నుండేవి. కాశీ పట్టుపీతాంబరాలు, జిలుగువలువలు చీని చీనాంబరాలు, అపూర్వ వస్తుజాలములను గూర్చి అనేక చరిత్రాధారములున్నవి.

పుణ్యక్షేత్రాలలో గాక అక్కడక్కడ జరిగే ఉత్సవాలలో జాతరలలో తీర్థాలలో తాత్కాలికంగా అనేక అంగళ్ళు పరిశ్రమలు వినోదములు గల సంతలు జరిగేవి. ఇంతేగాక కొన్నికొన్ని గ్రామకేంద్రాలలోకూడా సంతలు జరిగేవి. ఆ కాలంనాటి గ్రామపంచాయతీలలోని పెత్తనదారులే ఈ సంతలను చక్కగా నిర్వహించేవారు. ఈ కాలమునాటి ఎగ్జిబిషనులను వస్తు ప్రదర్శనములకు ఆనాటి సంతలెంతమాత్రము తీసికట్టు కాదనటము అతిశయోక్తికాదు.

ఆ సంతలు ఏ చెరువుగట్టునగల విశాల మైదానములోనో జరిగేవి. అక్కడ తాత్కాలికముగా తాటియాకు పందిళ్లు పాకలువేసేవారు. వీధులు బారుబతీరి యుండేవి. ఒక్కొక్క శ్రేణిలో ఒక్కొక్కరకము సరకులు వస్తువులు అమ్మే అంగళ్లు పెట్టేవారు. కమ్మరులు, కంచరులు ,వడ్రంగులు మొదలైన కులవృత్తులవారు తమతమ కులవృత్తులకు సంబంధించిన కార్ఖానాలను నెలకొల్పి ఆయా పరిశ్రమలు చేసేవారు. రకరకముల, ధాన్యములు, సరకులు, వస్త్రములు, అలంకారములకు, భోగవిలాసములకు సంబంధించిన వస్తువులు, గృహోపకరణములు, పాత్రసామాను, కొయ్యసామాను, ఒకటేమిటి, ప్రజల కుపయోగించే సమస్తమైన ద్రవ్యములు, సరకులు, వస్తువులు, అంగళ్ళలోపెట్టి అమ్మేవారు. పశువులు, మేకలు, మొదలైన జంతువులనుతెచ్చి అమ్మేవారు. ఈ సంతలు జరిగే ప్రదే

శానికి వీధిభాగవతులు, దొమ్మరివాళ్లు, భోగపుమేళములుకూడావచ్చి తమ తమ విద్యలను ప్రదర్శించేవారు.

సంతలుజరిగే ప్రదేశమును బాగుచెయ్యడానికి "సంతకనవి" మాన్యాలని ఆనాటి ప్రభువు లిచ్చేవారు. ఏడువారాలలో వివిధ కేంద్రాలలో జరిగే సంతలకు వర్తకులు ఒకచోటినుండి ఇంకొక చోటికి తమసరకులు తీసుకొని పోవుటవల్ల లాభకరంగా నుండేది.

రైళ్ళు లారీలు గాని సరియైన రోడ్లుగాని లేనికాలంలో ఈ సరుకులన్నీ నలుప్రక్కలనుంచీ, ఎలా వచ్చేవి ? ఆ కాలంలో వందలకొలదీ ఎడ్లపైన కంచర గాడిదల పైన రెండుప్రక్కలకు వ్రేలాడునట్లుగా కట్టిన గోనె సంచులలో ధాన్యములు, అపరములు, వివిధములైన సరకులువేసి తోలుకొని వచ్చేవారు. ఈ సంచులను కంట్లములని పెరికెలని అసిమి సంచులని అనేవారు, పెరికెలలో సరకులు రవాణాచేసే బలిజవారిని పెరికెబలిజీలనేవారు, రాజస్థానమునుండి వచ్చిన లంబాడీలనే కులాలవాళ్ళు కూడా మనదేశంలో వివిధ ప్రాంతాలలో ఈ రవాణా వ్యాపారంచేసేవారు. వీరిని ఆయా ప్రాంతాలలో బ్రింజారీలనీ సుగాలీలనీ వ్యవహరించేవారు.

ఆంధ్రదేశంలో అనేక ప్రదేశాలలో సంతలు జరిగేవి కొన్నికొన్ని సంతలు ప్రత్యేక సరకులుగాని పశువులుగాని అమ్మే సంతలు. కేయూరబాహుచరిత్రలో నూనె సంతలో ఏడుమానికల బియ్యానికి ఒక మానిక నూనె నిచ్చేవారని కవి వ్రాశాడు. ప్రతాపరుద్రమహారాజు కాలంలో ఆంధ్రనగరమైన ఓరుగల్లులో మడిసంతలు మైల సంతలు వర్ణింపబడినవి. శుకసప్తతిలోను హంసవింశతిలోను సంతలు పేర్కొనబడినవి.

"అసిమిలోదొకటి అమ్మేదొకటి" అనేనానుడిసంతలో జరిగేవ్యాపారము ను గూర్చినదే.

పూర్వము కొన్ని శతాబ్దములనుండి నేటి పశ్చిమ గోదావరి జిల్లాలో చేరిన పాలకొల్లు గ్రామంలో ప్రతి శనివారము గొప్ప సంత జరిగేది. అక్కడికి దూరప్రాంతాలనుండి కూడా పారిశ్రామికులు, వర్తకులు వచ్చేవారు. అనేక సరుకులు విక్రయించేవారు. 16-18 శతాబ్దాలనాటికి ఉత్తర సర్కారులలోని ప్రాంతాలు అన్నీ గోల్కొండ నవాబుగారి వల్లను 1687 సం॥ తరువాత మొగలాయి రాజ ప్రతినిధి అయిన దక్కను సుబేదారు, లేక నిజామువల్లను సన్నదులు పొందిన జమిందారులు పరిపాలించేవారు.

పాలకొల్లు ప్రాంతం మొగలితుర్రు సంస్థానములో చేరిన గ్రామం. ఒలాందా దేశపు డచ్చి జాతివారు మొదట మొగలితుర్రు జమీందారుగారికి సాలుకు రెండువేలు వరహాలిచ్చే పద్ధతిని గ్రామం కౌలుకు పుచ్చుకున్నారు. తరువాత గోల్కొండ సుల్తానుగారిని ఆశ్రయించగా ఆయన శిస్తులులేకుండా ఆ గ్రామాన్ని వారికి యిచ్చారు. మొగలితుర్రు రాజాగారు తక్కిన జమిందారుల వలెనే తమ సంస్థానములోని గ్రామాలలో భూమి శిస్తు వసూలు చేయడమేగాక అక్కడ జరిగే వ్యాపారముపైన సుంకములు, పన్నులు, వివిధ వృత్తులపైన రుసుములు వసూలుచేసేవారు. పూర్వం పాలకొల్లు సంతకువచ్చే సరుకులపైనగూడా సుంకాలు, పన్నులు వసూలుచేసేవారు. డచ్చివారుకూడా ఆ అధికారమును చెలాయించసాగినారు. డచ్చి జాతివారు పాలకొల్లులో మూడువందల నీలితొట్టెలు పెట్టి బట్టలకు రంగువేసి ఎగుమతి వ్యాపారం చేసేవారు. నర్సాపురంలో ఇనుపకొలుములు పెట్టి ఇనుము, ఉక్కు తయారు చేయించేవారు. అక్కడ మూడువందల కమ్మరి పనివారు పనిచేసేవారు. ఇదిగాక డచ్చివారు బియ్యం వగయిరా సరుకులలోకూడా భారీ వ్యాపారం చేసేవారు. వారు జావా ద్వీపంనుంచి బత్తాయి నారింజ పంపరపనాస అంట్లు తెచ్చి యిక్కడ పాలకొల్లు, నర్సాపురం ప్రాంతాలలో తోటలు వేశారు. అరటి తోటలుకూడా పెంచారు. డచ్చి జాతివారు మన

దేశీయులతో కలిసి మెలిసి యుండేవారు. 1678 సం॥లో మద్రాసులోని ఇంగ్లీషు కంపెనీ ఏజెంటు తూర్పు కోస్తాలో బందరు వగయిరా ఫ్యాక్టరీలు తనిఖీచేస్తూ పాలకొల్లు, నర్సాపురంలో డచ్చివారి ఫ్యాక్టరీలు చూసి చక్కగా వర్ణించాడు.

పాలకొల్లు డచ్చివారి స్వాధీనంలో ఉన్నందువల్ల అక్కడ జరిగే సంతను వారే నిర్వహించేవారు. ఈ స్థితిలో 1766 సం॥లో ఇంగ్లీషువారు హైదరాబాదు నవాబు నిజామాలీఖానువల్ల ఉత్తర సర్కార్లు కౌలు పొంది యీ ప్రాంతాలకు ప్రభువులై జమిందారులవల్ల పేష్కసు వసూలుచేయ సాగినారు. డచ్చివారు ఇంగ్లీషువారికి స్వల్పమైన క్విట్టు రెంటు (విడుదల పన్ను) చెల్లించేవారు. అప్పట్లో ఇంగ్లీషు కంపెనీవారికి బందరు ముఖ్యః ట్టణము, లేక ప్రావెన్షియల్ రాజధాని నగరము. అక్కడ వారి చీఫ్ అయన సలహా సంఘము (chief in council) వ్యాపారముతో పాటు యీ ప్రాంతాల పరిపాలనకూడా జరిగించేవారు. జమీందారులవల్ల పేష్కసు వసూలుచేసేవారు. అప్పట్లో మొగలితుర్రు రాజాగారు కలిదిండి తిరుపతి రాజుగారు. ఇంగ్లీషు కంపెనీ దొర క్లార్లియరు సంస్థానంలో చేస్తూ యున్న స్వంత వ్యాపారముపైన, అతని సరుకులపైన సుంకములుచెల్లించా లని రాజాగారు కోరగా అతనికి కోపమువచ్చి ఆయనపై పగబట్టి బందరు చీఫ్- ముఖ్య అధికారికి పితూరీలు చెప్పి యీ జమీందారుగారు యితర జమీందారులు చెల్లించవలసిన పేష్కసుకుకూడా పూచీపడి బాకీ ఉన్నారని చెప్పి జమీందారీని 1786 సం॥లో జప్తుచేయించినాడు. జమీందారీని మేనేజి మెంటు చేయుటకు ఇంగ్లీషు కలెక్టరును నియమించి శిస్తులు, పన్నులు, వగయిరా వసూలు పని అతనికి ఒప్పగించారు. వసూలయిన సొమ్ములో ఖర్చులుపోను కొద్దిసొమ్ము బాకీ కింద జమకట్టే నాటకము ప్రారంభించారు. జమీందారుగారు 1791లో చనిపోగా ఆ సంస్థానము కంపెనీ రాజ్యంలో కలుపుకొన్నారు.

పైన చెప్పిన సందర్భములో జమీందారీలోని వివిధ పరగణాలలో సుంకములు వసూలుచేసే ఇజారాను ఇంగ్లీషు కలెక్టరు వేలం పాటగా పాటదారులే సుంకములు, పన్నులు వసూలుచేయుటం ప్రారంభమయినది. 1788 సం॥లో ఆచంట, అత్తిలి పరగణాలలో సుంకములు వసూలు ఇజారా పొందిన వేమూరి కృష్ణమ్మ పాలకొల్లు సంతకు వస్తూ యున్న వర్తకుల సరుకులపైనకూడా సుంకములు వసూలు చేయటం ప్రారంభించగా డచ్చి వర్తకులు అతనిని ఆటంక పరచినారు. అతడు వారిపైన మొగలితుర్రులోని ఇంగ్లీషు కలెక్టరుకు ఫిర్యాదు చేశాడు. ఈ సంగతి పాలకొల్లు డచ్చి వర్తకులకు తెలిసి వారు ఈ కృష్ణమ్మ చాలా అక్రమాలు చేస్తున్నాడని, వర్తకులను బాధిస్తున్నాడని, పాలకొల్లులో సంత జరుగనివ్వనని బాహాటంగా ప్రకటిస్తున్నాడని, అంతటితో తృప్తిచెందక తన గుమాస్తాను పాలకొల్లు గ్రామానికి పంపి అక్కడికి శనివారము సంత నిమిత్తము వచ్చియున్న వర్తకులను వెళ్ళిపోవలసినదని నిర్బంధించటము ప్రారంభించినాడని, ఆ బ్రాహ్మణ గుమాస్తాను పట్టుకొని నలుగురు బంట్రోతుల కావలాతో తమవద్దకు పంపిస్తున్నామని, న్యాయం జరిపించవలసినదని మొగలితుర్రు కలెక్టరుకు డచ్చివారు ఉత్తరం వ్రాసి పంపించారు. ఈ డచ్చివారు తమకు పాలకొల్లు గ్రామములో గల స్వల్పమైన హక్కులను పురస్కరించుకొని హెచ్చు అధికారం చలాయించడానికి ప్రయత్నిస్తున్నారని కలెక్టరు మచిలీ బందరులోని చీఫ్ ఇన్ కౌన్సిల్‌గారికి ఉత్తరంలో వివరములన్నీ వ్రాసినాడు. (గోదావరిజిల్లా మాన్యూలు పుటలు 204, 205) ఈ రికార్డునల్ల ఆ కాలంలో ఇంగ్లీషు వారు ప్రయోగించిన రాజ్య తంత్రము, దేశ పరిస్థితులు తెలుస్తున్నవి.

ఉత్తర సర్కారుల స్థితిగతులను గురించి విచారించడానికి మద్రాసులోని ఇంగ్లీషు కంపెనీ ప్రభుత్వము నియమించిన సర్క్యూటు కమిటీవారు మచిలీపట్నం క్రిందనున్న జమీందారీలనుగురించి విచారించి 1787 సం॥లో రిపోర్టు వ్రాస్తూ పాలకొల్లు గ్రామం యింకా డచ్చివారిక్రిందనే ఉన్నదని

అక్కడనుంచి ప్రతిసాలుకు 12 మొదలు 24 పుంజముల తెల్ల లాంగ్‌క్లాత్ 400 బేళ్లు ఎగుమతి చేస్తున్నారని, ఇదికాక రంగుల అద్దకాల ఛాయబట్టలు, చీటిగుడ్డలులోకూడా వ్యాపారము చేస్తున్నారని, పిఠాపురం జమీందారీలో చేరిన కాకినాడ దగ్గరనున్న జగన్నాధపురమును, గొల్లపాలెము, గుండ వరము గ్రామమును డచ్చివారి స్వాధీనములో ఉన్నవని, జగన్నాధపురం ఫ్యాక్టరీకి డచ్చివారు ప్రతిసాలున లక్ష వరహాలు తీసుకువస్తారని, అందులో కొంత బంగారముగాను, కొంత సరుకులుగాను ఉంటుందని, 40,000 వరహాలు చిరిపేరు వగైరాలతో చాయవేపే బట్టల క్రిందను 6,000 వరహాలు జగన్నాధపురంలోను, పాలకొల్లులోను తెల్ల లాంగ్‌క్లాత్ బట్ట క్రిందను వినియోగిస్తారని వ్రాశారు.

ఈ డచ్చి వర్తకులు చాలాకాలంనుంచి కాకినాడ ఏటిదగ్గఱ వర్తక సరుకులపైన మాటకి ఐదువంతులు దిగుమతి పన్ను, మాటకి మూడు వంతులు ఎగుమతి సుంకము వసూలు చేస్తున్నారని, యీ సుంకముల వసూలు హక్కు వారికెలా వచ్చినదో తెలియుటంలేదని, కాకినాడ ఏటికి ఒకవైపునగల జగన్నాధపురం ఒడ్డుమాత్రమే వారికి హక్కుగల స్థలంగా ఉన్నదని కాకినాడలో జరిగే వ్యాపారముపైన పిఠాపురం జమీందారుగారు పూర్వకాలంనుంచి సుంకములు (Land Customs) వసూలు చేస్తూ యుండగా ఈ డచ్చివారుకూడా సుంకములు వసూలుచేయడము అశాస్త్రీయ మని సర్క్యూట్ కమిటీవారు వ్రాశారు. [గోదావరిజిల్లా మాన్యూలు పుటలు 203, 204).

మన దేశములో వర్తకము చేయడానికి వచ్చిన ఇంగ్లీషు కంపెనీ వారు దేశము నాక్రమించి ప్రభువులైన తరువాత తమ దేశానికి అమిత ధనము తరలించుకొని వెళ్ళినారు. చాలా లాభాలు ఆర్జించినారు. ఆ ధనముతో తమ దేశంలో యంత్రపరిశ్రమలు స్థాపించుకొన్నారు. ఆ

యంత్రాల పైన తయారయిన సరుకులు మన దేశములో అమ్మి, లాభం పొందడానికి ప్రయత్నించారు. ఐతే అవని సులభముగా సాగలేదు.

ఈ వర్తక కంపెనీవారికి ఇంగ్లండు పార్లమెంటువారు 1818 సంవత్సరంలో మళ్ళీ ఇరవై సంవత్సరాలుపాటు మన దేశమును పరిపాలించడానికి, వ్యాపారము చేయడానికి పట్టా యిచ్చే సందర్భంలో దేశ పరిస్థితులను గురించి విచారణ చేశారు.

తమ దేశంలో తయారయ్యే సరుకులు హిందూదేశంలో ఎందుకు ఛలామణి కావడంలేదని అనుభవజ్ఞులయిన కంపెనీ దొరలను అడిగారు. అప్పుడు మద్రాసు రాజధానిలో కంపెనీ ఉద్యోగిగా వుండి రాయలసీమలోని తెలుగు జిల్లాల్లోను, సేలం జిల్లాలోను పనిచేసిన అనుభవజ్ఞుడయిన సర్ థామస్ మన్రోగారు పార్లమెంటుకు యీ క్రింది విధముగా లిఖిత సాక్ష్యం యిచ్చారు.

"ఇంగ్లండునుండి భారత దేశానికి వ్యాపార సరుకులు ఎగుమతి చేయుట కష్టసాధ్యమైన పని. అక్కడి ప్రజల రీతి, మత ధర్మములనుబట్టీ లౌకిక జీవన విధానమునుబట్టి, శీతోష్ణస్థితినిబట్టి, ఆ దేశ ప్రజల వస్తు నిర్మాణ కౌశలమునుబట్టికూడ విదేశ వస్తువులు అక్కడ చెల్లుబడి కావు. ఒక దేశములో తయారయ్యే వస్తువులు ఇంకో దేశమునుంచి తెచ్చుకోవడం అరుదు. హిందూదేశమువారికి కావలసిన వస్తువులన్నీ ఐరోపాలోకన్న తమ దేశములోనే ఎక్కువ చక్కగాను, చౌకగాను తయారగుచున్నవి. అన్ని విధములయిన నూలు సరుకులు, పట్టు బట్టలు, తోలు వస్తువులు, కాగితము, పాత్ర సామానులు, వ్యవసాయపు పనిముట్లు వారు తయారు చేస్తున్నారు. ఉన్ని దుస్తులు, కంబళ్లు కొంచెము ముదుగుగా నున్నప్పటికీ అవి అతి చౌకగా నున్నందువల్ల మనవాటికన్న హెచ్చుగా ఖర్చు అవుతాయి. వారి నున్నరకపు కంబళ్లు, బూర్నీసులు మనవాటికన్నా ఎక్కువ వెచ్చగాను,

మన్నిక కలవిగాను వుంటాయి. భారతదేశ వర్ణాశ్రమ ధర్మములనుబట్టి వారికి ఇంగ్లీషు వస్తువులు అక్కరలేదు" అని మన్రోగారు స్పష్టముగా చెప్పారు. అంతట ఇంగ్లండు పార్లమెంటువారు కంపెనీకి కొత్త పట్టా యిస్తూ వారేగాక అందరు దొరలు స్వేచ్ఛగా వ్యాపారము చేసుకోడానికి అనుజ్ఞ యిచ్చి, మన దేశ పరిశ్రమలను నాశనము చేయుడానికి, తమ దేశపు యంత్రాలపైన తయారయ్యే సరుకులు చలామణి చేయడానికి తగిన మాయోపాయాలు చేయడానికి ఏర్పాట్లు చేశారు. మన సరుకులపైన ఎక్కువ పన్ను, సీమ సరుకులపైన తక్కువ పన్ను విధించడమేగాక మన దేశములో వివిధ వృత్తులు చేసుకొని జీవించే పారిశ్రామికులపైన మోతర్పా పన్నులు, బజార్లపైన, సంతలపైన, భోగ ద్రవ్యములపైన, సారాయి మొదలైన విషావస్తువులపైన రకరకాల పన్నులు విధించి వాటిని కఠినముగా వసూలు చేసే విధానము కంపెనీవారు అవలంబించారు. ఇంకా తమకు లోబడియున్న జమీందారులు వగైరాలతో అనేక ఏర్పాట్లు చేసుకొని తమ క్రింద దేశీయోద్యోగుల చేతకూడ తమ వ్యాపారానికి అవసరమైన పనులు చేయిస్తూ తమ వ్యాపారాభివృద్ధి చేసుకున్నారు. ఈ విధానంవల్ల కొద్ది కాలంలోనే మన పరిశ్రమలన్నీ అడుగంటినవి. వివిధ వృత్తులవారు జీవనాధారం లేక కూలి పని చేసుకొని బ్రతుకవలసినవా రయినారు.

## బట్టల రంగు అద్దకము

సర్వసామాన్యముగా చేయు అద్దకముకన్న కలంకారీ అద్దకము విశిష్టమయినది. ఒక బట్టమీద అనేక చిత్రములుండి అనేక రంగులు కలిగి ఒకదానిలో నొకటి కలిసిపోకుండ దేని కది స్పష్టముగా నుండవలె నంటే అద్దే విధానములో చాలా మెళకువలు, ప్రావీణ్యము వుండవలెను. బట్టలను తెలుపుచేసి రంగు వేయుటకు సిద్ధపరుచుట, రంగులు తయారుచేసి వానిని మిశ్రమము చేయుట, అమ్ముటకు వీలుగా వానిని కలుపుట, అద్దకమునకు

నుపయోగించు అచ్చులు, దిమ్మలు తయారుచేయుట, వాని నుపయోగించు పద్ధతు లెరుగుట లేదా ఆ యా చిత్రములను బట్టలమీద కలములతో, కుంచె లతో చిత్రించుట మొదలైన పనులు కళగాను, శాస్త్రముగాను అభ్యసించి వంశ పారంపర్యముగా ఏ వృత్తులను అవలంబించినవా రొక కులముగా నుండుటలో ఆశ్చర్యము లేదు.

రంగులు నేటి కాలపు కృత్రిమపు రసాయనికములు కావు. అందులో వృక్ష సంబంధమైనవి, బెరళ్ళు, పండ్లు, పువ్వులు, ఆకులు - ఖనిజ సంబంధ మైన దినుసులు, క్రిమి కీటకాదుల, గూడులకు సంబంధించినవి. లక్క, మట్టివంటి పదార్థములుకూడా నుపయోగించి బట్ట చిరిగినను రంగు మాయని పక్కా రంగులు తయారుచేయుట యొక గొప్ప విద్య. నీలిమందు నీలి రంగు వేయుటకు, లక్క పట్టు బట్టలకు, ఎరుపు రంగు వేయుటకు, చిరి వేరు, సున్నము కలిపి ఎఱ్ఱ రంగుకు, కుసుంబా పువ్వునుండి ఎరుపు, గులాబీ రంగులు, కపిల గౌర వర్ణములు వేయుటకు, కాచు అవిఱు చెట్టు బెరడు తాలూకు సత్తు, రేవల చిన్ని, దానిమ్మ తొక్కలు కలిపి పసుపు రంగుకు, చిరువేరు లేదా మోదుగ పువ్వు, పటిక కలిపి పసుపు ఛాయకు, కరక్కాయలు, అన్నభేది కలిపి నలుపు రంగుకు యీ విధముగా నుండి పదార్థములు కషాయములుగాచేసి రంగులుగా చేయుదురు. కావిరా విత్తులు కాషాయ బట్టలకు వాడుదురు. ఛాయ పసుపుకూడా వాడుదురు. ఇంగిలీకము, జేగురు, గంగసింధూరము మొదలగు ఖనిజ పదార్థములు మారి రంగులు చేసేవారు. *

నీలి మందు, పసంత గుండ, కుంకుమ పువ్వు, కుసుంబా పువ్వు, చిరువేరు, నల్ల జీడిగింజలు, కానకొప్పు చెట్టు ఆకులు, కంబరబండి లేక ఓపిరావబండి చెక్కతో రంగులు వేస్తారని విశాఖపట్నంజిల్లా మాన్యూలును

---

* అద్దకపు పరిశ్రమనుగూర్చి 1948 భారతి రజతోత్సవ సంచికలో కామరాజు సత్యనారాయణ వర్మగారి వ్యాసము.

రచించిన కార్మికేల్ దొర వ్రాసినాడు. కరక్కాయ, పీలిమందు, చిరివేరు, పచ్చాకు, మంజిష్టా మొదలయిన వన మూలికలతో రంగులు తయారు చేసే వారని చాలామంది వ్రాసినారు. ఇప్పుడు యీ రంగులు లేవు.

## ముచ్చీలు

"తెలుగు చిత్ర కళ - అందలి సొగసులు" అను శీర్షికతో సుప్రసిద్ధ చిత్రకారుడైన శ్రీ వరదా వెంకట రత్నంగారు భారతి రజతోత్సవ సంచిక (1949) లో నొక వ్యాసమును వ్రాసినారు. అజంతా శిల్పములను రచించిన తెలుగు శిల్పులు కొన్ని తరములవారు కొన్ని శతాబ్దములపాటు ఆ చిత్రము లను రచించిన సంగతి పేర్కొన్నారు.

నేడు ఆంధ్ర దేశములో ముచ్చీలని వ్యవహరింపబడు కులమువా రొకనాడు చిత్ర కళనే వృత్తిగా చేసుకొని క్రీ. శ. 6 - 8 శతాబ్దములలో కృష్ణా, గోదావరి మండలములలో నుండినందుకు నిదర్శనము లున్నవి. వీరు హిందూ మహమ్మదీయ రాజుల, నవాబుల సంస్థానములలో ఆస్థాన చిత్రకారులుగా నుండి వా రిచ్చిన మడి, మాన్యము లనుభవిస్తూ అనేక విధములయిన శిల్పములు. చిత్రములు గోడలపైన రచించినారు. అనేక దేవతా వాహనములను నిర్మించేవారు. సంస్థానాధీశుల బొమ్మలను, వివిధ జాతుల మనుష్యుల, జంతువుల, పక్షుల బొమ్మలను, నగిషీ చిత్రములు గల పట్టె మంచములు, పెట్టెలు, మందసములు మొదలైన సామానులను తయారు చేసేవారు. వీరు దశావతారాలను ఆటకు రెండు అంగుళముల వ్యాసముగల గుండ్రని పేకముక్కలను అట్టతోగాని, తోలుతోగాని తయారు చేసి దానిపైన దశావతారములనే గాక, రాజు వజీరు మొదలైన బొమ్మలను చక్కగా చిత్రీకరించేవారు.

లేపాక్షి, వీరభద్రేశ్వరాలయము గోడలపైనను, కుంభకోణము, రామస్వామి గుడిలోను, జటిక్కొల్లి కాపులలోను రచింపబడిన చిత్రములు

చేసినవారు తెలుగు దేశమునుండి వచ్చినవారని, తంజావూరులో నివసించు చున్నారని, వారు యిప్పటికీ తెలుగు మాటలాడుదురనీ దక్షిణదేశ కులము లను గూర్చి రచింపబడిన గ్రంథమున వ్రాయబడి యున్నది. ఈ చిత్ర కారులు తమ పనికి కావలసిన రంగులు, వార్నిషలు తామే తయారు చేసు కునేవారు. అవి ఎంతకాల మయినను రంగు తగ్గక యుండెడివి. పెద్దాపుర సంస్థానములోని ముచ్చీలు రచించిన చిత్రములు కొన్ని యుండేవి.

ఇటీవల యీ చిత్రకళ పోషణలేక క్షీణించినది. ఈ చిత్రకారులు జీవనము జరుగక యితర వృత్తులలో ప్రవేశించసాగిరి. ఈ ముచ్చీల వంశీయు లిప్పటికిని పెద్దాపురము, రాజమహేంద్రవరము, ఏలూరు, కొండపల్లి మొద లైన వూళ్ళలోను, తెలంగాణాలోను వున్నారు.

## ఇనుము - ఉక్కు పరిశ్రమ

ఇంగ్లీషు వర్తక కంపెనీ ప్రభుత్వమువారు నాశనంచేసిన భారతీయ పరిశ్రమలలో వస్త్ర పరిశ్రమతోపాటు ఇనుము, ఉక్కు పరిశ్రమ ఒకటి.

ఎన్నివందల సంవత్సరాలనాటిదో యిప్పుడు ఢిల్లీలోనున్న ఇనుప స్తంభము-అది యీనాటికీ చెక్కు చెదరకుండా వున్నది. అది తుప్పు పట్ట కుండా ఎలా చేశారో ఎవరికీ తెలియదు.

ఇంపీరియల్ గెజెటీర్ సంపాదకుడు జె. ఏ. యన్. కాటన్‌గారు బ్రిటిష్ సామ్రాజ్య పారిశ్రామిక ఆర్థిక పరిస్థితులనుగూర్చి 1911లో అన్ని వర్తు సర్వేలో హిందూదేశములో చాలా చోట్ల మేలయిన రకము ఇనుమున్నదని వ్రాశారు. పూర్వము పరిశ్రమ దేశమంతటా సర్వసామా న్యంగా నుండేది. ఆ ప్రకారం తయారుచేసిన ఉక్కు యూరోపులో 'వూట్జు' అనే పేరుతో తయారయ్యే ప్రశస్తమైన రకం-భారతదేశంలో క్రీస్తుపూర్వం

అనేక శతాబ్దముల క్రిందటనే తయారయ్యేది. ఐరోపానుండి దిగుమతిచేసే ఇనుము, ఉక్కు-ద్వారా భారతదేశ పురాతన పరిశ్రమ దెబ్బతిన్నదని శ్రీ లజపతిరాయ్‌గారు వ్రాశారు.

మద్రాసు రాజధానిలో పూర్వము చాలా చౌక పద్ధతిలో ప్రశస్తమైన ఉక్కు తయారుచేసేవారని సి. డి. మెక్లీనుగారు తమ మాన్యూలులో వ్రాశారు. అది తయారుచేసే పద్ధతినికూడా వర్ణించారు.

కృష్ణా, గుంటూరు జిల్లాలలో చాలాచోట్ల ఇనుము లభిస్తుందని, పత్తెనపల్లి తాలూకా పడమర నాలుగుమైళ్ళలోయున్న యర్రగుంటపాడులో పూర్వకాలపు ఇనుము కొలుము లున్నవని, మాజీవీడు తాలూకాలో రమణక్కపేట వగయిరాగ్రామా లలో కొలుములు కనబడినవనీ వంటచెరకు ఖరీదు పెరిగినందువల్ల యీ పరిశ్రమ అడుగంటినదనీ కృష్ణాజిల్లా మాన్యూలులో వ్రాశారు. కానీ నిజానికి విదేశీ సరుకు పోటీవల్లనే యిది నాశనమైనది.

1830 సం॥లో చెన్నపట్నంనుండి కాశీయాత్రకు బయలుదేరిన ఏనుగుల వీరాస్వామయ్యగారు కడప దాటిన తరువాత దువ్వూరు మొదలు కొని, ప్రతి గ్రామంలోను కొండకరమల వాండ్రు ఇనపరాళ్ళతో ఇనుము తయారుచేస్తారని వ్రాసియున్నారు.

1868వ సం॥లో ప్రకటింపబడిన విశాఖపట్నంజిల్లా మాన్యూల్‌లో జయపూరు దేశంలోని కొండలలో ఇనుపమట్టి యున్నదని, ఆ మట్టిని కొలిమిలో వేసి ఇనుము, ఉక్కు తయారుచేసేవారనీ చెప్పి ఆ పద్ధతిని వివరించి యున్నారు. ఇది చాలా చౌకయిన పద్ధతి. గ్రామాలలో కర్తీ ఇనుము తయారుచేసేవారు. తమకు కావలసినది యుంచుకొని మిగిలిన దానిని బ్రింజారీలకు అమ్ముదురు. వారు నాటుకుతెచ్చి కంట్లము 1కి అయిదురూపాయలు

చొప్పున అమ్మెదురు. దానినే కోమట్లు ఆ యా ఇనుము యొక్క మచ్చను బట్టి మణుగు ఏడు మొదలు తొమ్మిది రూపాయలవరకు అమ్ముచుందురని వ్రాసియున్నారు. దేశమంతటను కమ్మరులున్నారనీ, ప్రతి గ్రామములోను కొలిమి యున్నదని, దేశమంతటను ఇనుపరాళ్ళున్నవని, వాటి నెలాగు వాడుక చేయవలెనో జనులకు బాగా తెలియునని, అనేక విధములయిన గొడ్డళ్ళు, ఇతర విధములగు ఆయుధములు చేయుదురని, కర్ణాటక తుపాకులు చేయు కుటుంబములవా రున్నారని, విశాఖపట్టణం మాన్యూలులో కార్మికేల్ దొరగారు వ్రాసియున్నారు.

తెలంగాణములో వరంగల్లు, కూనసముద్రము, తిందుర్తి, కొామరమల్లి, నిర్మల, జగత్యాల, అనంతగిరి, లింగంపల్లి, నిజామాబాదు మొదలయిన స్థలములలో ఇనుము కరిగించి ఇనుపసామానులు చేసేవారని; ఇల్లిందల, ఇబ్రహింపట్నం, కోనాపురము, చింతంపేట మొదలగు ప్రాంతములలోకూడా తక్కువ పరిశ్రమ యుండెనని; హైదరాబాదు, గద్వాల. వనపర్తి, కొల్లాపురములలో కత్తులు తయారుచేసేవారని, గద్వాలలోను, వనపర్తిలోను మంచి తుపాకులు తయారుచేసేవారని బిల్ గ్రామీగారు వ్రాశారు.

## నీలిమందు పరిశ్రమ

భారతదేశములో ముఖ్యంగా ఆంధ్రదేశములోను ప్రాచీనకాలము నుండి ప్రసిద్ధిచెందిన పరిశ్రమలలో నీలిమందు ఒకటి. 'ఇండిగో'[1] అనే ఇంగ్లీషుమాట ఇండియానుంచి వచ్చినదనే గ్రీకుమాటనుండి ఏర్పడి నందువల్ల క్రీస్తుశకానికి పూర్వమునుండి యీ పరిశ్రమ ప్రఖ్యాతి చెందినట్లు తెలుస్తుంది. నీలిమొక్కలు పెంచి నీలిమందు తయారుచేసే పరిశ్రమలో తెలుగువారు ప్రవీణులుగా వుండేవారు. ఇంగ్లీషు వర్తకుల పోటీలవల్ల, కుట్రలవల్ల నీలిమందు ధరలు వూహించలేనంతగా పెరిగి పడిపోతూ వుండి నందువల్ల, యీ వ్యాపారము ఒడిదుడుకులకు లోనయినది. తుదకు కృత్రిమ రసాయనిక నీలిమందువల్ల యీ పరిశ్రమ పూర్తిగా నాశనమైనది.

1 [illegible]

# 8. వర్తక సంఘములు-అష్టాదశ సమయములు

ప్రాచీనకాలములో మన దేశములో నొక్కొక్క వృత్తి లేక వ్యాపారము చేయువా రొక్కొక్క సంఘముగా నేర్పడుచుండిరి. క్రమక్రమంగా ఒక్కొక్క వృత్తిగాని, వ్యాపారముగాని చేయువా రొక్కొక్క కులముగా పరిణతి చెందిరి. ఈ వృత్తి వ్యాపార సంఘములలోని వారి క్షేమ లాభములను సంరక్షించుటకు కొన్ని నీతినియమము లేర్పరిచి, వానిని ఉల్లంఘించిన వానికి ప్రాయశ్చిత్తములు, అపరాధములు విధించి, శిక్షించుట ఆచార ధర్మముగా నుండెను. దాని కా కాలమునాటి రాజులును అంగీకరించు చుండిరి.

ఈ వర్తకసంఘము లనేక పరిశ్రమలకు, వ్యాపారములకు సంబంధించిన వయినప్పటికిని వీనిని 18 రకములుగా వర్గీకరించి వాటిని అష్టాదశ సమయములని వ్యవహరించుచుండిరి. తరువాత కులవర్గములకు కూడా అష్టాదశ వర్ణములు, జాతులు అను వ్యవహార మేర్పడెను.

వివిధ గ్రామములలోను, పట్టణములలోనుగల వృత్తి వ్యాపార సంఘములవారు కలిసి శ్రేణీ సంఘము లను పెద్ద సంఘములుగా నేర్పడి దేశములోని వివిధ ప్రాంతములతోను, దేశాంతరాలతోను వ్యాపారము జరిగించు చుండిరి. ఈ శ్రేణీ సంఘములు చాలా ధనవంతములు బలవంతములునై మంచి పలుకుబడి కలిగియుండెను. ఆ కాలమునాటి రాజుల కవసరము కలిగినప్పుడివి ధనమును చేకూర్చు 'బ్యాంకర్లు' గా కూడా వ్యవహరించెడివి. ఆ రాజులు యీ సంఘములకు కొన్ని ప్రత్యేక సౌకర్యములు, అధికారములు, గౌరవములు యిచ్చుచుండిరి. ఈ సంఘముల వ్యవహార సందర్భములలో కలుగు తగవులు, వ్యాజ్యములు పరిష్కరించుటకు ఆ సంఘమువారే పంచాయతి సభ లేర్పాటుచేసుకొనుటకు కూడా అప్పటిరాజు లంగీకరించు చుండిరి. ఈ సంఘము లనేక దానధర్మములు చేసినట్లుకూడా శాసనములవల్ల తెలియుచున్నది.

మధ్యయుగమునాటి శాసనములలో "నగర, నాడు, స్వదేశి, పరదేశి, నానాదేశి, పేహారు"లని, "యాభై యారు దేశాల బాలుమూల పెక్కండ్ర"ని, "బాలుమూల పదునెన్మిది సమయాల సమస్తమైన పెక్కండ్ర"ని, "అఖిల దేశాల పదునెన్మిది సమయాల సమస్తమైన పెక్కండ్ర"నీ, కనబడే వర్ణనల వలన ఆ నాటి వర్తకులలో వివిధ తరగతులవారు, సంఘములవారు ఉన్నట్లు, వారు ఛప్పన్నదేశా లని ప్రసిద్ధిచెందిన 56 దేశాలలో వ్యాపారం చేస్తూవున్నట్లు ఇటువంటి వర్తకసంఘములలో ముఖ్యమైనవి 18 యున్నట్లు తెలుస్తూవున్నది.

ఆ కాలములో రాజాధిరాజుల గొప్పదనమునుగూర్చి, వారి బిరుదావళిని గూర్చి వర్ణనము యుండినట్లే వర్తక సంఘములకుకూడా పెద్దపెద్ద వర్ణనము లుండేవి. వాని నా సంఘ సభ్యుల ఇండ్లలో జరిగే శుభకార్యములలోను ముఖ్యముగా వివాహ సమయములలోను పఠించి ప్రకటించుట ఆచారముగా నుండేది.

ఆంధ్రదేశములోని వర్తక సంఘములు తెలుగు దేశములోని వివిధ ప్రాంతములందే గాక కన్నడ, అరవ, మలయాళ దేశములతోను, దేశాల తీరాలతోను వర్తక వ్యాపారాలు జరిగించేవి. రెడ్డిరాజుల కాలములో అవచి తిప్పయసెట్టి, కాశ్మీరము, కాంభోజము, సింహళములనుండి, మలయా ద్వీప కల్పమునుండి, జావా, సుమత్రా ద్వీపములనుండి ఇంకా ఇతర దేశాలనుండి తెప్పించిన అపూర్వమైన వస్తువులనుగూర్చి శ్రీనాథ కవి సార్వభౌముడు తన హర విలాసములో వర్ణించాడు. అందలి పట్టణముల పేర్లు పైన చెప్పిన దేశాంతరాలలోనివే। ఇంత గొప్ప దేశాంతర వ్యాపారము చేసే వర్తకులు, వర్తక సంఘములు రూపు మాయుటకు అనేక కారణములు ఏర్పడినవి.

పూర్వము వర్తక సంఘములు భాషా భేదములతోగాని, కుల భేదములతోగాని నిమిత్తము లేకుండా వ్యాపారాభివృద్ధినే ప్రధాన లక్ష్యంగా

వ్యవహరించేవారు. క్రమక్రమంగా కుల వర్గాలలోని పట్టింపులు, కులకక్షలు అభివృద్ధిచెంది సంఘములో ఐకమత్యము నశించినది. సంఘములో కలిగిన తగాదాలు తామే పరిష్కరించుకొనే పద్ధతి పోయి దెబ్బలాటలు వృద్ధియై రచ్చకెక్కుట ప్రారంభమైనది. ఇంతలో మహమ్మదీయ దండయాత్రలు వచ్చి హిందూ వర్తక సంఘములకు రక్షణ లేకుండ పోయినది. వర్తక వ్యాపారములు తగ్గినను పాశ్చాత్య వర్తకులు వచ్చునాటికి మన దేశములో వివిధ ప్రాంతాలలో అనేక రకములైన వస్త్రములు, రంగుల అద్దకము ఇతర పరిశ్రమలకు సంబంధించిన వస్తువులు విరివిగానే తయారగుచుండెను. వానిని ఐరోపా దేశానికి ఎగుమతి చేసేవారు. ఇంగ్లిషు వర్తక కంపెనీవారు తమ వర్తక వ్యాపారము అభివృద్ధి చేసికొనుటకు మన పరిశ్రమలను, వ్యాపారములను పూర్తిగా నాశనం చేశారు.

## అయ్యావళీ సంఘము

మధ్యయుగమున క్రి. శ. 10 - 16 శతాబ్దముల మధ్య దక్షిణ హిందూ దేశములో వివిధ ప్రాంతాలలో వర్ధిల్లి వర్తకశ్రేణి సంఘములలో కెల్ల గొప్పది అయ్యావళి వర్తక సంఘము. దీని ప్రధాన కార్యస్థానము కన్నడదేశములో బిజాపూరు జిల్లా హుస్గుంద తాలూకా అయిహోలె అని వ్యవహరింపబడే అయ్యావళీపురములో నుండేది. దాని శాఖలు కన్నడ దేశములోనేగాక తెలుగు, అరవ, మళయాళ ప్రాంతాలలోకూడా వుండేవి. ఇంతేగాక యీ సంఘమునకు సింహళము, బర్మా, మలయద్వీపకల్పముల లోను- జావా, సుమత్ర మొదలైన ద్వీపములలోనుకూడా శాఖలుండేవి.

ఆంధ్రదేశంలో వర్తక వ్యాపారముచేయు కులములలో ప్రముఖులుగా నుండిన బలిజ సంఘమువా రందరూ అయ్యావళి సంఘ సభ్యులుగా నుండేవారు. ఆంధ్రదేశములోని బలిజవారు అనేక వ్యాపారములు చేసే

వారు. రవాణా వ్యాపారముచేయు పెరిక బలిజలు వందలకొలది ఎడ్లపైన సంచుల జతలలో సరుకులు నింపి రవాణా చేసేవారు. పగడాల బలిజలు, రాళ్లు లేక రత్నాల బలిజలు, గాజుల బలిజలు, ఉప్పు బలిజలు ఆ యా వ్యాపారములు చేసేవారు. బలిజలలో ఆయుధ జీవులై సైనికులుగా చేరి యుద్ధములలో పాల్గొనే వీరులు వుండేవారు. అందువల్లనే బలిజ సంఘానికి వీర బలిజ సంఘమని పేరు వచ్చినది. ఈ బలిజ సంఘమువారు అయ్యావళీ వర్తక సంఘమునకు చెందిన 18 సమయములలో చేరినవారే.

అయ్యావళీ వర్తక సంఘమునకు దేశ దేశాంతరములందలి ప్రతి ముఖ్య పట్టణములోను కార్యస్థానము లుండేవి. శ్రీమదయ్యావళీ సింహ విక్రమ పురవరులు బల్లిదులైన బలిజవారు దుష్ట నిగ్రహులును శ్రేష్టులున్ మ్రోంకాటి పట్టబద్ధులైన బలిజవారని ఒక సీసపద్యములో నెల్లూరు బలిజ సంఘమువారు వర్ణింపబడినారు. అయ్యావళీ వర్తక సంఘమున కొక జెండా, ప్రత్యేక వాద్యములు వుండేవి. వీరికి వీర బలంజసమయమని నామాంతరము-వీరులైన బలిజవారని అర్థము.

తమ సంస్థకుగాని, తమ సభ్యులకుగాని, వ్యాపారమునకుగాని శౌకర్యము కలిగించేవారి కి సంఘమువారు బిరుదు లిచ్చుచుండిరి. ఈ బిరుదులలో గొప్పది 'పృథివీసెట్టి' అనునది. ఈ బిరుదుగల వా రేయూరు వెళ్ళినను అక్కడ సత్కరింపబడేవారు. ఈ సంస్థలవారు యుద్ధ సమయములందు రాజులకు తోడ్పడుచుండినందువల్లనే వీరబలంజసంఘమువా రని పేరు పొందిరి.

ఈ వర్తక సంఘమున కంతటికని "రాయన భాస్కరుడు" గురువు. రాయన భాస్కరు డనునది శంకరాచార్యులవంటి గురు పదవి. ఆయన కా సంఘమువారు పృథివీసెట్టి యను బిరుదునిచ్చి సత్కరించుచుండిరి. రాయన భాస్కరుడు బ్రాహ్మణుడైనను పృథివీసెట్టి యను బిరుదాంకితుడే.

ఈ వీరబలంజ సంఘమువారు 32 వేల నగరములు (కరపట్టణములు: Seaports) లోను, 18 మహానగరములలోను, 64 యోగపీఠ స్థానముల లోను, 64 ఘటికాస్థానములలోను వర్తక కార్యాలయములను కలిగియుండి వ్యాపారము చేయుచుండిరి.

వీరు తమ కులములకు, వర్తక వ్యాపారమునకు సంబంధించిన వ్యవహారమును, కులసభ ద్వారమునగాని, సమయసభ ద్వారమునగాని పరిష్కరించుకొనుచుండిరి. వీరికి వేరే ధర్మాసనములు, న్యాయస్థానములు అవసరములేకుండా సమయసభలను సమావేశపరచుకొను చుండిరి. ఆ సమయ సభల తీర్పులకు, వాది ప్రతివాదులు బద్ధులగుచుండిరి. దేశమునేలు రాజులు వానిని మన్నించుచుండిరి. సమయ ద్రోహులను వెలివేయుటకు, వారికి అపరాధము విధించుటకు, శిరచ్ఛేదము చేయుటకుకూడా వారధి కారము కలిగియుండిరి. కొన్నికొన్ని కాలములలో వీరు రాజాధి రాజుల పైనకూడా పలుకుబడి కలిగి వారికి లక్షలకు లక్షల వరహాలు అప్పు లిచ్చు చుండిరి. అయ్యావళి వర్తక ప్రముఖుల సభ సాధారణముగా ఏ దివ్య క్షేత్రముననో కల్యాణోత్సవముననగాని, దేవాలయ ముఖ మండపములందు గాని సమావేశ మగుచుండును. 'దేశాయిసెట్టి' అనునాతడు వ్యవహార పరి ష్కారమున న్యాయాధిపతిగా వ్యవహరించును. ఈయనకు ధనపాలసెట్టి యనికూడా నామాంతరము.

వీరబలంజ సంఘమున కొక అధికార లాంఛనము (Insignia) వుండెను. దాని పేరు వజ్రబైషిగ. దానిని వజ్రబైసుగ, వజ్రబేసిగ, వజ్ర కేషిగ అనికూడా వ్యవహరించిరి.

ఈ సమయమువారుసమావేశపరచిన ఏ సభయందయినా ముందుగా ఏ ధ్వజమును ప్రతిష్ఠించుచుండిరి. ఇది రాజదండమువంటి రాజ

లాంఛనము. ఇది యొక త్రెడ్డు, లేక గరిటెవలె నుండెను. దీని అంచుల మీద 18 సమయముల లాంఛనములుండెను. దీనిని ప్రతిష్ఠించగానే దేశాయి సెట్టి 18 సమయములకు ప్రతినిధి పాలకుడుగా వ్యవహరించు అధికారి యగును.

అపూర్వమైన యీ విస్మృతాంధ్ర చరిత్రాంశమునుగూర్చి సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులయిన శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మగారు 1917 సం॥ జూలై నెల భారతిలో "మన ప్రాచీన వర్తక సంఘములు" అను శీర్షికతో నొక అమూల్యమయిన వ్యాసమును వ్రాసియున్నారు.

పెనుగొండ వైశ్యులు అనేక శాసనములలో పెనుగొండ పురాధీశ్వరులని, నగర స్వాములని పెనుగొండ శాసనులని పేర్కొనబడిరి. క్రీ. శ. 1148 సం॥లో గోదావరి మండలములోని దాక్షారామ భీమేశ్వరాలయమున పోతిసెట్టి చెక్కించిన దాన శాసనమునందు పెనుగొండ పురాధిపతి, సామంతుడు ఖండనభీమ బిరుదాంకితుడు అని అతడు వర్ణింపబడుటవలన నా కాలమునాటి వైశ్యులు వర్తక వ్యాపారములను చేయుటయేగాక రాజకీయోద్యోగములుచేసి యుద్ధములందుకూడా పాల్గొని బిరుదులందిన వారని తెలియగలదు.

వైశ్య సంఘమువారిని, పెనుగొండ శాసనులని వర్ణించినట్లే క్రీస్తుశకము 1084-1089 సం॥ల మధ్య వేంగిదేశము నేలిన రాజరాజ చోడ గంగు టేకి శాసనములో బెజవాడ శాసనులయిన తెలిక సంఘమువారు పేర్కొనబడినారు. చాళుక్య రాజులకు యీ సంఘమువారు చేసిన సేవకును, వీరి రాజభక్తికిని మెచ్చి వీరిండ్లలో వివాహములయినప్పుడు దంపతులు గుర్రమునెక్కి ఊరేగు గౌరవమును రాజుగారు ప్రసాదించిరి. * పూర్వము

* శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారి (ఆంధ్రుల చరిత్ర. 1 వ భాగము పుట 320)

రాజాజ్ఞలేనిది ఏనుగు, గుర్రము, పల్లకి మొదలయిన వాహనముల నెక్కి యూరేగుటకు ఎవరికిని అవకాశ ముండెడిదికాదు.

## 9. కులాచారములు-మర్యాదలు

ఇటీవలి కొంతకాలమునుండి మన పెద్ద పట్టణములలోని వీధులందు మాల మాదిగలనిగాని, చాకలి, మంగలి కులములవారనిగాని, ఇతర కులముల వారనిగాని విచక్షణ లేకుండా అష్టాది వర్ణములవారును తమ ఇండ్లలో పెండ్లిండ్లు జరిగినప్పుడు పెండ్లికుమారుని, పెండ్లి కుమార్తెను పల్లకీలలో కూర్చుండబెట్టి తమ శక్తికొలది బాజాభజంత్రీలతో, మేళతాళములతో, ఇతర అలంకారములతో రాత్రిళ్ళు కాగడాలు, గ్యాసులైట్లు, మతాబులు, చిచ్చుబుడ్లు, అవ్వాయిజువ్వలు మొదలగు బాణసంచాతో మహావైభవముగా వూరేగుచుండుట చూచుచున్నాము. దీని కెవ్వరూ ఏ కాలమున నాటంకము కలిగించుటలేదు. అయితే మొన్న మొన్నటివరకూ అనగా—

ఇంగ్లీషు ప్రభుత్వారంభ కాలములోకూడా పూర్వమునుండియు పల్లకీలలో నూరేగు పూర్వాచారముగల కుటుంబములవారు తప్ప యితర కులములవారే వీధిలో నూరేగినా ఆ వీధిలోని యితర కులమువా రాటంక పరచుచుండిరి. ఒకవేళ నూరేగు కులమువారు వెనుదిరుగక మూర్ఖించినచో దెబ్బలాటలుకూడా జరుగుచుండెను. ఆ కాలమున యిప్పటివలె పట్టణము నందలి వీధులలో వివిధ కులములవారు తిలతండుల న్యాయముగా కలగా పులగముగా కాపురముండక, ఒక్కొక్క కులమువా రొక్కొక్క వీధిలో

నివసించుచుండుటయు పూర్వాచారమును బట్టి పల్లకీలలో ఊరేగుచుండుట కధికారముగలవారు తప్ప యితర కులమువా రా వీధిలో నట్లూరేగినచో నది తమ గౌరవమునకు భంగకరమని యెంచి వానిని సహించకపోవుటయు ఆ కాలమున గట్టి కట్టుబాటుగా నుండెను.

ఇంగ్లీషు ప్రభుత్వారంభ కాలమునాటికి దక్షిణ భారతదేశంలోని శూద్ర కులములవారు కుడిచెయ్యి, ఎడమచెయ్యి కులములని రెండు శాఖలుగా విభజింపబడియుండి వివిధ పట్టణములందు కొన్ని భాగములు కుడి చెయ్యి కులమువారికి, మరికొన్ని భాగములు ఎడమచెయ్యి కులములవారికిని ప్రత్యేకింపబడి యుండెననియు, ఆయా భాగములందు నివసించు కులము వారు తమ అధికృతను ప్రకటించుకొనుచు ప్రత్యేక గౌరవ మర్యాదలను చెలాయించుకొనుచుండురనియు, వీరు తమ ఇండ్లలో జరుగు శుభ శోభనములందు తమ పేటలో నెట్టి వైభవముతో నూరేగినను రెండవ వర్గము వారుండు భాగములందు మాత్ర మట్లూరేగినచో వారు ఆటంకపరచు చుండిరనియు, అప్పుడప్పుడు దెబ్బలాటలు, రక్తపాతముకూడా జరుగుచుండెననియు చెన్న రాజధాని పరిపాలనను గూర్చిన మాన్యుయల్ అను గ్రంథసంపుటము లను రచించిన సి. డి. మెక్లీన్‌గారు వ్రాసి యున్నారు.

కుడిచెయ్యి కులమువారిలో వెల్లాల, కవరి అను గాజుల బలిజలు, కోమట్లు, కణకపిళ్ళలు (అకౌంటెంట్లు) పట్టుసాలెలు, పల్లియులలోని పురుషులు, చెప్పులుకుట్టు మాదిగవారిలో ఆడవారును చేరియుండిరి. ఎడమ చెయ్యి కులమువారిలో సెట్లు, వడ్లబత్తులు, కంచరి మొదలయిన చేతి పని వారు, తెలికలవారు, వేటగాండ్రు, పల్లెవారు (పట్టినవర్) చెప్పులుకుట్టు మాదిగలలోని పురుషులు పల్లియులలోని ఆడవారును చేరియుండిరి.

క్రీస్తుశకము పదవ శతాబ్దమునాటికి కాంచీపురమునకు దక్షిణమున గల దేశమున కుడి ఎడమ కుల విభజన యుండెననియు, యీ కులముల

వారిమధ్య తగవులు రాగా ఆ దేశము నేలు రాజులు వానిని పరిష్కరించి నట్లును చోళరాజుల శాసనములవలన తెలియుచున్నది. *

1652లో అనగా చెన్నపట్టణంలోని ఇంగ్లీషు వర్తక స్థానము స్థాపించిన కొలది కాలములోనే యీ కుడిచెయ్యి, ఎడమచెయ్యి కులముల మధ్య తగవు వచ్చెననియు, వర్తక స్థానముయొక్క సభాపతి 'ఆరన్ బేకర్' ఆ తగవు తీర్చినట్లును వారి రికార్డులలో నున్నది.

1704-1707 మధ్య మద్రాసులోని 'ఫోర్టుసెంట్ జార్జి' కోటకు గవర్నరుగ నుండిన 'థామస్ పిట్టు' గారి కాలమున కుడిచెయ్యి, ఎడమ చెయ్యి కులములవారు ఒకరికన్నా నొక రధికులమని తగవులాడికొని నట్లును, ఎడమచెయ్యి కులమువారు కుడిచెయ్యి కులమువారితో తాము సమా నులమని తమ్మైన యెంచవలసి యున్నదని వాదించినట్లును, కుడిచెయ్యి కులమువారు తమ గౌరవమునకు భంగము కలిగినదనుచు చెన్నపట్నమును వదలి పోయెదమని బెదరించినట్లును, అప్పుడు పిట్టుగారి రెండు వర్గముల కులములవారు నివసించు ప్రదేశములను వేరుపరచుటకు మధ్యగా సరిహద్దు రాళ్ళస్థంభములను పాతించి మీ మీ పేటలలో మీ మీ ఆచారముల ప్రకారము జరుపుకొనుడని చెప్పి అల్లరులుజరుగకుండా బందోబస్తు చేసెననియు, అంతట కుడిచెయ్యి కులములవారు కొంద రూరువదలి వెడలిపోయి రనియు నింగ్లీషు తూర్పు ఇండియా వర్తక సంఘంవారి రికార్డులలో నున్నది.

1820లో పల్లకీలలో నూరేగుటను గూర్చి కొన్ని కులములవారి మధ్య తగవులు కలుగగా, అప్పుడు చెన్నపట్నం రాజధానికి గవర్నరుగా నుండిన సర్ థామస్ మన్రోగారు, మేజస్ట్రీటులు సాధ్యమైనంతవరకు క్రొత్త యాచారములను సమర్ధించుటకు ప్రయత్నింపక పూర్వాచారములనే సమర్థింపవలెనని 1820 జూలై 18 వ తేదీన తమ 'మినిట్సులో' వ్రాసిరి.

* Peasant state and society in Medieval South India. Burton Stein

ఇంగ్లీష్ ప్రభుత్వంవారు చాలాకాలమువరకు మన దేశీయుల మతా చార వ్యవహారములతో జోక్యము కలిగించుకొనక సాధ్యమైనంతవరకు మనవారి పూర్వాచారములను మన్నించుచుండిరి. అయితే ఇంగ్లీష్ ప్రభుత్వము గట్టిపడిన పిమ్మట క్రైస్తవ మతబోధకుల ప్రోత్సాహమువలన దేశములోని ప్రజలందరు జాతి, మత విచక్షణ లేకుండా సమాన పౌరసత్వ హక్కులు కలిగినవారే యను సూత్రముపైన పరిపాలింప నమకట్టిరి. దీని ప్రకారము రాజబాటల నందరును స్వేచ్ఛగా నుపయోగించుకొనవచ్చు ననియు అందులనుగూర్చి ఒక కులంవా రింకొకరి నాటంకపరుపరాదనియు నిర్ణయించిరి.

1857 లోను 1861 లోను ఇంగ్లీషు న్యాయస్థానములుచేసిన తీర్పుల వలన కులవిచక్షణ లేకుండా అష్టాదశ వర్ణములవారును పల్లకీ నెక్కి యూరేగుటకు వీలుకలిగెను.

మన దేశములో పూర్వమిట్లు కొన్ని కులములవారు మాత్రమే పల్లకీలలో నెక్కి యూరేగు నాచార మెట్లు వచ్చినదని పరిశోధించగా మను ధర్మ శాస్త్రము మొదలగు స్మృతులలో వర్ణాశ్రమ ధర్మములను గూర్చిన నిబంధనలందు తారతమ్యము లుంచినట్లే తరువాత కాలమున అష్టాదివర్ణముల వారిలోకూడా తారతమ్యములు బయలుదేరినట్లును, అవి చిరకాలాచారమునుండి ప్రమాణములయి రాజులచే మన్నింపబడి వివిధ కులముల గౌరవ ప్రతిపత్తులందు తారతమ్యము లేర్పడినట్లును కనబడు చున్నది.

ముత్యముల జాలరులు, పట్టుకుచ్చులు, నవరత్న ఖచితములైన బంగారు అలంకరణముతోను, గరుడ మకర సింహతలాట ధ్వజములతో ఏనుగు అంబారీంపైనను రెండుప్రక్కల మూయుకుండానుండు 'అందలము' లను పల్లకీలలోను కూర్చుండి - వెండి బంగారు బొమ్మల చిత్రములుగల

వేత్రధరులు, బల్లెములు, ఖడ్గములు మొదలగు నాయుధములు ధరించిన గుఱ్ఱపు రౌతులు, బంటులు ఇతర పరివారము వెంటరాగా, వందిమాగధులు, వైతాళికులు తమ బిరుదావళిని వర్ణించుచూ కైవారములు చేయుచుండగా, మంగళతూర్యములతో జయభేరులతో ఢంకా ఢమారాలతో మారేగుట రాజాధిరాజులకు మాత్రమే హక్కుగల రాజవైభవము. బలవంతులగు చక్రవర్తులు దిగ్విజయముచేసి బలహీనులగు రాజులను జయించి, వారి బిరుదులను పూడబెరుకుచుండిరి.

అట్టి రాజాధిరాజులను ధిక్కరించి యీ రాజలాంఛనములను వహించుట కెవ్వరికిని వీలులేదు. ఎవ్వరైనను అట్టి లాంఛనములు, బిరుదులు వహించినట్లు తెలిసినచో వారు రాజదండనకు పాత్రులగుచుండిరి. రాజాధిరాజులు తమ రాజగురువులకు, సామంతులకు, బంధుమిత్రులకు కొన్ని రాజలాంఛనముల నొసగి గౌరవించుట ఆచారముగా నుండెను. అట్లు వారి అనుగ్రహమునకు పాత్రులైనవారు వారివారి తాహతునుబట్టి పొందిన పెద్ద చిన్న బిరుదులను, నిర్ణీతములైన రాజలాంఛనములను మాత్రమే వహింపవలెనుగాని వానికన్న అధికతర గౌరవములను వహించినచో రాజదండనకు పాత్రులగుచుండిరి. రాజులు మారినప్పుడు పాతవారిచ్చిన బిరుద లాంఛనము లొక్కొక్కప్పుడు తీసివేయుటయు జరుగుచుండెను. రాజాజ్ఞ లేకుండా యిట్టి రాజలాంఛనములు వహించినవారు శిక్షింపబడుచుండిరి. పూర్వపు రాజాధిరాజులు ప్రసాదించిన రాజ లాంఛనములలో ననేక తారతమ్యములు కనబడుచున్నవి. రాజుగారి పట్టపుటేనుగు, పల్లకీ, అందలము మొదలగు వానికిగల యలంకరణము యథాతథములుగా నెవ్వరికిని ప్రసాదించలేదు. అంతకు తక్కువగానుండు అలంకరణములను వారివారి తాహతులనుబట్టి నిర్ణయించుచుందురు. కొన్ని వాహనములకు బంగారు జలతారుల, పట్టు కుచ్చులుగల గవిసెనలు, జాలరులు, తక్కువ సంఖ్య ముత్యముల సరములు గల గొడుగులు, కొందరికి సామాన్య పల్లకులు, కొందరికి రెండు

ప్రక్కలను మూయకుండా మందు అందలములను, పల్లకీలు, వానిని మోయుటకు 4, 8 లేక 16 మంది బోయీలు, దానికి తగినట్లు హెచ్చు తగ్గు సంఖ్య ధ్వజములు, కత్తులు, కటారులు, బల్లెములు ధరించిన పరివార జనము, రౌతులు, భటులు, ఢంకా డమారా బాజా భజంత్రీలు,— రాత్రికి ఊరేగునప్పుడు ఉపయోగింపదగిన కాగడాల సంఖ్యకూడా రాజశాసనమునుబట్టి నిర్ణయింపబడి చిరకాలాచార ప్రమాణమును పొంది కవుల గ్రంథములందు వర్ణింపబడి యున్నది. ఇట్లే మతగురువులకును, ఆచార్యులకును, పండితులకును, కవులకునుగూడా కొన్నికొన్ని బిరుదులు, గౌరవములు నొసగబడుచుండెను. కనకాభిషేకము, సింహతలాటపు మురుగులు, కుండలములు మొదలైన విట్టివే.

ఈ రాజలాంఛనములను గౌరవములు పొందినవారు క్రమక్రమముగా పెరుగుటవలన అందులో కొన్ని విశేషలక్షణములను కల్పించి ప్రత్యేక గౌరవము కలిగించుట ప్రారంభించిరి. ఉదాహరణమునకు సాధారణముగ వీధిలో పల్లకిని నిలువుగా తీసుకొనిపోవుట సామాన్యముగా అందరికిని అలవాటు. అట్లుగాక మధ్యమధ్య వానిని అడ్డముగా త్రిప్పుట, అడ్డపల్లకీ నెక్కు గౌరవమనిరి. సాధారణముగా రాత్రికి కాగడాలతోను, దివిటీలతోను పోవుటగాక పగలుకూడా అట్టివానిని నుపయోగించుట పగటి దివిటీలతో పోవు గౌరవమనిరి. అటువంటి వెన్నో క్రొత్త కొత్త పద్ధతుల నేర్పాటు చేసిరి. సామాన్యముగా రాత్రికి పోవునప్పు డొక కాగడా వెలుతురున పోవుట యొక ప్రత్యేక గౌరవమయ్యెను. ఈ ప్రత్యేక గౌరవములు రాజశాసనమువలననే ప్రారంభమై అనుశ్రుతాచారములనుబట్టి ప్రమాణములైనవి. వీనిలో కొన్నిటిని కొన్ని కులములవా రనుభవించిరి. రాజులు మారినప్పుడు సాధారణముగా పూర్వాచారములను గౌరవించుచుండిరి. ఇంగ్లీషువారును చాలాకాల మీ పూర్వాచారములను గౌరవించిరి. తాముకూడా క్రొత్త బిరుదులు, లాంఛనములు ప్రసాదింపసాగిరి.

కాకతీయ సామ్రాజ్యము విచ్ఛిన్నమైన పిమ్మట 1330 మండి తెలుగు దేశము నేలిన కొండవీటి రెడ్డిరాజులు దానధర్మములను జేసియు, సంగీత సాహిత్య కళలను, కవులను పోషించియు ప్రఖ్యాతిచెందిరి. వీరు తమ ఆశ్రితులకు బిరుదులను, గౌరవములను నొసగిరి. దీనినిగూర్చి చరిత్రాధార ములును, కవుల గ్రంథములు మున్నవి.

కొమరగిరి రెడ్డి వసంతోత్సవములను చాల వైభవముతో చేయు చుండెను. ఆయనకు మిత్రుడును సచివుడును యగు గ్రంథ భాండాగారా ధ్యక్షుడైన అవచి తిప్పయసెట్టి కోటీశ్వరుడు. దేశాంతరములనుండి అపూర్వ వస్తువులను తెప్పించి రాజు కిచ్చుచుండెను. రాజందులకు సంతోషించి అతనికి ఛత్రచామరాందోళికలను, గుర్రములను మొదలగు రాజలాంఛనముల నిచ్చి గౌరవించెను. తిప్పయసెట్టి శ్రీనాథకవి సార్వ భౌముని వలన హరవిలాసమును కృతినొందెను. ఆందోళిక యనగా అందలము.

విజయనగర సామ్రాజ్యము నేలిన చక్రవర్తులు తమ బంధుమిత్రు లకు, గొప్ప ప్రభువులకు ఏనుగులు, గుర్రములు, పల్లకీలు నెక్కి తిరుగు గౌరవము; ఛత్రము, చామరము మొదలగు రాజలాంఛనములు నొసగి గౌరవించుటయేగాక వానికగు వ్యయముకొరకై ఉంబళిగె మాన్యము లనుగూడ యిచ్చుచుండిరి. విజయనగర సామ్రాజ్య స్థాపకుడును ఆ చక్ర వర్తుల రాజగురువును నగు విద్యారణ్యులవారు శ్రీ శంకరాచార్యులవారు స్థాపించిన శ్రీ శృంగేరీ పీఠాధిపతులుగా నుండిరి.

శృంగేరీ పీఠమునకు, దాని అధిపతులకు రాజాధిరాజు లెన్నో గౌర వముల నొసగియుండిరి. ఆ పీఠాధిపతి రోము నగరములోని రోమన్ క్యాథలిక్కు క్రైస్తవ మతగురువగు "పోపు" వంటివాడని ఆయన దక్షిణ హిందూ దేశంలోని వారికి మతగురు వగుటయేగాక పూర్వము మహారాష్ట్రీ

దేశము నేలిన పీష్వా, హోల్కార్ మొదలగు గొప్ప మహారాష్ట్ర ప్రభువులకుకూడా రాజగురువనియు, ఆయనకు ప్రత్యేక గౌరవము లున్నవనియు పాశ్చాత్యాధికారులు వ్రాసియున్నారు. శృంగేరి పీఠాధిపతులగు శ్రీ నృసింహ భారతీస్వాములవారు 63 మంది సిపాయిలతోను, 100 మంది బ్రాహ్మణ సేవకులతోను, 25 తుపాకులు, 20 ఖడ్గములు, 10 బాకులు లేక కటారులు, 25 కొంకులు (పిక్కర్స్), రెండు ఏనుగులు, 50 ఆవులు, 8 పెద్ద ఛత్రములు, ఆరు చామరములు, పది గుఱ్ఱములతోను, మైసూరు కమీషనరగు కబ్బన్‌గారు, మద్రాసు గవర్నరుగారును యిచ్చిన ముగ్గురు బిరదారీలు, సిక్కేదారులతోను 1837 లో పర్యటనము చేసినట్లు ఇంగ్లిషు వర్తక కంపెనీ వారి రికార్డులందు ఉన్నది.

శృంగేరి స్వాములవారికి గల ప్రత్యేక గౌరవములనుగూర్చి మైసూరు మహారాజుగారైన మూడవ శ్రీకృష్ణరాజ వొడయరుగారు 1868 డిశంబరు 31 వ తేదీన ఆ నాటి బ్రిటిష్ కమిషనరుగారు వ్రాసిన లేఖలోను, 1868 జూలై 20వ తేదీన ఇండియా ప్రభుత్వమువారు జారీచేసిన జాబీదులలోను ఆ స్వాములవారికి మరియాదచేసి గౌరవించవలసినదని బ్రిటిషు రాజ్యములోని ఉద్యోగులు హెచ్చరింపబడిరి.

ఇటీవల 1961 లో శృంగేరి పీఠాధిపతి చెన్నపట్నములోను, విజయవాడ మొదలగు పట్టణములలోను బంగారు పల్లకిలో నూరేగినపుడు దాని నప్పుడప్పుడు వీధి కడ్డముగా పట్టుట వలువురు చూచియున్నారు.

ఇట్లు పల్లకిని అడ్డముగా పట్టించి వూరేగించు గౌరవమును పూర్వమీ పీఠము పతిష్ఠించిన శ్రీ విద్యారణ్య స్వాములవారికి పహ్యాద్రిదేశము నేలు రాజులు శక పంవత్సరము 1217 లో (క్రీ. శ. 1305)లో ఇచ్చియుండినట్లు అనెగొంది రాజుల తామ్రశాసనములు రెండు, 1836 లో ధార్వాడు జిల్లా కోర్టులో దాఖలైనవి. మహారాష్ట్ర దేశమునేలిన పీష్వాలు స్వాములవారిని

తమ గురువుగా గౌరవించిరి. మైసూరులోని పాశ్చాత్యాధికారులుకూడా శృంగేరి స్వాములవారికి అర్ధపల్లకీ గౌరవ మున్నదని వ్రాసియుండిరి.

1836 వ సంవత్సరం జూలై నెలలో హుబ్బళి గ్రామమునందు లింగధారుల మతగురువగు శ్రీ సిద్ధలింగయ్య చరంతిగారిని లింగధారులు పల్లకీలో మారేగించుచు ఆ పల్లకిని మధ్యమధ్య వీధిలో అడ్డముగా త్రిప్పుచుండిరి. స్మార్త బ్రాహ్మణులిది చూచి ఆ దేశమునందు అర్ధ పల్లకీలో మారేగు గౌరవము శ్రీ శృంగేరీ స్వాములవారికి మాత్రమే కలదని, ఇతరులట్లూరేగుటకు వీలులేదని ధార్వాడ జిల్లా కోర్టులో దావా దాఖలుచేసిరి. ఆ కేసులోనే పైనచెప్పిన రాజశాసనములు దాఖలైనవి. అయితే వానిని గూర్చి క్రింది కోర్టువారు విచారించలేదు. దానిపైన బొంబాయి సదరు అదాలత్తు కోర్టులో దాఖలైన అప్పీలులోని న్యాయాధిపతులు వారికిగల హక్కులను గూర్చి అభిప్రాయభేదమును సూచించిరి. అంతట ఆ కేసు ప్రీవీ కౌన్సిలుకు పోవగా వాది దావా సంగతులు నిజమైనవే యని ఎంచినప్పటికిని అటువంటి హక్కులనుగూర్చి దావా బొంబాయి రాజధానిలో అమలులోనున్న లా ప్రకారం అక్కడ తెచ్చుటకు వీలుకలదా లేదా యను విషయమును నిర్ణయించవలసినదని సదరు అదాలతు కోర్టుకు 1843 లో రిమాండు చేసిరి. అప్పుడు క్రింది కోర్టు జడ్జీలు 8-2-1846 తేదీన అటువంటి దావా ప్రస్తుత పరిస్థితులలో చెల్లదని తీర్మానించిరి. ఆ తీర్పుపైన నెవ్వరును అప్పీలు చేయనందున అది ఖాయపడినది. ఆ దావా పునర్విచారణలో క్రింది కోర్టు జడ్జియైన బెల్‌గారు —

ఇటువంటి గౌరవము లుంచుటకు, తీసివేయుటకు ప్రస్తుతం రాజాధిరాజులగు బ్రిటిషువారే అధికారులు గనుక వాది వారికి విన్నవించుకొనియుండవలసినదనియు, అయితే ఇటువంటి గౌరవములలో విలువ లేదనియు వ్రాసిరి. ఇంకొక జడ్జియైన బ్రౌనుగారు పల్లకిని అడ్డముగా త్రిప్పి పోయుట అనునది చాలా హాస్యాస్పదమైన ఆచారమనియు, దీనిని అంగీకరించినచో

మరియొకరు ఒంటికాలిపైన నిలిచి యుండుటకు హక్కు కలదని గాని సాష్టాంగ ప్రణామములు చేయుచు ఒక గుడినుండి యింకొక గుడికి పోవుటకు హక్కు కలదనిగాని వాదింతురనియు అభిప్రాయపడెను. ఈ తీర్పును తరువాత బొంబాయి హైకోర్టులో వచ్చిన దావాలలో న్యాయమూర్తులు పేర్కొనిరి. పూర్వం విజయనగర సామ్రాజ్యమునేలిన చక్రవర్తుల కాలమున వారికి సామంతులుగా మధురరాజ్యము నేలిన ఆంధ్రనాయక రాజవంశీయుడగు రంగకృష్ణ ముద్దు వీరప్పగారు 1888 లో మశూచికమువలన చనిపోయెను. ఆయన భార్య గర్భస్థ శిశువగు విజయరంగ చొక్కనాధుడు మధురకు రాజయ్యెను. అతని బాల్యకాలమున పితామహియగు రాణి మంగమ్మగారే ఆ రాజ్యమును పరిపాలించెను. అప్పు డామెక్రింద మహామంత్రిగా నుండిన దళవాయి నరసప్పయ్యగారు అఖండ రాజ్యతంత్రజ్ఞుడును మహావీరుడునై ఆ రాజ్య వ్యవహారమును చక్కగా నిర్వహించెను.

ఆ కాలమున నా రాజ్యమునందు క్రైస్తవమత ప్రచారము చేయుచుండిన రోమన్ క్యాథలిక్కు జెస్యూటు మిషనరీలు అక్కడి తక్కువ కులములవారగు నరవరులను పల్లెజనమును తమ మతమున కలుపుకొనుచుండిరి. వారికి చాలా ఆదాయము వచ్చుచున్నను ప్రభుత్వమునకు పన్నులు చెల్లించక లాభము పొందుచుండిరి. వీరు గొడ్డుమాంసమును తిను పరంగి జాతివారని మనవా రసహ్యించుకొనుచుండిరి. క్రైస్తవమత ప్రచారకులలో అవినీతిపరులైనవారి దుర్మార్గమువలన దళవాయిగారికి వారియందు సదభిప్రాయము లేకుండెను. ఆ సమయమున కిటచిస్టులను కొందరు క్రైస్తవమత బోధకులను ఆ కాలములో నిక్కడ మతాచార్యుడుగ నుండిన ఫాదర్ బోషెట్ గారు పనిలోనుండి తొలగించగా, వారు క్రైస్తవమత విరోధులతో చేరి దుష్ప్రచారం చేయసాగిరి. ఇట్టిస్థితిలో క్రైస్తవమత ప్రచారకులు కొందరొక క్రైస్తవ సన్యాసిని హత్యచేసిరి. ఈ నేరమునుగూర్చి దళవాయిగారు విచారించి క్రైస్తవులపైన కఠినచర్య గైకొందురని భయపడి, వారిని

దర్శించి వారి అపోహలను తొలగించి, వారి అనుగ్రహము సంపాదించుట మంచిదని తలచి ఫాదర్ బోషెట్‌గారు మన దేశీయుల ప్రభువుల మర్యాద లను, ఆచారములను ఎరిగినవారై నందున క్రైస్తవ మతాచార్యుడు తమరిని దర్శించుటకు వచ్చుచున్నారని దళవాయిగారికి ముందుగా కబురంపి, తాము కాషాయాంబరములను ధరించి ఒక పీఠాధిపతివలె రాజభవనమునకు వెళ్ళిరి. దళవాయిగారును లేచి మతాచార్యులకు నమస్కరించిన ట్లియనకు నమస్క రించిరి. బోషెట్‌గారు దళవాయిగారిని స్తోత్రముచేసి తాముతెచ్చిన అమూల్య ములైన బహుమతులను సమర్పించిరి. దళవాయిగా రీయన స్తోత్రముల కుబ్బి ఆ బహుమతులను రాణిగారికి చూపించి వచ్చి రాణిగారు ప్రసన్ను లైనారనియు తమ రేమి పనిమీద వచ్చినారని అడిగిరి. బోషెట్‌గారు "మేము కార్యార్థులమై రాలేదు. రాజభక్తి కలిగియుండుట మా మత ధర్మములలో ఒకటి గనుక కేవలం దర్శించి పోవుటకే వచ్చితి"మని గంభీరముగా చెప్పిరి.

అంతట ఈ క్రైస్తవ స్వాములవారికి మన పీఠాధిపతులకు చేయు మర్యాదలనే చేయదలచి బాజా భజంత్రీలతో అడ్డపల్లకిలో మారేగించుచు వారి మఠమునకు తీసికొని పోవుదని దళవాయిగారు ఉత్తరువు చేసిరి. అంతట తమ మతగురువున కింత వైభవము జరుగుచున్నందులకు క్రైస్తవ ప్రజలు సంతోషముతో కేకలిడుచు వెంట పరుగెత్తుచుండగా బోషెట్‌గారిని తిరుచునాపల్లి వీధులలో అడ్డపల్లకిలో మారేగించుచు రాజభటు లాయనను వారి మఠమునకు తీసికొనిపోయి దిగబెట్టిరి.

1565 లో జరిగిన తల్లికోట యుద్ధము తర్వాత విజయనగర సామ్రా జ్యము విచ్ఛిన్నమయ్యెను. సామంతులు స్వతంత్రులైరి. బీజాపూరు గోల్కొండ సుల్తానులు దేశము నాక్రమించి తమ రాజ్యము స్థాపించ సాగిరి. ఉత్తర సర్కారు జిల్లాలు దూరముగా నుండినందువలన సక్రమ స్థిరమైన పరిపాలన లేకుండెను.

ఆ సమయమున పూర్వ రాజుల క్రింద పనిచేసిన సైనికాధిపతులు మొదలైన రాజోద్యోగులు, కొందరాజులు వివిధ ప్రాంతముల నాక్రమించి స్వతంత్ర ప్రభువులైరి. తరువాత గోల్కొండ సుల్తాను వలనను ఔరంగ జేబు గోల్కొండను జయించిన పిమ్మట దక్కను సుబేదారువల్లను గ్రామ ములు ఇజారాపొంది వంశపారంపర్యముగా ఆ నవాబుల నాశ్రయించి జమీం దారులై రాజలాంఛనములు పొందిరి. ఇట్టి ఉదాహరణము లెన్నోకలవు.

నూజివీడు జమిందారుల మూలపురుషుడైన మేకా బసవన్నగారు పైనచెప్పిన పరిస్థితులలోనే గొల్లపల్లిలో స్థిరనివాస మేర్పరచికొని ఒక కోట కట్టెను. ఆయన మనుమడైన కోనప్పగారు 1652 లో గోల్కొండ సుల్తాను అధికారులవలన గొల్లపల్లి పరగణాలలోని ఏబదారు గ్రామములు తవులుకు పుచ్చుకొనిరి. ఆయన కుమారుడైన అప్పన్నగారు 1687 లో గోల్కొండ సుల్తానుగారివలన "రాజబహద్దూర్ అప్పారావు, తహవర్ జలాలత్ ద స్తగహా" అను బిరుదులును, పల్లకిలో నెక్కి ఢంకా దమారా లతో నూరేగు గౌరవమును పొందిరి. ఇట్లే దేశములోని ఇతర జమీం దారులు రాజులైరి. మహమ్మదీయ ప్రభువులు కొందరు తమతమ రాజ్య ములలోని దేశపాండ్యాలకు పల్లకిలనెక్కి తిరుగు గౌరవముల నిచ్చి దాని వ్యయమునకై కొన్ని గ్రామములు పల్లకీ యినాముగా ప్రసాదించినట్లుకూడ లిఖితాధారము లున్నవి. వీనినిగూర్చి ఇంగ్లీషు ప్రభుత్వ కాలమున న్యాయ స్థానములు తీర్మానించియున్నవి.

# 10. విస్మృతములైన కుడి యెడమ కులకక్షలు

కుడి యెడమ కులకక్ష లనేవి దక్షిణ హిందూదేశంలోని తెలుగు, అరవ జిల్లాలలో ముఖ్య పట్టణాలలోనూ, పెద్ద గ్రామాలలోనూ శూద్ర కులాలవారిలో బయలుదేరి మొన్న మొన్నటివరకూ అతి తీవ్రంగా చెల రేగుతూ వుండేవి.

ఈ కక్షల పుట్టు పూర్వోత్తరాలను గురించి సరిగ్గా చెప్పడం చాలా కష్టం గాని ఇంగ్లీషువారు యీ దేశానికి రాకపూర్వంనుంచీకూడా యివి వున్నట్లు కనబడుతూ వున్నాయి. ఈ తగాదాలు సాధారణంగా ఒక కులం వారు పాటించే ఆచారాలను గురించీ, అనుభవించే మర్యాదలను గురించీ వచ్చేవి. ఉదహరణానికి ఒక కులంలో పెళ్లి జరిగినప్పుడు పెళ్లికుమార్తె, పెళ్లికుమారుడూ గుర్రంగాని, పల్లకిగాని యెక్కి బాజాలతో ఊరేగడానికి తమకు మాత్రమే హక్కు వున్నదనిన్నీ, ఇంకొక కులానికి వుండకూడ దనిన్నీ పట్టుదలతో పౌరుషం నిలబెట్టుకోవడానికి రెండవ పక్షంవారు అలాగ ఊరేగుతూ వున్నప్పుడు వారిని అటకాయించడమూ అందువల్ల ఉభయ పక్షాలవారికీ దెబ్బలాటలు జరిగి దొమ్మీలు, హత్యలుకూడ జరుగుతూ వుండడమూ పరిపాటి అయిపోయింది. ఇలాంటి సందర్భాలలో కొన్ని కులాలవారు ఏకమై ఒక కట్టుగా వుండడమూ, మరికొన్ని కులాల వారు ఏకమై వీరికి వ్యతిరేక పక్షంగా వుండడమూ, అందువల్ల యీ తగాదాలు అతి తీవ్రంగా జరుగుతూ వుండడమూ సర్వసామాన్యం అయింది.

ఇలాగ శూద్ర జనసంఘము రెండు పక్షాలుగా చీలి సదా పోట్లాడు కుంటూ వుండేవారు. దీనికే కుడి యెడమ కుల కక్షలని పేరు వచ్చింది.

ఇంగ్లీషు పరిపాలన వచ్చినతరువాత చాలాకాలంవరకూ తూర్పు ఇండియా కంపెనీవారూ, వారి అధికారులూ యీ కులాచారాలను సంప్రదాయాలను బట్టి వారి వారికి ఏర్పడిన హక్కులను కాపాడి అవి సరిగా అమలు జరిపించడానికి ప్రయత్నించేవారు. అయితే యిందులో ఒక చిక్కు వస్తూ వుండేది. తగాదా వచ్చినప్పుడల్లా యీ తగాదాకు సంబంధించిన కులాచారాలలోనూ, మర్యాదలలోనూ ఏది నిజమైనది, ఏది కల్పితమైనది, ఎవరిది ధర్మపక్షం, ఎవరిది అధర్మపక్షం అని నిర్ణయించవలసి వచ్చేది. ప్రభుత్వ కచ్చేరీలు, కోర్టులు యీ తగాదాలతో నిండిపోయేవి. క్రమ క్రమంగా ఇంగ్లీషు పరిపాలన గట్టిపడి క్రైస్తవ మతాచార్యుల పలుకుబడి హెచ్చుగా యీ ఆచార భేదాలను, మర్యాదలను క్రైస్తవ ప్రభుత్వం పాటింపవలసిన పని లేదనిన్నీ, ఏ కులంవారైనా ప్రజలందరూ సమానులే ననిన్నీ, హెచ్చుతగ్గు లుండకూడదనిన్నీ, అన్ని వ్యవహారాలలోనూ, బహిరంగ స్థలాలలోనూ, రాజబాటలలోనూ అందరికీ సమాన హక్కు లుండా లనిన్నీ ఒక సిద్ధాంతం ప్రబలింది. అందువల్ల ప్రజాశాంతికి భంగం కలిగి నప్పుడు తప్ప ఎవరు ఎలాగ ఊరేగినా, ఏ వుత్సవాలు చేసుకున్నా ప్రభుత్వాధికారులు జోక్యం కలిగించుకోవడం మానివేశారు. బళ్లారి డిస్ట్రిక్టు మునసబుగారైన శ్రీ పి. తిరుమలరావుగారు కుడి చెయ్యి, ఎడమ చెయ్యి కులకక్షలను గురించి తమ ఎదుట 1876 లో విచారణకు వచ్చిన 677 వ నెంబరు అసలు వ్యాజ్యంలో తీర్పు చెపుతూ యీ కుల కక్షలను గురించి యిలాగ వ్రాశారు.—

దక్షిణ హిందూదేశంలో ముఖ్యంగా దత్తమండలాలలో యీ ప్రాంతాలలో అన్ని పెద్ద పట్టణాలలోనూ, గ్రామాలలోనూ హిందూ సంఘంలోని కింది జాతులలో అనగా బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులు కావట్టి శూద్రులలో సర్వసాధారణంగా రెండు కక్షలు వుంటూవున్నాయి. ఈ కక్షలను సామాన్యంగా కుడి యెడమ కక్షలని అంటున్నారు. వీటిల్లో కుడి

చెయ్యి కులములను దైవాచార కులము లంటారు. ఈ కుల కక్షలో లింగ ధారణము చేసినవారు సాలెవాండ్రు, తెలికలవాండ్రు, కుట్రపు పనివాళ్లు, రెడ్లు, వ్యవసాయకులు, బలిజలు, గొఱ్ఱెల కాపరులు, కుమ్మరులు, చెప్పులు కుట్టేవాళ్ళు, బుట్టలల్లేవాళ్లు, గొల్లవాళ్ళు, చాకళ్ళు, మంగళ్ళు, జోగులు, బుడబుక్కలవాళ్లు లింగములు కట్టుకున్నవా ళ్లుంటారూ, మాలలున్నూ పరయాలలో కోటగార్లున్నూ చేరియున్నారు.

ఇక ఎడమచెయ్యి కులకక్షిలోనివారిని పాంచాలు లంటారు. వీళ్లలో ద్విజులలాగనే జందెములు వేసుకునే అయిదు తెగలబత్తులు - బంగారము, వెండి పనిచేసే కంసాలిబత్తులు, రాగి యిత్తడి పనిచేసే కంచరిబత్తులు, కఱ్ఱపనిచేసే వడ్లబత్తులు, ఇనుపపనిచేసే కమ్మరిబత్తులు, రాతిపనిచేసే శిల్పులున్నూ, పాటగారులనే రంగులు వేసేవారున్నూ, దేవాంగులు అనగా జందెములు వేసుకునే నేతగాండ్రున్నూ, పరయాలలో చెప్పులుకుట్టే మాదిగవాళ్ళున్నూ చేరియున్నారు.

ఈ రెండు కులకక్షలవారూ ఒకరికన్న రెండవవారు ఎక్కువవార మనిన్నీ ముందు తమకే మర్యాద జరగాలనే గౌరవంకోసం ఎల్లప్పుడూ తగాదాలు పడుతూవుంటారు. అనాదికాలంనుంచి యీ రెండు కులకక్షల వారికి వారివారి మర్యాదలు జరుపుకోవడానికి, వారివారి మతాచారాలు నడుపుకోవడానికి ప్రత్యేక వీధులు ఏర్పడివున్నాయి. వీరికి వేరువేరు దేవుళ్ళు, దేవతలు వున్నారు. ఒక కులకక్షికి చెందినవారు రెండవ కులకక్షికి చెందిన వారి వీధులగుండా ఊరేగింపులు చేసుకోకూడదనే నిషేధాలు అనాదిసిద్ధంగా వుంటూవున్నాయి.

ఇంగ్లీషు పరిపాలనలో ప్రజలు తెలివిమీరినకొద్దీ యీ నిర్బంధా లన్నీ క్రమక్రమంగా పోతూవున్నాయి. ఇంగ్లీషు పరిపాలనలోకూడా న్యాయస్థానాలు తమ డిక్రీలద్వారా యీ నిర్బంధాలను అమలు జరుపుతూ

వచ్చినమాట వాస్తవమేగాని ఈ విషయంలో పూర్వపు అధికారుల అభి ప్రాయాలకూ, ఇప్పటి అధికారుల అభిప్రాయాలకూ చాలా తేడా వుంది.

"ఇతరులకు యిబ్బంది కలిగించనంతవరకూ ప్రతి వ్యక్తికీ బహిరంగ మైన రహదారీలను స్వేచ్ఛగా వుపయోగించుకొనేటందుకు యిప్పుడు హక్కుకలిగి వున్నది. ఈ హక్కు పూర్వము చలాయించలేదనే సంగతి యికముందు చలాయించకపోవుటకు కారణం కాజాలదు. ఇప్పుడు ఒక వూరేగింపుకు అనుజ్ఞ యివ్వడంగాని, దానిని నిషేధించడంగాని కేవలమూ మేజస్ట్రేటుయొక్క విచక్షణమీదనే ఆధారపడి యున్నది. ప్రజల క్షేమము నకు బాధ్యత వహించేవాడు మేజస్ట్రేటే" అని తీర్పులో వ్రాశారు. (The Madras Revenue Register vol. x pp 9-13) మెకంజీ దొర గారు సేకరించిన స్థానిక చరిత్రలు కైఫియతులు మొదలైన పురాతన కవిలె లలో యీ కుడి యెడమల కులకక్షలను గురించిన దస్తావేజాలు చాలా వున్నాయి. అవి యిప్పుడు చెన్నపట్నం ప్రాచ్యలిఖిత పుస్తక భాండా గారంలో వున్నాయి. ఉదాహరణానికి 62వ సంపుటంలోని ఒక దస్తావేజు వల్ల యీ కులకక్షలను గురించి యింకా కొన్ని వివరాలు తెలుస్తున్నాయి.

ఈ దస్తావేజులవల్ల అప్పుడు వాడుకలో వున్న తెలుగు భాషా స్వరూపంకూడా తెలుస్తుంది. *

(అన 1842 వం॥ ది 3 నవంబరు)

**మకాం దాచేపల్లి**

మహారాజశ్రీ గుంటూరు జిల్లా మేజస్ట్రేటువారి సముఖానకు తప నపుకరు వెలిదండ్ల దానప్ప హెడ్డాపు పోలీసు ఠాణే దాచేపల్లి వ్రాసుకున్న అర్జీ విన్నపము.

* Local Record vol. 62, Oriental Manuscript Library Madras.

ఈ జిల్లాలోనేమి, యితర జిల్లాలలోనేమి కుడి యెడమ కులాల వారిలో కులాచార విషయమై స్వల్ప సంగతులను గురించి గొప్ప కలతలున్ను, ప్రాణహానిన్ని సంభవిస్తూ వున్నది గనుక యిలాగంటి దుర్మార్గములు జరుగకుండా ఏ ప్రకారం జరిగిస్తే నిలిచిపోతవో అందున గురించి అవలంబించవలసిన యుక్తమయిన మార్గమును గురించి నా అభిప్రాయమున్ను ప్రతి కులస్తులలో ముఖ్యమయినవారిని పిలిపించి వారికి ఏ యే మర్యాదలు, యేమేమి బిరుదులు జరగవలసినవో ఆ బిరుదులు వారికి యే విధంగా రాబడ్డవో అలాగంటి బిరుదులు అన్నిన్ని జరిగించే పక్షం వచ్చే లాభమేమో నిలిపివేసే పక్షముకు సంభవించే చెరుపు యేమో విచారించి జమీరు చేసేదనిన్ని పోయిన నెల ది 21 తారీఖున దయచేయించిన 16 నంబరు సరికిలేరు హుకుం ది ౨౨ తారీఖున రాత్రి నాకు చేరి అందుల సంగతులు గ్రహించి మనవి వ్రాసుకొనేది యేమంటే :—

తాలూ మజుకూరు యిలాకాలో కుడి యెడమ కులాలు అనే వాదిక లేదు గాని యితర జిల్లా యిలాకాలో యీ వాదిక కలిగి వున్నట్లున్ను కుడి అనగా మహానాటివారు అనిన్ని, యెడమ అనగా మత్తులో చేరిన కంసాలులు, గొల్లలు, ముతరాచలు, మాదిగలు వగయిరాలు అనిన్ని తెలియవస్తూ వున్నది. ఈ రెండు విధాలవారిలో పెండ్లిండ్లు మొదలైనవాటిలో యేమేమి కలతలు వుంటూవున్నవోనని విచారించినంతలో మహానాటి కులస్తులలో మాల కులస్తులు గుర్రాన్ని యెక్కి వూరేగడముకు మాత్రం కొన్ని గ్రామాదులలో కలతలు వున్నట్లున్ను, తతిమ్మా కులాలలో వారి వారి కులాచారం తారతమ్య ప్రకారం గుర్రాలు, పాలకీలు మొదలయినవి యెక్కి భజంత్రీలు వగయిరా మేళాలతోకూడా పెండ్లిండ్లలో వూరేగడం మొదలయినవి జరిగించుకునే యెడల యెడమ కులస్తులవల్ల ఆటంకమయి వున్నట్టున్ను తెలియలేదు. మాలవాండ్లు గుర్రాన్ని యెక్కి వూరేగేయెడల కొన్ని గ్రామాదులలో హర్షించి వున్నట్టున్నూ తెలియవస్తున్నది. యెడమ కులస్తులలో కంసాలీలు మొదలయిన పంచదాయీలవాండ్లు పెండ్లిండ్లు చేసుకునే యెడల గుర్రాన్ని యెక్కి వూరేగడముకు వచ్చిన మేళం బొత్రాయి

అనగా గ్రామం కట్టేటప్పుడు స్తంభ ప్రతిష్ఠ కాలమప్పుడు పాతబడ్డ రాతి స్తంభం దగ్గర వాదార్చకపోయినా మహానాటివారు ఆటంకంచేసి కల్తి జరిగిస్తూ వున్నట్టు తెలియబడుతూ వున్నది.

విశేషించి పిండ్లగురువు అనే యీ కులస్థుడే సంచారం వచ్చేయెడల పగలు కంచు దివిటీలు మొదలయిన బిరుదులు వేసుకుని వచ్చిన పక్షముకు ఆటంక పెట్టడమున్ను యిందువల్ల వుభయులకు కల్తి సంభవిస్తూ రావడమున్ను వున్నట్లు తెలియబడుతూ వున్నది.

గొల్లవాండ్రున్ను గుర్రాన్ని యెక్కి వూరేగే పక్షముకు కల్తి సంభవిస్తూ వున్నట్టు తెలియవచ్చుచున్నది.

ఈ యెడమ కులాల్లో చేరిన మాదిగవాండ్లు నాలుగుతట్లా పట్టుకునే పుల్లెడ, తెల్లకత్తి, కాలికి గజ్జ కట్టుకుని గ్రామంలోకి వచ్చే పక్షముకు మహానాటివారు ఆటంకము చేయడమున్ను వుభయులకు కల్తి జరుగుతూ వున్నట్టున్ను తెలియవస్తున్నది.

తతిమ్మా ముతరాచలు మొదలయినవాండ్లు పెండ్లిండ్లు చేసుకునే యెడల గుర్రాన్ని యెక్కి వూరేగడం మొదలయినవి జరిగించుకోవడంలో మహానాటివారు ఆటంకపెట్టటమే కాని అందువల్ల కలత సంభవించడమే కాని లేనట్టు తెలియబడుతూ వున్నది. ఈలాగున సంభవించడమునకు అనగా యీ వుభయవారలకు వుండే విరోధములు పూర్వోత్తరం తెలియడంకు యెంతదూరం విచారించినా రూఢి అయిన సంగతి తెలియబడదు. (శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారి 'గద్య చింతామణి' పుటలు 149 - 151.)

## 10 ఎ. ఆర్కాటు పట్టణంలో కుడి యెడమ కులాల కొట్లాట

ఆర్కాటు పట్టణ మిప్పుడు తమిళనాడు రాష్ట్రంలో చేరి వున్నది. ఈ దేశమంతా విజయనగర సామ్రాజ్యంలోని భాగంగా వుండి మహమ్మ

దీయ నవాబు లా సామ్రాజ్యాన్ని విచ్ఛిన్నం చేసినతరువాత కర్ణాటక నవాబు పరిపాలనలో చేర్చి అతడు దానిని ఇంగ్లీషువారికి సమర్పించగా, మద్రాసు రాజధానిలో ఉత్తరార్కాడు జిల్లాగా వుండేది. ఈ జిల్లాలోని జనంలో తెలుగు, అరవం మాట్లాడే హిందువులు అధిక సంఖ్యాకులు. ఆర్కాటు పట్టణం కర్ణాటక నవాబు రాజధానిగా నుండగా తురక జనంకూడా వృద్ధి చెందారు. అందువల్ల అక్కడి మొహరం పండుగ చాలా వైభవంగా జరిగేది. ఆ వూరేగింపు చూడడానికి హిందూ జనం మూగేవారు హిందూ కులాలలో కుడి యెడమ కులకక్ష లుండేవి.

1792 లో జరిగిన మొహరం పండుగ వూరేగింపులో ఒక విషాద సంఘటన జరిగింది. ఆ వూరేగింపులోనికి యెడమ కులానికిచెందిన ఆసామీ ఒకడు పసుపుపచ్చని ముచ్చెల జోడు తొడుగుకొని రాగా కుడి కులానికి చెందిన ఆసామీ అతడి నా ముచ్చెలు తీసివెయ్యమన్నాడు. అంతట వాడు 'నేను తీయను, తీస్తే వాటిని నీ నెత్తిమీదనే పెడతాను' అని దురుసుగా అన్నాడు. వారు తిట్టుకుంటూ వుండగా కుడి యెడమ కులాలవారు గుమి గూడారు. పెద్ద ఘర్షణ జరిగి వొకరి నొకరు దూషించుకుంటూ కొట్టు కొవడం ప్రారంభించారు. కొందరు కర్రలతో వచ్చారు. ఆ దెబ్బలాటలో ఒక వర్తాబత్తుడి తల పగిలింది. అంతట కొట్లాట తీవ్రరూపం దాల్చింది. ఉభయ కులాలవారూ బల్లెములు, జానికితాడు కర్ణాటక తుపాకులు తెచ్చి ఒకరి నొకరు పొడుచుకోవడం, కాల్చుకోవడం జరిగి యీ కొట్లాటలో కొందరు దుర్మరణం పొందారు. చాలామందికి గాయాలైనవి.

(In good old days of John Company Page 433)

## 10 బి. ఘంటసాలలో కుల కక్షలు

పూర్వం నూట పాతిక సంవత్సరాల క్రిందటి వరకు తెలుగు దేశం లోని పల్లెటూళ్ళలో కులాచారముల పట్టింపులు చాలా ప్రబలంగా వుండి తగాదాలు, కొట్లాటలుకూడా జరిగేవి. కుడి కులవర్గానికి చెందిన మాలవాళ్ల కాలికి గజ్జె కట్టేటప్పటికి యెడమ కుల వర్గానికి చెందిన మాదిగలకు ఇవ

మెత్రిది. ఎడమకుల వర్గానికి చెందిన కంసాలి బత్తులను ఘంటసాలలో వారిండ్లలో వివాహాలు జరిగేటప్పుడు ఇంటికి సున్నం వేసుకోకుండాను, ఇంటిముందు నాలుగు గుంజలతో పందిరి వేసుకోకుండాను ఆటంకపరిచే వారని, కొన్నికులాలను పల్లకిలెక్కి వూరేగనిచ్చేవారు కారని శ్రీ గొట్టిపాటి వెంకట సుబ్బయ్యగారు ఘంటసాల చరిత్రలో వ్రాశారు. (పుట 501)

## గుంటూరు గ్రామాలలో తగాదాలు

"విజయ ధ్వజ" అను గ్రంథమును రచించిన శ్రీ వి. యన్. శర్మ గారు విశ్వబ్రాహ్మణ కులమువారిని శివాలయ విగ్రహ ప్రతిమలను చేయ కుండా బ్రాహ్మణులు నిరోధించినారని, ఆ సందర్భంలో గుంటూరు జిల్లా మునసబు కోర్టులో OS 26/1911 నెంబరు దావాలో విశ్వబ్రాహ్మణుల హక్కు స్థిరపరచినారని వ్రాసి, వంద సంవత్సరముల క్రిందట సంబూరులో మహానాటి సమ్మె అనేది జరిగినదని దానిని సెట్టికుల సమ్మె అనికూడా అంటారని, అందులో అన్ని తెగల తెలగాలు, బలిజలు, మాలలు మొద లైన కుడి కులాలవారు కలిసి ఎడమ కులాలవారిని బాధించారని, ముఖ్యంగా పంచాణమువారనే కంసాలులను చాలా బాధలు పెట్టారని, వారు వివాహము లలో గృహాలంకరణములు చేసుకోకుండాను, పల్లకిలలో వూరేగకుండాను ఆటంకపరిచారని, గుంటూరు సమీపమున కాజ గ్రామ కాపురస్థులయిన గుత్తికొండ వెంకటాచారి అనే పంచాణ శాఖీయు నింట వివాహ సందర్భ మున అమీన్‌బాదులో వూరేగింపు చేస్తూవుండగా పల్లకి విరుగగొట్టి కంసాలి కులస్థులపైన దౌర్జన్యం చేసినారని, అప్పుడు కుడి కులాలవారిపైన దాఖలైన కేసులో కొందరు తెలగాలు మొదలైనవారు శిక్షింపబడినారని వ్రాశారు. (పుట 136 – 137)

## 10 సి. ఫ్రెంచి టవును యానాములో కుల కక్షలు

బ్రహ్మశ్రీ శతావధాని వెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు తమ చిన్న తనంలో కాశీకి వెళ్ళినప్పుడు సుప్రసిద్ధ పండితులైన శ్రీ ద్రావిడ సుబ్ర

హృశ్య శాస్త్రిగారి కుమార్తె వివాహమున వధూవరులను గుఱ్ఱముపై నూరేగుట చూచితిమనియు, పూర్వకాలంలో పల్లకిని, జోడు కాగడాలను, సింహతలాటము మురుగులను లైసెన్సు లేనిది యెవ్వరు నుపయోగింప వీలు లేదనియు 8-8-1948 తేదీన ఆంధ్ర పత్రికలో వ్రాసియున్నారు. దేశము తెలుగుమీరిన సిమ్మట ధనముగలవారి యాచారములను తృణీకరించి వారనియు, ఒక మోతుబరి రైతు జోడు కాగడాలతో నూరేగుచుండగా రాజభటు లాతని నాటంకపరచి దీనిని మీ కెవరిచ్చిరని యడుగగా నా యాముదపుచే నిచ్చినదని యాతడు బింకముగా జవాబు చెప్పెనని తిరుపతి వేంకట కవులు తమ గిరతమున చమత్కరించిరి.

వెంకటశాస్త్రిగారు జరిగిన కథ నుదాహరించారు :

ఇప్పటికి నూరేండ్ల క్రిందట ప్రజా ప్రభుత్వముగల ఫ్రెంచి టవునగు యానాంలో నుండిన పల్లెజాతివారి యింట వివాహంలో వధూవరులను పల్లకిలో నూరేగింపదలచి ఆ యూరి కాపులవలన ఆటంకం కలుగకుండా నుండుటకు పోలీసు సిబ్బంది సహాయమును సంపాదించిరి. పూర్వకాలం నుండియు పల్లెజాతివారు పల్లకిలలో నూరేగు ఆచారం లేదని, యానాంలోను చుట్టుపట్ల సముద్రతీర గ్రామములైన పీలపల్లి, తాళ్ళరేవు, కోరంగి, తిర్ఱాలమొండి, పండిపోరు మొదలగు గ్రామములలోను చేపలు పట్టుచు జీవనంచేయు "మలకాళ్ళ" మొదలగు పల్లెజాతివారిలో కొందరు ధనవంతులుండి, పల్లకిలలో నూరేగుట కుత్సాహ పడుచుండిరి. అందువలన యానాం గ్రామంలో నీ యూరేగింపు చూచుటకు ఆ చుట్టుపట్ల గ్రామాలనుండి వేలకొలది పల్లెజాతివారు వచ్చిరి. కాపు కులమువారి వీధులలో పల్లెజాతివారిట్లూరేగుట కాపు కులంవారి కవమానకరంగా తోచెను. అయితే పోలీసు సహాయ మున్నందువలన వా రేమియు చేయజాలక ఆ యూరేగింపు జరుగు సమయమున తమ తలుపులు మూసికొనిరి.

యానాంలో నింత వైభవంగా నూరేగింపు జరుపగలిగినందులకు పల్లెజాతివారు సంతోషించి, కాపులుండు శివారు గ్రామమైన కనగాలపేటలో

కూడా వూరేగింపు జరిగింపవలెనని యుత్సాహంతో బయలుదేరిరి. యానాములో కాపులవలన నెట్టి యాటంకం కలుగలేదుగదా యని పోలీసు సిబ్బంది వెనుకకు తగ్గెను. కనగాలపేట గ్రామందగ్గర కోడు అను సహజమైన ఏరొకటి దాటవలసి యుండెను. అది యరఫర్లాంగు వెడల్పుండును. పల్లెజాతివారు దానిని దాటివచ్చి వూరేగదలచినారని కనగాలపేట కాపులకు తెలియగానే వారొక చిత్రమైన యుపాయమును చేసిరి. జనపనార కట్టలను కట్టి కోడు ఒడ్డున పడవైచి వానిపైన తెల్లబట్టలు కప్పి వసంతం జల్లి ఆయుధపాణులై కావలి కాచుచున్నట్లు నటించిరి. అప్పుడే ప్రొద్దు గ్రుంకుచుండెను. అప్పుడా కోడును దాటి వచ్చుచున్న మఱకాళ్ళలో ముందు వచ్చిన వారీ దృశ్యమునుచూచి, తమకన్న ముందు వచ్చినవారిని చంపి, వారి శవములదగ్గర కాపులిట్లు నిలిచియున్నారని భ్రమపడి, ఆ భయంతో, గ్రామం తూర్పువగల చాలా లోతైన గోతమిపైపునకు పరుగెత్తిపోయి, దానిలోబడి ఈదుకొని ప్రాణములు దక్కించుకొనిరి. ఇట్లు మఱకాళ్ళలోని బహు సంఖ్యాకులు పలాయనంకాగా పెండ్లివారి ముఖ్య బంధువులు, పెండ్లి పల్లకీని మోయు బోయీలును కాపుల చేతుల్లో దెబ్బలు తిని వెనుకకు పారిపోయిరి. బోయీ లెట్లో పల్లకీని యానాం చేర్చగా, అక్కడి కాపులా పల్లకీని విరిచి ముక్కలుచేసి గోదావరి తూములో క్రుక్కిరి. వధూవరులు మాత్రం ప్రాణములతో ఇండ్లు జేరిరి. అంతట యానాం కాపుల కావేశం కలిగి, పల్లెగూడెంలో ప్రవేశించి దోపిడి చేయుట ప్రారంభించిరి. దీనికి భయపడి పల్లెజాతివారు తమ వెండి బంగారములు నూతులలో పడవేసికొని దాచుకొనిరి.

ఈ దౌర్జన్యం అపుడకు యానాంలోని పోలీసు సిబ్బంది చాలదని అక్కడి యూరొపియను అధికారి కాపు నాయకులదగ్గరకు వచ్చి మందలించి వారింప బ్రయత్నించెను గాని లాభం లేకపోయెను. అంతట యానాంలోని ఫ్రెంచి యధికారులు యీ కాపులింక నేమి దౌర్జన్యం చేయుదురో యని భయపడి, పాండుచేరికి సహాయ మంపుడని తంతి వార్తలను బంపిరి. పాండుచేరినుండి పైనిక దళమును పంపించుచు చామర్లకోట

లోని ఇంగ్లీషు సైనిక దళమును సహాయంగా పంపుడని ఇంగ్లీషు అధికారు లను వారు కోరిరి. ఇంగ్లీషు పటాలం ఉప్పుటేరు దాటి యానాం రావలెను. అంతట కాపులు అక్కడి తొట్టి పడవలకును, వేట నావలకును బొత్తలు కొట్టిరి. అయితే ఇంగ్లీషు సైనికులు లెట్లో పూరుచేరి కాపులలో ముఖ్య నాయకులను పట్టుకొని, ఫ్రెంచి యధికారులకు నప్పగించిరి. అందువలన పాండుచేరినుండి బయలుదేరిన పటాలం వెనుకకు మరలిపోయెను.

పై విధంగా పల్లెగూడెంలో దోపిళ్ళు చేసినారను నేరమునకు కాపు నాయకుల కొరేసి, పదేసి సంవత్సరములు కఠిన శిక్షలు విధించిరి. అట్టి వారిలో కొందరు శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి బాల్యంలో తమ కీ సంగ తులను చెప్పినారని ఆయన 28-9-1937 ఆంధ్ర సచిత్ర వార పత్రిక లోను, 6-9-1948 ఆంధ్ర పత్రికలోను వ్రాసియున్నారు. శ్రీ శాస్త్రిగారు 1870 సం॥లో జన్మించినందువల్ల యీ చరిత్ర ఆ కాలంనాటిది.

## 11. కాంచీపురము

"కథ కంచికి వెళ్ళింది"

సీ॥ చేతిలో వెన్నముద్ద చెంగల్వ పూబంతి
            రంగైన ముత్యాల రావిరేక
    పచ్చలుఁదాపిన పతకంబు పులిగోరు
            మేలైన ముత్యాల మేలు సరము
    నీలాలప్రోఁగులు నిగ్గులు మెఱయంగఁ
            దీరుగై కొప్పు కస్తూరి బొట్టు
    ధగధగద్ధగ కాంతిమిగులు రత్నకిరీట
            మలరారు పసిడిదువ్వలువ చెలువ

గీ. మానలూరింప వైశాఖ మాసమందు
బసిడిరథమెక్కి తిరువీధి బయలువెడలు
నిన్నుఁగంటి నా కోర్కెలన్నియునుగంటి
పరగుణ నమాజ। శ్రీ కంచి వరదరాజ।

తెలుగు దేశంలో ఆబాల గోపాలమూ చదివే పద్యానికి
పాఠాంతరమైన చాటుపద్య మిది.

"కథ కంచికి వెళ్ళింది మనమింటికి వచ్చాము" అని చెప్పి కథ ముగించడం తెలుగువారికి చిరకాలంనుంచి అలవాటు. "కంచికివెళ్ళి మంచి మొగుణ్ణి తెచ్చుకుంటా"నని చెప్పి బయలుదేరిన దోమసాని కథకూడా చాలామంది ఎఱిగినదే। ఇవిగాక కంచికి సంబంధించిన అనేక కథలు గాథలు, పాటలు పదాలు, సామెతలు మన దెలుగు దేశంలో వ్యాప్తిలో నున్నవి.

ప్రస్తుతం అరవం మాట్లాడే దేశం మధ్యలో నెక్కడనో వున్న యీ కంచికిని మనకును యింత దగ్గర సంబంధం ఎలాగు ఏర్పడినది? అది యెప్పు డేర్పడినది? అనే ఆలోచనలు అప్పుడప్పుడు కలుగకమానవు. ఇది తెలుసుకోవాలంటే దక్షిణాపథ చరిత్రను పరిశీలించవలసి యున్నది.

చరిత్ర ప్రసిద్ధమైన కాంచీపురమే కంచి. ఇది బహు పురాతనమైన పుణ్య నగరం. ఇది కాశి, గయా ప్రయాగములతో సమానమైన దివ్య క్షేత్రముగా పేర్కొనబడి యున్నది. క్రీస్తుకు పూర్వం మూడు వందల సంవత్సరములక్రిందట నుండిన పతంజలి దీనిని ప్రశంసించియున్నారు.

కంచిలో సుప్రసిద్ధములైన దేవాలయము లున్నవి. ఇది శివక్షేత్రమే గాక విష్ణుక్షేత్రముకూడ. మూకకవి తన పంచశతిలో స్తుతించిన కామాక్షి దేవి యిక్కడి అమ్మవారు.

ఒక కాలమునం దీ పట్టణం బౌద్ధమయంగా నుండేది. క్రీ. శ. ౨౪౦

వం॥ ప్రాంతమున చీనాదేశంనుండి వచ్చిన బౌద్ధసన్యాసి హ్యూయాన్‌త్సాంగు కంచికి వచ్చి అక్కడి బౌద్ధారామాలను, దేవాలయాలను వర్ణించినాడు.

శ్రీ శంకర భగవత్పాదులవారు కంచిలోనుండి సనాతన ధర్మమును సుప్రతిష్ఠితం చేసినారు. శ్రీ రామానుజులవారుకూడా యిక్కడ కొంతకాల మున్నారు.

ఒకప్రక్క శివకంచి - ఇంకొకప్రక్క విష్ణుకంచి, శైవ వైష్ణవముల మేలు కలయికను దెలుపు స్మార్త వైష్ణవులు నిక్కడి గొప్ప విశేషములు.

క్రీస్తుశకం ఐదవ శతాబ్ది మొదలు తొమ్మిదవ శతాబ్ది వరకును రమారమి ఐదువందల సంవత్సరములు రాజకీయంగా ద్రావిడాంధ్ర దేశముల నేకంజేసి ఆంధ్ర ద్రవిడ నాగరికతలను మేళవించి బౌద్ధ శైవ వైదికమత ధర్మములను సమన్వయంచేసి సనాతన ధర్మము నుద్ధరించి దక్షిణాపథము నందొక మహాసామ్రాజ్యమును స్థాపించి సుమత్రా జావా బలిబోర్నియో ద్వీపములందును శ్యామ కాంభోజములందును కూడా 'ద్రావిడాంధ్ర' నాగరికతను స్థాపించి ప్రఖ్యాతులైన పల్లవ రాజుల రాజధాని యీ కాంచీపురం.

దక్షిణ దేశమునందు వారు నిర్మించిన గొప్ప దేవాలయములును, వారు పోషించిన సంగీత సాహిత్య శిల్ప కళలు, వారు పునరుద్ధరించిన మత ధర్మములు, ద్వీపాంతరములందు వారు స్థాపించిన బ్రాహ్మణ సంప్రదాయములును పల్లవ రాజుల చరిత్రను వేనోళ్ళ జాటుచున్నవి.

పల్లవ రాజులు మహాబలవంతులై యుండగా వారి రాజ్యమున తూర్పున చోళమండల తీరం వెంబడిని చోళరాజు లేలిన రాజ్యభాగ మంతయు చేరి యుండుటయే గాక ఉత్తరమున ఆంధ్ర శాతవాహన చక్రవర్తు లేలిన కృష్ణానదికి దిగువగల తెలుగుసీమ యంతయు చేరియుండెను. ఈ విశాల సామ్రాజ్యమున కంతకును రాజధాని కాంచీపురమే.

క్రీస్తుశకం మూడవ శతాబ్దంలోని పల్లవ శాసనము లన్నియు శాతవాహనుల శాసనములవలెనే ప్రాకృతంలో నున్నవి. ౪, ౫ శతాబ్దులనాటి శాసనములు సంస్కృతంలో నున్నవి. ౬, ౭, ౮ శతాబ్దాలనాటివికూడా

సంస్కృతంలోనే వున్నవిగాని వీనికి తమిళ ప్రతులుకూడా చెక్కబడి యున్నవి.

క్రీస్తుశకం ౩ వ శతాబ్దినాటికి దక్షిణాపథం నేలిన శాతవాహన వంశం బలహీనంకాగా వారి సామంతులు స్వతంత్రులు కాజొచ్చిరి. అట్టి వారిలో నొకడైన పల్లవ ప్రభువు అమరావతినే రాజధానిగా జేసికొని కొంతకాలం తెలుగుసీమ నేలినట్లు కనబడుచున్నది. చరిత్రరీత్యా మనకు తెలియుచున్న మొదటి పల్లవరాజు క్రీ. శ. ౨౨౫ - ౫౦ మధ్య కృష్ణానది దిగువ ప్రాంతముల నేలిన బప్పదేవుడు. ఇతని కైదవ తరంవాడైన విష్ణు గోపుడను పల్లవరాజు కాంచీపురమును రాజధానిగా జేసికొని ౩౨౫ - ౩౫౦ మధ్య ఒక విశాల రాజ్యము నేలుచున్నట్లు సముద్రగుప్త చక్రవర్తి శాసనమున చెప్పబడినది. * క్రీ. శ. ౫౭౫ - ౬౦౦ మధ్య కాంచీపురం నేలిన సింహవిష్ణువు పశ్చిమ చాళుక్యరాజైన దుర్వినీతునికిని, తూర్పు చాళుక్య రాజైన విష్ణువర్ధనునికిని సమకాలికుడు. ఇతని యాస్థానముననే మహాకవి భారవి యున్నట్లు చరిత్రాధారములు కనబడుచున్నవి.

ఆ కాలమున కాంచీపురం బౌద్ధులకు మాత్రమేగాక బ్రాహ్మణులకు గూడ ముఖ్యస్థానముగా నుండెను. వేదవేదాంగవిదులైన బ్రాహ్మణోత్తము లనేకులు కాంచీపురమునుజేరి పల్లవరాజుల పోషకత్వమున బరిషత్తులను, వేద విద్యాలయములను నెలకొల్పి స్వమత వ్యాప్తికై కృషిచేయుచు కృతార్థు లగుచుండిరి. ఇక్కడనుండి బ్రాహ్మణులు పల్లవ రాజులచే నగ్రహారము లను సర్వమాన్య భూములను బడసి బ్రాహ్మణులు లేని దేశ భాగములకు పంపబడుచుండిరి. దేశంలో బ్రాహ్మణేతర మతముల నవలంబించిన ప్రజలే విశేషంగా నున్నను, బ్రాహ్మణులు తమ విద్యా ప్రభావంచే రాజుల నాకర్షించి కేవల వైదిక వృత్తులందు మాత్రమేగాక లౌకిక వృత్తుల యందును బ్రవేశించి మంత్రిత్వాధికారములను సహితం పొంది మతాంతరు లతో వైరము పెట్టుకొనక సహనంతో నుండిరి.

క్రీ. శ. ౬౪౦ వ సంవత్సర ప్రాంతమున దక్షిణాపథ దేశములందు

---

* Cambridge Shorter History of India pp. 165-201.

సంచరించిన చీనాదేశపు బౌద్ధ యాత్రికుడైన హ్యూయనిత్సాంగు మొదట వేంగీపురమునకు వచ్చినాడు. దీనికి దక్షిణమున మహాంధ్రము లేక ధాన్య కటక దేశ మున్నదని, దాని నాగరికతను, వైభవమును వర్ణించినాడు. మహాంధ్ర దేశమునకు నైఋతిమూలనుండిన చోడదేశం (కడప మండలం) నకు బోయినాడు. ఆంధ్ర చోడదేశంనుండి కాంచీపురం రాజధానిగామున్న దేశమునకు పోయినాడు. దాని నతడు ద్రావిడదేశమని వర్ణించినాడు.

కాంచీపురం ఐదారుమైళ్ళ విస్తీర్ణంగల పట్టణమనిన్నీ, నూరు బౌద్ధ సంఘారామము లున్నవనిన్నీ, అందు పదివేలమంది బౌద్ధ మతాచార్యు లున్నారనిన్నీ, హిందువుల దేవాలయములు ౮౦ మాత్రమే కలవనిన్నీ దిగంబర జైన సన్యాసులుకూడ వేనకువే లుండిరనిన్నీ అతడు చెప్పి యున్నాడు.

ఇట్లు కాంచీపుర మా కాలమున చాల ప్రాముఖ్యత వహించిన నగరమై దక్షిణాపథమునకు నాయికమణిగా నుండెను. *

క్రీస్తుశకం ౬౦౦ సం॥ ప్రాంతమున కాంచీపురం రాజధానిగా జేసి కొని పల్లవరాజ్యము నేలిన మహేంద్రవర్మ చాలా గొప్పవాడు. మహాబలి పురమున అతని మనుమడు కట్టించిన ఆదివరాహమూర్తి దేవాలయమునం దీయన చిత్రము లున్నవి. క్రీ శ. ౬౧౦ సం॥ర ప్రాంతమున చాళుక్యులు మహేంద్రవర్మ నోడించి వేంగి రాష్ట్రమును లాగికొన్నారు. అప్పుడు మహేంద్రవర్మయొక్క సోదరుడే వేంగికి రాజ ప్రతినిధిగా నుండినాడు. ఆ యుద్ధములలో చాళుక్యులు పల్లవుల నోడించి దక్షిణమునకు తరమినట్లు కనబడుచున్నది.

మహేంద్రవర్మ రసికుడు. సంగీత సాహిత్యములందు ప్రవీణుడు. ఇతడు మత్తవిలాసమను ప్రహసనమును సంస్కృతంలో రచించి సుప్రసిద్ధుడైనాడు. అందా కాలంనాటి రాజకీయ సాంఘిక మత పరిస్థితులు అన్నియు వర్ణింపబడి యున్నవి.

---

* శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు ఆంధ్రుల చరిత్ర I. ౨౪౦.

పల్లవుల చరిత్ర అగాధంగా నున్నది. ఇం దనేక రాజ వంశముల వారు కనబడుచున్నారు.

క్రీ. శ. ౬౩౫ - ౬౦ మధ్య రాజ్యమేలిన నరసింహవర్మ కాలం లోను, ౭౧౫ - ౧౭ మధ్య రాజ్యమేలిన పరమేశ్వరవర్మ కాలంలోనుకూడా చాళుక్యులు పల్లవరాజ్యంపైకి దండెత్తి వచ్చినారు. క్రీస్తుశకం ౮౭౫-౮౫ మధ్య రాజ్యంచేసిన అపరాజితునితో పల్లవరాజ్య మంతరించె నని చెప్ప వచ్చును. చోళరాజైన మొదటి ఆదిత్యుడు అపరాజితు నోడించి అతని రాజ్యమైన తొండ మండలమును జయించి చోళ రాజ్యమును స్థాపించి నాడు. *

శాతవాహనులకాలంలోనే బ్రాహ్మణమతం దక్షిణదేశమున ప్రచారం కొచ్చినది. పల్లవుల కాలంలో బ్రాహ్మణులు రాజాదరణమును పొంది బౌద్ధ మతమును రూపుమాపి వైదిక మతమును పునరుద్ధరించిరి. అనేక దేవాలయములు నిర్మింపబడెను. పల్లవుల దేవుడు ఈశ్వరుడు. అతడు నందివాహనుడు. జటాజూటములు ధరించువాడు. శిరోభాగమున జ్ఞాన మయ మగు చంద్రకళను ధరించి యిందుశేఖరు డైనాడు. మహాయాన బౌద్ధుల బుద్ధభగవానుడే కైలాసగిరిపై తపోముద్రలోనున్న నందివాహను డైనాడు. కాని యీయన బౌద్ధ సన్యాసివలె కుటుంబము లేనివాడు కాడు. భిక్షుకుడేగాని భార్యయగు దాక్షాయణితో కాపురం చేయుచున్నవాడు. మ్రొక్కినవారికి పాపపరిహారం చేయువాడు. అందుచే వెంకటేశ్వరుడై ఆంధ్ర భూమిని వెలసియున్నాడు. ఈయన మంత్ర మహిమచే పల్లవుల యావులమందను నాశనం చేయకుండా వ్యాఘ్రములకు వాకట్టు కట్టువాడు. అందుచే నాయన భార్య వ్యాఘ్రవాహిని. వేంగి యనగా వ్యాఘ్రము. బ్రాహ్మణులు మంత్రప్రభావంచేత బౌద్ధ వ్యాఘ్రమును అరికట్టిరి. వైదిక మతమును మరల స్థాపించిరి. జైన బౌద్ధమతములు వానప్రస్థ సన్యాసాశ్రమ ప్రధానములు. బ్రాహ్మణ మతం గృహస్థాశ్రమ ప్రధానం. జైన బౌద్ధములు వైరాగ్య ప్రధానమైనవి. బ్రాహ్మణ మతం కర్మప్రధానమైనది. జైన

---

* Cambridge Shorter History of India pp. 200-201.

బౌద్ధమును కష్టసాధ్యమైన అహింసను బోధించెను. బ్రాహ్మణ మతం మంత్రబోధితమైన హింసను, యజ్ఞముగా బోధించినది. అందుచే ఈ కాలంలో బ్రాహ్మణ మతం, సంఘమును సరియైన మార్గమగు ధర్మమున నిలువబెట్టినది. యజ్ఞయాగాది క్రతువులు జరుగసాగెను. *

ఈ వైదిక ధర్మ విజృంభణమునందు కాంచీపురమున నొక గొప్ప విశేషం జరిగినది. ఎక్కడను గానబడని శైవ వైష్ణవముల మేలు కలయిక యిక్కడ జరిగినది. ఇక్కడి స్మార్తవైష్ణవుల సంప్రదాయమే దీనికొక నిదర్శనంగా నున్నది. ఇది సనాతన ధర్మ విజయమని చెప్పవచ్చును.

క్రీ. శ. ౧౦౨౨ మొదలు ౧౦౬౩ వరకును రాజమహేంద్రవరమును రాజధానిగా వేంగి దేశమును బరిపాలించి ఆంధ్ర మహాభారతమును కృతినొందిన చాళుక్య రాజైన రాజరాజ నరేంద్రుడు చోళరాజుల యల్లుడు. ఈయన కుమారుడైన రాజేంద్రుడు వేంగి ప్రభువు అగుటయేగాక తన మాతామహుని రాజ్యమైన చోళరాజ్యమునకుగూడ వారసుడై కులోత్తుంగ చోళుడను బిరుదువహించి కాంచీపురమును రాజధానిగా జేసికొని ౧౦౬౩ మొదలు ౧౧౧౨ వరకును రాజ్యము చేసినాడు. అతడు కాంచీపురంనందే యుండి పరిపాలించుచు వేంగికి విజయాదిత్యుని రాజ ప్రతినిధిగా జేసినాడు. అతడు తన తండ్రి కాలంలోనే మహావీరుడై గోదావరి కుత్తరమున వింధ్యాచలమునంటి ప్రస్తుతం మధ్య మాగాణములని వ్యవహరింపబడు చక్రకూట రాజ్యమును జయించియుండెను. అందువలన నితడు తెలంగాణమున కెల్ల చక్రవర్తిగా నుండెను. రాజేంద్రచోళుని తరువాత రమారమి ఒక వంద సంవత్సరము లీ రాజవంశం వారీ విశాల సామ్రాజ్యమును బరిపాలించినారు.

ఇట్లు కాంచీపురం మన ఆంధ్ర చక్రవర్తికి రాజధాని యైనందువలన ఆంధ్రదేశంనుండి వేదశాస్త్ర పారగులైన వైదికులు, రాజ్యనీతి విశారదులైన నియోగికులు, రణనీతి కోవిదులైన క్షత్రియులు, వాణిజ్య నిపుణ

* ఆంధ్రదేశపు చరిత్ర - శ్రీ చిల్లరిగె శ్రీనివాసరావుగారు
పుటలు 23 - 26.

లైన వైశ్యులు, వ్యవసాయమునందు ప్రవీణులైన తక్కిన కులముల వారును కాంచీపురమునకు నిరంతర ప్రవాహంగా పోయి రాజాదరణమును పొంది ధనమును, గౌరవమును సంపాదించుట సర్వసామాన్యమైనది.

మహా పుణ్యక్షేత్రములలో నొక్కటై బహు పురాతనమై చరిత్ర ప్రసిద్ధమై, ఆంధ్ర సామ్రాజ్య రాజధానియై దక్షిణ దేశమునందలి రాజకీయ సాంఘిక మతధర్మములకెల్ల చాలకాలం కేంద్రస్థానమై యుండిన కాంచీ పురం తెలుగువారికి కొట్టిన పిండియై తెలుగువారి కథలలోను, గాథలలోను సాహిత్యలలోను, పాటలలోను యిప్పటికిని వినవచ్చుచుండుటలో మా మన తెలుగు కథలన్నీ "కంచికి వెళ్ళడం"లోనూ ఆశ్చర్యం ఏమున్నది?

# 12. దేశాంతరాలలో ఆంధ్ర నాగరికత

మనకు చిరపరిచితమైన దేశములలో కాంభోజము ఒకటి. భారత వర్షమునందు చెప్పబడు మహాసంకల్పములలో అంగ వంగ కళింగ కాశ్మీ రాది 56 సుప్రసిద్ధ దేశాలలో యిదికూడా పేర్కొనబడుతూ వున్నది.

కాంభోజమనే మాట ఆ దేశపు గుఱ్ఱమునకు, ఏనుగునకు, శ్రేష్ఠ మైన శంఖమునకు పర్యాయపదంగా నున్నది. సంగీతంలోని గొప్ప రాగము లలో నొకదానికికూడా యీ పదాన్ని వాడుతున్నారు. కాంభోజరాజు కథ లని తెలుగులో కొన్ని కథలుకూడా కనబడుతూ వున్నవి.

కాంభోజులు యవన, శక, పహ్లవాదులతోపాటు రామాయణం లోను, హరివంశంలోను పేర్కొనబడి యున్నారు. వీరు మొదట క్షత్రి యులే యైనను వైదిక ధర్మములను, కర్మలను విడనాడివందువల్ల శూద్రు లైనారని విష్ణు పురాణములోను, మనుస్మృతిలోను చెప్పబడియున్నది.

కాంభోజులు, కాశ్మీరానికి పడమరగా ఒక దేశంలోనుండే మ్లేచ్ఛ జాతివారని అనుకొనడమేగాని యీ కాంభోజ మెక్కడ నున్నదో చాలా మందికి తెలియదు. ఇది మన భరతఖండమునకు తూర్పునగల సముద్రమున కవతల కొన్ని ద్వీపకల్పాలు, ద్వీపాలు దాటిన తరువాత నున్నది. ఆసియా ఖండముయొక్క ఆగ్నేయ భాగమున యిప్పుడు కాంబోడియా అని వ్యవహరింపబడుతూ వున్న దేశమే మన కాంభోజము.

ఇది ప్రస్తుతం ఇండో-చీనా అని పిలువబడే దేశంలో సయాం, లావో, కొచిన్‌చీనా, అన్నాం రాజ్యముల మధ్య నున్నది. దీని విస్తీర్ణం ౬౯౦౦౦ చదరపుమైళ్ళు. ఇందిప్పుడు ౨౪ లక్షల ప్రజలున్నారు. వీరు ఆర్య - మంగోలియా జాతుల లక్షణములను కలిగియున్నారు. ఇది ఫ్రెంచి వారి సంరక్షిత రాజ్యంగా నున్నది. స్వాతంత్ర్యమును పొందుటకు పెనగులాడుచున్నది.

కంబుజమనే పదంలోనుండి కాంభోజమనే పేరు వచ్చింది. కాంబోడియా అనేది దీనికి వికృతి. క్రీస్తుకుపూర్వం కొన్నివందల సంవత్సరముల క్రిందటనే హిందూదేశపు తూర్పు సముద్ర తీరములనుండి బ్రాహ్మణమత ధర్మములును, సంస్కృత భాషయున్నూ యీ దేశమునకు వ్యాపించియుండెను. క్రీస్తు శకం ఐదవ శతాబ్దంలో నివి యీ దేశమునందు మరింత ప్రబలమైనవి. ఈ సంగతులు ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా అను ఆంగ్ల విజ్ఞాన సర్వస్వంలో వ్రాయబడియున్నది.

ఇంత దూరమున వున్న యీ కాంభోజానికి తెలుగువారికీ యింత సన్నిహిత సంబంధం ఎలాగ ఏర్పడినది అనేది ఒక చిత్రమైన కథ. కొంచెం జాగ్రత్తగా పరిశీలిస్తే ఒక్క కాంభోజంతోనే గాక యీ తూర్పు సముద్రతీరానవున్న అనేక దేశాలతోను, ద్వీపాంతరాలతోనుకూడా మనకు చాలా సంబంధం వుండినట్లూ మన నాగరికత ఆ దేశాలకు చాలాకాలం క్రిందటనే వ్యాపించినట్లూ తెలుస్తుంది.

## కౌండిన్యుని 'ఫ్యూనాన్' రాజ్యం

ఆశియా ఖండముయొక్క ఆగ్నేయ భాగమునగల ఇండోచీనా(Indo-China) లోను, మలయా ద్వీపకల్పంలోను, జావా, సుమత్రా, బలి, బోర్నియో మొదలైన ద్వీపములలోను భారతదేశ నాగరికత వ్యాపించిన చరిత్రనుగూర్చిన వివరములు కొన్ని చీనా సామ్రాజ్య చరిత్రవలన తెలియుచున్నవి. ఈ ప్రాంతములకుపోయిన చీనాదేశపు రాయబారుల వ్రాతలవలన క్రీ. శ. మొదటి దశాబ్దిలో కౌండిన్యుడను బ్రాహ్మణుడొకడు భారతదేశం నుండి వచ్చి, ఇండోచీనా దేశమధ్యమున చీనావారు ఫ్యూనాన్ (Funan) అని వ్యవహరించిన గొప్ప రాజ్యమును స్థాపించినట్లు తెలియుచున్నది.

ప్రస్తుతం 'అన్నామ్' అని పిలువబడుచున్న చంప దేశంలో కన బడిన క్రీ. శ. ౭వ శతాబ్దినాటి యొక సంస్కృత శాసనంలో ఇండో చీనాలో 'ఫ్యూనాన్'కు రాజధానియైన భవపుర స్థాపన విషయమునుగూర్చి వివరింపబడి యున్నది.

ఈ కౌండిన్యుడు ఇండోచీనా దేశపు రాజ కొమరితను పెండ్లియాడి యొక రాజవంశమునకు మూలపురుషు డైనట్లుకూడా చెప్పబడుచున్నది. తరువాత నీ రాజవంశమును భారతదేశంలోని చంద్రవంశంతో ముడిపెట్టి నారు. తరువాత భారతీయ నాగరికతను క్రమక్రమంగా ఇండోచీనాలో నంతటను వ్యాపింపజేసి యితర రాజ్యంలోకూడ స్థాపించినారు. ఇప్పుడు, కాంబోడియా యని వ్యవహరింపబడు కాంభోజ రాజ్యం వానిలో నొకటి. ఇది మొదట ఫ్యూనాన్ రాజ్యమున కొక సామంత రాజ్యంగా నుండెను. ఇప్పుడు అన్నామ్ అని పిలువబడు చంపరాజ్య మింకొకటి. దక్షిణ సయాం (థాయిభూమి) లోని ద్వారవతి యింకొకటి. బర్మాలో పెరూ రాష్ట్రింలోని హంసావతి మరియొకటి. ఆ రాష్ట్రింలోనే యుండిన అరిమర్దనపుర రాజ్యం మరియొకటి.

## భా ర తీ య సం స్కృ తి

బర్మానంటి క్రిందికిపోయిన మలయద్వీపకల్పంలో భారతీయ సంస్కృతి చాలాకాలం క్రిందటనే నెలకొనినది. బోర్నియోలో క్రీ. శ. ౪వ శతాబ్దినాటి సంస్కృత శాసనంలో మూలవర్మన్ అను రాజు వైదికాచారముల ప్రకార మొక యజ్ఞమును చేయించినట్లు చెప్పబడియున్నది.

జావాలో పశ్చిమ భాగమున పూర్ణవర్మ యను రాజు కాలువ నొకదానిని త్రవ్వించినాడు. తాను శ్రీమహావిష్ణువుయొక్క అంశమున జన్మించితినని చెప్పుకొనుచు అట్లు ప్రవర్తింపసాగినాడు. బలిద్వీపమున నిప్పటికిని భారతీయ నాగరికత కనబడుచున్నది. సుమత్రాద్వీపం పూర్వం సువర్ణద్వీపమని వ్యవహరింపబడుచుండెను. తరువాత జావా (యవ) ద్వీపమునందలి మధ్య భాగమునను, తూర్పు భాగమునను కూడా హిందువుల నాగరికత గల రాజ్యము లేర్పడెను.

## శ్రీ విజయ సామ్రాజ్యము

సుమత్రా ద్వీపంయొక్క ఆగ్నేయభాగమున శైలేంద్ర వంశంవారు స్థాపించిన "శ్రీ విజయ" సామ్రాజ్యం, చీనాకును హిందూదేశమునకును మధ్యగల పూర్వ పశ్చిమ సముద్రమునెల్ల కొన్నివందల సంవత్సరముల పాటు అతి వైభవంతో నేలిన రాజ్యంగానుండెను. క్రీ. శ. ౮వ శతాబ్దంలో సుమత్రా రాజ్యంలోని కొన్ని భాగములపైనను జావా మలయ భూభాగంపైనను, ద్వీపకల్పం దగ్గరను గల యనేక చిన్న ద్వీపములపైనను శ్రీ విజయ సామ్రాజ్యాధీశులు తమ యధికారమును వదలివేసిరి. ఈ శ్రీ విజయ సామ్రాజ్యం సంస్కృత విద్యకు నిలయంగా నుండెనని చీనా దేశపు యాత్రికుడైన ఇట్సింగు వ్రాసియున్నాడు.

## మజాపహిత రాజ్యము

క్రీ. శ. ౧౪ వ శతాబ్దమున నీ మలయ ద్వీపకల్పంలోను, మలయ భూభాగం (Peninsula) లోను బిల్వతిక్త మను సంస్కృత నామముగల మజాపహిత్ రాజ్యం వ్యాపించియుండెను. ఇది బౌద్ధ సంప్రదాయములు గల హిందూరాజ్యం. దీనికి గొప్ప నౌకాబల ముండెను. ఉత్తరమున ఫిలిప్పీను ద్వీపముల వరకును, తూర్పున ఆస్ట్రేలియా ఖండము వరకును గల సముద్రంలో వీరి నౌకలు శాంతి భద్రతలను స్థాపించుచుండెను.

## కాంభోజ రాజ్యము

అన్నామ్ అనబడు చంప దేశంలోను, కాంబోడియా యనబడు కాంభోజ రాజ్యముననను, బోర్నియో జావా సుమత్రా బలి ద్వీపములలోను కనబడుచున్న శాసనముల వలన నిశాల భారతదేశ చరిత్రను నిర్మించుట కవకాశం లేర్పడినవి.

ఇండోచీనాలోనున్న ఫ్రెంచి విద్వాంసులును, జావాలోనున్న డచ్చి పురాతత్వ శాస్త్రజ్ఞులు(Archaeologists)ను యీ శాసనములను పరిశోధించి వాని చారిత్రక ప్రాముఖ్యతను తమ భాషలలో వివరించియున్నారు. ఈ విషయములనుగూర్చి ఇంగ్లీషు భాషలో నేమియు వ్రాయబడనందున ఆ ప్రాంతములందు వ్యాపించియున్న భారతీయ రాజకీయ వైజ్ఞానిక విశేషము లను గూర్చి మన కంతగా తెలియుటలేదు.

క్రీ. శ. ౬ వ శతాబ్ది మధ్య కాంభోజం ఫ్యూనాన్ రాజ్యంయొక్క సార్వభౌమత్వంనుండి వెలువడి స్వతంత్రమై మహాశూరులైన రాజులవలన పరిపాలింపబడసాగెను. క్రీ. శ. ౬ వ శతాబ్దంనుండి ౧౪ వ శతాబ్దం వరకును, హైందవ నాగరికతా ప్రాబల్యంగల యీ రాజ్యంయొక్క వైజ్ఞానిక చరిత్రయు, కొంతవరకు రాజకీయ చరిత్రయుగూడ తెలియగల ౩౦౦ శాసనములు అక్కడ దొరకినవి. వానిలో చాలవరకు సంస్కృతంలోనే యున్నవి.

## చ ం ప

కాంభోజ రాజ్యమునకు తూర్పున చంపయను హిందూ రాజ్యమొకటి యుండెను. ఈ రాజ్యమునకు చీనావారితోను, అన్నామ్ రాజ్యంవారితోను నిరంతర పోరాటం తటస్థించుచుండి నందువలన దీని చరిత్ర చిక్కులతో నిండినది. ఇక్కడ దొరికిన ౧౩౦ శాసనములును చీనా, అన్నామ్ చరిత్రల లోని ఆధారములను గలిసి యీ రాజ్యంయొక్క సమగ్ర చరిత్ర నిర్మాణము నకు వీలు కలిగించుచున్నవి. ఇండోచీనాలోని హిందూరాజ్య ప్రభుత్వ యుగచరిత్రను బయటకుతీసి మన కుపకారం చేసినవారు ఫ్రెంచి పురాతత్వ శాస్త్రజ్ఞులే.

## జావా, సుమత్రా, బలి

జావా, సుమత్రా, బలి ద్వీపములలోకూడా కొన్ని సంస్కృత శాసనములును, జావాలోని పూర్వపు భాషయైన "కవి" భాషలోని శాసనములు కొన్నియు కనబడినవి. ఇందులో కవి భాషలోనివి రెండు చరిత్ర గ్రంథములు (Chronicles) క్రీ. శ. ౧౩ - ౧౪ శతాబ్దులనాటి వైభవమును చాటుచున్నవి. క్రీ. శ. ౯, ౧౦ శతాబ్దులనాటి అరబ్బీ వర్తకుల వృత్తాంతములు, యీ ద్వీపంలోని రాజకీయ సాంఘిక ప్రజా జీవనమును గూర్చిన కొన్ని విశేషములను తెలుపుచున్నవి. డచ్చి పురాతత్వ శాస్త్రజ్ఞులు శాసనములను పరిశోధించి హిందూయుగ చరిత్ర నిర్మాణమునకు తోడ్పడుటయే గాక అక్కడ హిందూ దేవాలయములను, స్మృతిచిహ్నములను (monuments) జాగ్రత్తగా కాపాడి మహోపకారమును చేసినారు.

## అ ం కో ర్ వా ట్

కాంబోడియా యనబడు కాంభోజ రాజ్యమున క్రీ.శ. ౧౨వ శతాబ్ది పూర్వార్ధమునందున్న రెండవ సూర్యవర్మ యను రాజు నిర్మించిన "అంకోర్ వాట్" విష్ణ్వాలయం ప్రపంచమునందలి చిత్ర నిర్మాణములలో నొకటిగా

పరిగణింపబడుచున్నది. ఇది మొన్న మొన్నటివరకు నొక ఘోరారణ్యమున కప్పువడి యుండినందువలన చాలకాలం వరకును ఎవరికిని దీని సంగతియే తెలియకుండెను. దానిని ఫ్రెంచి విద్వాంసుడైన హెచ్. మోహో (H. Mouhot) ౧౮౬౦ లో కనుగొని ఆశ్చర్యంజెంది అది ప్రపంచంలో కెల్ల అద్భుతమైన గొప్ప నిర్మాణమని తన దినచర్య పుస్తకంలో వ్రాసి కొన్నాడు. అంకోర్ వాట్‌లోని నిర్మాణము లన్నియు చాలా గొప్పవే. అక్కడి కందకం వెడల్పు ౨౦౦ అడుగులు. దేవాలయం చుట్టునున్న ప్రాకారం తూర్పు పడమర్లకు ఒక మైలులో మూడింట రెండు వంతులు పొడుగును, ఉత్తర దక్షిణములకు అరమైలు పొడుగును వున్నది. ఈ దేవాలయం మూడు అంతస్తులుగా నున్నది. దానికి గొప్పగొప్ప గోపురము లున్నవి. దాని లోపలి గోడలపైన రామాయణంలో నుండియు, మహా భారతంలో నుండియు, హరివంశంలో నుండియు అనేక ఘట్టములు సూచించు బొమ్మలు చిత్రించబడి యున్నవి.

## శిల్పములు

జావాలో 'బోరోబొదూరు స్తూపం' అను నొక బౌద్ధస్తూప మున్నది. ఒక కొండనే యొకస్తూపంగా మలచినారు నేర్పరులైన శిల్పులు. జావాలో మధ్యభాగమున ప్రాంబనన్ అను చోట రాతి గోడలపైన రామాయణం లోని మొదటి యైదు కాండలలోని కథను బొమ్మలుగా చెక్కినారు. కాంబోడియాలో నున్న అందమైన దేవాలయములు జావాలో లేవుగాని యిక్కడి దేవళముల శిల్పం కాంభోజంలోని వానికన్న చాలా అందమైనది. జావాలోని బౌద్ధ శిల్పములలోని విగ్రహములలో కొన్ని, ప్రపంచంలోని శిల్పము లన్నిటికన్నను అందమైనవిగా నున్నవి. ఈ పై సంగతుల నన్ని టిని డాక్టర్ బి. ఆర్. చటర్జీగారు మీరటు కాలేజి మ్యాగజీన్‌లో ఒక వ్యాసంగా వ్రాసియున్నారు. *

---

* Modern Review for March 1929, pp. 337-338.

## ఆంధ్రుల ప్రశంస

క్రీస్తుశకారంభం నాటికే ఆంధ్రులు దక్షిణ హిందూదేశపు తూర్పు సముద్రతీరమున కృష్ణా గోదావరి నదీ ప్రాంతాలందు రాజ్యముల నేలుతూ వర్తక వ్యాపారములు చేస్తూ వుండినట్లు చీనాదేశపు చరిత్రలవల్ల తెలుస్తున్నది.

క్రీస్తు శకారంభంనాటి రోమ్ గ్రీసు చరిత్రకారులైన ప్లినీ టాలమీ మొదలైనవారు దక్షిణ హిందూదేశపు సముద్రతీరమున పాలూర, మైసోలస్, కొంటకశైల, కొడ్డూర మొదలైన రేవుపట్టణము లున్నట్లు పేర్కొని యున్నారు. దూబ్రాయి దొర చేసిన చరిత్ర పరిశోధనవలన కృష్ణాజిల్లాలోని గూడూరే కొడ్డూరని తేలినది.

నాగార్జున కొండదగ్గర బయల్పడిన బౌద్ధ శిథిలముల వలనను, శాసనముల వలనను క్రీస్తు శకారంభంనాటికి కృష్ణానది వెంబడిని సముద్ర యానం చేయు గొప్ప నౌకలు వచ్చుచుండెడివని, ద్వీపాంతరములతో గొప్ప వ్యాపారం జరుగుచుండెనని కాశ్మీర, కాంభోజములనుండి, చీనా నుండి బౌద్ధ యాత్రికు లనేకు లిక్కడికి వచ్చుచుండిరని స్పష్టపడినది.

నాగార్జున కొండ బౌద్ధుల పుణ్యక్షేత్రం. మహాయాన స్థాపనాచార్యుడైన నాగార్జునుని వాసస్థలం. దీనిని బౌద్ధులు శ్రీనగరమని, శ్రీక్షేత్రమని వ్యవహరించుచుండిరి.

## ద్వీపాంతరములలో తెలుగు పేర్లు

బర్మాలోని పెరూ దేశంలోనున్న ప్రోమ్ అనే పట్టణంయొక్క పూర్వపు పేరుకూడా శ్రీక్షేత్రమే। ఇది కేవలం కాకతాళ న్యాయమా లేక భారతీయ సంపర్కంవలన కలిగినదా? అనే ప్రశ్నవేస్తే యిలాంటివి చాలా కనబడుతున్నవి. బర్మా దేశంలోని అరకాన్ రాష్ట్రంయొక్క రాజధాని పేరు త్రైలింగం. ఈ పెరూ దెశంను పూర్వం స్వర్ణభూమి యనేవారు. దానినేలిన త్రైలింగు రాజవంశం తెలుగు రాజవంశమే. పూర్వం బర్మా

రెండు విభాగములుగా నుండెనట. ఒక భాగమును కళింగమనిన్నీ, ఇంకొక భాగమును ఉత్కళమనిన్నీ అనేవారట. జావా సుమత్రా ద్వీపములలో చీనావారికి మొదట కనబడిన హిందూ దేశీయులు కళింగులైన తెలుగువారే. అంతట వారు హిందూ దేశీయుల నందరినీ కళింగులని వ్యవహరింప సాగినారు.

ప్రస్తుతం కొచిన్‌చీనా, దక్షిణ అన్నామ్ అనే దేశముల దగ్గర పూర్వముండిన చంపా దేశంలో నొక రాష్ట్రం పేరు అమరావతి. ఇంకొక రాష్ట్రం పేరు విజయ. ఇవి మన ఆంధ్ర చరిత్రలో ప్రసిద్ధములైన పేర్లే కదా? నయాం సింధు శాఖమీదనున్న కాకుళమనే రేవు పట్టణం మన చరిత్ర ప్రసిద్ధమైన శ్రీకాకుళమునకు ప్రతిరూపమే అనడానికి సందేహం లేదని శ్రీ డాక్టర్ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులవారు వ్రాసియున్నారు.

ఇలాగ మన తూర్పు సముద్రతీరమున కవతలగానున్న ద్వీపాంతరాలలో దేశాలపేర్లు, పట్టణాలపేర్లు, వీనిని పరిపాలించిన రాజుల పేర్లుకూడా మనకు చాలా సన్నిహిత సంబంధంగల పేర్లుగానే వున్నందువల్ల ఒక కాలంలో ఆంధ్ర నాగరికత అక్కడ వ్యాపించియుండిన దనుకోవడానికి చాలా అవకాశం వున్నది.

## శాసనములు - గాథలు

అలాంటి సంబంధం వుండేదనడానికి కొన్ని శాసనములు, గాథలు, శిల్ప సాంప్రదాయములుకూడా తోడ్పడుతున్నవి. క్రీ. శ. ౨౪౮ సం॥లో ఇండో-చీనా దగ్గిర చంపా దేశంను పరిపాలించుచుండిన చండవర్మ యను రాజు అప్పుడు ఆంధ్రదేశం నేలుతూవుండిన రాజుకు రాయబారం పంపినాడు. అది తిరిగి రావడానికి నాలుగేళ్ళు పట్టినది. అప్పుడు నాగార్జున కొండదగ్గర విజయపురిని రాజధానిగా చేసికొని ఇక్ష్వాకు వంశీయుడైన వాసిష్ఠీపుత్ర బాహుబల శాంతమూల మహారాజు ఆంధ్రదేశం నేలుచుండెను. ఇప్పుడు నాగార్జున కొండదగ్గర శిథిలావస్థలోనున్న విజయపురి అనేది ఒక మహాపట్నం. అక్కడ దొరికిన శాసనం ఒకటి బౌద్ధ ఉపాసిక బోధిశ్రీ

అనే యూమె వ్రాయించినది, చూస్తే చీనాదేశం మొదలు కాశ్మీరం వరకు నుండే నానాదేశాలవారు వర్తకులు, మతవ్యాపకులు, తీర్థవాసులు ఆంధ్ర దేశానికి తరచుగా వస్తూ పోతూ వుండేవారని తెలుస్తుంది. అంతేకాదు; చంపా దేశంలో కనబడే ప్రాచీన లిపి ఆంధ్రదేశంలో ఆ కాలంలో అనగా క్రీ. శ. ౧, ౨ శతాబ్దాలనాటి ప్రాచీన బ్రాహ్మీలిపి. *

చంపా దేశమందు వోకస్ అనే పట్టణంలో యిటీవల కనబడిన ౩ వ శతాబ్దంనాటి శాసనం ఆంధ్ర వంశజుడైన వాసిష్ఠీపుత్ర శాతకర్ణి శాసన లిపి యని శాస్త్రజ్ఞు లంటున్నారు.

జావా, సుమత్రా. బలి, ఇండో-చీనా, సయాం, బర్మా దేశములందు కనబడిన పురాతన శాసనము లన్నియు గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు మండలములందు కనబడిన ౫, ౬, ౭ శతాబ్దములనాటి పురాతన లిపి లోనే వున్నవి. పరిశోధకులు దీనిని వేంగి లిపి యని "తెలుగు కన్నడలిపి" యని యంటున్నారు. ఈ దేశా లన్నిటిలోను శాలివాహన శకమే వాడుకలో నుండినది. కేవలం తెలుగువారును, కన్నడులును మాత్రమే వాడుచుండిన శక మిది. దీనిని ద్రావిడులైన అరవవా రెన్నడును వాడినవారు కారు. ఉత్తర హిందూ దేశీయులు విక్రమ శకమునే వుపయోగించేవారు. అందు వల్ల నీ దేశాలతో తెలుగువారికే ఎక్కువ సంబంధ ముండినట్లు విశ్వసించ వచ్చునని శ్రీ డాక్టర్ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులవారిట్లు వ్రాసియున్నారు. •

"ప్రస్తుతం ఇండో-చీనా అనే దేశం దగ్గర పూర్వం ఫ్యూనాన్ రాజ్యమును స్థాపించిన కౌండిన్యుడను బ్రాహ్మణుడు దక్షిణ హిందూదేశం నుండి అక్కడకు వచ్చినాడని. అతడు ద్రోణుని పుత్రుడైన అశ్వత్థామ వలన ఒక కుంతమును వరప్రసాదంగా పొందినాడనిన్నీ గాథ యొకటి

---

* చూ. ప్రాచీనాంధ్రులు - పలవరాజ్య చిహ్నాలు. శ్రీ భావరాజు వెంకట కృష్ణారావుగారు, భారతి ప్రమాది, శ్రావణం.

• చూ : ఆంధ్రులు సంస్కృతి సంబంధములు, భారతి, ప్రమాది, భాద్రపదము.

అక్కడ వాడుకలో నున్నది. ఇది ఈ ద్వీపాంతరములోని రాజ్యమునకును దక్షిణహిందూదేశము నేలిన పల్లవరాజవంశములకును గల సంబంధమును సూచించుచున్నది." తాము అశ్వత్థామ సంతతివారమనియు బ్రహ్మవంశము వారమనియు పల్లవులు తమ శాసనములందు వ్రాసికొనియున్నారు. యవన పహ్లవ కాంభోజులు మొదట క్షత్రియులై యుండినను వైదిక ధర్మములను తప్పి చరించినందువలన శూద్రులైనట్లు విష్ణు పురాణమునందు చెప్పబడిన గాథ యీ సంగతినే సూచించుచున్నది.

మలయాద్వీపకల్పములో తూర్పుతీరమునగల "లిగో" పట్టణమును అశోకవంశజుడైన దంతకుమారుడు స్థాపించినాడనియు అతడు దంతపురమునుండి వచ్చుచుండగా ఓడపగిలి యీ తీరమును జేరినాడనియు అక్కడ నౌకగాథ ఉన్నది. ఈ దంతపురము కళింగదేశపు పూర్వరాజధాని. "స్వస్తిశ్రీ విజయదంతపురాత్" అని అనేక శాసనములు దీనిని పేర్కొని యున్నవి. దీనివలన ఆంధ్రులకి ద్వీపాంతరములతో చిరకాలమునుండి దగ్గర సంబంధమున్నట్లు తెలియుచున్నది.

క్రీస్తుశకము ౩ వ శతాబ్దినుండి తొమ్మిదవ శతాబ్ది వరకును ద్రావిడాంధ్ర దేశములనేలిన పల్లవులకాలములోను వారితరువాత ౧౨ వ శతాబ్దం వరకు నాంధ్రదేశమునేలిన చాళుక్యుల కాలములోను వేంగి దేశము, దక్షిణమున కాంచీపురమునుండి ఉత్తరమున మహానది వరకును పడమర బళ్ళారి వరకును వ్యాపించియుండెనని శ్రీ చిలుకూరి వీరభద్రరావుపంతులు గారు తమ ఆంధ్రుల చరిత్రలో వ్రాసియున్నారు.

## సంస్కృతాంధ్ర సంప్రదాయము

క్రీ. శ. ౪౦౫-౪౧౧ సం॥లమధ్య భారతదేశమున పర్యటనము చేసిన చీనాదేశపు బౌద్ధసన్యాసియైన పాహియాను అనేక బౌద్ధగ్రంథములను తీసికొని దక్షిణ హిందూదేశమునుండి సింహళమార్గముగా ఓడనెక్కి తన

దేశమునకు పోతూవుండగా తుపాను వచ్చినదనిన్ని అప్పు డా యోడమీద నున్న బ్రాహ్మణు లాపత్తునకతని బౌద్ధగ్రంథములే కారణములని నిందించి, వానిని సముద్రమున బారవేయ ప్రయత్నించిరనిన్ని వ్రాసినాడు. ఇంతేగాక తన మార్గమధ్యమున జావాలో కూడా పాషాండులును బ్రాహ్మణులును ఉన్నారని అతడు వ్రాసియున్నాడు. దీనినిబట్టి ఆకాలమున బ్రాహ్మణులు సముద్రయానము చేయుచూ దేశాంతరములందుకూడా నెలకొని వైదికమతమును ప్రచారము చేయుచుండినట్లు స్పష్టపడుచున్నది.

శాతవాహనుల కాలములోను పల్లవుల కాలములోను చాళుక్యుల కాలములోనుకూడా ఆంధ్ర నాగరికత సముద్రములుదాటి దేశాంతరములలోను ద్వీపాంతరములలోను వ్యాపించినట్లు అనేక దృష్టాంతములు కనబడుచున్నవి. బ్రాహ్మణ బౌద్ధ మతధర్మములు, ఆచారవ్యవహారములు, వేదశాస్త్ర పురాణేతిహాసములు, సంగీత సాహిత్యములు, నృత్యనాటక శిల్ప కళలు, దక్షిణ హిందూదేశమునుండి బర్మా, మలయా, ఇండో, చీనా కాంబోడియా దేశములకును జావా సుమత్రా, బోర్నియో, బలి, ఫిలిప్పైను ద్వీపములకును కూడా వ్యాపించెను.

ఇప్పుడు ఇండోనేషియా అని పిలువబడు ప్రాంతములందు పూర్వకాలము వర్ధిల్లిన చంప, అంకోరు, శ్రీవిజయ, మజాపహిత మొదలైన ప్రదేశము లన్నియు సంస్కృత విద్యా కేంద్రములుగా నుండినవి, ఆ ప్రాంతములందలి రాజ్యముల పేళ్ళు, నగరముల పేళ్ళు, వానినేలిన రాజుల పేళ్ళును భారతీయ సంస్కృత నామములే. అక్కడి రాజసభలందలి యాచార వ్యవహారములన్నియు భారతీయ సంప్రదాయము ప్రకారము సంస్కృతమునందే జరుపబడుచుండెను. రాజోద్యోగుల కందరికిని సంస్కృత బిరుదనామములే యుండెను. ఎన్ని రాజవంశములు మారినను ఆ బిరుదులిప్పటికిని సయాం(థాయి) దేశములో నిలిచియున్నవి. తుదకు మహమ్మదీయ రాజ్యముగామారిన మలయా ద్వీపకల్పములోకూడా ఇప్పటికిని అవి నిలిచియున్నవి.

ఇండోనేషియా దేశములన్నిటిలోను మన పురాణేతిహాస కథలు వ్యాపించియున్నవి. మన రామాయణ భారత గాథలకు సంబంధించిన బొమ్మలు శిల్పములు ఆటపాటలును కొద్ది మార్పులతో అక్కడ కనపడు తున్నవి జావా బలిద్వీపములలోని నృత్యకళ కేవలము మన భరతనాట్యము నుండి వచ్చినదే. మన వీధినాటకముల వంటివే అక్కడ కనబడుతున్నవి. అక్కడి తోలుబొమ్మలాటకు వయాంగ్ అనిపేరు. దానిలోని బొమ్మలు, కథలు పాటలు రాగములు మన తెలుగు తోలుబొమ్మలాటలలో నున్నట్లే యున్నవి. అందువలన అవి మన ఆంధ్రదేశమునుండి అక్కడకు వ్యాపించిన దనడానికి సందేహములేదు.

బలిద్వీపము చాలా చిన్నదైనను ఇప్పటికిని అక్కడ సనాతనధర్మ సంప్రదాయాలు నిలిచియున్నవి. హిందూదేశములోని సంస్కృత లిపి లిపిపైని దీవులకు కూడా వ్యాపించినది. ఆభాషలో మన తెలుగు మాటలు కూడా కొన్ని ఉన్నవని తెలుస్తున్నది. కాంభోజములోని లిపి కేవలము మన దక్షిణహిందూదేశము నుండి అక్కడికి వ్యాపించినదే. అందనేక సంస్కృత పదములు చాలా కొద్ది మార్పులతో నున్నవి. అక్కడ సివిలు క్రిమినలు ధర్మశాస్త్రవిధులు మన మనుస్మృతిపైన నాధారపరుపబడి బౌద్ధమతమున కనుగుణములైనమార్పులతో క్రోడీకరింపబడినవి ఈ నాగరికతను గురించి శ్రీ జవహర్లాల్ నెహ్రూగారు తమ గ్రంథములలో వ్రాసినారు.

ఈ వలసరాజ్యము లందలి శిల్ప సంప్రదాయములన్నియూ భారతీయములై యుండుట ముఖ్యముగా గమనింపదగిన విషయము పూర్వము కాంభోజ రాజ్యమునకు రాజధానియైన అంకోర్‌తోమ్‌లోను, అంకోర్‌వాట్ లోను గొప్ప గొప్ప దేవాలయము లున్నవి. వీనిలో మన దేశపు శిల్ప సంప్రదాయములు కనబడుతున్నవి. ఆదేశంలోకూడా అయోధ్య ఉన్నది. అక్కడకూడా మన రామాయణ భారత గాథలున్నవి. అక్కడను మన విఘ్నేశ్వరుడు, శివుడు విష్ణుమూర్తి మొదలైన దేవుళ్లు ఉన్నారు.

ఇండోచీనాలోని "స్వాజకోలాక్"లోని దేవాలయము చాలా పురాతనమైనది. అది రెండువేల సంవత్సరముల నాటిదని అంటారు. అది

హిందూదేశపు దేవాలయము వలెనున్నదట. అక్కడనున్న కంచువిగ్రహములలో గుంటూరుజిల్లా "బుద్ధాం"లో నుండే విగ్రహముల లక్షణములు కనబడుచున్నవని మ్యూయల్ దొర వ్రాసినారు.

## 13. ప్రవాసాంధ్రము—మారిషసు

ఆంధ్రదేశానికి మూడువేలమైళ్ళదూరంలో, హిందూమహాసముద్రం మధ్యలో నున్న మారిషస్ ద్వీపంలో వెలసింది ఒక అపూర్వమైన ఆంధ్ర ప్రదేశ।

మారిషస్ ద్వీపంలోనే పుట్టి, పెరిగి, స్వయంకృషివల్ల సంపన్న గృహస్థులై, పౌరులై ప్రజా ప్రభుత్వంలో గౌరవ స్థానము పొంది, తమ మాతృభాషయైన తెలుగే మాట్లాడుతూ ఆంధ్ర సంస్కృతినీ సంప్రదాయాలను అనుసరించి, ఆంధ్ర వ్యక్తిత్వం కాపాడుకొంటూ భారతదేశానికి కీర్తి తెస్తూ వున్న అచ్చమైన ఆంధ్రులు నలభై వేలమంది వున్న ఆ ద్వీపాన్ని ప్రవాసాంధ్ర ప్రదేశమంటే అతిశయోక్తి లేదు. ఆంధ్రులెక్కడ ఉంటే అది ఆంధ్రప్రదేశమే కదా!! నూటముప్పై సంవత్సరాల క్రిందట మాతృభూమియైన ఆంధ్రదేశాన్ని వదిలి జీవనం నిమిత్తం ఆ దూర దేశానికి వెళ్ళిన పాటకజనము, వారితోపాటు అక్కడికి వెళ్ళిన వివిధ వృత్తులవారు, చిల్లరవ్యాపారస్థులు, వివిధ కులాలవారు అక్కడ జీవనంచేస్తూ స్వయంకృషివల్ల అభివృద్ధిచెందారు. వారి వంశీయులే అక్కడి ఆంధ్రులు. ఇప్పుడక్కడనున్న ఆంధ్రులలో వ్యవసాయకులు, చిన్న చిన్న భూస్వాములు, వివిధ వృత్తులవారు, వ్యాపారులు, విద్యావంతులై ప్రజాప్రభుత్వ సంస్థలో ప్రతినిధులైనవారు, ఉద్యోగులు కూడ ఉన్నారు వీరు అక్కడగల వివిధ జాతి మత భాషల వారితో కలిసి మెలిసి సోదరభావముతో ఐకమత్యముతో

ఉంటారుగాని తమ ఆంధ్ర వ్యక్తిత్వమును కాపాడుకొంటారు. నేడు మారిషసు రేడియో కేంద్రం నుండి ఇంగ్లీషు, ఫ్రెంచి, హిందీ, తమిళ భాషలతోపాటు తెలుగులో కూడ అనేక కార్యక్రమాలు, ప్రసంగములు, పాటలు, తెలుగు రికార్డులు మొదలైనవి ప్రసారమవుతున్నవి. ఆరునెలల క్రిందట మారిషస్ రేడియో కేంద్రమువారు ఢిల్లీలో ఆల్ ఇండియా రేడియో కేంద్రము వారికొక అధికారిక లేఖ వ్రాస్తూ ఆంధ్రదేశములో ప్రసారమవుతూ వున్న తెలుగు కార్యక్రమములను తమకు అందజేస్తే వాటిని మేము ప్రసారము చేస్తామని వ్రాశారు దీని ఢిల్లీ అధికారులు హైదరాబాదు విజయవాడ కేంద్రాలకు పంపించారు. మన ట్రాన్స్మీటర్లు అంత దూర దేశాలకు ప్రసారం చేయగలిగి కాకపోవటం మన దురదృష్టము. తమిళనాడు ప్రభుత్వమును చూచియైన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఇటువంటి కార్యాలను సాధించకపోవటం అంతకన్నా దురదృష్టము.

మారిషస్ ఆంధ్రుల ఇళ్ళలో మన దేశమువలనే పండుగలు పర్వాలు జరుపుకుంటారు. సంక్రాంతి ముగ్గులతో సహా మన ఆంధ్రపేను అక్కడ ప్రదర్శితమవుతుంది. మన రామదాసు కీర్తనలు, త్యాగరాజ కృతులు, అక్కడ పాడతారు. మన భారత భాగవతములు, శతకాలు అక్కడ చదువుతారు. భజనలు, హరికథలు, వీధి భాగవతములు మొదలైన సాంస్కృతిక కార్యక్రమాలు సాగుతున్నాయి.

మారిషస్‌లో ఆంధ్రులు అనేక పట్టణాలలో గ్రామాలలో పఠన మందిరాలు గ్రంథాలయాలు స్థాపించి తెలుగు పుస్తకాలు తెలుగు పత్రికలు తెప్పించుకొని చదువుతున్నారు. అప్పుడప్పుడు సభలు చేసి రాజకీయ మత వైజ్ఞానిక విషయాలను గూర్చిన ఉపన్యాసములు ఏర్పాటుచేసుకుంటున్నారు. ఆంధ్రులు స్వయంకృషివల్ల స్థాపించిన పాఠశాలలు మారిషస్‌లో 40 ఉన్నవి. అందులో తెలుగు బోధిస్తారు. ఆ పాఠశాలలో పనిచేసే ఉపాధ్యాయులు ట్రెయినింగు తర్ఫీదు పొందినవారే. ఇదిగాక ప్రభుత్వం స్థాపించిన ప్రాథమిక పాఠశాలలు 45 ఉన్నవి. అందులో 4 వేల మంది చదువుకున్నారు. అక్కడ ఉపాధ్యాయుల ట్రెయినింగు కాలేజీ కూడ స్థాపించబడినది.

మారిషస్‌లోని ప్రభుత్వ కళాశాలలో ఇంగ్లీషులోను, ఫ్రెంచిలోను బోధిస్తారు. అందులో విద్యనభ్యసించిన తెలుగు విద్యార్థులు సీనియరు కేంబ్రిడ్జి మొదలగు పరీక్షలలో ఉత్తీర్ణులై ఉద్యోగము చేసేవారు, ఇంగ్లాండు, ఫ్రాన్సు దేశాలలో వైద్యము న్యాయశాస్త్రము అభ్యసించి వచ్చినవారుకూడ ఉన్నారు. మారిషసులోని ఆంధ్రులకు మాతృదేశపు రీతి మత ధర్మాలమీద, సంస్కృతి సంప్రదాయాలమీద చాలా మక్కువ. అక్కడ ఆంధ్రులు వివిధ పట్టణాలలో శివ విష్ణు దేవాలయములను, రామాలయాలను, కృష్ణాలయాలను, ఆంజనేయాలయాలను నిర్మించారు. సెయింట్ పియర్ (St. Pierre) లోని విష్ణు మందిరము చాలా ప్రఖ్యాతి చెందినది. మారిషసు ఆంధ్రులు తాము నిర్మించిన దేవాలయాలకును, సభా భవనములకు, విష్ణు మందిరము, సింహాచల మందిరము, రామేశ్వర శివమందిరము, కృష్ణమందిరము మొదలైన పేర్లను పెట్టుటలోనే వారి వ్యక్తిత్వము వెల్లడియగుచున్నది. ఈ దేవాలయాలలో ఉత్సవాలు పండుగలు ఉత్సాహంతో జరుపుతారు. మారిషసు ఆంధ్రులు వినాయకచవితి, దీపావళి, సంక్రాంతి, ఏకాదశి వ్రతాలు, హోళీ పండుగ, కామ దహనము, మహాలయ పక్షాలు, శివరాత్రి ఉత్సవాలు, శ్రీరామనవమి వైభవముగా జరుపుకుంటారు. క్రైస్తవులు క్రిస్మసుపండుగలోను, నూతన సంవత్సరాది పండుగలోను జాతి మత వివక్షత లేక అందరూ పాల్గొంటారు. మహమ్మదీయుల మొహరం పండుగ, రంజాను పండుగలలో కూడ తెలుగువారు పాల్గొంటారు.

మారిషసులో గ్రామ పంచాయితీలకు పురపాలక సంఘాలకు రాజ్యాంగ సభలకు ఎన్నికల నిమిత్తము పంపే దరఖాస్తులు ఆంధ్రులు తెలుగులో వ్రాయవచు ననే స్వీకారము సంపాదించినారు. మారిషసు జిల్లా కోర్టులోను ప్రధాన న్యాయస్థానములోను తెలుగు అనువాదకులు నియమింపబడినారు. రెండవ ప్రపంచ యుద్ధకాలము నుండి మారిషసులో ఆంధ్ర సంఘములు వృద్ధియై వివిధ పట్టణాలలో పనిచేయసాగినవి ఆ ద్వీపరాజధానియైన పోర్టులూయీలో ఒక కేంద్ర ఆంధ్ర సంస్థ స్థాపించడం ఎంతైనా అవసరమని తోచి అక్కడి తెలుగువారు 1948 సంగలో "మారిషస్ ఆంధ్ర మహాసభ"ను స్థాపించారు.

ఈ మహాసభ ముఖ్య ఉద్దేశ్యములు :

1. ఆంధ్రుల సాంఘిక ఆర్థిక క్షేమతలను అభివృద్ధిపరచుట.

2. వేదాంతం, సారస్వతము, లలిత కళలు, విజ్ఞాన శాస్త్రము, చరిత్ర మొదలైన చరిత్ర పఠనము పెంపొందించి ఆంధ్ర సంస్కృతిని వ్యాపింపచేయుట.

3. తెలుగు భాషా బోధనకు, వ్యాప్తికి, పుస్తక భాండాగారములను, పాఠశాలలను, ఉచిత విద్యా సంస్థలను నెలకొల్పుట.

4. దేశములో సమావేశము జరిపి ఆరోగ్యము, శుభ్రతలను గూర్చి ప్రజలకు తెలియపరచుట.

5. సంఘ ఉద్దేశ్యములను వ్యాప్తి చేయుటకు పుస్తకములు, సంచికలు, కరపత్రములు ప్రచురించుట.

6. మరణించిన సంఘసభ్యుల కుటుంబములకు అవసరమైన ఆర్థిక సహాయము చేయుట.

మారిషసు ఆంధ్ర మహాసభ దిన దినాభివృద్ధి చెందినది. 1958 నాటికి దీనికి 36 శాఖా కార్యాస్థానము లేర్పడినవి. వీరు 18 రాత్రి పాఠశాలలను స్థాపించి నడుప సాగినారు. 1973 నాటికి ఈ సభకు 50 శాఖా కార్యస్థానము లేర్పడినవి. భారతదేశమునుండి వచ్చే పత్రికలు అక్కడ ప్రచురించే పత్రికలే కాక సభవారు తెలుగు దిన పత్రికలను, వారపత్రికలను, భారతి మొదలైన మాస పత్రికలను తెప్పించి తమ శాఖా కార్యాస్థాన సంఘంనుంచి పంపుతారు. ఆంధ్ర దేశంలో ప్రకటించబడిన అనేక తెలుగు గ్రంథాలను తెప్పించి పుస్తక భాండాగారంలో నుంచుతారు. ఆంధ్ర మహాసభవారు విద్యాభివృద్ధికోసం కృషి చేయటమేగాక సంగీత సాహిత్య సాంస్కృతిక కార్యక్రమములను కూడ నిర్వహిస్తున్నారు. ఆ సందర్భములో భజనలను, సంగీత కచేరీల పోటీలను ఏర్పాటు చేస్తున్నారు. పోర్టు లూయీ నగరంలో ఆంధ్ర మహాసభవారు ప్రయాణికుల సౌకర్యార్థం ఒక పెద్ద

ధర్మశాలను నడుపుచున్నారు. మహాసభ సభ్యులలో విద్యావేత్తలు వివాహాది శుభకార్యములు జరిపించెదరు.

ఆంధ్రములో శివ రహస్యమునుగూర్చి, వేదాంతమునుగూర్చి ఉపన్యాసము లిస్తూ ఉంటారు.

మారిషసులో ఆంధ్ర మహిళా సభకూడా పనిచేస్తూ ఉన్నది. దీనికి కూడ చాల శాఖాకార్యస్థానము లేర్పడినవి. ఈ సంఘంవారు కూడ గ్రంథాలయాలను నెలకొల్పి ఉపన్యాసాలకు సభ లేర్పాటు చేస్తారు.*

మారిషస్ ఆంధ్రులకొరకు మన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారింత వరకు ఎట్టి సహాయమూ చేయలేదు.

## పూర్వ చరి

మారిషను ద్వీపం హిందూ మహాసముద్రంలో భారతదేశ పశ్చిమ సముద్రతీరానికి మూడువేల మైళ్ళ దూరమున ఆఫ్రికా ఖండపు దక్షిణా గ్రమునకు తూర్పున 400 మైళ్ళదూరములో నున్నది. బొంబాయి రేవునుండి ఓడలో ప్రయాణము పది రోజులు పట్టుతుంది.

ఈ ద్వీపము ఇంచుమించు త్రికోణాకారంగా నున్నదని చెప్ప వచ్చును. ఇది 36 మైళ్ళ పొడుగు 26 మైళ్ళవెడల్పుగలిగి రమారమి 720 చదరపుమైళ్ళ విస్తీర్ణం కలిగియున్నది. దీని దగ్గర చిన్న లంకలు కొన్ని యున్నవి. ఈ ద్వీపంలో కొండలు, లోయలు, చిన్నచిన్న సెలయేళ్ళు కూడ సుందరంగా నుండును. ఇక్కడ నదులన్నిటిలో పెద్దది పదిమైళ్ళ

---

* 1. The Andhras in Mauritius :
The Hindu 14th September 1974 :

2. Article of Sri Paidayya Kalla Ramaswami usher District Court, Rose Hill Mauritius – in Telugu Vignana Sarwaswam. Telugu Samskriti Volume.

పారుతున్నది. దీనికి గ్రాండ్ రివర్ (grand river) అనే పేరున్నది. మారిషస్‌ద్వీపరాజధాని పోర్టు లూయీస్ (Port Louis). ఈ ద్వీపంను మొట్టమొదట చూచిన పాశ్చాత్యులు పోర్చుగీసువారు. 1505లో వారు దీనిని కనుగొనునప్పటి కిందులో ఆదిమవాసులుండేవారు. పాశ్చాత్యు లాక్రమించిన దేశాలలోని ఆదిమవాసుల గతియే వీరికిని పట్టినది. వీరిలో చాలమందిని చంపివేసిరి. కొందరు మారుమూల ప్రదేశాలకు పారిపోయిరి.

యూరోపా ఖండములోని రాజకీయములతో ఈ ద్వీపము చేతులు మారినది. పోర్చుగీసువారి తరువాత డచ్చిదేశపు ఒలాందుల వశమైనది. 1715-1767 మధ్య ఫ్రెంచిజాతివారి స్వాధీనమైనది. దీనికి వారు (I lede France) అని ఫ్రెంచి పేరు పెట్టారు దీనిని పరిపాలించిన గవర్నరులలో లా బౌర్డినా అను నతడు ప్రఖ్యాతి వహించినాడు. పంచదార పరిశ్రమ స్థాపించాడు. ప్రత్తి, నీలిమందు వగైరా పంటలు వేయించాడు. ఈ వ్యవసాయపు పనులను ఆ కాలంలో తెల్లవారు పట్టుకొని బానిసలుగా చేసిన నీగ్రోల చేత చేయించే వారు. ఈ యజమానులు చాలా క్రూరులై వారిని బాధించి చిత్రహింసలు పెట్టేవారు.

ఇంగ్లీషువారికి, ఫ్రెంచివారికి యుద్ధములు ప్రారంభం కాగా ఈ ద్వీపము ఇంగ్లీషువారికి ప్రక్కలో బల్లెమైనది. ఫ్రెంచి నౌకా దళములకు, సైనిక దళములకు దీనిని స్థావరముగా చేసి సముద్రతీరాలలో అక్కడక్కడ గల ఇంగ్లీషు రాజ్యాలపైన దండయాత్రలు చేసేవారు. ఆ సందర్భంలో లా బౌర్డినా నౌకా దళంతో 'పాండుచేరి' వచ్చి మద్రాసులోని ఇంగ్లీషు వర్తక స్థానము పట్టుకొన్నాడు. 1810 సం॥లో ఇంగ్లీషు నౌకా దళము వచ్చి సైనిక బలముతో ఈ ద్వీపము నాక్రమించినారు. 1814సం॥లో ఇంగ్లీషువారికి, ఫ్రెంచివారికి జరిగిన ప్యారిసు సంధి షరతులను బట్టి మారిషసు బ్రిటీషు వలస రాజ్యమైనది. అయితే అక్కడి ఫ్రెంచి ప్రజల భాషకు, సంస్కృతికి భంగములేకుండ కొన్ని ఏర్పాట్లు చేశారు. ఇంగ్లీషును ఫ్రెంచిని రాజభాషలుగా చేసినారు.

మారిషసులో తోటల యజమానులు నీగ్రో బానిసలను బాధించి వారిచేత పనులు చేయిస్తూ అమిత లాభములు సంపాదిస్తూండగా అమెరికాకు ఎగుమతిచేసిన నీగ్రో బానిసలను అక్కడి తెల్లవారు పెట్టే చిత్రహింసలు వర్ణనాతీతములు.

మారిషస్‌లోనే కాక ఇతర ఇంగ్లీషు వలస రాజ్యాలలోకూడ తెల్లవారు నీగ్రో బానిసలను క్రూరముగా బాధించి పని చేయించేవారు. నాగరికమైన బ్రిటిషు సామ్రాజ్యములో యిటువంటి ఘోరమైన బానిసత్వము సాగుతూండడము అవమానకరమని ఇంగ్లాండులో ఆందోళన జరుపగా 1834 సంవత్సరమునుండి 1838 వరకు గల మధ్య కాలములో ఇంగ్లీషు పార్లమెంటువారు బానిసత్వము రద్దుచేస్తూ అనేక శాసన విధులను చేశారు. బానిసత్వము రద్దు చేయుటవల్ల బానిసల యజమానులకు కలిగిన నష్టమునకు కొంత పరిహార మిచ్చారు. బ్రిటిషు సామ్రాజ్యములో వివిధదేశాలలో గల కూలి జనమును తెచ్చుకొని వ్యవసాయపు పనులు చేయించుకో వచ్చునని సూచించారు. అప్పట్లో హిందూదేశము బ్రిటిషు పార్లమెంటు వారి తనిఖీకి లోబడి తూర్పు ఇండియా వర్తకసంఘంవారి పరిపాలనక్రింద ఉండేది. వీరవలంబించిన ఆర్థిక విధానముల వల్ల గ్రామాలలో పూర్వ పరిశ్రమలు నాశనమై ప్రజలు జీవనాధారములేక అల్లాడుతూ చాలా తక్కువ కూలికి పనిచేయడం ప్రారంభమైనది. అందువల్ల యిక్కడినుండి మారిషసుకు కూలి జనమును తీసుకొని వెళ్ళడానికి అక్కడ తెల్ల యజమానులు తమ ఏజంట్లను పంపించారు. మారిషసు చాలా బాగా ఉంటుందని అక్కడ హెచ్చు కూలి వస్తుందని కొన్నాళ్ళపాటు పనిచేయటానికి ఒప్పందము చేస్తే సర్కారువారే రాకపోకల వ్యయము భరిస్తారని బీదవాళ్ళకు చెప్పి వాళ్ళచేత ఒడంబడిక పత్రాలు వ్రాయించి తీసుకొని వెళ్ళడము 1834 సం॥లో ప్రారంభమైనది. 1834 - 1837 సంవత్సరములమధ్య కలకత్తా రేవునుండి ఏడువేల మందిని ఇలాగ తీసుకొని వెళ్ళారు. ఆ సమయములో 'మెకాలే' నాయకత్వంక్రింద ఏర్పడిన 'లా కమిషన్' అసహాయులు, అమాయకులైన పేదవారి చేత కూలీ ఒడంబడికలు వ్రాయించుకొని వెళుతున్నారని

ఆ పత్రము షరతులు వారు అర్థము చేసుకొని, బుద్ధిపూర్వకముగా అంగీకరించినట్లు రుజువు ఉండాలని ఒక ప్రమాణముగా వారికి తగిన సౌకర్యములున్నవో లేవో గమనించాలని, కూలి ఒడంబడిక పత్రము నకలును ప్రభుత్వమునకు పంపాలని సూచించగా ఆ ప్రకారం నిబంధనలు చేస్తూ Act V of 1837 ) ఒక శాసనము చేశారు. అయిదు సంవత్సరములు పూర్తికాగానే ఆ ఒడంబడిక అంతము-కావలెను కూడా నిబంధనలు చేశారు. ఈ చట్టము షరతుల ప్రకారం మారిషసుకు బ్రిటిషు గయానాకు ఆస్ట్రేలియాకు కూలీల వలస పోవుటకు అనుమతింపబడినది. అయితే ఈ వలస పద్ధతిలో కొన్ని అన్యాయములు జరుగుతూ వున్నట్లును అమాయకులైన గ్రామస్థులను మోసగించి బలవంతముచేసి ఒడంబడికలు వ్రాయిస్తూ ఉన్నట్లును, వారికి ముట్టవలసిన కూలిసొమ్ము సరిగా ఇవ్వడము లేదనీ, వారిని క్రూరముగా బాధిస్తున్నట్లున్నూ తెలిసి ఇంగ్లాండులో ఆందోళన ప్రారంభమైనది. అంతట 18 8 వ సం॥లో వలస పంపడము నిలుపుచేసి దీనినిగూర్చి విచారించడానికొక విచారణ సంఘంను నియమించారు. ఆ సంఘం వారి నివేదిక వల్ల మారిషసులో తప్ప తక్కిన రాజ్యాలలో అక్రమాలు జరుగుచున్నట్లు తెలియగా 1840 సం॥లో మారిషసుకు తప్ప తక్కిన రాజ్యాలకు వలస పంపుట నిషేధించారు. మారిషసు విషయములో కూడా గట్టి కట్టుదిట్టములుచేస్తూ 1842 సం॥లో ఒక శాసనము చేశారు. ఈ ప్రకారము మారిషసు వలసరాజ్య ప్రభుత్వానికి, ఇండియాలోని ఇంగ్లీషు కంపెని ప్రభుత్వానికి జరిగిన వలస కూలి ఏర్పాటు పత్రమొకటి ప్రభుత్వము వారి రికార్డులలోనున్నది. అనేక కఠిన నిబంధనలను విధిస్తూ 1844 సం॥లో జెమెయికా బ్రిటిషు గయానా ట్రినిటాడ్ వలస రాజ్యాలకు వలస కూలిని పంపే విషయంలో మరియొక చట్టము చేశారు. తరువాత కొంతకాలానికి దక్షిణాఫ్రికాలోని బ్రిటిషు వలస రాజ్యమైన నేటాలుకు కూలి జనమును పంపుటను గూర్చిన శాసనము చేశారు. ఆంధ్రదేశమునుండి మారిషసు ద్వీపానికి కూలి జనము వలస వెళ్ళడము 1838 సం॥లో ప్రారంభమైనదని చెప్పవచ్చును. ఆ సం॥లో గోదావరిజిల్లా (అనాటి రాజమహేంద్రవరం

జిల్లా)లో కాకినాడ దగ్గఱనున్న కోరంగి రేవునుండి గాంజెస్ లేక గంగా నది అనే పేరుగల ఓడ కూలి జనముతో వెళ్ళినట్లు ప్రభుత్వ రికార్డులలో నున్నది. అటుతరువాత 1847 వ సం॥లో రాబర్ట్సు అనే ఓడలో చేరి పనులు కాయకష్టముచేయు వివిధ వృత్తులవారు (Artisans) ఇక్కు కర్ర తాపీపనివారు వడ్రంగులు వ్యవసాయకులు మొదలైన కూలిజనముతో పాటు చిల్లర వర్తకులు మొదలైనవారు బయలుదేరి వెళ్ళినట్లు రికార్డుల వల్ల తెలుస్తున్నది. 1849 సంవత్సరమునాటికి మారిషసు ద్వీపములోని జనసంఖ్య 168462 మందిలో 66245 మంది భారతీయులున్నారని అంచనా వేయబడియున్నది.

1931 సం॥పు జనాభా లెక్కల ప్రకారము మారిషసు ద్వీపం జన సంఖ్య 3932 38 మంది. అందులో భారతీయులు 268649.

1953 సం॥లో అంచనాలను బట్టి ఆ ద్వీపంలో మొత్తం జన సంఖ్య 501415 అందులో 335327 మంది భారతీయులు: ఐరోపా జాతుల వారును, ఆఫ్రికా జాతులవారును 148248. చీనాదేశీయులు 17850. ఆ ద్వీప ములో భారతీయులలో ఉత్తర హిందూదేశీయులు ముఖ్యముగా హిందీ మాట్లాడేవారు 170357 (ఇందులో బిహారీలు, గుజరాతీయులు యున్నారు.) మహమ్మదీయులు 70,300 తమిళులు 50,000. ఆంధ్రులు 40,000 మంది. మహారాష్ట్రీలు 5 000.

మారిషసు ద్వీపములోని కొందరు హిందువులు అక్కడి స్త్రీలను వివాహము చేసుకొన్నందువల్ల ఒక మిశ్రమ జనము కూడ ఉన్నారు, గాని వారుకూడ హిందువులుగానే పరిగణింపబడుతున్నారు. మారిషస్‌లో కొందరు బౌద్ధులు కూడ ఉన్నారు, తెల్లవారిలో క్రైస్తవులలో ప్రొటెస్టెంటులును రోమను క్యాతలిక్కులను ఉన్నారు. మారిషసు ద్వీపములో హిందీ, క్రియోల్, ఫ్రెంచి, ఇంగ్లీషు భాషలను, హిందువులలో బీహారీలు, గుజ రాతీలు, మహారాష్ట్రీలు, తమిళులు, తెలుగువారు వారి వారి మాతృభాషలను మాట్లాడతారు.

భారతీయులలో అన్ని భాషలవారును ప్రభుత్వములో ఉన్నతోద్యోగములో నున్నారు. చాలామంది చెఱకు పండించుట. వ్యాపారము, ఇతర వృత్తులు చేస్తారు. పూర్వము బ్రిటిష్ కలోనియల్ శాఖ ఆధిపత్యము క్రింద వలస రాజ్యంగా నుండగా మారిషసు ద్వీపమును పరిపాలించడానికి మొదట ఒక గవర్నరును ఆయనకు ఒక సలహా సంఘము, ఒక శాసనసభ ఉండేవి. తరువాత ప్రజా ప్రతినిధులను ఎన్నుకొనే పద్ధతి స్థాపించారు శాసన సభలోను మునిసిపాలిటీ సభలలోను, పంచాయితీలలోను, భారతీయులకు కూడ ప్రాతినిధ్యము ఉండేది. మొదట హెచ్చుమంది తెల్లవారుండేవారు. తరువాత వారి సంఖ్య తగ్గించారు. బ్రిటిష ప్రభుత్వము వారు భారతదేశానికి స్వాతంత్ర్యము నిచ్చిన తరువాత తమ వలస రాజ్యాలకుకూడ నిచ్చారు. అంతట ప్రజలు ఎన్నుకున్న పార్లమెంటు అనబడు ప్రజా ప్రతినిధుల శాసన సభకు బాధ్యత వహించిన మంత్రిమండలి (క్యాబినెట్టు) ప్రధానమంత్రి నాయకత్వం క్రింద ఏర్పడినది. బ్రిటిష ప్రభుత్వంవారి వలన సర్ బిరుదమును పొందిన శివసాగర్ రాంగులామ్ అనే భారతీయ ప్రముఖుడు మారిషస్ ప్రధాన మంత్రి యైనారు. ఇతడు విద్యావంతుడు, సరసుడు, భారతదేశం పట్ల చాలా స్నేహభావం కలవారు ఈయన మన దేశమునకు కొన్ని మారులు వచ్చి వెళ్ళారు. మారిషస్‌లో భారతదేశ ప్రభుత్వానికి హైకమీషనరనే ప్రతినిధి యున్నారు.

1968 సం॥లో బ్రిటిష్‌వారు మారిషస్‌కు స్వాతంత్ర్య మివ్వగా అక్కడ ప్రజా ప్రభుత్వ మేర్పడినది. అక్కడి జనసంఖ్య 8 లక్షలలో సగంమంది భారతదేశంనుండి వివిధ ప్రాంతాలనుండి వెళ్ళినవారి సంతతి వారే. వీరిలోగల ఐకమత్యంవల్ల బీహారు రాష్ట్రమునుండి వెళ్ళిన కుటుంబానికి చెందిన సర్ రామ్‌గులామ్‌గారు ప్రధాన మంత్రి యగుట తటస్థించినది.

మారిషస్ ప్రధాని ఇంగ్లండుతోను, భారతదేశంతోను చాలా స్నేహభావం కలిగియున్నారు. ఆయన భారతదేశానికి వచ్చి ఆర్థిక, సాంస్కృతిక సంబంధములను అభివృద్ధి పరచుటకు కృషి చేశారు. మారి

షస్‌లో ఉన్నత విద్యాభ్యాసమునకు తగిన అవకాశములు లేనందున ఇంగ్లండు, ఫ్రాన్సు దేశాలకన్నా భారతదేశంలో తక్కువ ఖర్చు అగును గనుక మారిషస్ విద్యార్థుల నిక్కడికి పంపుట ప్రారంభించినారు. మన విశ్వవిద్యాలయములు మారిషస్ విద్యార్థులకు కొన్ని విద్యార్థి వేతనములిచ్చి ప్రోత్సహించసాగినవి.

మారిషస్‌లోకి అన్ని జాతులవారి భాషలకు, సంస్కృతికి ఆ ప్రభుత్వమువారు సమానమైన ప్రోత్సాహం నిచ్చుచున్నందువల్ల భారతీయ భాషలు - అందు ముఖ్యంగా హిందీ చాలా అభివృద్ధి చెందినది.

సర్ రామ్‌గులామ్‌గారి ఆహ్వానంపైన మన ప్రధాన మంత్రి ఇందిరా గాంధీగారు 1970 సం॥లో మారిషస్‌కు వెళ్ళి అక్కడ మహాత్మా గాంధీగారి పేరుతో స్థాపించబడిన వైజ్ఞానిక కేంద్రమునకు శంకుస్థాపన చేసినారు.

మారిషస్ ప్రధాని రామ్‌గులామ్‌గారు తమ అధికార హోదాలో భారతదేశంలో పది రోజులపాటు పర్యటించుటకు తమ భార్యతోను, ఆర్థిక ప్లానింగు మంత్రి వగైరాలతోను 1975 సం॥ జనవరి 6 వ తేదీన విమానంలో బొంబాయికివచ్చి, ఢిల్లీలో మన ప్రభుత్వంవారి అతిథిగా నున్నారు. వారు మన ప్రధాన మంత్రి ఇందిరా గాంధీగారితోను, ప్రభుత్వ వర్గంతోను చేసిన సంప్రతింపుల ఫలితంగా మారిషస్ రాజ్యాభివృద్ధికోసం యీ సం॥లో జూలైలో ప్రారంభమగు రెండవ ప్రణాళికకు 175 కోట్ల రూ. సహాయం చేయుటకు వారంగీకరించిరి. ఇందులో రు. 10 కోట్లు వాణిజ్యపరపతి యుంటుంది. ఇదిగాక మారిషస్‌లో మంచినీటి సదుపాయం కోసం *రు: 10 కోట్ల ఋణం మంజూరు చేశారు. (మారిషస్ 1 రూపాయకు భారతదేశపు [illegible] రూపాయలు సమానం)

భారత ప్రభుత్వంవారి ఔదార్య మింతటితో ఆగలేదు. 750 సెకండరీ విద్యార్థులకో ఒక విజ్ఞానకేంద్రంగా పనిచేయు మహాత్మా గాంధి ఇన్‌స్టిట్యూట్‌కు రు. 10 లక్షల ఏరాశి మిచ్చుటకుకూడ అంగీకరించినారు. రామ్‌గులామ్‌గారు చాలా సంతోషించారు. భారతదేశాన్ని, ప్రధానిని చాలా

---

* పల్లపు నీటి పారు సదుపాయము కోసము

ప్రశంసించారు. తాను బీహారువాడిననీ, తాను యిక్కడి రాజకీయాలను గ్రహించగలనని చమత్కరించినారు.

రామ్‌గులామ్‌గారు జనవరి 10 వ తేదీన నగపూర్‌లో జరిగిన అఖిల ప్రపంచ హిందీ మహాసభకు అధ్యక్షత వహించి తమ ఉపన్యాసమును విశుద్ధమైన హిందీ భాషలో చదివి అందరికీ ఆశ్చర్యం కలిగించినారు. ఇందుకు ఆశ్చర్యపడవలసిన పని లేదని; నూట ఏబదిఏండ్ల క్రిందట మారిషస్‌కు వలసవెళ్ళిన తమ పూర్వులే భాషను, యీ సంస్కృతిని అక్కడకు తీసుకొని వచ్చారని, ఇప్పుడు అక్కడ చాలామందికి యీ భాష వచ్చునని అన్నారు. ఆయనహిందీ భాషాభిమానియైనా తక్కిన భాషలనుకూడ ఆదరిస్తున్నారు. మన కేంద్ర ప్రభుత్వంవారు చూపిన మార్గాన్ననుసరించి ఆంధ్ర ప్రభుత్వం అక్కడి ఆంధ్రులకు తోడ్పడుట న్యాయం.

# 14. సింహళము - ఆంధ్ర సంస్కృతి

—శ్రీ అడివి బాపిరాజుగారు

[ఆంధ్ర విశ్వ విద్యాలయంవారు ఆయనకు కళాప్రపూర్ణ బిరుద మివ్వలేదుగాని బాపిరాజుగారు ఆంధ్ర కళాప్రపూర్ణుడే.

ఆయన భారతదేశ మంతటా పర్యటించి ఆంధ్ర సంస్కృతికి సంబంధించిన చరిత్రాధారాలను సేకరించారు. తన నవలల్లో, కథలలో, వ్యాసాలలో దానిగురించి వ్రాశారు.

సింహళ యాత్ర చేసి వచ్చినతరువాత అక్కడ కనబడిన ఆంధ్ర సంస్కృతి చరిత్రాధారాలను గురించి ఆయన వ్రాసిన

అపూర్వ వ్యాసములు 1951 సం॥ ఏప్రిల్ నెల భారతిలో ప్రకటింప బడినవి. లక్షల ఖర్చుతో ప్రపంచాంధ్ర సభలను ఏర్పాటు చేస్తున్న ఆంధ్ర ప్రభుత్వంవారు చెన్నపట్నంలోను, తంజావూరులోను వున్న తెలుగు పుస్తకాలను అచ్చువేయించే సంగతి అలావుంచివాటి ప్రతులను వ్రాయించడానికికూడ ప్రయత్నించలేదు. మల్లంపల్లి సోమశేఖర శర్మగారి చరిత్ర పరిశోధనకు సంబంధించిన వ్యాసాలుగాని, బాపిరాజుగారి రచనలనుగాని ప్రకటిస్తే ఆంధ్ర సంస్కృతికి శాశ్వతమైన సేవ చేసినవారవుతారు. ఈ సభల తరువాత మళ్ళీ దాని గురించి ఆలోచించేవారే వుండరు ]

## ప్రస్తావన

ఈ మధ్య మదరాసు ప్రభుత్వంవారి కోరికపైన ప్రభుత్వంవారి మదరాసు మ్యూజియంకు సింహళంలో క్రీ.శ. అయిదవ శతాబ్దంలో రాజ్యం చేసినకశ్యప మహారాజు రాజధాని దుర్గమైన సింహగిరి పర్వతంపైన,గుహాలో వున్న చరియలోవున్న కుడ్య చిత్రాలకు ప్రతిరూపాలు తీయడానికి సింహళ యాత్ర చేసి, ఆ ప్రతిరూపాలు తీసికొనివచ్చి మ్యూజియంకు యిచ్చియున్నాను. నాకు సహాయార్థంగా యువకులైన నలుగురు చిత్రకారులను కూడా తీసికొని వెళ్ళినాను. వారు కోడూరు రామమూర్తి, రాంభొట్ల కృష్ణమూర్తి, పిలకా నరసింహమూర్తి, కె. శ్రీనివాసులుగార్లు. మేమంతా ఈ యాత్ర ఎంతో ఆనందంగా కొనసాగించాము.

సింహళంలో బౌద్ధులు ఎక్కువ. తరువాత సంఖ్య హిందువులు. ఆ వెనుక క్రైస్తవులు, ముస్లింలు. ఎక్కడ తిరిగినా ప్రాచీన స్తూపములు, సంఘారామాలు, దేవాలయాలు శిథిలాలై పడివున్నాయి. చిత్రలేఖనాలు, శిల్పాలు, భవనాలు తమ తొల్లింటి సౌందర్య రూపాలను ఓజ్మాత్రంగా చూపిస్తూ దేశం అంతటా నిండివున్నాయి. చాలా పురాతన నగరాలు, స్తూపాలు విహారాలు, సంఘారామాలపై గాఢమైన అరణ్యాలు అలుముకు పోయినాయి. ఈనాడు సింహళప్రభుత్వంవారి ప్రాచ్య పరిశోధకశాఖవారు

యీ శిథిలాలను జాగ్రత్తగా పైకి తీస్తున్నారు. డాక్టరు పరణవితానంగారు ప్రజ్ఞావంతులు, శేముషీ సంపన్నులు, కళాప్రపూర్ణులు, రసజ్ఞులు. వారు ఆ ప్రాచ్య పరిశోధక శాఖకు ముఖ్యోద్యోగులు. వారు మా యాత్ర నిర్విఘ్నముగా కొనసాగటానికి సర్వవిధాల సహాయం చేశారు. మన ఆంధ్రులకన్న వారికి మన ఆంధ్ర చరిత్ర ఎక్కువగా తెలుసును. ఆయన వుద్దేశంలో ఆంధ్రప్రదేశానికీ సింహళానికీ సాంస్కృతిక సంబంధమైన బాంధవ్యం అతి గాఢంగా వుండేదని. ఆ దేశం అంతా తిరుగుతూ ప్రాచీన కట్టడాలు, గుహలు, శిల్పాలు, చిత్రలేఖనాలు పరిశీలిస్తూవుంటే, ప్రథమంనుండీ అనేక శతాబ్దాలపాటు ఆంధ్రులు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో, తమ శిష్యులైన సింహళులద్వారానో తమ సంస్కృతికి అక్కడ వాకలు కట్టించినారని స్పష్టంగా కనబడింది.

## ౧. దేశాలు

అశోక చక్రవర్తి కాలానికి ముందే ఆంధ్రులలో చాలామంది బౌద్ధ దీక్ష తీసుకున్నారు. స్తూపాలు ఆంధ్రదేశంలో ఆ ప్రథమ దినాల్లోనే వెలసినవి.

బుద్ధ దేవుడు తన 80 సంవత్సరాల జీవితంలో రెండు మూడుసార్లు ఆంధ్రదేశం వచ్చి బౌద్ధ ధర్మం నెలకొల్పి సంఘారామాలు ఏర్పరచినట్లు కనబడుతున్నది.

ఆంధ్రదేశానికి క్రీ. పూ. వేయి సంవత్సరాలకు పూర్వమే ఆంధ్రులు వలసవచ్చి రాజ్యాలు స్థాపించినట్లు, సింహళులు క్రీ. పూ. వేయి సంవత్సరాలనాడో (అయిదారువందల సంవత్సరములకు పూర్వమే అయివుంటుంది) సింహళానికి వలస వెళ్ళినారు. వీరికీ వారికీ గాథలలో సింహ సంబంధం వుంది. వీరికి వారికీ సింహ పతాకమే। శాతుడనే గంధర్వుడు సింహమై మొదటి శాతవాహనుని పెంచినాడు కాబట్టి వీరు శాతవాహనులు. సింహ పతాకులు కాబట్టి వారు సింహళులు.

కథలంటే ఆంధ్రులు ప్రాణం అర్పిస్తారు. ఆంధ్ర మహాకవి

గుణాఢ్యుడు సేకరించి వ్రాసిన గాథల సంపుటి బృహత్కథ. ఆ బృహత్కథలో ఆంధ్రులు సింహళ రాజధానితో బాగా వర్తక సంబంధాలు కలిగి వున్నట్లు స్పష్టమౌతున్నది. తామ్రపర్ణి రేవులో ఆంధ్రుల ఓడలు దిగేవట. సింహళంనుండి దాల్చిన, కొబ్బరి, లవంగాలు, కర్పూరం, లక్క, మిరియాలు, పచ్చలు, రత్నాలు దిగుమతి చేస్తే ఆంధ్రులు బంగారం, రంగులు, యాలకులు, లోహ సామానులు, వస్త్రాలు, శిల్ప సామానులు సింహళానికి ఎగుమతి చేసేవారు.

సింహళ రాజుల వంశ చరిత్రలు వర్ణించే గ్రంథాలు, మహావంశ, దీపవంశ, చూళవంశ అనే గ్రంథాలు. వానిలో ఆంధ్రుల రాజులతో సింహళ రాజులకున్న స్నేహ బాంధవ్యాలు వర్ణించారు.

## ౨. స్తూపాలు

ఆంధ్రులూ, సింహళులూ, బౌద్ధులు వారి దేశంలో వారి ద్వీపములో స్థవిరవాదమే ఎక్కువ ప్రాబల్యం వహించింది. ఆ తర్వాత ఆంధ్రుడైన శ్రీ నాగార్జున బోధిసత్వుడు మహాయానానికి జనకుడు. నాగార్జునుడు సింహళంలో కొంతకాలం నివసించినట్లు గాథ లున్నాయి. అతని మహాయాన విధానం సింహళం వినింది.

ధాన్యకటకంలోనూ, ఇక్ష్వాకుల రాజధాని (నేటి నాగార్జున కొండ) అయిన విజయపురిలోనూ సింహళుల సంఘారామా లున్నట్లు శాసనాలు ప్రత్యక్షం చేస్తున్నవి. సింహళ ప్రాచీన స్తూపాలు, ఆంధ్రుల స్తూపాలు ఒకే రూపంలో వున్నాయి. పవిత్రమైన బుద్ధుని దంతధాతువు ఆంధ్ర దేశామ్నుండే సింహళం వెళ్ళింది. మరి ప్రాచీన స్తూపాలకు ఆంధ్ర స్తూపాలకు ప్రత్యేకమైన ఆయక స్తంభాలు వున్నట్లు పరిశోధకు లంటున్నారు.

ఆంధ్ర స్తూపాలకు చుట్టూవున్న శిలాప్రాకారపు రాతి కంచెలు సింహళ స్తూపాలకు వున్నా, ఆంధ్ర స్తూపాలకున్న రాతి కంచె సంపూర్ణ శిల్పయుక్తము, సింహళపు కంచెపై శిల్పం లేనే లేదనవచ్చు.

అయినా ప్రదక్షిణ ప్రాకారాలు, వేదికలూ, సూచీ స్తంభాలూ, రెండు దేశాలలోనూ ఒకే విధంగా వున్నవి.

## 3. శిల్పం

సింహళ దేశంలో ప్రాచీన శిల్పం జాగ్రత్తగా గమనిస్తే సింహళ మహారాజులు అప్పటికే జగత్ప్రసిద్ధి వహించిన ఆంధ్ర శిల్పులను సింహళం తీసుకొని వెళ్ళి వుంటారనుకొనడం సత్యదూరం కాదు. పల్లవ భోగంలో (పల్నాడు) దొరికే పాలరాయి, గంధపు చెక్కపై శిల్పం మలచినట్లు విశ్వసించడానికి అనువైన మెత్తని రాయి. అలాంటి రాయి సింహళంలో దొరకలేదు. ఆంధ్రదేశంనుండి ఆ రాయిని కొనిపోవటం కష్టం. కాబట్టి ఆంధ్రదేశాన్నుండి వెళ్ళిన శిల్పులు అలాంటి రాయిని సింహళంలో వెదికినారు. సింహళ రాజధాని అయిన అనూరాధపురంచుట్టూ నల్లరాయి కావలసినంత వుంది.

అయినా ఆ శిల్పులు దానితో శిల్పం మలచటానికి యిష్టంలేక పల్నాటి రాయిని పోలిన ఒకవిధమైన స్ఫటికపు రాయిని అనూరాధపురానికి కొద్దిమైళ్ళ దూరంలో కనిపెట్టి ఆ రాతిని విరివిగా వారి శిల్పానికి ఉపయోగించారు.

అనూరాధపురం ప్రాచీన స్తూపాలకు అలంకరించిన నాగుల శిల్పాలు, సూచీ స్తంభాలు, బుద్ధ విగ్రహాలు, పద్మశిలలూ అన్నీ ఆ రాతితోనే విన్యసించారా శిల్పులు.

అనూరాధపురంలో దర్శనమిచ్చే ప్రాచీన బుద్ధ విగ్రహాలన్నీ ధాన్యకటకాది ఆంధ్ర బౌద్ధశిల్ప క్షేత్రాలలో దొరికే బుద్ధ విగ్రహాలకు ప్రతిరూపాలు.

భారతదేశంలో బారహూత, మధుర, గయ, సారనాద, నలందాది క్షేత్రాలలో ప్రత్యక్షమయ్యే బుద్ధ రూపాలు వేరు; ఆంధ్రదేశంలో బుద్ధ రూపాలు వేరు. నిలుచునివున్న భిక్షమూర్తి విగ్రహాలు, పద్మాసనస్థుడైన ధ్యాన బుద్ధమూర్తి విగ్రహాలు అమరావతి శిల్పులో, వారి శిష్యులైన సింహళులో విన్యసించారు.

మిహింతల పర్వతంలో "కిరిబదపవు" అనే గిరిబంధ చైత్యంలో

పని చేసినవారు ఆంధ్ర శిల్పులో, వారి శిష్యులో అయివుంటారని డాక్టరు పరన వితానంగారి మాటలవల్ల స్పష్టమౌతున్నది. ఇక్కడి శిల్పాలు ముఖ్యంగా అలంకారరూపమైనవి. వాని విన్యాస వైఖరి భావంచూస్తే సాంచీస్తూప ద్వార గోపుర శిల్పాలను తలంపుకు తెస్తున్నవి.

ఆంధ్రులు నాగపూజావలంబకులు. వారి బౌద్ధ శిల్పంలో నాగ మూర్తి విన్యాసం ఎక్కువ. అలాంటి నాగ నాగినీ విగ్రహాలు సింహళ శిల్పంలోనూ ఎక్కువ భంగిమాలలో, దేహ సౌష్టవంలో, అలంకారాములలో వస్త్ర విన్యాసంలో అనూరాధపురాములలోవున్న ప్రాచీన శిల్పాలు ఆంధ్ర శిల్పాలకు ప్రతిరూపాలే.

డా॥ పరనవితానగారు "కొన్ని శిల్పాలలో అమరావతి శైవ సంప్రదాయం స్పష్టమౌతుంది" అన్నారు. సూచీ స్తంభ శిల్పం ఆంధ్రుల సొత్తు. అది అనూరాధపుర మిహింతల స్తూపాలకడ ప్రత్యక్షమౌతుంది. ఇతర చోట్ల కనబడదు అని ప్రాచ్య పరిశోధనశాఖకు చెందిన సేనావరత్నగారు వారి "మిహింతల" అనే గ్రంథంలో వ్రాసినారు.

ఈ విషయమే "విన్సెంటు స్మిత్" తన "దక్షిణ భారతీయ సింహళ కళ" అనే గ్రంథంలో సింహళ ప్రాచీన శిల్ప చిత్ర లేఖనలకు ఆంధ్ర శిల్ప చిత్ర లేఖనాలను పోల్చి చూపి ఆంధ్ర కళకు సింహళ కళా చరిత్రపైన వున్న ప్రాభవాన్ని నిరూపించినారు.

పల్లవులు ఆంధ్రులు. శాతవాహనులకు వారు చాలాకాలం సామంతులుగా వుండి గుంటూరుసీమ కంతేరు రాజధానిగా పరిపాలించారు. ఆంధ్ర ఇక్ష్వాకుల కాలంలో వారు కంచీపురం రాజధాని చేసికొని, తామున్నూ స్వతంత్రులు కావడానికి ప్రయత్నించి ఇక్ష్వాకుల రాజ్యం నాశనం చేసినారు. వీరితోపాటు ఇక్ష్వాకులకు సామంతులూ, రాజబంధువులూ అయిన చాళుక్యులు స్కంధనగ్రోలు (కందనోలు లేక నేటి కర్నూలు) రాజధానిగా రాజ్యం చేసేవారు. వీరూ, అటు వైజయంతీపురంలోని చూతకుల శాతవాహనులూ సామ్రాజ్యాలు నిర్మించ ప్రయత్నం చేసినారు.

శాతవాహన శిల్ప సాంప్రదాయం పల్లవులు కంచి, మహాబలిపుర పీఠపన్నవాసల మొదలైన ప్రదేశాలలో, చాళుక్యులు బాదామిలో, విష్ణు కుండినులు ఉండవల్లి, మొగలురాజపుర గుహలలో, సాలంకాయనులు జీలకర్రగూడెం మొదలైన ప్రదేశాలలో, కళింగాంధ్రులు దంతపురం, శాలిహుండాం, సంఘారామాదులలో శక్తివంతంగా ప్రవహింపజేసినారు. ఆ పల్లవుల కాలంలోనూ ఆంధ్ర శిల్పుల ప్రతిభ సింహళంపైన ప్రజ్ఞతో ప్రవహిస్తూనే వున్నది.

"స్నాన పుష్కరిణులు, ఆ పుష్కరిణులకు గంగకు వున్న సంబంధమూ, ఆ గంగలో విహరించే ఏనుగులను, చూసి వారు భారతీయ పల్లవ శిల్పం గమనించి, మహాబలిపురంలోని ఏడు రాతి రథాలూ అచ్చటి ఏనుగులు, గంగావతరణాది శిల్పాలూ తలచుకు తీరుతారు" అని డా॥ పరణ వితానగారు సూచినారు. ఇసురుమణిస్తూపంలో దాని రథికుడు చెక్కిన శిల్పం గమనిస్తే పల్లవ శిల్పమే యిది అని తోస్తుంది అని సేనావరత్నం గారు వ్రాసినారు.

పెంద్యచేర విహారంలో దొరికిన ఒక శిల్ప ఖండంలో మాయాదేవి స్వప్నం గండరించి వుంది.

ఒక మంచంపైన మాయాదేవి పవ్వళించి వుంది. ఆ రూపం సగం వరకే వుంది. చుట్టూ సేవకురాండ్రు వివిధ భంగిమలలో కూర్చుండి, నిలుచుండి నిదురబోతున్నారు. ఈ శిల్పం నాగార్జునకొండలోని స్తూపాల శిల్ప ఖండం వలెనే వున్నది. రాయి తేవా లేకపోతే ఇక్ష్వాకుల శిల్పమే సింహళం తీసుకొనివచ్చి వుంటారు అని అనుకోవచ్చును. ఇదేరకపు శిల్పం నాగార్జున మెట్ట స్తూప శిల్పంలో ఎన్నో వున్నాయి. పరిచారికల మోములు అలంకరణ జడలు, సేవకుల రూపాలూ అన్నీ ఇక్ష్వాకుల విజయపురం శిల్పం వలెనే వున్నాయి. ఆంధ్ర శిల్పంలో అర్ధచంద్ర శిల అని పిలువబడే అర్ధ పద్మ శిలా శిల్పం అంత విరివిగానూ సింహళంలోనూ ఉపయోగించినారు.

ఇక్ష్వాకుల శిల్పంలో నాగార్జునదేవుని విగ్రహాలు మూడు నాలుగు

వున్నాయి. ఇవి బుద్ధరూపాలే అని కొందరంటారు. అట్టి విగ్రహం ఒకటి చెక్కు చెదరకుండా సంపూర్ణ శిల్పంగా సింహళంలో పెరువిల్లా సంఘారామంలో దొరికింది.

## ౮. చిత్రలేఖనం

భారతీయ చిత్ర లేఖనానికి హిమాలయ శిఖర శృంగం కదా అజంతాగుహా విలసిత కుడ్య చిత్రలేఖనం. క్రీస్తుపూర్వం నాలుగవ శతాబ్దం నుండి ప్రారంభమై, క్రీ. శ. ఆరవ శతాబ్దం వరకూ అజంతాలోని ఆంధ్ర చిత్రలేఖన చరిత్ర అనన్యమై ప్రవహించి వచ్చింది. అజంతాకు పయనమై వచ్చి, ఆంధ్ర శిల్ప కులపతుల పాదాలకడ చిత్రలేఖన మభ్యసించి తమ తమ దేశాలకు పోయి, అక్కడ విజృంభింపజేసినారు - కోహరస్తాను, గాంధార, పారశీక, చీనా, సువర్ణద్వీప, మలయద్వీప, యవద్వీప, సింహళ ద్వీప చిత్రకారులు.

ఆ సింహళ చిత్రకారులు, ఆయసంఘారామ పొలనారువ, అనూరాధపుర, దుబుల్లా సింహగిరి మొదలైన నగరాల సంఘారామ విహారాదులలో ప్రజ్వలింపజేసినారు. దుత్తగామను దంబుల్లా కొండపై విహారం నిర్మించినాడట. అక్కడ నేటికి చెక్కు చెదరకుండా ప్రాచీన కాలం నాటివీ, మధ్యయుగం నాటివీ చివరి యుగం నాటివీ చిత్రలేఖనా లున్నవి.

భారతీయ చిత్రకారులు ఉపయోగించినన్ని రంగులు సింహళ చిత్రకారులు ఉపయోగించలేదు. కాని ముఖ్యమైన మూడు వర్ణాలూ, పీలి, జేగురు, ఇంగిలీకము - పసుపురంగు ఉపయోగించినారు. రేఖలలో లాలిత్యమూ, శక్తి భారతీయ చిత్రకారుల కున్నట్లు సింహళ చిత్రకారులలో లేదు. అయినా ఆంధ్ర భారతీయ చిత్రలేఖనలోని అందాలన్నీ వారి చిత్రలేఖనంలోను కనబడతాయి.

కశ్యపరాజు తండ్రి ధాతుసేనను చంపించినాడు. సోదరుడు అయిన మొగ్గలాయనుడు కశ్యపునకు భయపడి భారతదేశం పారిపోయినాడు. అనూరాధాపురం రక్షణకంత అనువైన నగరంకాదు. కాబట్టి కశ్యప మహా

రాజా అడవుల, కొండల మధ్యకుపోయి, ప్రకృతిసిద్ధంగా దుర్గమమైన సింహగిరి తన రాజధానిని చేసుకొని ఆ కొండచుట్టూ మహానగరం నిర్మించు కొన్నాడు. తన్ను సార్వభౌమునిగా గణించుకున్నాడు. సార్వభౌములు అవతార పురుషులు. కాబట్టి తాను కుబేరుని అవతారమన్నాడు. సింహగిరి కైలాస పర్వతం. కైలాసపర్వతంచుట్టూ విద్యాధర, గంధర్వాంగనలు ఆకాశ సంచారం చేస్తూ విహరిస్తూ వుంటారు.

ఆ రీతిగా తన కొండ చరియను గుహాకారంగా చెక్కించి మేఘా లలో విహరిస్తున్నట్లు సుందర స్త్రీ రూపాలను చిత్రింపజేసినాడు.

అజంతాలో కుడ్యచిత్రం వేసేందుకు రాతిగోడయైన, అందుకై సిద్ధంచేసిన మన్ను అందుగ, సున్నం, ఆవాలలేపం మొదలైనవి కలిపి నూరిన లేపనం పూసి, అందుపై బొగ్గుతో లేత రంగులతోనే బొమ్మవేసి, ఆ బొమ్మను తరువుతూ రంగులు వేసినారు చిత్రకారులు. ఆ విధానమే సిగిరియా చిత్రకారులూ అనుసరించినారు.

సిగిరియాలో ముప్పదిపై చిల్లర బొమ్మలవరకు మాత్రమే చిత్రించి వున్నారు. నేడు వానిలో పది పన్నెండు బొమ్మలు మాయమైపోయినాయి. ఇప్పుడు పదునేడు బొమ్మలు వున్నాయి.

భంగిమాదులలో, హస్తవిన్యాసంలో అజంతా సంప్రదాయానికి సిగిరియా బిడ్డ అని స్పష్టంగా కనబడుతుంది.

అజంతాలో వేలకొలది చిత్రాలు విన్యసించినట్లు దంబుల్లా విహా రంలో చిత్రించినారు.

అజంతాలో మహేంద్రుడు సింహళం ఓడలోవెళ్లి చేరుతున్నట్లు అద్భుతమైన చిత్రలేఖనం వున్నది. సంఘమిత్ర బోధివృక్షం పట్టుకు వెళ్లిన చిత్రలేఖనం దంబుల్లాలో చిత్రించి వున్నారు.

## ముగింపు

నేటికీ సింహళంలో చిత్రలేఖనం అజంతా సంప్రదాయాన్నే అనుస

రిస్తున్నది. మేము వున్న సిగిరియాప్రక్క ఒక సంఘారామంలో గ్రామ చిత్రకారులు కొందరు పూర్వశక్తితో అజంతా భంగిమాయుక్త బౌద్ధ చిత్రాలను చిత్రిస్తూ వుండడం గమనించినప్పుడు నాకు కలిగిన ఆనందం వర్ణనాతీతం.

తమిళ సోదరు లెప్పుడో సింహళం దండెత్తి వెళ్లినారు. ఇతర మతమని అయినా గౌరవం లేకుండా "బౌద్ధస్తూప విహారాదులను నాశనం చేసి యత్నలు ఎత్తుకుపోయినట్లు దోచుకునేవారు" అని మహావంశ కర్తలు వ్రాసినారు.

చోళులు క్రీ. శ. పదవ శతాబ్దంలో అనూరాధపురం నాశనం చేసి పొలనారువాలో రాజ్యం స్థాపించినారు. వారు నిర్మించిన దేవాలయము, శిల్పాలూ అచ్చట వున్నాయి. మధ్యయుగంలో చివర సింహళానికి స్కంధపురం రాజధాని. ఆ నగరానికి నేటిపేరు కేండే. ఆ రాజులు దండెత్తివచ్చి పోర్చుగీసువారితో యుద్ధాలు చేసేటప్పుడు తంజపురి ఆంధ్రనాయక రాజులు, మధుర ఆంధ్ర నాయకులు సహాయం చేసినారు. చివరి సింహళ రాజులు ఇల్లడం వెళ్లిన మధుర ఆంధ్రనాయక రాజవంశంవారు. వారు తీసుకొని వెళ్లిన నృత్య, శిల్ప, చిత్రలేఖన, సంగీత సంప్రదాయాలు నేటికీ అక్కడ ప్రచారంలో వున్నాయి.

ఆంధ్రులంటే సింహళంవారికి ఎంతో ప్రేమ. అసలు సింహళులు మర్యాదగలవారు. శాంత హృదయులు. వారి గ్రామాలు, నగరాలు ఎంతో పరిశుభ్రంగా వుంటాయి. వారి మగవారి కట్టు దక్షిణాదివారి కట్టు. ఆడవారు మళయాల ఆంధ్రవిధానాల కలయిక అయిన ఒక చిత్రవిధానపు కట్టు, బొట్టు 'అనుకరిస్తారు.

వారి సింగళీ భాష పాలిభాష బిడ్డ, కాని వారి భాషాలిపి, ఆంధ్ర లిపి బ్రాహ్మిలిపినుండి వచ్చినవి కాబట్టి వారు శిల్పంలో ఆంధ్రుల శిష్యులు కావడంవల్లా, యీ నాడు అచ్చంగా ఆంధ్ర భాషాలిపివంటి లిపినే వారూ వృద్ధి చేసుకున్నారు.

# 15. హరిజన చరిత్ర - పరిశోధన

గాంధీమహాత్ముని హరిజనోద్యమ సందర్భంలో మన మాల, మాదిగల స్థితిగతులు బాగా వెల్లడియైనవి. దాని ఫలితంగా స్వతంత్ర భారత రాజ్యాంగంలో హరిజన క్షేమ లాభముల కవసరములైన విధి నిషేధములు చేర్చబడినవి. అయితే హరిజనులను గూర్చిన ప్రమాణ చరిత్ర గ్రంథ మింతవరకు ప్రకటింపబడలేదు.

"దక్షిణ హిందూదేశములోని కులములు - జాతులు" అను పేరుతో ఏడు సంపుటములు రచించిన థర్‌స్టన్ దొర మన మాల, మాదిగల ఆచార వ్యవహారాలనుగూర్చి కొంత వివరించియున్నాడు. ఆంధ్ర పత్రిక (1928-29) విభవ సంవత్సరాది సంచికలో శ్రీ సిరిపి ఆంజనేయులుగారు అనంతపురం మండలములోని ఆది ఆంధ్రులనుగూర్చి వ్రాసిన వ్యాసములో ఆంధ్రదేశ హరిజనులను గూర్చిన అనేక విశేషాంశము లున్నవి. ఇతర జిల్లాలవారిని గూర్చి వ్రాయవలసినదని ఆయన హెచ్చరించారు.

## అనంతపుర మండల ఆది ఆంధ్రులు

—సి రి పి ఆం జ నే యు లు

[ఆచార వృత్త్యాదికములలో రాష్ట్రము నందలి యాది మాంధ్రుల వ్యవహారము లొక మండలమును వేఱొక మండలముతో బోల్చునెడలఁ గొంతకుఁ గొంత భిన్నించి యున్నట్లు తెలియు చుండుటచే ననంతపుర మండలము నందలి యాది మాంధ్రుల చిరకాలాగతాచార వృత్తివిశేషములను యథాక్రమమున నిరూపించు నుద్దేశమున నిది వ్రాయబడినది. రాష్ట్రమునగల ప్రజానాయకులును,

సంఘ సంస్కార ప్రియులును కేవల జనహితకరమగు తమ కృపా వీక్షణము నిట్టి సాంఘిక దైన్య చరిత్రములవంక మరల్చి, పతిత జాతి జనుల దుర్భర విషాద పరిస్థితులకు మూలమగు కీలకము నెఱిగి, దాని దొలచుటకయి యనుత్తప్త హృదయమున - మనసార గృషి సల్పుచో నిక నా జాత్యభివృద్ధినిగూర్చి శంకించు పని యుండదు. ఇం దాదిమాంధ్ర పదమునకు సమముగ బంచమశబ్ద ముః యోగించు వ్యాసరచనా సౌకర్యార్థమేయని పాఠకులు గ్రహింతురు గాక। సీ అం.]

## మాల మాదిగలు (పూర్వ గాథ)

పూర్వము కైలాస గిరియందు పార్వతీ పరమేశ్వరుల సన్నిధి నొక ధేను వుండెను. దాని పోషణార్థము మహాదేవు డిద్దఱు బాలకులను సృష్టించెను. వారా దంపతులకు మనఃప్రీతి కలుగ నా యావును గాపాడుచుండిరి. దంపతులు తమ కా గోవువలన బ్రాప్తించు క్షీర ఘృతాదులలో దేనివేని బశుపాలకుల కిచ్చుచుండలేదు. ఒకనా డంబిక బాలకులలో నొక్కనికి బాల గో౹కుడు పెట్టెను. వా డది భుజించి దాని మాధుర్యమున కలరి, తత్పదార్థ ప్రాప్తికి మూలమైన లేగటి యావు నున్మూలించినచో నట్టిది యింకను పరిపగ లభించవచ్చునని తలంచి, యా పసికై రెండవవాని బ్రేరేచి యొద బఱిచెను. అనంతరము ద్వితీయు డా నవసూతికను వధించుటయు, బ్రథము డాతని నడిగి కొంత పలలము బుచ్చుకొనుటయు సంభవమయ్యెను. ఉమా మహేశ్వరు లది గ్రహించి గో హంతకులును, మాంస భక్షకులును నగుట వలన నా బాలకు లస్పృశ్యుల దాకరానివారినిగను, మొదట నా మొదవును జంప సంకల్పించినవాడు మాంసాధికారికాక బాధ్యతగల ద్వితీయు నడిగి పుచ్చుకొనుచు "మాల" యనబడునట్లును, ద్వితీయుడు పలలాధికారియై మాంస ప్రదాత యగుచు, 'మాదిగ' యనబడుగునట్లును శపించిరి. ఇట్లు శాప సంత్రస్తులగు నా గోపాలకుల వంశజులే మాల మాదిగ లన జెల్లినటు లీ

ప్రాంతమునందలి యాది మాంధ్రులు చిరకాలముగ నొక కట్టుకథ చెప్పు కొనుచున్నారు.

## మాల మాదిగల పరస్పర సంబంధము

అనంతపుర మండలమున మాలలు గ్రామములకు మిగుల సమీపము నను, మాదిగలు దూరమునను నిండ్లు కట్టుకొని వసించుచున్నారు. ఈ ప్రాంతమునంగల మాల మాదిగల కే విషయమునను బొత్తులేను. అన్ని సందర్భములయందు నెవరికి వారు వేఱుగనే యుందురు. ఈ కులభేదము బహుకాలమునుండి కలదు. చివర కది జాతి తిరస్కారముక్రింద బరిణ మించినది. మాల మాదిగలలో నొండొరులకు బంక్తి భోజనము లేదు. ఒకరి బావి నీరు వే రొకరు త్రాగరు. ఒక్క తాంబూల స్వీకారము దప్ప దక్కిన యే సమయమునను నొండొరులకు గలుపు మెలుపులు లేవు. దృష్టిలో మాత్రము మాలలకు మాదిగలును, మాదిగలకు మాలలును హీనులు. తిలకధారణ ముభయ వర్గములయందును గలదు; కాని కుగ్రామ వాసులలో నెవ్వరును బొట్టు పెట్టరు. నాగరికతగల ప్రదేశమునందు నామ ధారులు కొంద ఱీవల తిలకము ధరించుచున్నారు. విద్య నేర్చుకొనుట కే జాతివారికిని నడ్డంకి యావంతయును లేదు. ఉభయ వర్గముల బాలికా బాలకులును సమముగ గూడుచుండి, విద్యార్జనమునకయి ప్రయత్నింప వచ్చును. మాదిగల కంటె మాలలలో దెలివితేట లధికముగ నున్నట్లు కన్పట్టుచున్నది.

## పంచముడు - బ్రాహ్మణుడు

ఆది మాంధ్రుల వాడలో బ్రాహ్మణు డడుగు పెట్టినను, బ్రాహ్మణ వీథిలో పంచముడు ప్రవేశించినను నాది మాంధ్రునకు దారిద్ర్యము తప్పదు. ఆది మాంధ్రుడు చర్మమునకు గలపేయు పాత్రను బ్రాహ్మణుడు సమీ పించినను, బ్రాహ్మణుని తలపిడనము వఱకు నాది మాంధ్రుడు నడచినను బంచముని గూడెమే పాడగును. ఇది యీ ప్రాంతమునందలి యాది

మాంధ్రులలో గల భీతి; కావున ఏ మండలమున పెక్కు చోట్ల నాది మాంధ్రులు తమ వాడకు బ్రాహ్మణులను రానిచ్చుటకును. బ్రాహ్మణుల చేతి భోజనము గ్రహించుటకును జడియుచున్నారు. స్నాన పానములకు విరళ్యంతరము.

## ఆదిమాంధ్రుల వివాహ విధానము - అంతశ్శాఖలు

ఈ మండలము నందలి యాది మాంధ్రులలో గౌరీ పరిణయములు, రజస్వలానంతర వివాహములు, వితంతూద్వాహములు కూడుకొను నియమములు గలవు. పైగా దాసువాంధ్ర తెగ యొకటి యున్నది. ఇందన్నింటను గౌరీకల్యాణములే ప్రశస్తములుగ బరిగణింపబడుచున్నవి. రజస్వలా నంతర వివాహమునకు బందిరి, పచ్చతోరణము, ఉల్లెడ, కలశము, ముసుగు చీర, హరివాణము, బాసికము, నలుగు సేసలు లేవు. కన్యాశుల్కము మూడువరాలు మాత్రమే. తక్కినవన్నియు గౌరీ వివాహ క్రమమునే యనుసరించును. వారపుదాసరి యను కుల పురోహితుడు పంచముల పెండ్లి తంతు నడపును. వివాహము మూడు దినములైనను, నైదునాళ్ళయినను జరుగును. రజస్వలానంతర వివాహ విధిని బరిణయమైన దంపతు లితరుల నలుగు సేసలలో దాల్గొనకూడదు. ఈ పద్ధతి నవలంబించిన గౌరీ వివాహితలుగాని, మధ్యమా వివాహితలుగాని అనికలు తొడగరు. కొన్ని ప్రాంతములలో మాత్రము వీరలకు కంచుక ధారణ మున్నది. గుత్తి, తాడిపత్రి, కల్యాణదుర్గము (పశ్చిమ ప్రాంతమున గొంతవలకును) తాలూకాలలో స్త్రీ పునర్వివాహ పద్ధతి యున్నది. తక్కిన భాగములం దది లేదు. కాని యీ జాతిలో బహుపవృత్తి యన్నివైపులను సమానముగ గలదు. అనిక తొడుగుకొని గళమున గిన్నె బొట్టు ధరించుట సంసారిణులకంటె దాసురాంధ్ర కెక్కుడగు లాంఛనము. బస్విరాంధ్రు కొందఱు నుదుట త్రిమూర్ధము గూడ నుంచుకొందురు.

స్త్రీలలో ప్రథమ వివాహమువలన బుట్టిన సంతతికిని, ద్వితీయ వివాహమువలన గలిగిన సంతానమునకును సంతశ్శాఖాభేదము లేదు. దాసు

రాంధ్ర సంతతికిని, విధివిధానమున వివాహ మాడినవారి సంతానమునకును గూడ నట్టి తారతమ్య మేమియును గానము. ఆచారానుసారముగ వివాహము జరుగక యౌవనమునుండి కూడుకొన్న పురుషుని వలనను, మగడు గతించిన పిమ్మట పరభర్తవలనను బుట్టిన సంతతికి గోళకులనియు, కుండ గోళకులనియు పేళ్ళు. కంచుక ధారణములేని ప్రాంతమున నీ గోళకులు కులభ్రష్టులుగ నెన్నబడుదురు. రజస్వలానంతర కన్యావివాహ పద్ధతియు, నీగోళకుల వివాహపద్ధతియు సమానమే; కాని సంతానమున మాత్రము గోళకులు భ్రష్టులనియు, రజస్వలానంతర వివాహితల బిడ్డలు స్వజాతీయు లనియు భావింపబడుచుండుట చిరకాలమునుండి యున్నది. ఈ ప్రాంతము నందలి యాది మాంధ్రులలో నింతకంటె నంతర్భాగ్యములు వేఱుగ లేవు.

## ఆది మాంధ్ర స్త్రీలు

హిందువులలో గల సమస్త జాతులయందువలె నాది మాంధ్రుల లోను స్త్రీలకు స్వతంత్రాధికారము లేదు. వారున్నతస్థలముల నాసీనులయి యుండదగదు. రోటిపై గూర్చుండి సంభారములు సిద్ధము చేయరాదు. చెప్పులు వేసికొని తిరుగగూడదు. పదిమంది పురుష లోకచోటగూడి మాటాడుచున్న సమయమున నా మార్గమున వెళ్ల తటస్థించిన స్త్రీ వినయ భావమున వంగి యొదిగి పోవలయును మగవారి యెదుట నింతు లొండొరులు దూషించుకొనరాదు. పరస్పర వాక్కలహములయం దెవ్వరును జెప్పు, చీపురు మున్నగు తుచ్ఛ సాధనముల నోట నుచ్చరించుట యపచారము. వయసు చెల్లిన పెద్ద ముత్తయిదువ యైననేతప్ప, భర్తతో నే యువతియు మద్యశాల కరుగు టొప్పదు. నాగరికత హెచ్చినచోట నీ నియమము లంతగా గన్పట్టవు.

## జాతి నియమములు - కుల దేవతలు

తాడిపర్తి భాగమునను, గుత్తి ప్రాంతమున కొంత ప్రదేశము నందును నాది మాంధ్రులకు చాకలివాండ్రు గుడ్డలు తుకుట కలదని తెలియు చున్నది. క్షౌరకు లేవైపున నాది మాంధ్రులను స్పృశింపరు; పంచముల

శుభాశుభ కర్మలయందు వాద్యములు మోయింపరుకూడ. ఆది మాంధ్రులు తమకు దామే పరస్పరము క్షురకర్మ గావించుకొనెదరు. హిందూపురము, కల్యాణదుర్గము, పెనుగొండ, ధర్మవరము, అనంతపురము భాగములలో నాగరికత వెలసిన కొన్ని పట్టణములందు దప్ప తక్కినచోట్ల అంగవస్త్రమే కాని యాది మాంధ్రుల కంగవస్త్రము లేదు. ఇందులకు ప్రబల హేతువు దారిద్ర్యమే యైనను క్రమక్రమముగ నది జాతి నియమముగ మారిపోయినది. స్త్రీలలో కంచుక ధారణము లేకుండుటకుగూడ నింతకంటె ప్రబలమగు కారణము తోపదు. పురుషులందు మూడు నెలలకొక క్షౌరము, నాలు నెలల కొక స్నానము పెక్కుచోట్ల సిద్ధము.

శుంటెమ్మ, కొల్హాపురమ్మ, గంగమ్మ, ఎల్లమ్మ, నల్లమ్మ, పెద్దమ్మ, బాటమ్మ, మారెమ్మ మున్నగునవి యాది మాంధ్రుల స్త్రీ దేవతలు. జాతిబోనముల నర్పించి, కోళ్ళ బొట్టేళ్ళను బలి యొసగుచు బంచము లీ దేవతల నారాధింతురు. ఓబళేశుడు, పోతలప్ప, నరసింహుడు మొదలగు పురుష దైవములను బుష్ప ఫలపత్ర నైవేద్యములతో బంచములు పూజింతురు.

## పంచముడు - పంటకాఁపు

వృత్తులు — ఈ ప్రాంతమునందలి యాది మాంధ్రులకు సేద్యమే ప్రధాన జీవిక. మాలలు నూలుగుడ్డలు, కంబళ్ళుకూడ నేయుచున్నారు. వారేకులను మిగుల నాణెముగ తీర్చి చాల సన్నముగ వడుకనేర్తురు. ఈ ప్రాంతమున చిరకాలమునుండి మాల నూలు మిగుల ప్రసిద్ధి వహించినది. మాలల నేత బిగువునందును, నాగరికతయందును దొగడావాంధ్ర నేతను మించుననుటకు సందియము లేదు. ఇప్పటికి కొన్నియేండ్ల క్రిందటివఱకు పెక్కుతరములుగ రైతులకు మాలలే గుడ్డలన్నియు సిద్ధముచేసి యిచ్చుచుండిరని తెలిసెడిని. సేద్యమును, నేతయును గాక మాలలకు దాసరి తనమును, నెట్టిపనియుగూడ గలవు. ఉపవృత్తు లెన్నియున్నను బంచమునకు

వ్యవసాయము లేకున్నచో జీవిక కష్టతమ మగును. కాన నాది మాంధ్రు డెప్పుడును బంటకాపు నాశ్రయించియే యుండును.

అనంతపుర మండలమున బంటకాపు పంచములకు బట్టుకొమ్మ. పంచమునకును, బంటకాపునకును కేవలము సన్నిహిత సంబంధ మున్నది. ద్వాదశవిధ పుత్రులలో బంచముడు పంటకాపునకు స్వయందత్తు డన దగును. శ్రీరామున కాంజనేయునివలె బంటకాపున కాది మాంధ్రుడు విశ్వసనీయుడగు బంటు. కొన్నియెడల బంటకాపు లింటి మాదిగలను స్వసంతతికంటె నధికానురాగముననుు, ప్రియ బంధువులకంటె గాఢాభి మానముననుు జూచి మన్నించుటయు గలదు. సూర్యోదయము మొదలస్త మాన పర్యంతము నాది మాంధ్రుడు పంటకాపు గృహముననుు, పొలముల లోను నొడలువంచి మనసార పాటుబడుచుండును. పంచముని విహరణ రంగములు పంటనేలలే. పంటకాపు పసులకొట్ట మాతని విరామ భవనము. ఒక్క వంట యింటను, స్మగాణ మందిరముననుు దక్క యజమానుని గృహమున గేవల స్వతంత్ర వృత్తిని సంచరించి, యందరి పిన్న పెద్దలలో బూసలలోని దారమట్లు వర్తించి, పంచమ సోదరు డుత్సాహాతిశయమున బని చేయుచుండును సమస్త శుభాశుభ కార్యములయందుకూడ బంటకాపు సన్నిధిలో పంచముడు సంసిద్ధుడయి యుండును. కింకరశబ్ద మీ సేవకుని యెడ సార్థకము. క్రింది విషయములవలన గాపునకును, నాది మాంధ్రు నకును గల సంబంధము విశదపడగలదు. రైతులకు పంచముడును, బంచమునకు రైతును నియమానుసారముగ నిచ్చి తీసికొనవలసిన వస్తు విశేషములు సయిత మిందు గ్రమరీతిని వివరింపబడును.

### పంచముని విధి

ఒక యెకరము సాగుబడి బావి సేద్యమున కొక జత క్రొత్త చెప్పులు, కాడికొక చిల్లకోల, రెండుకాండ్ల కపిల యెద్దుల కొక చిల్లపోటు, వారిని పంచముడు రైతున కొసగుచుండవలయును. పొలములలో నాకు వలుచుటకు, నెరువు మోయుటకు, విత్తనము చల్లుటకు నొక మనుష్యుడు

పనికి బోవుచుండవలయును. రాగి, జొన్న, కొఱ్ఱ మొదలగువానిని విత్త
వలసిన కాలమున నచ్చుకట్టు తీయుటకును, పసిలాగుటకును రెండు దినము
లొకొక్క మనుష్యుడు వంతున పనికి వెళ్ళుచుండవలయును. విత్తనపు
గింజలుగాని, పసిగాని లేనిసమయమునను, కపిలె చర్మములు వలయు నపు
డును, పొరుగూరినుండి వానిని మోసి తెప్పుటకొక మనుష్యుడు వెళ్ళుట
యావశ్యకము. పాత చెప్పులు సవరించుట యాది మాంధ్రుని విధి. ఎద్దుల
పట్టెడలకు తమ్మలుంచుట, చర్మపు ముసుగులు వేయుట, వారెలు
పెట్టుట, మొల తోలు (కపిలె తోలునప్పుడు కృషికుడు పిక్కలకు గట్టు
కొనెడు చర్మాంబరము. దీనినే తొడతోలని కొందఱందురు.) కుట్టుట, పంచ
మునకు ముఖ్యము. కపిలె చర్మము పాతగిలినపుడు దానిని బలుమఱు సవ
రించుటకు పంచము డే వేళను సిద్ధముగ నుండవలయును. పంటకాపు
గృహమున బఱ్ఱె యీనిన తరువాత నొకటిన్నర నెలలోపల లేగ మృతి
నొందినచో, చచ్చిన దూడ చర్మ మొలచి యాకారము గుదిర్చి తల్లి
యెనుమునుండి పాలు పిదుకుట కను వేర్పఱుప వలయును. పాలు
పిదుకుటకొఱకు దూడల మూతికి దగిలించుటకయి పంచముడు ముండ్ల
చిక్కము కట్టించి యీయవలయును. కాపుసాని రాట్నమునకై చర్మముతో
చెవులుచేసి యిచ్చుచుండవలయును. కదురు వడితీర్చి తఱుచు సిద్ధము
చేసి కాపుసాని కిచ్చుచుండుట పంచముని యిల్లాలి కర్తవ్యము. సూర్య
చంద్రగ్రహణ సమయములయందు గ్రహశాంతి కర్మలకయి వెళ్ళుట కే
సందర్భమున నాదిమాంధ్రు డొక మనుష్యుని సిద్ధపఱుపవలయును. కళ్ళము
చెక్కుట, యలికి శుభ్రము చేయుట యాదిమాంధ్రుని కార్యము. పైరు
కోసినపిమ్మట ధాన్యమిల్లు చేరునందాక ఒప్ప వేయుట, కంకు లాఱ
బోయుట, ఎండ వానలలో రాసికి కావలియుండుట, గడ్డి దొడ్డికి దోలుట,
వామి వేయుట మొదలగు పనుల నన్నింటిని బంచమ సోదరుడే చూచుకొన
వలయును. ఇంటి యజమానునికి గౌరవార్హముగ చిన్న పెద్ద జోడు
సిద్ధముచేసి యీయవలయును.

పంట కాపుల యిండ్లు వెలిప్రక్క పూయుటకును, కట్టెలు కొట్టు
టకును నొక మనుష్యుని పిలుపుట పంచమున కావశ్యకము. రైతుల

ఇండ్లలో కన్య పుష్పవతి యైనపు డతడు కొమ్మ గొరిజ తీయవలయును. వివాహ వేళలందు బసిమందికి మించిన యధికసంఖ్యాకులతో నాది మాంద్ర సోదరుడు రైతునకు దోడ్పడవలయును. రెండు మూడు దినము లింటి మెత్తు, పూత, కట్టెలు కొట్టుట మున్నగు పనులు చూడవలయును. వధూ వరులకు బాదరక్ష లమర్చుచు బొరుగూర పెండ్లికూతు రెంతదూరమున నున్నను వాని గొనిపోయి సకాలమున జేర్చవలయును. వివాహ సమయ మున ధాన్యపు బాతరకయి పెండ్లికుమారునకు బదులుజో డీయవలయును. వివాహ సందర్భములలో దప్పెటలు మ్రోయింపవలయును. ఆడుబిడ్డ పుట్టి వింటినుండి నూతన వస్త్రములతో నత్తగారింటికి బోవునపుడెల్ల క్రొత్త చెప్పుల జత కుట్టి యిచ్చుచుండవలయును. పంటకాపు గృహమున మగబిడ్డ పుట్టినచో, నా బాలకు డైదేండ్లవాడైన పిమ్మట, చెప్పుల జత కుట్టికొని పోయి యా పాపనికి దొడుగవలయును.

పిల్లులు, కొక్కు, గాడిదలు, గుఱ్ఱములు మున్నగు నంటరాని జీవములు చచ్చి వీథులలో బడియున్నపుడు వాని గొనిపోయి దూరమున మఱుగు చేయవలయును. గ్రామమున జాతర, పండుగ, పబ్బములు మున్నగు రైతుల పనులకయి దండోరా వేయవలయును. గ్రామ దేవర సందర్భమునందు కట్టెలు కొట్టుట, చావళ్ళు చప్పరములు నిర్మించుట, వీథు లూడ్చుట, ఊరికి బచ్చతోరణములు గట్టుట, గ్రామ దేవత కావశ్యక మగు సమస్తోపకరణములను సమకూర్చుట, పలకలు కొట్టుట, కొలిమి కట్టెలు (పంజాలు) పట్టుట, బలివేయుట ఆదిమాంధ్రుని కర్తవ్యము.

అనాథ ప్రేతములు మోయుట, అశుభ కార్యములలో దహనాది క్రియలు గావించుట, వార్తలు గొనిపోవుట పంచమ సోదరుని విధి. ఇంతియకాక రైతున కత్యవసరములగు చిక్కు వేళలలో నెల్ల బంచముడు పనికి వెళ్ళుచుండవలయును.

## పంటకాఁపునుండి పంచముఁడు పొందఁదగిన మేరలు

1. కట్టుఃవడె—ఒకచోటికి పరి పైరున నేబదిపేర్ల ధాన్యమునకు పరిపడునట్లుగ విచ్చేరు నొక పైరుకట్టయు, నొకపడెయు. (గట్టి ధాన్యము పండించిన చోట్లగుచో నొక్కొక్క కొలమున నొక మనుజుడు మోయ దగిన యొక్కొక్క మూఁపెడు కంకులును, జోడుగాక పిన్న పెద్దజత, కపిలె చిల్లపోటు యిచ్చినందులకయి జొన్న, రాగి పైరుపెట్టిన పట్టుల నొక్కొక్క స్థలమునను నొక యొంటిపటపు కఁచకి మూఁపెడు కంకులును, గంపలు, చేటలు సవరించి వానికి జర్మపుటతుకులు వేయుటయు, గాదెలు, బండి జల్లలు మున్నగువాని నల్లుకుటయు లోనగు పనులకయి ఇరువదిపేర్ల ధాన్యము పట్టగల గంపతో నొక గంపెడు కంకులు నాదిమాంధ్రున కొసగ వలయును).

2. ఒడికంకులు— ఏఁడువాంధ్రు రాట్నపుచేవులు తీసికొనిపోయి యిచ్చినందులకును, కిదురు పడి తీర్చినందులకును, వొడిలో భరింపతాలి పంతవలకు నాదిమాంధ్రుని యిల్లాలికి గావుపాని పెట్టెడు కంకులు.

3. పంపకపు గింజలు— ధాన్యపు బంపకమున గరకళ్ళమువారు బావిపేద్యపు బట్టున నన్ని కొలములయందును బండెడు ధాన్యములో బడిఁట నొకపాలు పంచమునకు బంచి యీయఁదగిన గింజలు.

4. దండికట్టు— ధాన్యము తూర్పారబోసిన తరువాత గట్టి గింజ లన్నియు రాసికి జేర్చి విడిచెడి కొసభాగపు ధాన్యము;

5. మిరాసికట్టు— రాసి కొలిచిన తరవాత నడుగున రెండఁగు కముల నిలువున విలువనుండు గింజలు.

6. రాసి యడుగు విడుపు— పంపకమైన రాసిలో గొలత పోగా మిగత భాగమునందు బంటనుబట్టి విడిచెడు ధాన్యము.

7. గగ్గులు—గింజలన్నియు రాల్చుకొనగా తప్పదారి తగులుకొన్న

పడితలకలను రాలగొట్టుకొనుటకై పంచమునకు వదలిపెట్టెడి యెత్తు కంకులు.

8. నెత్తిమానిక్రింద గింజలు— ధాన్యము తూర్పాఱబోసి రాసికి చేర్చునపుడు రమారమి యెనిమిది సేర్లకు తగ్గక పంచమునకు వేసికొనెడి గింజలు.

9. కల్లపూడ్పు— కళ్ళములోని గింజలు రైతు చేతితో నూడ్చుకొనగా నడుగున పందందు నిలిచెడు ధాన్యము.

10. అటిముటి— పాత చెప్పులు కుట్టి యిచ్చినపుడును, కళ్ళము లికినవాడును బొండ్లము (తాటి)తో గల టెంకాయ పరిమితిని నిచ్చెడు పంకటిముద్ద. (ఇతర సమయములయందుగూడ నింటిపని చేయుచున్నంత కాలము నాదిమాంద్రునకు పంటకాపు భోజనము పెట్టుచుండవలయును.)

11. కోడలికము — ఇంటి యాడుబిడ్డ నూతన వస్త్రములతో వత్తగారి యింటికి బోవునపుడెల్ల నన్నముపెట్టి యిచ్చెడి ప్రాంత వస్త్రము.

12. ఉద్దాల గింజలు— యజమానుని యింటి బిడ్డకు బట్టుచెప్పులు తొడిగినపుడు బిడ్డని పాదము లగపడకుండువట్లు పోసెడు ధాన్యము.

13. పెండ్లియీవి — వివాహానంతరము గూడెమువారికెల్ల నొక పూట భోజనము పెట్టి, యింటి మాదిగ కెనుపద్దమగాని, యావు తలుపును గాని, (కురుపవాండ్రైన యెడల) గొఱ్ఱెమగాని, మేకనుగాని యిచ్చెడి దానము.

14. అంబటి గింజలు— కపిలెకయి క్రొత్తగా బొక్కెన సిద్ధము చేసినవాడు అంబలికొలకు నిచ్చెడు ధాన్యము. (ఈ ధాన్యము కొన్ని గ్రామములలో నాలుగున్నర పేర్లును, మరికొన్నిచోట్ల నాలుగు పేర్లును నిచ్చెడి పద్ధతి గలదు.)

15. కుక్కల దోపిళ్ళు — అంటరాని జంతువులు చచ్చిపోయి నపుడు వానిని లాగివేసిన వెట్టివానికి పెట్టెడు మూడుపేర్ల ధాన్యము.

ఎకరమునకు ముప్పావుసేర. దండోరా పనికి జొన్న, రాగి పంటల కొక్కొక కపిలెదానికి పండ్రెండుసేర్ల ధాన్యమొసగుట కనుపైన కంకులు. వరివేల మగుచో నొక్కొక్క పట్టున నొక్కొక్క పంటకు వెన్నులదగ్గఱ గఱము త్రాటి బిగువుగల యొక పైరుకట్ట. పంటనుబట్టి తిరిపముకూడ వేఱుగ నుండును. ఇంతియకాక యుగాది, సంక్రమణము, మహాలయ పూర్ణిమ, నాగుల చవితి, ఏకాదశి, పితృతర్పణము, అమావాస్య మున్నగు తిథులయం దింటింట భోజనము పెట్టుటకూడ.

16. వైబాబు— పొలపంటితో బరువు చచ్చినపుడు పూ త్తియును, పెద్ద పసరము పడినపుడు పగమును నొసగెడు చర్మము.

17. కాలి బారుగ— మరణవార్త కొనిపోయి బంధువుల కంద జేయు కాలమున భోజనము కట్టి యిచ్చుచు, పరువునకు రెండణాల పంతున నిచ్చెడు దబ్బు.

18. ప్రేత సంస్కారము— కట్టెలు, పిడకలు మారిలోనుండి మోసికొనిపోయి శ్మశానవాటిక జేర్చి, కాష్ఠముల బేర్చి శవ దహనము చేసి నందులకయి యొసగెడు రు 2 ల పైకమును, దానితో నిచ్చెడు నాముదాలు నాలుగు సేర్లు, ఉప్పు రెండుసేర్లు. (చనిపోయినవారి కంత్యక్రియలు జరిపిన వాడు గృహపతి యాదిమాంధులలో బండ్రెండుగురకు భోజన తాంబూలము లమర్చి, యొక రూపాయి బహుమతిగ నీయవలయును )

19. గుంత పాతిక — శవము పూడ్చుటకు దీసెడు గోతికై యొసగు మాడ.

## పంచమునినుండి యితరులకు జెందవలసిన
## కానుకలు, పంచముని యతిథులు

1. కాటిపాపని సుంకము — పంచముడు కాటిపాపని కేడాది కొక్కొక తడవ కాటిసుంక మీయవలసి యుండును. ఈ కాటిపాపడు వీర బాహుని పంతతివాడని తెలియుచున్నది. కొందఱు గొల్ల దనుచున్నారు

గాని యది నమ్మదగినది గాదు. పాషాణధర్మము నెలయించి రాక్షసులలో దుర్బోధ పెంపొందించిన చంద్రఖండ శేఖరుని వంశపువారమనియు, పాషాణ ధర్మావలంబి యనియు, నందుల కాతడు ధరించిన విభూతి, ఎముక పూసల పేరు, చర్మాంబరము, తలపడగ, ఇత్తికొమ్ము, కాటుక, కావివస్త్రము, కల్లు గంటలే నిదర్శనము లనియు గొంద అనుచున్నారు.

"మురిసి పాలభస్మచర్మ - ములను నెముకపేరు లి
ట్లరయ నార్యులెల్ల నింద్య - మనుచు దూఱుచుండఁగా
నెరసుపేయ కివి ధరింప - నేమికారణంబు
నీ చరితమెల్లఁ జెప్పుమయ్య - చంద్రఖండ శేఖరా".

అవి యాతని మత ధర్మములనుగూర్చి పార్వతి శివుని ప్రశ్నించినప్పటి వర్ణన సందర్భమునుబట్టి చిరకాలాగతమైన యట్టివేషమే తమకు నుండుట చేతను, నందు ప్రోక్తములైన ధర్మములే తాము నాచరించు చున్నందునను, దాము చంద్రఖండ శేఖరుని సంతతికి జెందినవారమని యీ జనులు నుడువు చున్నారు. గ్రామములయందు వసింపక శ్మశానముల గాపుండి, యందు వలన దమకు లభించు కాటి మాదలచే జీవించుట వారికి ధర్మము; కాని యిప్పు డట్లుగాక యూరూరు తిరిగి బిచ్చమెత్తుకొనుచు, గాటి మాదల కొర కయి సంవత్సరమున కొకతడవ వీరు పంచముల గూడెము నమీపించు చుందురు. పంచములలో బ్రతి కుటుంబమునను కుటుంబమున కేఁడాదికి రెండు రూప్యములు, పంద్రెండు పేర్ల ధాన్యము, ఒక కోడి వీరి కీయవలసి యున్నది.

2. మాస్టినివాండ్రు— ఒకప్పుడు బేరికోమటి, దేవాంగ, కమసాల, ఒంటెద్దుగాండ్లు, ఏకల, గొల్లబోయ, మాదిగ మొదలగు 'పంచాచార (పాంచాల) పణకట్టు'నకు జేరిన జాతులవారు విశ్వబ్రహ్మను బురస్కరించుకొని యొకప్రక్కను, నేతికోమటి, లింగబలిజ, పెట్టిబలిజ, కుమ్మర, చాకల, తొగట, మాల మొదలగు 'పెట్టి పణకట్టు'నకు జెందిన జాతులవారు వీరశైవుని బురస్కరించుకొని యొకవంకను నిలిచి, మత విషయములలో ఘోర యుద్ధము సల్పిరనియు, నా కాలమున బంచాచార పణకట్టునకు

సహాయభూతులుగ వచ్చి తమ శస్త్రవిద్యా కౌశలము జూపిన దక్కను సింధు వాండ్రలో ఏ మాస్టినివాండ్రుకూడ నొక తెగవారనియు జెప్పుదురు. అందు లకు దార్కాణముగ వంశాచారమునుబట్టి యేసాది కొక్కపర్యాయము వీరు తమ పూర్వుల బలదర్పాతిశయాదుల మారూర బొగడి జెప్పుకొనుచుందురు. వీరికి జదువు రాదు.

3. సింధువాండ్రు— వీరలు గోసంగి సంతతికి జెందినవాండ్రు: లింగధారులు; అర్ధగంధము, నక్షతలు దాల్చి, యాచారపరులుగ నుందురు. చదువునేర్చి జలస్తంభ నేత్యాది గ్రంథములం బఠించి, యితరులకు వివి పించుచుందురు.

4. దక్కనువాండ్రు (దక్కలవాండ్రు) — జాంబవంతుని జ్యేష్ఠ పుత్రుడగు నీలముని సంతతివారమని వీరు చెప్పుకొనుచున్నారు. వీరికి గాయత్రీధారణము గలదు. స్నాన సంధ్యానుష్ఠాన తత్పరులై, వీర లాది పీఠమునుండి యింతవఱకు జెల్లిన యుగపురుషుల చరిత్రములు, నే యుగ మున నెవ్వరెవ్వ రెట్లెట్లు వర్తించి కీర్తి గాంచినదియు దెల్పుచు, జాతీయ ధర్మముల బ్రకటించుచు, కల్పవృక్షము, కామధేనువు, చింతామణి మున్నగు వాని యుత్పత్తి క్రమాదుల నెఱింగించుచు, ఆగతానాగత వృత్తాంతముల దెల్పుచుండువారు. పంచములు వీరి నంటరానివారిగ భావించి తమ పాళె మునకు రానీయరు; ఁ రెత్తిపోయుదురు. వీరిని దాకినచో దమకు వినాశము నిస్సంశయమని యాదిమాంధ్రులు తలంతురు. ఇందు 2, 3, 4 భాగము లలో వివరించిన ముత్తెగలవారు పురప్రవేశ మొనర్చి, యది వదలి పోవు దనుక నాదిమాంధ్రులు వారి భోజన వ్యయములను దాము భరించుటయకాక, ప్రతి వర్గమువారికిని గడప యొక్కటికి నాల్గణాలను, సేరు ధాన్యమును తాంబూల సహితముగ నొసంగి వారిని సాగనంపెదరు.

5. పెద్దయింటి గొల్లవాండ్రు — వీరు లాఁగు, చుంగురుమాలు, కాలి యందె, పిలికాసె, ముకుగాలము, నాగస్వరము, రక్త చందనము ధరింతురు. పూర్వము బ్రహ్మరథోత్సవ కాలమున, పెట్టిఫణికట్టు వారి మంత్రశక్తి వలన పంచాచార ఫణికట్టువారి తేరు నిలిచిపోయియుండ, విద్యా

బలముచే నా రథము దన ముకుగాలమువలన లాగి, యుత్సవము సాగించిన పెద్దయింటి గొల్లవాని సంతతికి జెందినవారమని యీ తెగవారు చెప్పుకొనెదరు. పాములు బట్టుట, మోడిపేయుట, యింద్రజాలాది విద్యలను గనబఱచుట యీ వర్గమువారి కార్యములు. వీరికి గడపకు రెండణాలు, రెండుపావుల గింజలు నాదిమాంధ్రులు లీయవలసి యున్నది.

౮. ఆదిజాంబవ మహాముని — పంచములకు గురువర్గములోని వారు. విభూతి, లింగము, జన్నిదము, రుద్రాక్షలురి దండకమండలువులు, పాదుకలు, పిడిబాకు, కొంగ, వాలుగత్తి, త్రిశూలము, గండకత్తి (వేట కొడవలి), కాషాయాంబరము మొదలగువానిని ధరింతురు. గుఱ్ఱముపై నెక్కి, వెమలికుంచె వెలయ, బంగరు తప్పెటలు మ్రోయుచుండ, బరివారక వర్గముతో జూపఱకు గన్నుల పండువుగ వెడలుదురు. వీరు పంచముల పాళెమునకు బయలుదేఱుటకు ముందు భటులతో శిష్యవర్గమునకు శ్రీముఖ మంపుదురు. దాని ననుసరించి వారికై పంచము లొక విడిది కుదిర్చి, పవిత్రపఱిచి, దాని పచ్చతోరణములతోను, పందిరులతోడను గైసేసి, పాళెపు ముఖద్వారములకు దోరణములు గట్టి, ముత్తయిదువలతో, మల్లెర కలశములతో, పుష్పగంధ తాంబూల దక్షిణాదికములతో దమకు దగిన పనికొమ్ము, పనిరాలు, కాశిముంత, అరె, అంపె, చినకత్తులతో (సింధు క్రీడాసహితముగ) నాడుచు, బాడుచు నానందభావము వెల్లివిరియ సత్కార పూర్వకముగ బొలిమేరకడ నాదిమాంధ్రు లాచార్యునకు స్వాగత మొసగి యుత్సవ పురస్సరముగ మహావైభవముతో వారిని రాజవీథిని బాళెమునకు గొనివత్తురు. గురు డశ్వముమీదనుండి దిగుటకు ముందుగ వారికి నీరాజనము సమర్పించి, యనంతరము పాదములు గడిగి యమ్మహాశయుని విడిది జేర్తురు. దేశికవర్యు డందున్నంతకాలము నాతనికి గావలయు పదార్థముల గొదవలేక సమకూర్తురు. అనంతరము వ్యయములుపోగా గుటుంబమున కొక మాడ (రమారమి రెండు రూప్యములు) వంతున గురుదక్షిణ సమర్పించి, యడుగులకు మడుగులిడి, విభవాభిరామము సాగనంపి, యాచార్యుని బొలిమేరకడ వీడ్కొనెదరు.

## ఆదిమాంధ్రుల దుర్దశ - అందులకు గారణములు

ఈ మండలము నందలి యాదిమాంధ్రులకు సేద్యమే ప్రధాన జీవిక యని వెనుక తెల్పియుంటిమి. వ్యవసాయమునకును, పంచముల కుల వృత్తికిని నవినాభావ సంబంధ ముండుట పాఠకు లెఱుగుదురు. పుర పారిశుద్ధ్య సంఘమువారి వశమున నున్న పట్టణములలో మ ల మాదిగలు వీథు లూడ్చుట, మఱుగు దొడ్లను శుభ్రముచేయుట మొదలగు పనులవలన జీవించుచున్నారు. కాని యీ ప్రాంతమునందలి యాదిమాంధ్రుల హీనదశ వర్ణనాతీతముగ నున్నది. ఇందులకు వారి కండగ నుండిన రైతు సంఘమున విశేష భాగము స్వవృత్తినుండి విరమించుట యొక ముఖ్య కారణము.

పెద్దపెద్ద యూళ్ళయందు నేల సేద్యము చాలవరకు నడుగంటిన దన వచ్చును. సకాల వర్షము లేకపోవుట కృషికుల యుత్సాహము భగ్నమగుటకు ప్రధాన హేతువు. ఇందులకు దోడుగ బావుల బ్రతుకుగూడ పాడయ్యెను. చెఱువుక్రింద కృషిమాత్ర మింకను గొనయూపిరితో నిలిచి యున్నది. ఈ మండలము నందలి గొప్ప చెరువులకు జీవనప్రదములుగ నుండిన యొకటి రెండేళ్ళ కడ్డముగ నన్యరాష్ట్రమున గట్లు వైచుటచేతను, కేవలము వర్షాభావమునను బుక్కపట్టణము, క్రొత్తచెరువు మున్నగు ప్రదేశముల గల సుప్రసిద్ధ తటాకములు వర్షముల కొలదిగ నొక నీటిచుక్కయైన గానకపోగా, వేలకొలది రూప్యముల వెల చేయుచుండిన యచ్చటి పల్లపు నేలలు మెట్ట పంటలకు గూడ గొఱగాక నిరర్థకములయి యున్నవి. ఈ కారణములచే ధర్మవరము, పెనుగొండ, మడకసిరా భాగములయందలి పంట కాపులకు సేద్యమునందు బట్టుచిక్కక జీవనాధారములు తప్పిపోయెను. అందుచే నా ప్రాంతముల నందలి రైతులలో నొక్కొక్కడు నొక్కొక్క కాడి పసరములు చొప్పున గొని, యొక బండి నుంచుకొని యుదయాస్తమానము లితరుల కూలిపనులకు పోయి యెడ్లను జంపుకొని, తమ్మాలమునకైన గుటుంబ పోషణము జరుగనందున ఋణగ్రస్తులయి చెడుచున్నారు. పంటకాపు లిట్లు బ్రతుకులు పోగొట్టుకొని కష్టదశకు వచ్చుటచే వారి నాశ్రయించి యుండిన పంచములు తమకు రాదగిన మేరలు పఱింపగా,

వృద్ధిచెడి, జీవనోపాధి కన్యమార్గముల బహుప్రయత్నములు గావింప మాని, దుస్థితికి వచ్చుచున్నారు. అందు గొందఱు గ్రామాంతరములకు వెళ్ళి యెముకలు, తోళ్ళు గొనితెచ్చెదమని లబ్బెలకడ లెక్కలు వ్రాయించి పంచకారములు తీసికొని, వాని నెప్పటి కప్పుడే సంసార వ్యయములకును, త్రాగుడునకును వినియోగించి, నూతన సంస్కారముల కయి క్రొత్త యజమానులను వెదకుచుందురు. మఱికొందరు కొనిపోయినదానిలో నింటి వెచ్చముల కుపయోగించుకొన్నది పోగా, మిగుల పైకముతో చిన్న చిన్న వ్యాపారములు సాగించుచు, త్రాగుడునకును, యజమానుల ద్రోహ వర్తనములకును వశులై, మరల లేవలేక పడిపోవుచున్నారు. మఱియు గొందఱు తెచ్చెదు సరుకునకంటె తీసికొనిపోయెడు ధనమే యధికము కాగా దానిని దీర్పజాలక, యజమానుల కంటబడక నెలలకొలది తిరుగుచు, చివరకెప్పుడో యాకస్మిక ఋణప్రదాతల హస్తగతులై కూర్చుండి, వర్ణింపరాని మానహానికరములగు వేదనలకు పాల్పడి, కడకు దల తాకట్టు పెట్టువరకు వచ్చుచున్నారు.

ఈ మండలము నందలి యాది మాంధ్రులలో నాత్మగౌర వాత్మ విశ్వాసములు క్రమ క్రమముగ నరుదగుటకు, ఆ కులమునందు హెచ్చు పెరుగుచుండెడి త్రాగుబోతుతనముకంటె ప్రబలతరమగు కారణము వేఱొండు కాన్పింపదు. ఇందుల కనుగుణముగ సోమరితనము సహితము వీరిలో నానాట వేరూనుచున్నది. పెద్దలలో స్త్రీలును, పురుషులును, వృద్ధులును బగలెల్ల తమ పూరిగుడిసెల నీడలలో బరుండి పుక్కిటి పురాణములతో గాలము వ్యర్థముచేయుచు. మరియు సాయం సమయములందు దమ బిడ్డల నుపాదానముకయి యూరిలోనికి బంపుచుందురు. పదిమందియున్న కుటుంబమున బాటుపడువార లొక రిద్దఱికంటె నెక్కుడుమంది యుందు రనుకొనరాదు. వారైనను దమ రాబడిలో జాలభాగ మెప్పటి కప్పుడే మద్య విక్రేత కర్పించి వ్యర్థులగుచున్నారు. త్రాగుడుకు స్త్రీ పురుషు లెల్లరు సమానముగ వాడుకపడి యున్నారనుట విపరీతాభిప్రాయముగాదు. ఈ

దురభ్యాసము గ్రామవాసులయందుకంటె బట్టణవాసులలో నధికమనవచ్చును. మద్యశాల వారికి దల్లియిల్లన నొప్పును. అందలి పంచములు మద్యశాల కడ దమతో పసిబిడ్డల సయితము నుంచిదుకొని, యా కసుగందులనుగూడ ద్రావించి యానందించుచుండుట కొన్నియెడల సంభవ మగుచున్నది. పల్లెటూరి జనులలో నది కొంత తగ్గియుండుటకు బని యధికమగుటయు, చేత డబ్బు లాడకపోవుటయు గారణములు కావచ్చును. ఇంతియకాక గ్రామ మర్యాద లింకను సజీవములుగ నున్నందున బల్లెటూళ్ళ బంచము లిపేళ రైతు నాశ్రయించి కొంతవఱకు గౌరవముననే కాలము గడుపు చున్నారు.

ఆదిమాంధ్రుల యందు త్రాగుడు హెచ్చుటకు మార్గములు హెచ్చు. కులనిర్ణయము ననుసరించి ప్రతి శుభాశుభ కార్యమునను వారు మద్య స్వీకారము నత్యంత ముఖ్యముగ బాటించుచున్నారు. పాణిగ్రహణ మహోత్సవ సమయములయందు బురుషుని వివాహమునకు ‘తుశాల రూక’ యను పేర నొక రూప్యమును, నాడబిడ్డ పెండ్లికి తలంబ్రాలు కానుక ‘బాబులు’ను జేరి మొత్తమున దశమాసమును, గృహపతు లాదిమాంధ్రులలోని పెద్దల కొసగవలసిన గట్టడి గలదు. ఈ పైకమున నొక కాసియైన విలువలేక యంతయు మద్యవ్యాపారికి ముట్టజెప్పి, ప్రముఖులందరు భాగములవంతున తీర్థసేవనము గావింతురు. పంచములలో ఎల్లమ్మ భక్తులు, విషమ సంఖ్య గల సంవత్సరములలో నా దేవతకు సాగుబోయుచున్నారు. ఒక క్రొత్త కడవ నురచే నింపి, పసుపు కుంకుమములతో నా ఘటముం బూజించి, గూడెమువఱకు దానిని సాగించి, యిష్ట బంధువర్గముతో నిష్టాగోష్ఠి నందరి మద్యము గ్రోలెదరు. త్రాగుడు సలవాటులేని బిడ్డలగుచో నా తీర్థ మొకింత మీద జల్లుకొనవలయును. ఊర జాతర సందర్భములలో గుంభము వోయుట, చప్పరములు నిర్మించుట మున్నగు కార్యములకయి వచ్చెడు భాగధన మెల్లరకు సమానముగ జేరవలసి యుండుటచేత, నది ముఖ్యముగ కల్లు సారాలకే వినియోగింపబడుచున్నది. కుల సంబంధమగు తప్పు వడినప్పుడు, పెద్దలు విధించు శిక్షాద్రవ్య భాగ మింటింటికిం జెందవలయునని

నియమమున, దానిని సురకయియే పెచ్చించి, పిన్నలును, పెద్దలును నష
ముగ నందు బాల్గొనుచున్నారు. పుర పారిశుద్ధ్య సంఘ కార్యాలయముల
యందు పెట్టిపనులలోనుండు పంచములు వేతనము లందిన దినము మొదలు
వరుసగ రెండు మూడునాళ్ళు కల్లంగళ్ళు విడువరు. మద్య సేవానిరతిచే
పెక్కండ్రు పనులకుగూడ వెళ్ళరు.

## సంఘముల తోడ్పాటు - పంచముల వెనుబాటు

పురపాలకవర్గమును, స్థానిక సంస్థలును, సేవా సంఘములును పంచ
ముల పురోభివృద్ధిని గురించి మండలమున బహుభంగుల శ్రద్ధ వహించు
చున్నది. నిమ్నజాతుల విషయమున ప్రత్యేక గమనముగల్గి వారి కొఱంత
లను మఱింత సులువుగ దీర్చుటకయి కార్మికశాఖ యొకటి నియోగింప
బడినది. పంచమ బాలుర విద్యాభివృద్ధికొఱకు పాఠశాలలు విరివిగ సంస్థా
పింప బడుచున్నవి. గ్రామ పారిశుద్ధ్య సంఘములందును, స్థానిక మాండలిక
రాష్ట్రీయ సభలయందును వారి కవకాశ మొసగబడుచున్నది. మఱియు
వారి యున్నతికి వలయు సమస్త సదుపాయములును గావింపబడుచున్నవి.

ఆదిమాంధ్రుల సమున్నతికి దేదగిన సాధనములలో విద్య ప్రధాన
మైన దనుట నిర్వివాదాంశము; కాని దానివలన ప్రయోజన మొక కొంత
కాలముననే వ్యక్తమగునది కానందున, నాటకటిపెల్లున ననురనురగుచున్న
యీ దరిద్ర జాతియందది యంత ప్రోత్సాహ సంజనకముగ వృద్ధి నొందు
చుండ లేదు. తలిదండ్రులు చదు వెఱుగనివా రగుటచే దమ సంతతికి విద్యా
విషయమున నే విధమునను దోడ్పడకుండజాలుట యటుండ వేళకు తిండి
తీర్థములైన నమర్పలేకున్నారు. బాలుర పఠనమున కావశ్యకములగు
వస్తువుల నసలే తీసియీయ నిచ్చగింపరు. రాత్రులయందు బాలకులు
చదువుకొనుట కింట దీపములలో చమురుండదు. ఆదిమాంధ్రుల బిడ్డలు
కూడ క్షుధాతురులగుటచే, విద్యార్జనమున కుత్సహింపక వెనుకబడుచున్నారు.
ఆదిమాంధ్ర విద్యార్థులు పంచమేతరులగు నగ్రవర్ణజులతో గలిసి విద్యా
భ్యాస మొనర్పుటచేత, వారి వేష భాషాదులందు గొంతవఱకు మార్పు

గలుగుననుట నిస్సంశయము; కాని పంచమేతర పాఠశాలలయందున్న తన కులజు లాదిమాంధ్ర సంతతి నభిమాన భావమున జూచుట యరుదు. ఉత్తమ వర్గమునకు జెందిన యుపాధ్యాయులు కొందరు పంచమ విద్యార్థులను గడగండ్ల కొంతురను వాదమున గొంత సత్యము లేకపోలేదు. అది కారణముగ నగ్రవర్ణమునకు జేరిన సమపాలకులుకూడ నాదిమాంధ్ర బాలకులను హేళనము గావించి, యుత్సాహభంగకరముగ మాటలాడెదరు. ఇట్టి భిన్న వ్యాపార మెంతకాలమో సాగనేరదని మన మెరుగుదుము. అయిన నాదిమాంధ్రుల పెంపు పంచమేతర పాఠశాలలలో వారిని జేర్చుటయందు మాత్రమే యాధారపడి యుండలేదు

వివిధ సంఘములయందు గౌరవ సభ్యులుగ జేయుటవలన ననంతపుర మండలము నందలి గర్భ దరిద్రులగు నాదిమాంధ్రుల కబ్బెడు కిరీట మేదియును లేదు. పలుతెగల మనుష్యులతో గలసి మెలసి వర్తించుటచే కొంత వరకు వారి నాగరికత పెంపొందుననుట తప్ప, పంచముల భుక్తిమార్గమున కది తోడ్పడకుండుట స్పష్టము. భుక్తికి సాధనము కాకపోవుట యటుండ నదియొక విధముగ వారికి నష్టమునకుకూడ హేతుభూత మగుననుట ప్రమాదకర విషయము కాదు. ఈ పదవుల కువ్వైభూరి యని యబ్బుట వలన దమ్ము తామే మఱచి, కష్టపడి పనిచేయు సమర్థత యుండియు గార్యములపట్టున ననాదరముచూపి, మిట్ట పెత్తనములకు మరిగి, ఉన్న బ్రతుకులనుగూడ బోగొట్టుకొని, కష్టములపాలైన యువకులు స్మృతి పథమున దగులుచున్నారు. ఒక పంచమ సోదరు డొకానొక సాధారణ సంఘ గౌరవసభ్య పదము బొంది కులవృత్తిలో బ్రవేశింపనొల్లక, యందువలన దమకు విధిగ రాదగిన రెండు వందలకు మించిన వార్షిక భృతి గోల్పడి ఋణగ్రస్తుడయ్యెను మఱొక సోదరు డంతకంటె నున్నత గౌరవాధికారము నాకాంక్షచేసి, మాసమునకు బదేను రూపాయల రాబడిగల జీవనౌషధము వంటి తన యుద్యోగమునకు గడుపు గక్కురితిచే శాంతి చెప్పి, పిమ్మట కుటుంబ నిర్వాహణము దుర్భరముకాగా చిక్కుల బొందెను. ఎరిగినవారి నెల్ల పీడించుట, పలువురకు లొంగి వర్తించుట, పుల్లవిఱుపు మాటలచే గ్రుద్దులను తెంచుట యిట్టివారికి బ్రతుకు తెరువు లగుచున్నవి. ఈ మంత

లమున నిట్టి స్థానములు విరివిగ నుండుటయు, నవి పంచమ సోదరులకే లభ్యమగుటయు నెందును సంభవము కానేరదు. ఎచ్చటనో ప్రధాన పట్టణములయందు మాత్రమే యొకరిద్దరికో యట్టి యవకాశ మపురూపముగ గాని లభింపదు. ఈ కొలది స్థానములకుకూడ నర్హులగు సోదరు లరుదవ, మండలమునందలి యాదిమాంధ్రుల స్థితి యెంత విచారకరముగ నుండు నదియు నూహించుట సులభము. చదు వెరుగనివారిలో దినమున కొక్కపూట కడుపార నింత గంజి త్రావగలవారి సంఖ్య యంత హెచ్చుగాదు. పెక్కుచోట్ల నాదిమాంధ్రులు రెండు మూడు దినములుగూడ తిండిలేక వాడి నత్తలగుచుండుట కటస్థించుచున్నది. ఇక వ్రాయ జదువనేర్చినవార లెచ్చటనో నల్ప సంఖ్యాకులుగ నున్నను వారందరు నేదియో యొక యుద్యోగము నాశ్రయించి, తన్మూలమున సంసార యాత్ర సాగించుటకు శ్రమ నొందవలసినవారుగనే యున్నారు. తోళ్ళు, తంగెడుచెక్క వ్యాపారముల యందు ప్రవేశించి, స్వతంత్ర వృత్తితో జీవనము సాగించుకొనదగు శక్తి వారికున్నను నిందుల కత్యవసరమగు మూలధనము సేకరించుట వారి కెంతమాత్రమును సులువుగాదు. కాన నీ మండలమునందలి యాదిమాంధ్రుల స్వచ్ఛంద జీవనోపాధికి నెరవు గల్పింపజూచుట నాయకుల ముఖ్య విధి యగుచున్నది.

## అభివృద్ధి మార్గము

ఈవల నాదిమాంధ్రులలో ప్రతి కుటుంబమునకు నలయొకటికి రెండేసి యెకరముల మెట్టక నేల యొసగ నిశ్చయింపబడినటులు తెలియుచున్నది. ఈ పద్ధతి చాలవఱకు ప్రయోజనార్హమే; అయిన నిందున పంచముల పురోభివృద్ధినిగూర్చి శంకింపదగిన తర్కాంశమొకటి లేకపోలేదు. ఈ మండలమున నిపు డెందున వ్యవసాయమున కర్హమగు నేలలు విలువలో లేవనుట నిజము. ఇక మన పంచమ సోదరులకు నెందున్నవి పోరంబోకు భూములే. పోరంబోకులన కొలిమాలిన సారవిహీనములగు మరుస్థలములనుట వింతకాదు. అట్టి నిరుపయోగ ప్రదేశముల నెచ్చటనైన

గొప్పను మండలమునందలి యాదిమాంధ్రుల దారిద్ర్యము పాయఁజాలదు. నలుపునకు దావలమయిన యీ మండల ప్రాణముల నిలువబెట్ట దలంచుచో ముఖ్యముగ నిందు జలాధారములను విరివిగ గల్పించి, వాని బెంపొందించుట ప్రధాన కర్తవ్యమను భావ మీనాఁటికే పెద్దలతో ప్రబలతమముగ గలదు. ఏటేట నెందులకు నుపకరింపక నిరర్థకముగ మున్నీటి పాలగుచుండు నేటి నీటి నీ ప్రాంతములకు ద్రిప్పి మండల వ్యవసాయాభివృద్ధి కాదరువు గల్గించుటకన్న మండలాభివృద్ధికి మార్గాంతరము లేదు. వ్యవసాయము భారతమాతకే వెన్నెముక యనుట నది పెంపు వహింపనిచో మండల సౌభాగ్య మింపు నింపనేరదు. భారత ప్రపంచమునకు ప్రాణతుల్యే దగు పంటకాపు లేమి లోకదారిద్ర్య మూలముగాక మఱేమి? ఈ మండల మందలి యాదిమాంధ్రుని వృద్ధి తర తరములుగ బంటకాపు వశమున నుండిన దనుట యతిశయోక్తి కానేరదు. పంటకాపు పేద్యపు బ్రతుకు ప్రశస్తదశయం దున్నంతకాలము మూడు పూవు లారు కాయలుగ బంచముదే బంటకాపట్లు ముప్పొద్దుల గడుపార భుజించుచు నాకలి యెట్టిదో యెఱుగక పేదఱికమనునది తెలియక, యఱచేతి నిమ్మపండువలె నుండెను. నలుపువలన వ్యవసాయ మంతరించుటయు, దానితో బంటకాపు భగ్నహృదయు దగుటయు, నా హేతువున మండలమున పీటపెట్టుటయు, నందుచే నాదిమాంధ్రుని వృద్ధి నన్నగిల్లుటయు సంభవమయ్యెను. వ్యవసాయార్హములై ప్రశస్తములైన నేలలు వందలకొలది యెకరములు బీడు పెట్టుకొని, యందువలన గాసు వీసమేని ప్రయోజనము గానకుండుట యటుండ బన్నుల నొసగెడు ప్రయాస సహితము పైకొన భూస్వాములే యొందటో యలఁడి నొందుచుండ, నెట్టి యావరువును లేని తుంగయైనను మొలవని యూషర క్షేత్రముల నెన్నింటిని గైకొన మొనర్చికొనినను, బంచము దండువలన మూట గట్టుకొనున దేమియు నుండజాలదు. అట్టి నేలలకు బ్రప్రథమమున జలాధారములను గల్పింప బ్రయత్నించుట వాయకుల ప్రధాన విధి. ఆ భూములను పేద్యమున కర్హమగురీతి నొనర్చుకొని తన్మూలమున జాలినంత ద్రవ్యోపపత్తిని బొందుదనుక తకావిమండి వడ్డి లేకయో, స్వల్పమైన వడ్డిపైననో ఋణ మిప్పించి, యా దైన్య విచార

వరుల గార్యావలంబులనుగ నొనర్చుట యవసరము కాదగినది. ఇదియైన నొక్కపెట్టున నాదిమాంధ్రుని మొనర్చుటయు మేలుగాదు. ఒక్కొక యూరను బరోపకారవాంఛగల గ్రామపంచాయతి సంఘమొకటి యుండనే యుండును గదా! సహాయ ధన మా సమాజవశమున నుంచి, యాది మాంధ్రుల కార్యసౌకర్యము ననుసరించి వారికై దానిని వినియోగించు విధమున నా సంఘమువారి తోడ్పాటున నాదిమాంధ్రుల కృషిని పెంపొందింపఁ దివురుట నాయకుల ధర్మము.

## నాయకుల కర్తవ్య కార్యములు

చర్మకారక కర్మయం దాసక్తహృదయు లగు యువకులను స్థలాంతరములకు బంపి, వివిధములగు కళాశిల్పములయందు వారల గుశలురుగ నొనర్చి, యా జాతిసోదరుల కులవృత్తికి బోషణము గల్గింపవలసియున్నది. వ్యవసాయమునకు దరువాత మాపంచజాతి పురోభివృద్ధికి గాపాడునది వాణిజ్యమే కావున నెముకలు, తోళ్ళు, తంగేడుచెక్క మొదలగు లాభకరము లైన యనుకూల వ్యాపారములయందు బంచమజాతి కభిరుచి గొల్పుట యుక్తము. అందులకు దగిన విధమున బరపతిసంఘములు పాటుపడునట్లు చూచుట యవసరము. బాటలు చక్కజేయుట, బావులు త్రవ్వించుట, కుంటలు గట్టించుట, ప్రభుత్వమువారి కట్టడములు నిర్మించుట, మొదలగు ప్రజాహితకర కైంకర్యములయందు, జిన్నచిన్నగ బంచములకు బ్రవేశము గల్గించి, యావిషయమున వారికి గేలూత యొసగుట యొప్పును. పంచమబాలికా బాలకులలో యథాక్రమమున నొకవంక విద్యను సాగించుటయు, పగలు తీరుబడిలేని యువకులకు రాత్రిపాఠశాలలు స్థాపింప బూనుటయు నాయకుల విధి విద్యతోగూడ బంచముల చేతిపనులకు బ్రోదిపెట్టఁదగును బాలురకు నేతయు, బాలికలకు వడుకుటయు, గృహవితరణాదికములును గరపబూనుట యుక్తము. ముఖ్యముగ మండలభారములలోని ప్రధానపట్టణముల యందెల్ల బంచమవిద్యార్థుల కుచిత భోజన వసతిగృహముల గల్పింపవలయును. ఈ క్రియాకలాపములతోగూడ నన్నింటికంటె నవసరముగను, నత్యంతావశ్యక

ముగను నాజాతియందలి పిన్న పెద్దలలో చక్కగ పాదుకొనియున్న మద్య పాన దురభ్యాస మహామహీరుహమును గూకటి వేళ్ళతో పెల్లగించుటకయి వలయు ప్రయత్నముల నన్నింటిని గావింపదివురుట లెస్స. ధర్మవర ప్రాంతమునందలి పంచములు కల్లు త్రావకుండ గట్టుదిట్టము లేర్పరుచుకొనిరి గాని, కొంతకాలమునకే యది యజగరోపవాసము ననుసరించెను. ఆ పెను భూతము వీడనంతవరకు పంచముల శ్రేయము నాసించి చేసెడు సర్వ ప్రయత్నములును బూదిలోని హోమము వలె బరిణమింపక తీరదు. అట్లగుచో జీవర కాదిమాంధ్రుల యున్నతి గగనకుసుమమే యగును. ఈ కీలక మెలగి వర్తించి పంచములను బతనదశనుండి తొలగించి నాయకులు వారి నుద్ధరింతురుగాక.

శ్రీ సిరిపి ఆంజనేయులుగారు అనంతపురం మండలములోని హరిజనుల ఆచార వ్యవహారములను గూర్చి, గ్రామీణ వ్యవసాయ ఆర్థిక వ్యవస్థలో వారి స్థానమునుగూర్చి, వారి కష్ట సుఖములనుగూర్చి వారి అభివృద్ధి మార్గములనుగూర్చి వ్రాసిన విషయములన్నీ ఆంధ్రదేశములోని అన్ని జిల్లాలకును వర్తించగలవు. ఈ విషయములనుగూర్చి విశ్వవిద్యాలయములు తగిన పరిశోధన చేయించుట, సమగ్రమైన ఆంధ్ర హరిజన చరిత్రము రచింపజేయుట అత్యంతావశ్యకము.

# 16. గ్రామీణ వ్యవసాయార్థిక వ్యవస్థ

ఇంగ్లీషు వర్తక కంపెనీ ప్రభుత్వమువారు స్వప్రయోజన నిమిత్తం మన గ్రామ వ్యవస్థను తారుమారుచేసేవరకు అది చెక్కుచెదరక గ్రామాలు పాడిపంటలతో తులతూగేవి. కుల వివక్షతలేకుండ గ్రామస్థులందరికి సుఖ జీవనాలు జరిగేవి. పూర్వము గ్రామ గుడికట్టుక్రింద భూమి అంతా గ్రామస్థులదే. దానిని సాగుచేసి అనుభవించే హక్కేగాని అమ్ముకునే హక్కు లేదు. గ్రామస్థులే దానిని సాగుచేయించి సర్కారుకు చెందవలసిన రాజ భాగము పంటలోనుంచి ఇచ్చి వ్యవసాయపనులు, గ్రామ పనులు చేసేవారి జీవనము నిమిత్తం గ్రామాచారప్రకారం ఇచ్చే పంటభాగములిచ్చి మిగిలినది గ్రామ రైతుల జీవనము నిమిత్తం పంచుకునేవారు.

అకాలములో ఎవరి కేవస్తువు కావలసిన, ఎవరేపని చేయించుకోవలె నన్నా పంటదినుసులతోనే రాజ్యము నెరవేరేది. రొక్క చెలామణి అవసర ముండేదికాదు. బంగారు వరహాలుగాని, వెండి రూపాయలుగాని, రాగిదబ్బులు, లేక కాసులుగాని సర్కారుకు రుసుమిచ్చి ఎవరైనా ముద్రించుకోవచ్చును. పంటను పంచి శిస్తు వసూలుచేసే అమరక పద్ధతిని అసరా అని, దానిని వితించి శిస్తు వసూలుచేసే పద్ధతిని వీసబడి అనీ అనేవారు.

ఇంగ్లీషు కంపెనీవారుకూడా మొదట ఈ పద్ధతిప్రకారమే పరిపాలన జరిగించి తరువాత గ్రామ రైతులకు పట్టాలిచ్చి అమ్ముకునే హక్కులిచ్చి శిస్తును రొక్కముగా వసూలు చేయడము, శిస్తు బాకీకి భూమిని జప్తుచేసి వేలం వేయించడము ప్రారంభించడముతో ఆర్థికవ్యవస్థ తారుమారు అయి నది. రొక్క చెలామణి కొంపతీసినది.

## పొ లి పా ట లు

మొన్న మొన్నటివరకు శ్రీకాకుళము మండలము మొదలు రాయల సీమ, తెలంగాణా ప్రాంతములందలి గ్రామాలలోను, గ్రామీణులు, స్త్రీలు, పురుషులు పంటకల్లములదగ్గర రాత్రి అంతా పొలిపాటలు పాడుతూ పంట మార్పిడి పనులు చేసేవారు. పాటలు సాధారణముగా "ఒలియా, ఒలియో, ఒలియా। రావేల గనవాడ రార పొలిగాడా॥" అను పల్లవితో ప్రారంభించి పాడిపంటలకు అధిదేవతయైన విఘ్నేశ్వరుని తెలుగువారి ఇలవేల్పు రాముల వారిని, సీతాదేవిని, పార్వతి పరమేశ్వరులను స్తుతించి, గ్రామ దేవతలను, గ్రామ పొలాలను వాటిని సాగుచేసే ఉమ్మడి వ్యవసాయ పద్ధతులను, గ్రామ పంటలోనుంచి చెల్లించే రాజభాగము వివిధములైన గ్రామ సేవలు చేసే ఆయగాండ్రకు జీవనానికిచ్చే పంటభాగములు, దేవాదాయ, బ్రహ్మాదాయ ములకు కులవృత్తులవారికిచ్చే మామూళ్లు వివిధ కులాలవారు ప్రీతితో ఆర గించే రకరకాల పంటదినుసుల వర్ణనలు, గ్రామజీవనములోని సుఖ దుఃఖ ములు మొదలైన వర్ణనలుగల చరణాలు ఉంటాయి. ఈ పొలిపాటలు వొక్కొక్క మండలములో వొక్కొక్క విధమైన బాణీలో పాడుతారు. ఇటీవల ఇంగ్లీషు ప్రభుత్వములో గ్రామవ్యవస్థ పాడైనందువల్ల ఈపాటలు పాడటం తగ్గిపోయినది. కాని ఆయా ప్రాంతాలలోని ముసలివారు జ్ఞాపకము చేసుకొని పాడిన పాటలు కొన్ని 1931-1932 సంవత్సరము గృహలక్ష్మి సంపుటాలలో ప్రకటించబడినవి. డాక్టర్ బి. రామరాజుగారు ఆంధ్రజానపద వాఙ్మయమును గూర్చి చేసిన పరిశోధనఫలితముగా మూలపడిన పొలిపాటలు ఇప్పుడు బాగా వెల్లడియైనవి. పొలి పాటలలో వర్ణించబడిన సంగతులు 1840 సం. నాటి తెలుగువారందరికి తెలిసినవే. అందువల్ల ఆకాలంనాటి వాఙ్మయములో వాటినిగూర్చిన వివరము లున్నవి. నెల్లూరు కాపురస్తులు పండితులైన తాతాచార్యులు చెప్పిన కథలను బ్రౌనుదొరగారు 1866 సంలో ప్రకటించారు. ఆ కథలలో ఆ కాలంనాటి రాజకీయ సాంఘిక మతా చారవ్యవహారాలతోపాటు గ్రామీణ వ్యవసాయార్థిక వ్యవస్థకు సంబంధించిన విశేషములున్నవి. అయితే ఆ సంగతులన్నీ ఆ కాలంనాటివారికి తెలిసినవే గనుక బ్రౌనుదొరగారు వాటి వివరములు ఇవ్వలేదు. తరువాత ప్రకటించబడిన

ముద్రణలోకూడ వివరణములు లేనందువల్ల వానిలోని విశేషములు నేటి చదువరులు గ్రహింపలేకపోతున్నారు. యం. వి. శేషాచలం కంపెనీవారు 1874 డిశంబరులో ప్రకటించిన తాతాచార్యుల కథలలో సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకుడైన శ్రీ బంగోరె గారు ఆకథలలోని చారిత్రకాంశములకు వివరణములనూ, మాటలకు అర్ధములనూ, అనేక గ్రంథములను పరిశోధించి వయోవృద్ధులను సంప్రదించి వ్రాసియున్నారు. అందులో పొలి పాటలలోని సంగతులుకూడ ఉన్నవి.

పొలి అను పదానికి Freshness, bloom, An offering in homage to rustic deities profit, gain. పస, బలిహరణము, మేలు. పొలిపోవుట, To loose one's bloom అని బ్రౌనుగారు తమ నిఘంటువులో అర్ధములు వ్రాశారు.

పొలి (1) పంట పెంపు, ఫలవృద్ధి. (2) బలి అని ఆంధ్రశబ్ద రత్నాకరములో పొలిపాట = కాపులు కుప్ప నూరుచునప్పుడు పంటకు అభివృద్ధికలుగవలెనను ఉద్దేశముతో పాడు పాట అని శ్రీ చలమచర్ల రంగాచార్లుగారు వ్రాశారు. బ్రౌను నిఘంటువులోను, మాండలికవృత్తి పదకోశము లోను మరికొన్ని గ్రంథములలోను వ్యవసాయానికి సంబంధించిన కొన్ని మాటలు కోరు, మేడిపాలు, చెరువుమేర, పొలిదోసిలి, దర్మచేట, కిదిశ కలగ మొదలైన మాటలకు అర్ధములున్నవి. కొన్నిమాటలకు లేవు. వీనిని కష్టపడి సేకరించి బంగోరెగారు తాతాచార్ల కథలలో వివరించారు

పొలి: గ్రామాచారాల్లో దేవత పేర పెట్టే నైవేద్యం, ధాన్యం, అన్నం, జంతుబలి మొదలైనవి. గ్రామ దేవతలను వ్యవసాయ ధనాన్ని, ఆరాధించే విధానం.

పొలిగట్టు: గింజలు చేతబట్టుకుని ఒకడు తిరుగుతూ మేలురాశి చుట్టూ గీత గీయడం.

పొలి కేక: కళ్ళంచుట్టూగాని, రాశిచుట్టూగాని పొలి తిరిగేవాడు స్థానికంగా ఉన్న సంప్రదాయాన్నిబట్టి బిగ్గరగా అనే మాటలు, పాడే పాటలు, ఉదాహరణానికి "పంచపాండవులిచ్చిన పంట పొలో పొలి."

పొలిగాడు: వళ్ళకలో నెత్తినిపెట్టుకుని పొలిగింజ గిసేవాని వెంబడిని పోయ్యేవాడు.

పొలి గింజలు: మేలిరాశిలో దేవుడుపేర తీసిన ఐదుదోసిళ్ళ ధాన్యం. ఇందులోనుంచే "పొలి దోసిలి" అనే పదం వచ్చింది. దీనినే దేవర దోసిలి అనికూడ అంటారు. కళ్ళంలో ధాన్యం మార్చి గింజలు కొలిచే టప్పుడు ముందుగా దేవునిపేర తీసే కొన్ని దోసిళ్ళ గింజలు.

పొలి చేట: పొలి తిరిగేవాడు పట్టుకునే ధాన్యపు చేట. దీనిలో వినాయకుణ్ణి పెట్టి రాసిచుట్టూ తిరుగుతాడు. ఈ గింజలు పొలివానికే వదులుతారు. నిండు రాసిని చేటతో విసిరే ఆచారం (మాండలిక వృత్తి పదకోశం)

పొలి జల్లుట: గ్రామదేవత కొలుపులో పొలి అనగా బలి తీసిన వస్తువులను గ్రామ మేరలందు జల్లు పూజా విధానము.

పొలి తిరుగు: గ్రామ గుడికట్టు (పొలిమేర) చుట్టూ జాతరలలో బల్యాన్నము (నెత్తురుకూడు) ఎత్తుకుని పొలి కేకలతో తిరిగివచ్చి దేవతలకు అర్పించుట. ఇది చాలా ప్రధానమైన తంతు దీనివల్ల గ్రామానికి సర్వశ్రేయములు ఒనగూడునని ప్రజల విశ్వాసము. పొరుగూరివారు దీనిచూడరాదు.

పొలిమేర: బలిని తీసికొని తిరుగవలసిన గ్రామ ఎల్లలు. 'పొలిమేర దాటగొట్టినారు.' (మా. వ.)

పొలిమేరమ్మ: పోలేరమ్మ, ఊరి సరిహద్దు దగ్గరనుండే గ్రామ దేవత. ఏటేటా బలితో ఆరాధిస్తారు. (మా. వృ. వ్య. వ.)

అర్ధపుదోసిలి: An allowance of grain made to the village barber.

ధర్మచేట: (1) ధర్మాదాయములకు, సత్రాలకు, మఠాలకు ఇచ్చిన ధాన్యం. ఇటువంటి ధర్మకార్య సంస్థలకు ధాన్యం రాశిమంచి ధర్మంగా ఇచ్చే కొన్ని చేటల ధర్మం. గ్రామవృత్తులవాళ్ళకు చేటలతో మామూలుగా ఇచ్చే గింజలు. (మా. వృ. వ్య. వ.)

మైల చేట: The allowance of grain made to the village washer man.

మేరచేటలు: అయగాండ్రకు కళ్ళంలో మంచి చేటలతో ఇచ్చే మేర గింజలు.

రాశి అడుగు (రాశడుగు): ధాన్యం అంతా గోతాలకు ఎత్తినతర్వాత రాశిలో వల్పగా అడుగున మిగిలిఉండే ధాన్యాన్ని కళ్ళం కావలి గాళ్ళకు మొదలైనవాళ్ళకు వదిలేస్తుంటారు.

కిడిశ. కిడిసె. కిలిసె: The sweepings of refuse of grain (బ్రౌ. ని), తూర్పార పోసేటప్పుడు మేలురాసి (మంచి గింజల రాసి) ప్రక్కనపడే పొట్టు, గింజలుకలిసిన భాగం. (మా. వ్య. వ్య. వ), వగము పొలుటోపి గింజబట్టిన ధాన్యపుగింజ, కాయతరక. (మా. వ.)

శెలగ, శలగ, పెలగ: A unit. a word used in measuring grain from which a new reckoning begins.

కుచ్చెల: ధాన్యము కొలవడములో కొత్త లెక్క మొదలుపెట్టే టప్పుడు అనేమాట. కళ్ళంలో ధాన్యం కొలిచేటప్పుడు ఇరవై కుంచల కొకటి చొప్పున లెక్క గుర్తుకు పోసే పిడికెడు గింజల కుప్ప. (మా. వ్య. వ్య. వ.)

పొలి గలుగు: ధాన్యం కొలుచుట ప్రారంభించునప్పు డనేమాట. వ్యాపారి 'లాభం' అని ప్రారంభిస్తారు. ధాన్యం కొలుచునప్పుడు శలగం పెలగ అంటారు. 19 కాగానే 20కి బదులు శలగ అంటారు. మళ్ళీ పొలి లాభం రెండు అని ప్రారంభిస్తారు.

పంచాంగం ఇనాము లేక మాన్యము అనే పదాలు వ్యవసాయ వ్యవస్థలో అదనులు, కార్తెలు, వర్ష సూచనలు, ఋతువులు మొదలైన ముహూర్తములు విడమర్చి చెప్పే పురోహిత బ్రాహ్మణునికి ముఖ్యమైన స్థానమును సూచిస్తాయి. కాశాచార్ల కథలు పుటలు (106-109)

మేడిపాలు: అసామిదగ్గర పొలము సాగుచేసిన రైతుకు పంటలో పగంకంటె ఎక్కువగా వచ్చే భాగము. (మా వృ. వ్య. ప.)

కోరులో కలిసిపోకడ. రాజుగారి సొంత పొలాలతో కలిసిపోవడము, అవి అన్వయించుకోవాలి. తాతాచార్ల కథల పుట. 58.

పంసారి అనే పదాన్ని రైతు కాపు పెద్యగాడు అనే ప్రత్యేకార్థంతో ఉపయోగించినట్లు కనబడుతుంది.

గ్రామములోని వివిధ కులాలవారికి వ్యవసాయ పనులలోను ఇతర పనులలోను మాలమాదిగల సహాయము అత్యంతావశ్యకమైనందువల్ల రైతులు వారిని తమ కుటుంబాలలోనివారిగానే చూస్తారు. మాల మాదిగలను చాలా విశ్వాసపాత్రులుగా ఉంటారు. వారు పాలేళ్ళుగా పనిచేస్తారు పాలేరు అనుమాటకు భాగస్వామి అని అర్థమని శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు పంటకాల చరిత్రలో వ్రాసి, రైతు, పాలేరు మధ్యగలసంబంధమును గూర్చి శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు 'వ్యత్యయము' అను కథలో వ్రాసిన సంగతులు అక్షరాలా నిజమని అన్నారు. ఆ కథ 1928 సం॥ డిసెంబరు నెల భారతిలో ప్రకటింపబడినది. అందులోని యజమాని బ్రాహ్మణుడు. పాలేరు మాలవాడు. ఆకాలంలో కమ్యూనిష్టు భావాలు వ్యాపించలేదు.

## గ్రామములలోని మతాచారములు

మాల కులమువారి జీవిత విధానము, మత ధర్మాలు, ఆచార వ్యవహారములు గ్రామములోని ఇతర కులాలవారితో మాల మాదిగల సన్నిహిత సంబంధములనుగూర్చి శ్రీ ఉన్నవ లక్ష్మినారాయణగారు మాల పల్లిలో చక్కగా చిత్రించారు.

## బ్రాహ్మణునకు మాలవాడిచ్చిన మాన్యం

గుంటూరు సీమలో జమీందారయిన శ్రీ రాజా వెంకటాద్రి నాయుడు (1761-1816)గారిని గురించి చాలా కథలు ప్రచారంలో ఉన్నాయి. ఆయన చాలాధర్మాత్ముడు. ఐతే నిరంకుశుడు. ఆయన గ్రామాలలో ఒకచిన్నపల్లెను

పాగుచేసేవారు లేకపోగా దానిని ఒక మాలవానికి పదేళ్ళకు కౌలు కిచ్చారు. ఆ సంవత్సరం వాడి అదృష్టంవల్ల బాగా వర్షాలు కురిసి గ్రామ భూములన్నీ బాగా ఫలించాయి. అంతట వాడు బాగా సంతోషించి ఆ గ్రామములో ఉన్న ఒక బీద బ్రాహ్మణుని పిలిచి యుద్దుం విత్తనాలుపట్టే ఒక మాన్యం ఆయనకు దానమిచ్చి దానిని తానే పాగుచేసి ప్రతి సాలున పంట తరుణంలో మత్తా ధాన్యం ఇచ్చేవాడు. ఇలావుండగా మాలవాని కౌలు ఆఖరై పోయినది. రాజా గారి వ్యవహారాలు చూస్తూయున్న ఆయన బావమరిది ఆమాన్యం లాక్కొని రాజాగారి భూములలో కలిపివేశారు. అంతట ఆబ్రాహ్మణుడు వెళ్ళి జరిగిన సంగతంతా మొరపెట్టుకున్నాడు అప్పుడు రాజాగారు బావమరిదిని పిలిచి మందలించి మాన్యాన్ని యథాప్రకారంగా జరిగించాలని ఉత్తర్వు చేశారు. ఈ కథ బ్రౌను దొరగారు తాతాచార్యుల కథలలో ముద్రించారు ఆకాలంలో మాల మాదిగలకు దేవ బ్రాహ్మణ భక్తి ఉండేదని ఈకథవల్ల తెలుస్తోంది.

## మా ల వా ని చం దా

ఆంధ్ర వాల్మీకి శ్రీ వావిలకొలను సుబ్బారావుగారు ఒంటిమిట్ట చేరుటకుముం దా గ్రామమందలి పెద్దమనుష్యులు సభదీరి కోదండ రామస్వామి వారి యుయ్యాలపీటకు గొలుసులు తెప్పించవలయునని చందాలు వేయ బూనుకొని చేతినిండా కాగితములు, బుడ్డినిండా మసి, యినుపముక్కు కలము పూని ఆ గ్రామాధిపతిగారు సభ నలంకరించిరి. కాని పేరు వ్రాసిన వారు, అంకె వేసినవారు లేరాయె. పేరంటాండ్రు నీవు పాడు నీవు పాడమన్నట్లు నీరుమ నీవు నీవని కాలక్షేపము చేయుచుండిరి. కాలు గంటయైనను హరిః ఓంమ్మని యంకె వేసినవారు లేరాయెను. అప్పు డచ్చటికి ఒక పంచముడు వచ్చియుండి నీరు నడుపాట్లు చూచి "అయ్యలారా! ఈ మాలవాని ధనము స్వామికి పనికివచ్చునా" యనెను. దానికే మాక్షేపమని సభ్యులనిరి. "అట్లైన నా చందా రు. 10 లు వేసికొనుడు. యిప్పుడే తెచ్చి యిచ్చెదననెను." ఆమాట వినగానే ఈ పెద్దమనుష్యుల ముఖమున గాటు వేసిన నెత్తురు లేదు. రూపాయి వేయుదమా, అర్ధ వేయుదమా అని ఆలోచించు పెద్దమనుష్యుల గుండెలో రాయి పడెను. మాలవాడు

రూ.10 లు వేసినపుడు వానికి దక్కినవేయుట యవమానమని వారు సగ్గిన ముగ్గినలైరి. సమ్యార్థపీఠజులైన ఈ వ్యాఖ్యాతయు మాల దాసుడే. స్వర్థచే నైన ఏ వ్యాఖ్యానమును పండితుడగువాడు వ్రాయుగాక। వానికిది మార్గదర్శి యగుగాక. గోడ నిర్మించిన, ఉత్తరను వ్రాయు వా రెందరో యుందు రనియే ఈ వ్యాఖ్యాత యభిలాష।" (శ్రీ మదాంధ్ర వాల్మీకి రామాయణ వ్యాఖ్య-మందరము శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు - బాలకాండము పుటలు: 117-118)

మాల మాదిగలలో రామభక్తు లున్నారు మాల మాదిగలలో రామానుజమతానికి చెందిన దాసులు శుచి శుభ్రతలు కలిగి విద్య నేర్చి పౌరోహిత్యము చేస్తారు. వైద్యముకూడ చేస్తారు. మాదిగలలో చాలామంది శైవులు. వాకికి జంగాలు గురువులు. ఇదీగాక మాల మాదిగలుపోతురాజు, పోలేరమ్మ, ఎల్లమ్మ మొదలైన దేవతలను కొలుస్తారు. ఆ కొలుపులలో ఇతర కులాలవారు మొక్కుబడులు చెల్లిస్తారు. గ్రామ దేవతల ఆరాధన మునుగురించి చాలా అభిప్రాయభేదా లున్నవి. దీనిని గురించి పరిశోధన చేయడము అవసరం. దేశములోని వివిధ ప్రాంతాలలో గ్రామాలలోని కులాచారములు దేవతారాధన పద్ధతులు మనవైదిక, బౌద్ధ, జైన, చార్వాక, తాంత్రిక సంప్రదాయములలోనుండి పుట్టినవే. అయితే అవి అనేక రూపాలు దాల్చినందువల్ల వాని అంతరార్థము గ్రహించడం సులభసాధ్యమైనవనిగాదు. దీనినిగూర్చి చాలా పరిశోధన జరిపించవలసి యున్నది.

ఎల్లమ్మ దేవతారాధనము రేణుకకు సంబంధించినదని కాకతీయ యుగములోని దేవతారాధనమును గూర్చిన చర్చలలో శ్రీ సురవరం ప్రతాప రెడ్డిగారు వ్రాసినారు. (ఆంధ్రుల సాంఘిక చరిత్ర) పోతురాజు కొలుపులను గూర్చి పాశ్చాత్యులు తమ గ్రంథాలలో వ్రాశారు.

మాతంగి ఎల్లమ్మ (రేణుక) అవతారమని మాల మాదిగలే గాక ఇతర కులాలవారామెచేత కడుపులు చేయించుకుంటారు. ఉన్నత కులాల వారిలో కొన్ని కుటుంబాలవారింట శుభకార్యములలో మాలవానిని సత్క రించు ఆచారము కనిపిస్తున్నది. పద్మనాయకులైన రావువారింటి పెండ్లిలో

మాలవానిని సత్కరించు ఆచారమునుగూర్చి వీరేశలింగముగారు బంగారు యాచమనాయకునిగూర్చి ఏచని కథనుగూర్చి వ్రాసినారు. (చూ. ఆంధ్ర కవుల చరిత్ర ౩ వ భాగము.) మందపాటివారింట పెండ్లిలో ముందుగా మస్తైలు; మంగళసూత్రము, చీరె, జామారు ఒక మాలవానికిచ్చి వాడిచ్చిన అక్షతలు తెచ్చిగాని పెండ్లి చేయరని శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు వ్రాశారు. ఇట్లే కొన్ని కోమటి కుటుంబాలలో పెండ్లికి ముందు మాలవానికి తాంబూలము నిచ్చి సత్కరించు ఆచారమునుగూర్చికూడా ఆయన వ్రాశారు. ఇట్లే మరికొన్ని కులాలలోను ఇటువంటి ఆచారము లున్నవని దీని అంతరార్థము తెలియుటలేదని వ్రాశారు. (కాకతీయాంధ్రరాజ యుగం.). దక్షిణ హిందూదేశములోని కులములు, జాతులు అను గ్రంథములోని ౩ వ సంపుటములో ఎడ్గర్ థర్స్టన్‌దొర కోమట్లు అను శీర్షికక్రింద వారి ఆచార వ్యవహారములను వివరించినారు. వివాహ కాలమందు కొన్ని విచిత్రమైన ఆచారములను అవలంబిస్తున్నారని, దీనివల్ల వారికి మాదిగవారితో ఏదో సంబంధమున్నట్లు కనపడుతున్నదని చెప్పి ౩౨౪వ పుటలో కొన్ని వివరములిచ్చినాడు. వారిళ్ళలో వివాహము ముందు ఒక మాదిగవానిని పిలిచి తమ చెప్పుకు మరమ్మత్తు చేయవలసిన అవసరం లేకపోయినా బుద్ధిపూర్వకంగా ఊడదీసి బాగుచేయించి అతడికి ఆ పనికి సామాన్యంగా యిచ్చేదానికన్నా హెచ్చుసొమ్ము తాంబూలంలో పెట్టి యిచ్చి 'చేరిందా? చేరిందా?' అని అడుగుతారు. అతడు 'చేరింది, చేరింది' అంటాడు. ఈ ఆచారము వారు ఉల్లంఘించినచో మాదిగలు వచ్చి అల్లరిచేసి పెండ్లి పందిరికి కట్టిన అరటిచెట్లు పీకివేస్తారు. కోమట్లు వివాహం 7 రోజులు చేస్తారు. ఒక్కొక్కప్పుడు ౫ రోజులు చేస్తారు. వివాహ కలాపం పూర్తియైన తరువాత 7 రోజులైనప్పుడు ౫ వ నాటి అర్ధరాత్రి, ౫ రోజు లైనప్పుడు ౩ వ నాటి అర్ధరాత్రి, పెండ్లి యింట్లో పెరటి దొడ్లోకి వెళ్ళి తమ కులాచారమని చెపుతూ ఒక విధమైన తాంత్రిక ప్రక్రియ జరుపుతారు. వారు పిండితో ఒక ఆవును చేసి దాని పొట్టలో వసంతముపోసి యుంచుతారు. పిండితోనే మాదిగవాళ్ళ పశువులను కోసే ఇనుప పరికరాలనుచేసి యెండబెట్టి యుంచుతారు. వీ రా

గోవును పెరటిలో పూజ చేస్తారు. తరువాత దానిని పిండి ఆయుధాలతో కోస్తారు. వసంతం రక్తముతో చిందుతుంది. కోసిన ఆవుయొక్క అవయవాలలో కొమ్ములను తమలో కొమ్ము కులమువారికి, గొంతుకను గొంతు కులమువారికి, కాళ్ళు, శిరస్సు కర కపాల కులమువారికి, మూపురము తొంటి కులమువారికి, దంతములు దంత కులమువారికి పంచి యిస్తారు. ఈ ఆచారము 1870 సం॥ నాటికికూడా జరుగుతూ వున్నట్లు తనకు తెలుసునని మేజర్ మెకంజి దొర వ్రాశాడని, మద్రాసు రాజధానిలో చాలా ప్రాంతాలలో యీ ఆచార మున్నదనీ యీ పిండి ముద్దలను నాపసాని ముద్దలని అంటారని, యీ ఆచారమింకా మద్రాసులో జరుగుతూనే వున్నదని తర్‌స్టన్ దొర 1909 సం॥లో ప్రకటించిన మూడవ సంపుటంలో వ్రాశారు.

తెలుగు దేశంలోని కోమట్లు నిజానికి వైశ్యులే. వీరు గౌర లేక గౌడ అనే వంగదేశమునుండి చాలకాలం క్రిందట వలస వచ్చారు. అందువలన వీరిని గౌర లేక గవర కోమట్లని అంటారు. వీరిలో చాలామంది 'తామ్రలిప్తి'లో వుండేవారు. వీరు మొదట జైనమతావలంబులు దేశాంతరాలలో సముద్ర వ్యాపారము చేసినవారు. *

అందువల్ల యిక్కడి బ్రాహ్మణులు వీరిని తక్కువగా చూశారు. అయితే వీరు పెనుగొండలో స్థిరపడిన తరువాత గొప్ప అగ్నిపరీక్షకు లోనై పరిశుద్ధులైనారు. దీనినిగూర్చి కన్యకాపురాణము బయలుదేరినది. వీరి వివాహోపనయనాలలో కొంత శాంతిక విధానములను అవలంబించి కృత్రిమ గోత్రముల నవలంబించినందువల్ల వీరిలో జరిగే శుభాశుభాలు వేదోక్తముగా గాక పురాణోక్తముగనే బ్రాహ్మణ పురోహితులు జరిపించేవారు. కొంతకాలానికి వీరు మేల్కొని తమ యిళ్ళలో వేదోక్తంగా కర్మలు చెయ్యాలని పట్టుపట్టారు. అంతట వీరికి, బ్రాహ్మణులకు తగాదాలు బయలుదేరినవి. ఈ కేసు బందరు జిల్లా కోర్టులో 1817 సం॥లో దాఖలై ప్రీవిష్షి

---

* Some facts in making of Bengal Panch Cowrie Banerjee Viswa Bharathi Vol. II. 263

యర్ కోర్టుకు, మద్రాసులోని సదర్ అదాలతు కోర్టుకు, ప్రీవీ కౌన్సిల్‌కు వెళ్ళింది. 1845 లో తీర్మానమైనది గాని తగాదా పరిష్కారం కాలేదు. ఆ కేసులో వైశ్యుల ఆచారాలను గురించి, నాపసాని ముద్దలను గూర్చి చర్చలు జరిగినవి. ఇటీవల తెలుగు వైశ్యులు ఋషి గోత్రము లవలంబించి వేదోక్త కర్మలను చేస్తున్నారు. (3. M. I. A. 304.) *

* "ఆంధ్ర చరిత్రపై అష్టాదశ వర్ణముల ప్రభావము" అను శీర్షికతో నేను సుమారు 400 పుటల గ్రంథమును రచించియున్నాను. అందులో వివిధ కులాచారములను గూర్చి, ముఖ్యముగా కూలం మాదిగల కులాచారములగూర్చి గ్రామీణ ఆంధ్ర ప్రజా జీవనములో వారి స్థానాన్నిగూర్చి, హరిజన చరిత్రముగూర్చి వీరైనంతవరకు పరిశోధించి వివరించి యున్నాను. ఆ గ్రంథము అచ్చుకు సిద్ధముగా నున్నది.

# 17. వర్ణభేదములోని విచిత్ర పరిణామము

శ్లో॥ న విశేషో_స్తి వర్ణానాం సర్వం బ్రాహ్మ మిదం జగత్
బ్రాహ్మణాః పూర్వ సృష్టోహి కర్మభి ర్వర్ణతాంగతాః॥
కామ భోగ ప్రియా _స్తీక్ష్ణః క్రోధనాః ప్రియ సాహసాః
త్య_క్త స్వధర్మా రక్తాంగా _స్తే ద్విజాః క్షత్రతాంగతాః॥
గోభ్యోవృ_త్తిం స మాస్థా య పీతాః కృష్యుప జీవినః
స్వధర్మాన్నాను తిష్ఠంతి తే ద్విజా వైశ్యతాంగతాః॥
హింసానృత ప్రియా లుబ్ధా స్సర్వకర్మోప జీవినః
కృష్ణాశ్శౌచ పరిభ్రష్టా _స్తే ద్విజా శ్శూద్రతాం గతాః॥

(మహాభారతము - శాంతిపర్వము 188 అధ్యాయం, శ్లో॥ 10-13)

"వర్ణములలో హెచ్చు తగ్గులు లేవు. జగత్తు అంతా బ్రహ్మ మయము. మొదట సృష్టింప బడిన బ్రాహ్మణులుకదా కర్మముచే వర్ణమును పొందిరి." కర్మ భోగములందు ప్రీతిచెంది క్రూరులై క్రోధముకలిగి ప్రియ సాహసులై స్వధర్మములను ఏ బ్రాహ్మణులు విడిచిపెట్టిరో, ఎఱ్ఱని శరీరము గలవారో ఆ బ్రాహ్మణులు క్షత్రియులైరి. గోవుల పాలనవృత్తిని చేయుచు కృషిచేసి జీవించువారై పసుపువర్ణము గలిగిన యే ద్విజులు స్వధర్మము నమష్ఠించుటలేదో వారు వైశ్యులైరి. లోభము గలిగి అన్ని కర్మలను చేయుచు జీవించుచు శౌచము లేనివారై నల్లని దేహము గల్గిన ద్విజులు శూద్రులైరి - అని మహాభారతము - శాంతిపర్వము, 188 వ అధ్యాయము లోని 10-13 శ్లోకములు చెప్పుచున్నవి.

భగవద్గీత స్వధర్మము ననుష్ఠించుటలోని ప్రాశస్త్యమును గడిస్తున్నది. వేద విద్య లెన్నియైనను కులవిద్యకు సాటిరావని గువ్వల చెన్న శతకముకూడా ఆ సంగతినే చెపుతున్నది. అష్టాదశ వర్ణములవారిలో ముందుగా స్వధర్మము నుల్లంఘించి యితర వృత్తులచే జీవించుట ప్రారంభించినవారు బ్రాహ్మణులే. క్షత్రియులు తమ క్షాత్రధర్మాన్ని ఆచరించే అవకాశాలు లేక కందాయమైనారు. వైశ్యులు తమకు విధించబడిన కృషి పశు పాలనములను వదలి కేవలం వాణిజ్యముచే జీవింప సాగినారు. తక్కిన కులాలవా రంత సులభముగా త్వరగా తమ కుల ధర్మములను, కుల వృత్తులను విడనాడలేదు. ఒక కులవృత్తివల్ల జీవించే వారా విద్య వదలితే కులధర్మము నుల్లంఘించి నట్లుగానే ఎంచేవారు. ఒక కులవృత్తి వా రింకొక వృత్తి చేయుట కిష్టపడేవారు కాదు. అయితే ఇంగ్లీషు వర్తక కంపెనీవారి పాలనలో మన గ్రామీణ వ్యవసాయార్థిక వ్యవస్థ విచ్ఛిన్నము కాగా గ్రామములలోని వివిధ కులాలవారి వృత్తులు నాశనమై వారు జీవనాధారము లేక వ్యవసాయము, పశుపాలనము, కూలి నాలి పనులు చేసుకొని జీవింపవలసినవా రైనారు. అయినప్పటికి ఒక కులానికి చెందిన సేవకుడు యితర కులమువాని పని చేయడాని కంగీకరించేవాడు కాడు. గ్రామాలనుండి పట్టణములకెళ్ళి కూలి నాలి చేసుకొనేవారు, నౌకరీ చేసేవారు. ఇతర దేశాల నుంచి వచ్చినవారి ఆచార వ్యవహారాలు చూడడంవల్ల, పట్టణవాసములోని నాగరిక విధానాలవల్ల కొంత మార్పుచెంది తమ కుల ధర్మములను, ఆచారములను క్రమ క్రమముగా మీరడం అలవాటు చేసుకున్నారు. ఐనప్పటికీ ముఖ్యమైన విషయాలలో మాత్రం తమ కులాచారాలను వదలరు. తమ శాఖవారితో తప్ప వియ్యమందరు, పంక్తి భోజనాలు చేయుట కిష్టపడరు.

ఇటీవల కొంతకాలంనుండి వివిధ కులాలవారు హిందూ జనసంఘములో తమ గౌరవమును పెంపొందించుకొనడానికి అగ్ర వర్ణాలవారి ఆచారాలను, సంస్కృతి సంప్రదాయాలను అనుసరించటం ప్రారంభమైనది. ఇది కోరదగిన మార్పే అవడానికి సందేహం లేదు. దీనివల్ల చాలా కులాల వారిలో నాగరికత అభివృద్ధి చెందుతూ వున్నది. ఐతే కులభేదముల పట్టుదలలు మాత్రం సడలుటలేదు. ఈ విచిత్ర పరిణామమును గురించి భారత

దేశములోని, వివిధ ప్రాంతాలలోని కులవర్గముల ఆచార వ్యవహారములను గూర్చి పరిశోధించిన చరిత్ర కారులు, అర్థ శాస్త్రజ్ఞులు కూడా అనేక గ్రంథ ములలో వ్రాసియున్నారు.

1908 వ సంగలో ప్రకటింపబడిన "ఇంపీరియల్ గేజెటీర్" లోని మద్రాసు సంపుటమును సంతరించిన డబ్ల్యు ఫ్రాన్సిస్, ఐ. సి. యస్. గారు "జనాభా" అను శీర్షికక్రింద యిలాగ వ్రాశారు:

మద్రాసు రాజధానిలోని తెలుగు, అరవ, కన్నడ, మలయాళ భాషా ప్రాంతములలో వివిధ కులములవారు చిన్న చిన్న ఉపశాఖలుగా విభజింప బడి యున్నారు. ఈ కుల శాఖలలోనివారి కొకరితో ఒకరికి సంబంధము లేదు. ఒకరితో నొకరు వియ్యమందరు. సాధారణముగా పంక్తి భోజనము కూడా చేయరు. ఐతే యీ కులాల వారందరూ తమ పూర్వీకులు చేస్తూ వుండిన కుల వృత్తులవల్ల జీవించటంలేదు. జనాభా లెక్కల వివరాలవల్ల అరవ దేశములోని 'పరయను'లనే అస్పృశ్యులలో నాల్గవ వంతు, తెలుగు జాతి మాలవారిలో నూటికి 12 మంది వారి పూర్వులు చేస్తూవుండిన పీచ పేనకా వృత్తులనుండి విముక్తులై ఉన్నతస్థితిని పొంది భూమిని దున్నే వ్యవసాయకులుగాను, చిన్న భూస్వాములుగాను కూడా జీవిస్తున్నట్లు తెలుస్తున్నది.

ఇక బ్రాహ్మణులలో నూటికి అరవైమంది తమకు విద్యుక్తము లైన యజన యాజన అధ్యయన అధ్యాపన, దానప్రతి గ్రహములవల్ల జీవించటము మాని వ్యవసాయము, ఇతర వృత్తులు, తుదకు వ్యాపారము కూడా చేస్తూ జీవిస్తున్నట్లు తెలుస్తున్నది. ఇంతమాత్రముతో కుల కట్టు బాటులు సడలిపోయినవని అనుకోకూడదు. అన్ని ముఖ్యమైన విషయాల లోను కుల కట్టుబాటులు, పట్టింపులు చాలా కట్టుదిట్టంగానే సాగుతున్నవి. తన కుల శాఖలలో మందిగాక యితర శాఖలలోమంది పిల్లను పెళ్ళి చేసుకో కూడదనే పట్టింపు చాలా గట్టిగా అమలు జరుగుతూ వున్నది.

హిందూ జనసంఘములోని అనేక కుల వర్గములవారిలో ఏర్పడి

యున్న విధి నిషేధాలను అమలు జరుపుకొనటములో వివిధ కులాలవారు తమ మతాచారాలను పాటించు తమ తోడివారిలో తమ స్థాయిని మెరుగు పరచుకొనడానికి చేస్తూవున్న గట్టి ప్రయత్నాలు కొన్ని కనబడుచున్నవి. హిందూ సంఘములో బ్రాహ్మణులు అగ్రస్థానము వహించిన వారైనందువల్ల వారి కులాచారాలు శాస్త్రీయములైన సదాచారములనే భావము హిందూ జనసంఘములోని తక్కిన కులాలవారిలో వ్యాపించియున్నవి. అందువల్ల తమ తోడివారిలో తమ స్థాయిని పెంపొందించుకొనజూచు కుల శాఖవారు లేక కులమువారు నీచములుగా పరిగణింపబడే వృత్తులను వదలి వీలైనంత వరకు బ్రాహ్మణాచారాలను, సంప్రదాయాలను అనుకరిస్తారు. ఉదయమున స్నానంచేసి బొట్టుపెట్టుకుంటారు. మాంసాహారమువదలి శాకాహారులనువారు పట్టుబట్ట కట్టి పూజా పునస్కారాలు చేస్తారు. వ్రతాలు చేస్తారు. తమ పిల్లలకు ఈడేరకుండానే పెండ్లిండ్లు చేస్తారు తమలో పూర్వము వితంతువులకు మారుమనువు ఆచార మున్నప్పటికి పునర్వివాహము నిషేధిస్తారు. తమ యిండ్లలో జరిగే శుభాశుభాలను దబ్బుకాశపడి వచ్చి చేయించే బ్రాహ్మణులచేత చేయించుకుంటారు. పూర్వము శూద్ర కమలాకరములో చెప్పబడిన రీతిగా పురాణోక్తముగాచేసే కర్మలను వేద శాస్త్రోక్తమైన పద్ధతిలో జరిపించుతారు. ఐతే యిటువంటి చర్యలను ఆయా కులశాఖల వారికన్నా కొంచెము శ్రేష్ఠమైన కులవర్గములవారుగాని, వారితో సరిసమానమైన కులవర్గాలవారుగాని హర్షించరు. ఈ మార్పులు జరుగుతూవుంటే చూస్తూ వూరుకొనక దానిని ప్రతిఘటిస్తారు.

ఇటువంటి సందర్భములో తిరునల్వేలి జిల్లాలో 1899 సం॥లో జరిగినది అక్కడ అనపూర్వకముగా కల్లు గీస్తూ అస్పృశ్యులుగా పరిగణింప బడే 'శానాన్' కుల శాఖవారు తాము క్షత్రియులమని ప్రకటించుకొని దేవాలయములోనికి రావటానికి ప్రయత్నించగా అక్కడి 'మరవన్' కులమువారు ప్రతిఘటించారు. అందువల్ల వారి ప్రయత్నములు సాగలేదు.

ఐతే వివిధ కులములలోని విధి-నిషేధములు ఉల్లంఘించే ప్రయత్నాలు బాహాటంగాగాని, ఒక్కసారిగాగాని జరుగక మెల్లిమెల్లిగా జరుగుతాయి. ఒక్కొక్క కులవర్గములోని కొన్ని కుటుంబాలవారు కొంత ధనము

బలము చేకూరగానే తమ శాఖలోని యితర కుటుంబాలనుండి వేరుపడి బ్రాహ్మణ కులాచారాలను, సంప్రదాయాలను అవలంబించి తమ తోడివారి కన్నా తాము అధికులమన్న భావముతో ప్రవర్తిస్తూ తమకన్న హెచ్చు గౌరవముగల శాఖవారితో వియ్యమందుటకు ప్రయత్నిస్తారు. ఆ ప్రకారముగా ఒక కొత్త కుల శాఖగాని, ఒక కొత్త కులముగాని ఏర్పడుతుంది" అని ఫ్రాన్సిస్‌గారు వ్రాశారు.

వీరు చెప్పిన సంగతులే బొంబాయిలోను, పంజాబులోను, మధ్య రాష్ట్రములోనుకూడా జరుగుతున్నట్లు సుప్రసిద్ధ చరిత్రకారుడు, అర్థ శాస్త్రజ్ఞుడు నైన డాక్టర్ రాధాకమల ముఖర్జీగారు బాగా పరిశోధనలు జరిపి 1924 సంగలో రచించిన Principles of Comparative Economics అనే ఉద్గ్రంథములో (పుటలు 7-16) వివరించియున్నారు. వారు వివిధ కులాలలో బయలుదేరిన కొత్త శాఖలను వివరించారు. మధ్యరాష్ట్రములోని తేలీ కులమువారిని గూర్చిన ఉదాహరణమునకు సంబంధించిన విషయము:

తేలీ అనేవారు తెలికలవారు. ఉత్పాదక కులమువారు. వీరిలో ఒంటెద్దుతో మూనె గానుగ ఆడేవారు, రెండెద్దులతో గానుగ ఆడేవారు, ఏరండ శాఖవారు, 'సావో' శాఖవారు, గాండ్లి శాఖవారు అనే శాఖల వారున్నారు. సావో శాఖవారు మూనె గానుగ లాడడం మానివేసి వ్యవసాయ వృత్తి నారంభించి చెరుకు, వరి పండించి కొంత ధనవంతులైనారు. వీరికి సావుకారు అనే అర్థంకల సావో శాఖవారని పేరు వచ్చినది. గాండ్లి వారుకూడా మూనె గానుగ లాడడం మాని భూస్వాములుగాను, వడ్డీ వ్యాపారులుగాను, ఇతర వ్యాపారులుగాను వున్నారు. వీరు బనియాలనే కోమట్లు మనిపించుకోడానికి ప్రయత్నిస్తున్నారు. వీరిలో కొందరు జందెములుకూడా ధరిస్తారు. వీరీ విధముగా సంఘములో తమ స్థాయిని పెంచుకోడానికి ప్రయత్నిస్తున్నారు. వీరు తెలుగు దేశమునుంచి వచ్చిన పరాయి జనము అయినందువల్ల వీరి ప్రయత్నము కొంత సులభసాధ్యమైంది. ఇక ఏరండ తేలీ శాఖవారు మాత్రం చాలా హీనస్థాయిలో నున్నారు. ఆముదములనుండి ఆముదము తీయించటము నీచమైన పని అని తేలీ కులమువారి ఊహ. అందువల్ల గతిలేనివారుతప్ప తక్కినవారు దాన్ని వదలివేస్తారు.

దక్షిణాపథములోని ప్రజలకు అక్కడి రాజ్యాలను పాలించు రాజ వంశీయుల రాజకీయ కార్యక్రమాలపైనకంటె సముద్రాలను దాటి దేశాంత రాలకు వెళ్ళి వ్యాపారముచేసి వలసలు స్థాపించే కార్యక్రమాలపైన హెచ్చు అసక్తి వుండేదని పూర్వకాలంనాటి శాసనాలవల్ల తెలుస్తున్నది.

మైసూరు రాజ్యములోనున్న బలిగామిలోని ఒక శాసనము నానా దేశి, కుడి యెడమ కులములవారిని పేర్కొంటూ యిలాగ చెపుతున్నది :

“కృతయుగారంభమునుండి, దేశాంతరాలకు వెళ్ళే ధైర్యశాలురు ఉద్భవించి యీ చిన్న మండలములోని ఆరు ఖండములలోగల భూమార్గ, జలమార్గములద్వారా వివిధ ప్రాంతాలకు పోయి గుఱ్ఱములు, ఏనుగులు, నవరత్నములు, సుగంధ ద్రవ్యములు, ఓషధులు మొదలైన సరకులతో భారీగా గాని, చిల్లరగా గాని వ్యాపారము చేస్తూ వుంటారు. * దక్షిణ భారత దేశమునుండి తూర్పు సముద్రములోని వివిధ దేశములకు వెళ్ళుతూ వుండిన మణిగ్రామ చెట్టియారులు ఆయా దేశాలవారికి సుపరిచితులు” అని శ్రీ కె. ఎమ్. పణిక్కరుగారు ‘భారతదేశ చరిత్రపైన భూగోళ ప్రభావము’ అను గ్రంథములో వ్రాశారు.

ఆంధ్రదేశము నేలిన రాజులు త్రిసముద్రాధిపతులనే బిరుదు వహించారని, శ్రీకాకుళమున కుత్తరమున గల గొప్ప రేవు పట్టణములను ‘టాలమీ’ పేర్కొన్నాడనికూడా ఆయన వ్రాశారు.

ప్రాచీన కాలములో వైశ్యులు మాత్రమే వాణిజ్యము, వర్తక వ్యాపారాలు చేసేవారు. పూర్వకాలమునాటి జైనుల మత కథలలోను, బృహత్కథలోను గుప్త, సెట్టి అనే బిరుదులతో వైశ్యులు సముద్రాలు దాటి దేశాంతరాలతో వర్తక వ్యాపారాలు చేస్తూవుండిన ఉదాహరణము లున్నవి. సెట్టి అనేది శ్రేష్ఠి అనేదాని రూపాంతరము. ఈ పదము రాజ స్థానము, గుజరాతులలోకి వెళ్ళేటప్పటికి షేఠీ, సేట్ అని రూపాంతరం

* Epigraphica Carnatica, Vol. VII. P. P. 118

పొందినది. తెలుగు దేశములో సెట్టి అని, అరవ దేశములో చెట్టి అని వ్యవహారంలో నున్నది. తెలుగు దేశములోని వైశ్యులను కోమట్లు అని వ్యవహరించేవారు. గౌడ లేక వంగ దేశమునుంచి వచ్చిన కోమట్లను 'గవర' కోమట్లు అనేవారు. వీరు మొదట జైనులుగా నుండేవారు. ఈ కోమట్లు పెనుగొండలోను, 18 ముఖ్య పట్టణములలోను స్థిరపడి నగర స్వాములని, పురవరాధీశ్వరులని బిరుదులతో వ్యాపార సంఘాలుగా నేర్పడి వ్యాపారం చేసేవారు.

కోమట్లతోబాటు తెలుగు దేశములోని బలిజలుకూడా వర్తక వ్యాపారాలు చేస్తూ గొప్ప సంఘాలుగా నేర్పడి దేశాంతరాలలో వ్యాపారాలు సాగించేవారు. వీరుకూడా సెట్టి బిరుదు వహించారు వీరినిచూచి తక్కిన వారుకూడా తమతమ కులవృత్తులు వ్యాపారాలుగానే పరిగణించి సెట్టి బిరుదు వహించారు. ఇప్పుడు సెట్టి అనే బిరుదు తెలుగు, అరవ దేశాలలోని కోమట్లు. బేరిసెట్లు, నాటుకోటి సెట్లు, లింగబలిజలు, సాలెవారు, దేవాంగులు, కుమ్మరులు, గొండ్లవారు, తెలికలవారు, ఉప్పరులు, వడ్డెవారు, సెట్టివారుకూడా వహిస్తున్నారు. ఇది మన వర్ణముల చరిత్రలో నొక పరిణామము.

# 18. వరహాల చలామణి

పూర్వం చాలాకాలంనుంచీ, మొన్న మొన్నటివరకూ మన దక్షిణ హిందూదేశంలో 'వరహా'లనే బంగారు నాణెములు చలామణిలో వుంటూ వుండేవి. ఇప్పుడు వరహాలు ఎక్కడా మచ్చుకైనా కనబడవుగాని, మన భాషలో మాత్రం వరహాలు చలామణిలోనే వున్నాయి. మన సామెతల లోనూ, కథలలోనూ రూపాయిలకన్న వరహాలకే ఎక్కువ ప్రాముఖ్యత వుంది. ఈ నాణెముమీద వరాహరూపము (అడవిపంది బొమ్మ) వున్నందు వల్లనే దీనికి 'వరహా' అని పేరు వచ్చింది. క్రీస్తుశకము ఏడవ శతాబ్దము నుంచి ఆరువందల యేళ్లు మన దేశాన్ని పరిపాలించిన చాళుక్య రాజవంశము యొక్క లాంఛనము వరాహ చిహ్నమే అయినందువల్ల ఈ నాణెమును మొదట ముద్రించినవారు వారేనని చరిత్రకారుల అభిప్రాయము. ఏది ఎలా వున్నా యిది చిరకాలంనుంచి చలామణిలో వున్నదనటానికి సందేహం లేదు. దీనిని గ్రీసు దేశపు వర్తకులు 'డ్రాచ్మ' అనేవారు. మహమ్మదీయులు "హూన్" అనేవారు. హిందూ రాజులేగాక మహమ్మదీయ ప్రభువులు కూడా రక రకాల వరహాలను ముద్రించారు. వరహాలమీద ఒక్క వరాహ రూపమేగాక ఇంకా యితర విగ్రహాలుకూడా వేసేవారు. ఇంగ్లీషు వారీ దేశానికి వర్తకం చెయ్యడానికి వచ్చేటప్పటికి అనగా పదహారవ శతాబ్దిలో వరహాలమీద జగన్నాథ దేవాలయము, జగన్నాథస్వామి విగ్రహము వుంటూవుండడం చూసి వారు దీనికి 'పెగోడా' అని పేరు పెట్టారు. 'పెగోడా' అంటే దేవుని గుడి అని అర్థం. ఆ మాటను అంతకు పూర్వం పోర్చుగీసువారు ఆ అర్థంలో వాడేవారు.

వరహా సర్వసాధారణంగా తొమ్మిది చిన్నాల యెత్తు బంగారు నాణెముగా వుండేది. సాధారణంగా యిప్పటి రూపాయిలలో రు. 3-8-0 లు విలువ వుండేది, వరహాకి 16 పణాలు. పణమనేదికూడా బంగారు నాణెమే

కాని అందులో టంకం చాలావుండేది. దాని విలువ రు. 0-3-6. వరహాలో సగం విలువగల నాణెము మాడ.

మహమ్మదీయులు హూనులనే వరహాలవేగాక పదిహేను రూపాయిల విలువగల బంగారు మొహిరీలనుకూడా ముద్రించారు. వారు ముద్రించిన వెండి నాణెములలో దినారమనేది రు. 2-8-0 ల విలువ కలది. ప్రస్తుతము చలామణిలోనున్న వెండి రూపాయను మొదట ముద్రించినవారు మహమ్మదీయులే. దాములనే రాగి డబ్బులనుకూడా తురకలు అమలులో పెట్టారు.

క్రీ. శ. 14 వ శతాబ్దమునాటికి దీనారములు, టంకములు అనే నాణెము లున్నట్లు శ్రీనాథకవి సార్వభౌముని పద్యంవల్ల తెలుస్తూ వుంది. ఇవి బంగారు నాణెములనికూడా తెలుస్తూవుంది. టంకము అనేది మనఃకల్పితమైన నాణెమని సి. పి. బ్రౌనుదొరగారు వ్రాశారుగాని యిదికూడా చలామణిలో వున్న నాణె మనడానికి సందేహము లేదు. ఇది 14 లేక 16 డబ్బులు; నాలుగు పణములు విలువగల నాణెమని బ్రౌనుగారే వ్రాశారు. టంకములో సగము విలువగల నాణెము ధరణము. పైన చెప్పిన బంగారు నాణెములు గాక 'రూక' అనే ఒక చిన్న నాణెముకూడా చలామణిలో వుండేది. ఇది చిన్నమొత్తు వెండి బంగారముల నాణెమని శబ్దరత్నాకరములో వుదహరించబడి యున్నది.

రాగి నాణెములలో డబ్బు అనేది రెండు దుగ్గాణీల విలువగలది. దుగ్గాని అనగా రెండు దమ్మిడీలు. కాని అనగా ఒక దమ్మిడి. దమ్మిడీలో సగము విలువగల నాణెము 'కాసు'. ఇవన్నీ చాలా చిన్న చిన్న నాణెములు. 'కాసు' అనే మాట కర్షము అనే సంస్కృత పదములోనుంచి వచ్చింది. దీనిని ఇంగ్లీషువారు (cash) క్యాష్ అనే వ్యవహరించారు. దీనిబట్టి క్యాష్ అనేమాటకి నగదు, రొక్కము అనే అర్థములు వచ్చాయి. ఇలాగే పణమనే మాటకుకూడా అరవంలో 'ధనము' అనే అర్థము వచ్చింది. ఇంగ్లీషు వర్తక కంపెనీవారు తాము స్వయముగా నాణెములను ముద్రించక పూర్వం దేశంలో అంతకుముందు చలామణిలోవున్న నాణెము

లనే ఉపయోగించేవారు. అయితే వాటి విలువలను యీ క్రింది విధముగా స్థిరపరిచారు.

10 కాసులు = ఒక దుడ్డు, లేక దుగ్గాణి అనగా రెండు పైసాలు.

2 దుడ్లు = ఒక డబ్బు. అనగా ఒక కాని.

4 దుడ్లు = ఒక వెండి ఫణము. అనగా $1\frac{1}{4}$ అణా.

45 పణములు = ఒక స్టార్ పగోడా అనే పూల వరహా.

ఈ పూల వరహా ఖరీదు రు. 3-8-0 లు. దీనికి ఒకపక్క భగవతి విగ్రహము, రెండవపక్క నక్షత్రం బొమ్మ లుండేవి. బహదరీ అనిన్నీ, త్రిమూర్తుల వరహా (Three swamy pagoda) అనిన్నీ పేరుగల కరుకు వరహా ఖరీదు రు. 4-0-0 లుగా నిర్ణయించారు.

బహదరీ, సుల్తానీ అనే వరహాలు హైదరాలీ, టిప్పుసుల్తానులు మైసూరు రాజ్యం పరిపాలిస్తూ వున్నప్పుడు వేయించిన నాణెములు. (1761-1799) కంఠీరవరాయ వరహా అనేది యింకొకటి వుండేది. దీనిని కంఠీరవ రాయ వరహా (Kanteroi Pagoda) అనేవారు. ఈ వరహాలు 105 కి రు. 305-7-4 లుగా లెక్క కట్టేవారు.

చెన్నపట్నం (మిశా) వరహా నెల్లూరు, గుంటూరు జిల్లాలలోనూ పూర్వం ఆర్కాటు నవాబు కిందవుండే కర్నాటకమనే రాజ్య భాగాలలోనూ చలామణి అవుతూ వుండేది. ఈ వరహాలు నూరింటికి 385 ఆర్కాటు రూపాయిలుగా లెక్క కట్టేవారు. వరహాకి రు. 3-15-$7\frac{1}{4}$ లు లేక 52 పణములు లేక 80 కాసులు అని చలామణి మారకం జరిగేది.

క్రీ. శ. 1788 వం॥రం నాటికి చెన్నపట్నంలో 14 రకములైన రూపాయలు చలామణిలో నుండేవి. మచిలీపట్నం, మద్రాసు, జగన్నాయక పురం, సూరతు, ఆదోని, బొంబాయి, ఆర్కాటు, పాండుచేరి, కలకత్తా, బంగాళీసిక్కా, రాయచూరు, నాగపూరు, ఔరంగాబాదు, బనారసు అనే

పేర్లతో వానిని వ్యవహరించేవారు. మద్రాసు టంకసాలవారు 1788 సంవలో యీ క్రింది జాబితా దాఖలా విలువలను ప్రకటించారు.

హైదరాలీ బంగారు మొహిరీ ఒకటింటికి 16 అర్కాటు రూపాయలు.
అహమ్మదీ బంగారు మొహిరీ = నాలుగు మైసూరు వరహాలు.
సిద్దాహి అర్ధమొహిరీ = 2 మైసూరు వరహాలు.
హైదరు వరహా = $4\frac{1}{2}$ ఆర్కాటు రూపాయిలు.
ఉరోయను బంగారు పణములు $16\frac{1}{2}$ కి = ఒక మైసూరు వరహా =
= రాజగోపాల పణములు 31
= కొత్తగోపాల పణములు 33
= తలచేరి పణములు 20
= సుల్తాను పణములు $13\frac{1}{4}$
వెనీషియన్ (నాణెము) = 5 రూపాయలు.

షాంపూరు రూపాయలు 365 = 100 (Star Pagoda) పూల వరహాలు.

పాండుచేరి రూపాయలు $382\frac{3}{4}$ = 100 మైసూరు వరహాలు.
మహారాష్ట్ర రూపాయలు $4\frac{1}{8}$ = ఒక మైసూరు వరహా.
జర్మను క్రౌను నాణెము = 2 మైసూరు వరహాలు.

ఆ కాలంలో బంగారు పూల వరహాలకు, వెండి రూపాయలకు గల మారకం రేటు వెండి సరఫరానుబట్టి వుండేది.

1791 మార్చి 1 వ తేదీన చెన్నపట్నం కోట అధికారులు 100 పూల వరహాలకు 365 ఆర్కాటు రూపాయిలుగా ధర నిర్ణయించారు.

ఆర్కాటు రూపాయి = 12 పణములు = 25 కాసులు అని నిర్ణయించారు.

ఇంగ్లీషు తూర్పు ఇండియా వర్తక కంపెనీవారు 1801 లో వెండి రూపాయలను ముద్రించినపుడు రూపాయకి 176-4 గ్రెయినుల యెత్తు వుండేటట్లున్నూ, అందులో 166-48 ఛాదీ వెండి వుండేటట్లున్నూ నిరుకు పరిచారు. 1818 లో 180 గ్రెయినుల ఎత్తు వుండేటట్లున్నూ, 165 గ్రెయినుల ఛాదీ వెండి వుండేటట్లున్నూ నిర్ణయించారు. 1835 లో హిందూదేశమంతటా యీ కంపెనీ రూపాయి చలామణీ అయ్యేటట్లు శాసించారు. (Act XVII of 1835)

క్రమక్రమంగా వరహాలు, మొహిరీలు పోయి ఇంగ్లీషువారి సవరినులే బంగారు నాణెములుగా వున్నాయిగాని వరహాలలాగ వాడుకలో లేవు.

# 19. విచిత్ర పన్నుల విధానము

ఇటీవల స్వతంత్ర భారతదేశంలో మన కేంద్ర మంత్రులు - రాష్ట్ర మంత్రులు అనేక విధములైన కొత్తపన్నులు విధిస్తూ శాసనాలు చేయస్తూ వుండడం అందరికీ తెలిసిన విషయమే.

పూర్వం ఇంగ్లీషు ప్రభుత్వ కాలంలో పన్నుల బాధను గురించి శ్రీ చిలకమర్తి కవిగారు 1896 సం॥లో వర్ణించియున్నారు.

సీ॥ నేల దున్నదమన్న తాలతరము పన్ను
నీరు గావలెనన్న నీటి పన్ను
వాణిజ్య మొనరింప వచ్చుబడికి పన్ను
సరుకు లమ్మెదమన్న సంతపన్ను
కర్ర లమ్మెదమన్నఁ గలప కింకొకపన్ను
పట్టణంబుల మునిసిపాలు పన్ను
పారిపోవుదమన్న బండి హాసిల్ పన్ను
కొంపమ్ముకొన్నచో స్టాంపు పన్ను

తే. గీ॥ ఉన్నమట్టుకు తినకుండ ఉప్పుపన్ను
వనెడు పన్ను లెగదీసె జనులనెల్ల
కటకటా యెట్టులున్నదో కాపులదశ
సుగుణ ధనులార జనులార చూడరయ్య.

ఇంగ్లీషు ప్రభుత్వం దాపురింపక పూర్వం గోల్కొండ సుల్తానుల ప్రభుత్వ కాలములో విచిత్ర పన్నుల విధానము ప్రారంభమైనది. భూమి పైన శిస్తు పన్నుగాక సాయర్ అనే రక రకాల పన్నులు విధింపబడేవి.

సరిహద్దు సుంకాలు, ఎగుమతి, దిగుమతి సుంకాలు వసూలు చెయ్యడానికి రహదారీలలో అంచె లంచెలుగా ఘాటీ లుండేవి. వంతెనల దగ్గర, పడవల రేవుల దగ్గర, ఖిల్లకట్లు దగ్గర హాసీలు సుంకాలు వసూలు చేసేవారు.

ఇళ్ళపైన, అంగళ్ళపైన, కార్ఖానాలపైన, సంతలపైన, బజారుల పైన, సాలె మగ్గాలపైన, కమ్మరి కొలిములపైన, తోళ్ళు పదునుచేసేచోటు-ఒకటేమిటి రకరకాల పరిశ్రమలపైన, వృత్తులపైన, వ్యాపారాలపైన, ఉప్పుమళ్ళపైన పన్ను లుండేవి.

వ్యభిచార గృహములపైన, సారా దుకాణాలపైన, నల్లమందు కొట్లు వగైరాలపైన పన్నులు విధించేవారు.

అన్నిటికన్న చిత్రము నేరాలు చేసినవారిపైన విధించే జరిమానాలు మొత్తముమీద సర్కారుద్యోగులకు చెల్లించే లంచాలు మామూళ్ళపైన కూడా నూటి కింత అని పన్ను విధించేవారు.

1828-1839 మధ్య కర్నూలు నవాబుగా వుండిన గులాం రసూల్ ఖాన్ మొదటి నిజాం ప్రభుత్వ సామంతుడు. తర్వాత ఇంగ్లీషు కంపెనీకి లోబడినాడు. ఇతడు 1839 లో పదచ్యుతుడైనాడు. అతడు శ్రీశైలము, అహోబిలము మొదలైన పుణ్యక్షేత్రాలకుపోయే యాత్రికులపైన, అక్కడ దేవాలయాలలో జరిగే భోగాలు, అర్చనలు, మరమ్మతులుపైన, తీర్థాలపైన పన్ను విధించేవాడు. దేవాలయ మరమ్మతులకు భక్తు లెంత ఖర్చుపెడితే అంత మొత్తం నవాబుకివ్వాలని ఏనుగుల వీరాస్వామయ్యగారు కాశీయాత్ర చరిత్రలో వ్రాశారు. 1830 సం॥లో ఆయన హైదరాబాదు వెళ్ళినపుడు అక్కడ సుంకములకు నిరుకు అనగా నిర్ణయము లేదని, ఏ వస్తువుమీద సుంకానికి ఎవడు ఊహించి దరఖాస్తు చేసినా దివాన్జీ ఆ సుంకమును గుత్తకిస్తాడని, కట్టెల బండ్లకు, విస్తరాకులకు షహరులోకి రావడానికి నాలుగైదు తిరువలు వసూలు చేస్తారని, తిరువ పన్ను వసూలు చేసేవాడి జోరావరీకొద్దీ యివ్వ వలసి వస్తుందనీ, చంపినా అడిగే దిక్కు లేదనిన్ని వ్రాశారు

గోల్కొండ సుల్తానులు శిస్తుల వసూలు హక్కులు, పన్నుల వసూలు హక్కులు వేలం వేసేవారు. లేదా గుత్త కిచ్చేవారు. గుత్తదారులు చాలా అక్రమాలుచేసి ప్రజలను చిత్రహింస పెట్టేవారు. నవాబుల వల్ల పన్నదులు పొందిన జమిందారులు పాళెగాళ్లు వారికి పేష్కషు చెల్లిస్తూ తమ తమ పలుకుబడిక్రింద మన్న గ్రామాలలో భూమిశిస్తుగాక చిత్రములైన పన్నులు విధించి వసూలు చేసేవారు.

తెలుగు, కన్నడ, అరవ, మలయాళ భాషా ప్రాంతాలను కలిపి, ఇంగ్లీషు వర్తక కంపెనీవారు మద్రాసు రాజధాని అను పేరుతో పాలించేవారు. అంతకు పూర్వ మీ ప్రాంతాలన్నీ మొగలుచక్రవర్తి రాజప్రతినిధి యైన హైదరాబాదు నవాబు రాజ్యములో చేరి వుండేవి. అయనవల్ల అధికారము పొందిన నవాబులు ఫౌజుదారులు, పాళెగాళ్ళు, జాగీరుదార్లు, జమిందారులు ఆయనకు కప్పము చెల్లిస్తూ వివిధ ప్రాంతాలను పరిపాలించేవారు. ఆ కాలములో భూమి పన్ను మాత్రమేగాక వర్తక సరుకులపైన నాయరు సుంకాలు, అబ్కారీ అనగా సారా వగైరా ఔషా ద్రవ్యాలపైన, భోగద్రవ్యాలపైన మోతర్పా పన్నులు, ఉప్పు సూరేకారముపైన పన్నులు యింకా చిత్ర విచిత్రములైన రకరకాల పన్నులు, రుసుములు వసూళ్ళు చేసేవారు. స్థానిక ప్రభువుల యిష్టానిష్టములనుబట్టి యివి మారుతూ వుండేవి.

ఇంగ్లీషు ప్రభుత్వాధికారులీ రకముల పన్నులను రద్దుచేసి, వానిలో తమ క్షేమమువచ్చినవానిని మాత్రము వసూలు చేయసాగిరి కోయంబత్తూరు జిల్లాలో మేజర్ మెక్లియాడ్‌గారు 36 రకముల పన్నులను రద్దు పరచినట్లు రికార్డులలో నున్నది.

(1) కుమ్మరులపైన (2) నామములు, విభూతి ధరించువారిపైన (3) ప్రతివారము జరుగు సంతలపైన (4) అద్దకము, రంగులు (5) నెయ్యి (6) పొగాకు (7) ధాన్యము కుప్పలు (8) సున్నము (9) తలారీలు (10) పెర్కటీలు (11) సరుకులుమోయు ఎద్దయజమానులు (12) భోగమువారు (13) వ్యభిచార స్త్రీలు (14) కూలీ మేస్త్రీలు (15) తామరపువ్వుల అద్దె

(16) పెరళ్లలో తోటలు (17) నదియొడ్డున నాటిన చెట్లు (18) పరిచేలలో మేయు పశువులు (19) తేత కొబ్బరికాయలు (20) చింతలు (21) బలపము (22) పోకచెక్కలు (23) కొలగారము (24) మహాదేవస్వరమలై దగ్గర మ్రొక్కుబడులు (25) దానధర్మములు (26) కలుపుతీయు తొల్లిక పారలు (27) గ్రామ వృత్తులవారికి సాలియానా చెల్లుబడులు (28) పశువుల అమ్మకము (29) పశువుల శాలలు (30) ఏతములు (31) చేపలు పట్టు జాలరి వృత్తి (32) మగ్గములు (33) సర్కారుకు రైతులు చెల్లింపవలసిన ధాన్యములో లోటు వచ్చినపుడు అమలుదారులు విధించు తఫరీకు అనగా వంతులవారీగా చెల్లించుకోవలసిన విధింపు (34) తాశిల్దారుగారి ఖర్చుల నిమిత్తము తఫరీకు (35) ప్రతి రైతు చెల్లించవలసిన మొదటి కిస్తుపైన ఒక్కొక్క ఫణము అదనపు చెల్లింపు (36) నాగలి పన్ను.

ఈ సంగతి కోయంబత్తూరు జిల్లా మాన్యువలులో వివరించబడి యున్నది.

తెలుగు జిల్లాలలో కూడా గోలకొండ సుల్తానుగారి క్రిందను హైదరాబాదు నిజాముగారి క్రిందను పనిచేయు ఫౌజుదారులును, నవాబులును వారికి లోబడి వివిధ ప్రాంతములను పరిపాలించుచుండిన జమిందారులును యిటువంటి పన్నులను, రుసుములను వసూలు చేయుచుండినట్లు లిఖితాధారములున్నవి. కుక్కుటేశ్వర శతకమునందును, రామలింగేశ్వర శతకమునందును దీనినిగూర్చిన వర్ణనము లున్నవి.

సేలము జిల్లాలో హోసూరు, ధర్మపురి తాలూకాలు తెలుగు ప్రాంతములేకదా. సేలము జిల్లా ఇంగ్లీషు వర్తక కంపెనీవారి వశమగు నప్పటికి ఆ జిల్లాలోని చెట్టియారు కులములో కొన్ని శాఖలవారు తమతో వ్యాపారము చేయువారిపైన న్యాయవిచారణాధికారమును చెలాయించు చుండిరి. పుల్లరులను, వ్యవసాయకులపైనను, కంసాలి, కంచరి, కుమ్మరి, కాతగారులు (రాతి చెక్కెడు పనివారు), వడ్లబత్తులు మొదలైన పంచదాయి కులములవారిపైనను, చాకలి, మంగలి, మాల మాదిగల పైనను పన్నులు విధించుచుండిరి. హత్యానేరము, దొంగతనము, వ్యభిచారము,

వివాహ భరారు భంగము నేరము, కృష్ణగద్దలను, కోతులను, పాములను చంపిన నేరములకు జరిమానాలు విధించుచుండిరి. ఈ అధికారము వారి కుండినందువలన సర్కారువారు చెట్టియారులపైన పన్ను విధించుచుండిరి. ఇది యుక్తముకాదని 1797 లో పేలము కలెక్టరుగా నుండిన కర్నల్ రీడ్‌గారు తలచి వారి న్యాయ విచారణాధికారమును, పన్ను విధింపు అధికారమును రద్దు చేసిరి.

(Forty Years of Progress. Srinivasa Raghava Iyengar, P. 28)

ఇంగ్లీషు వర్తక కుంపిణీవారు మన దేశములో పలుకుబడిని, రాజ్యాధికారములను సంపాదించగానే పూర్వము మొగలాయి దొరతనములో విధింపబడు పన్నుల కింకను అనేక విధములైన క్రొత్త పన్నులను చేర్చి వానిని కఠినముగ వసూలు చేయసాగిరి. పూర్వము గ్రామములలోను, పట్టణములలోను కొన్ని వృత్తులు, వ్యాపారములు చేసుకొనువారిపైన 'మోతర్పా' అనునొక విధమైన పన్ను విధింపబడుచుండెను. ఇది తూర్పు ఇండియా వర్తక సంఘమువారి దొరతనములో నొకవిధమైన తల పన్నుగా పరిణమించినది. సాలెవారి మగ్గములపైనను, ప్రత్తి రాటముల పైనను, గొర్రెల కాపరుల పైనను, కమ్మరి, కంచరి, వడ్రంగి, రాతిచెక్కడు పని వారు తుదకు రాటముమీద నూలు వడుకు ముసలమ్మలపైనకూడా యీ పన్ను విధింపసాగిరి.

ఏ వృత్తిగాని, వ్యారముగాని చేసికొని బ్రతుకవలెనన్నను, ఏ వస్తువైనను అమ్ముకొని జీవింపవలెనన్నను ప్రతి స్త్రీ పురుషుడు నీ పన్ను చెల్లించి తీరవలెను- దుకాణదారులపైన ప్రత్యేకముగా పన్ను విధించుటయే గాక వీధులప్రక్క చాపలనో, గుడ్డలనో పరచుకొని జీవించు బీద వర్తకుల పైనను, వీధులలో మూటలు వేసికొనిగాని గంప నెత్తిన పెట్టుకొనిగాని అమ్ముకొను చిల్లర బేరగాళ్లపైనను కూడా ఈ పన్ను విధించుచుండిరి. చిన్నచిన్న వృత్తులచేసికొని బ్రతుకువారిపైనను వారు తయారుచేయు వస్తువుల పైనను వా రుపయోగించు పనిముట్లపైనకూడా ఈ పన్ను విధించు

చుండిరి. ఆ పనిముట్ల విలువ కెన్నోరెట్లు సొమ్మును చెల్లించిగాని బీదవారా వృత్తిని చేసుకొనను వీలులేకుండెను.

ఈ పన్నును వసూలు చేయుట కుద్యోగుల కివ్వబడిన అధికారము లనుబట్టి వారు తమ చిత్తానుసారముగా, నిరంకుశముగా ప్రవర్తించి ప్రజలను బాధించుచుండిరి. నేరములను ఆచోకి తీయుటకొఱకు పోలీసువారు చేయు జులుమును చేయుచుండిరి. ఆకస్మికముగా వచ్చి దర్యాప్తు చేసి ఇంటిలో చొరబడి సోదాచేసి పన్ను లివ్వలేనివారికి సంకెళ్ళు వేసి బొండలో పెట్టి చిత్రహింసలు పెట్టి బాధించుచుండిరి. దీనికి భయపడి ప్రజలు వారికి లంచములిచ్చి తృప్తిపరుప సాగిరి. *

ఈ పన్నుకు ఒక నిలకడగాని, నిరుకుగాని లేదు. తమ యిష్టము వచ్చినప్పుడెల్ల అధికారులు వీనిని హెచ్చు చేయుచుందురు. దీని భారము ధనవంతులపైనకన్న బీదవారిపైన హెచ్చుగా పడుచుండెను. ఈ పన్ను చెల్లించుటకును, పట్టాను పొందుటకును బీదవాడు చాలాదూరములో నింకొక గ్రామములో నున్న కచ్చేరిలకి పోవలసినందున తమ పనులు నష్టపడి తాము చెల్లించు మొత్తపుకన్న హెచ్చు సొమ్మునే నష్టపడుచుండిరి.

భూమిని దున్నుకొని బ్రతుకు రైతులుగాక ఇంక నే వృత్తినిగాని, ఏ వ్యాపారము చేసుకొన్నను యీ పన్ను చెల్లించి తీరవలెను. ఒక ముసలమ్మ కూరగాయలు పట్టుకొని ఒక వీధిమూలకు వెళ్ళినాగూడా ఈ పన్ను లిచ్చుకోవలసినదే. ఒక చిన్న బట్టలమూట వేసుకొని తిరిగే చిల్లర వర్తకుడు కూడ దీని చెల్లింపవలెను. ఐతే ఈ దేశములో వ్యాపారముగాని, ఏ వృత్తినిగాని చేసుకొను పాశ్చాత్యు లెవ్వరును ఈ పన్ను చెల్లింపనక్కర లేదు అని ఈ పన్నులను వసూలుచేయు అధికారిగా పనిచేసిన ఒక ఆంగ్లేయ దొరగారే చెప్పినారు. • ఈ పన్ను ప్రత్యక్షముగా రైతులను బాధించునట్లు

* Condition and requirements of Madras John Bruce Norton 1854 Pp 164-5

• Commons First Report 1853. Appendix 7. India in the Victorian Age Ro D. Pp 164-5

కనబడకపోయినను వృత్తులు చేసుకొను పారిశ్రామికులను, వర్తకులను బాధించు ఏ పన్ను అయినను రైతుల పంటలకు సరియైన రేటు రాకుండా చేయును గనుక అది రైతులకును నష్టకరముగనే యుండెను. ఈ పన్నులో చాలా భాగము చేనేత మగ్గములపైన పడగా నేతగాండ్రు నష్టపడిరి. ఆ పరిశ్రమ తగ్గగా రైతులు పండించు ప్రత్తి ధర తగ్గెను. ఈ పన్నువలన దేశీయుల స్థితి దుర్భరమైనది.

## మోతర్ఫా పన్నుల నిరకునామా

గంజాము జిల్లా చికాకోలు పరగణాలోను, దాని క్రిందనున్న గ్రామములలోను 1787 నాటికి వివిధ వృత్తులపైనను, మగ్గములపైనను విధింప బడు మోతర్ఫా పన్నులు యీ క్రింద వివరించినట్లుండెను :

| | |
|---|---|
| 1. చేపలు పట్టువారిపైన నెల 1కి రు. 1-8-0 చొప్పున | 237-0-0 |
| 2. గాజులు తయారు చేయువారిపైన నెల 1కి రు. 14-0-0 చొప్పున | 140-0-0 |
| 3. కమసాలులపైన ఇంటికొకటింటికి రు. 1-0-0 నుండి రు. 6-0-0 వరకు | 54-0-0 |
| 4. కుమ్మరులపైన ఇంటికి నెల 1కి రు. 1-0-0చొప్పున | 116-0-0 |
| 5. నూనె గానుగల తెలికలవారిపైన 0-8-0 నుండి రు. 5-0-0 వరకు | 408-0-0 |
| 6. పాలు అమ్ముకొను గొల్లలపైన 0-8-0 నుండి రు. 3-0-0 వరకు | 102-0-0 |
| 7. చాకళ్ళపైన 0-8-0 నుండి రు. 30-0-0 వరకు | 73-0-0 |
| 8. పల్లివారు లేక కూరలమ్ముకొను వారిపైన రు. 1-8-0 నుండి రు. 3-0-0 వరకు | 34-0-0 |

| | | |
|---|---|---|
| 9. | పెగ్గి - ఇంటి 18 రు. 1-0-0 చొప్పున | 240-0-0 |
| 10. | చెప్పులుకుట్టు మాదిగలపైన రు. 0-4-0 చొప్పున | 27-0-0 |
| 11. | పడవలలో బియ్యము అమ్ముకొనువారిపైన ఒక్కొక్కరికి రు. 2-0-0 చొప్పున | 26-0-0 |
| 12. | జాలరులపైన 0-4-0 చొప్పున | 11-0-0 |
| 13. | గొర్ల కాపరులపైన రు. 3-0-0 చొప్పున | 10-0-0 |
| 14. | రంగిరీజువారు లేక రంగులు వేయువారిపైన రు. 1-8-0 చొప్పున | 10-0-0 |
| 15. | జలగడుగులవారిపైన రు. 1-0-0 చొప్పున | 5-0-0 |
| 16. | మేదరులపైన రు. 1-0-0 చొప్పున | 3-0-0 |
| 17. | చికాకోలు దగ్గరనున్న శివారు గ్రామములపైన | 53-0-0 |
| 18. | మగ్గములపైన రు. 0-8-0 చొప్పున | 449-8-0 |
| | మొత్తము రు. | 1683-0-0 |

వంగ రాష్ట్రమునందుకూడా యీ పన్ను లిట్టే విధింపబడుచుండెను. నస్యాముల దండయాత్రల కిదియొక ముఖ్య కారణముగా నుండెను. వంగ రాష్ట్రమునందు యీ పన్నులను ఇంగ్లీషువారు 1793 లో రద్దుచేసిరి. కాని మద్రాసులో మాత్రం 1863 వఱకు వసూలు చేయుచుండిరి.

* The Ganjam District Manual T. J. Maltby 1882, Pp. 214-215.

# 26. పన్నుల వసూళ్లలో చిత్రహింసలు

శిస్తు ఇవ్వలేని రైతులను అధికారులు బాధించే పద్ధతి మన దేశంలో చాల కాలంనుంచీ మొన్న మొన్నటి వరకూ బాహాటంగా జరుగుతూ వచ్చిన దురాచారం. అనేక రాజాధిరాజుల పరిపాలనలో మహా వైభవం అనుభవించిన శ్రీనాథకవి సార్వభౌముడు తన చివరి రోజులలో అనగా క్రీస్తు శకం 1437 - 1440 ఆ ప్రాంతంలో దరిద్రుడై కృష్ణా జిల్లాలో బొడ్డుపల్లెను గుత్తకు పుచ్చుకుని వ్యవసాయం చేసి నష్టపడి శిస్తు చెల్లించలేక పోగా అప్పటి ప్రభువులైన ఒడ్డెరాజుల అధికారులు ఆయనను హింసలు పెట్టినట్లు ఒక చాటు పద్యంవల్ల తెలుస్తూ వుంది.

సీ॥ కవిరాజు కంఠంబు కౌగిలించెనుగదా
పురవీధి నెదురెండ పొగడదండ
ఆంధ్ర నైషధకర్త యంఘ్రియుగ్మంబున
దగిలియుండెనుగదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత
వియ్యమందెనుగదా వెదురుగొడియ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుగదా
నగర వాకిటనుండు నల్లగుండు

కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు తినిపోయె తిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి
నెట్లు చెల్లింతు టంకంబు లేడునూర్లు॥

"బొగడ దండ" యనగా తప్పు చేసినవారి మెడను వేయు నొక తిరు బొండ కొయ్య. (చూడు : ప్రభావతీ ప్రద్యుమ్నం. పద్యం 120. పురాణపండ మల్లయ్య శాస్త్రిగారి వ్యాఖ్య.)

'విగళయుగ' మనగా ఏనుగు కాలి సంకెల. 'వెదురు గొడియ' యనగా అందలముయొక్క అవయవము. నల్లగుండు అనేది పెద్ద రాయి. శ్రీనాధుణ్ని యిలాగ బాధించారో లేదో కాని శిస్తు లివ్వలేనివారిని ఆ కాలములో యిలాగ చిత్రహింసలు పెట్టి బాధిస్తూవుండే మాటమాత్రం నిజం. నాగరికులైన ఇంగ్లీషువారి పరిపాలనలో మొన్న మొన్నటి వరకూ ఇంత కన్న క్రూరమైన చిత్రహింసలు జరుగుతూ వున్నాయంటే ఎప్పుడో ఒడ్డె రాజుల కాలంలో, మహమ్మదీయుల కాలంలోనూ అలాంటివి కొన్ని జరుగుతూ వుండేవంటే ఆశ్చర్యం ఏమిటి?

క్రీ. శ. 1857 లో శిపాయీల మ్యూటినీ అని ఆంగ్లేయులు వ్యవహరించే స్వాతంత్ర్య సమరం జరిగే వరకూ ఇంగ్లీషు వర్తక కంపెనీవారు యీ దేశాన్ని పరిపాలిస్తూ వుండిన కాలంలో రివిన్యూ శిస్తులు, పన్నులు వసూలు చేయడంలో రివిన్యూ అధికారులూ, నేరాలు ఆచూకి తీయడంలో పోలీసు అధికారులూ కూడా ప్రజలను అనేక చిత్ర హింసలు పెట్టి బాధిస్తూ వుండేవారు. ప్రజలు నోరులేని వారైనందువల్లనూ, రాజకీయ పరిజ్ఞానం లేనందువల్ల తమకు జరుగుతూవున్న అన్యాయాలను గురించి ఎవరికి చెప్పుకోవాలో తెలియక బాధపడుతూ వుండేవారు. గత శతాబ్దంలో యీ అక్రమాలు మితిమీరిపోయినాయి. చెన్నపట్నంలో మిషనరీలుచేసే అక్రమాలను అరికట్టడంకోసం పాటుపడుతూ 1844 లో మద్రాసు నేటివు అసోసియేష ననే ప్రజా సంఘాన్ని, క్రెసెంటు అనే పత్రికనూ స్థాపించి ప్రజాసేవ చేస్తూవుండిన శ్రీ గాజుల లక్ష్మీనర్సు సెట్టిగారు యీ అన్యాయాలను గురించి కూడా సభలలో తీర్మానాలు చేయించి ఇంగ్లాండుకు మహజరులంపి చాలా ఆందోళన చేశారు. అంతట కొంత కదలిక పుట్టింది. డేన్బీ సేమర్ అనే పార్లమెంటు సభ్యుడు 1852 లో యీ దేశానికివచ్చి లక్ష్మీ

నర్ఫుగారికి అతిథిగావుండి దక్షిణ జిల్లాలలో పర్యటనం చేసి అక్కడి అధికారులు ప్రజలను పెడుతూవున్న బాధలను, చిత్ర హింసలను స్వయంగా చూసి ఆశ్చర్యపడి బొండలు, చిరతలు మొదలైన కొన్ని హింసా సాధనాలను సీమకు తీసుకొని వెళ్ళాడు. 1854 సం॥ జూలై నెలలో యీ హింసల నిజానిజములను గురించి పార్లమెంటులో ఒక చర్చ జరిగింది. నాగరిక ప్రభుత్వంలో యిలాంటి హింసలు జరుగుతున్నాయంటే అక్కడి సభ్యులు నమ్మలేదు అంతట బోర్డు ఆఫ్ కంట్రోలు అధ్యక్షుడు దీనిని గురించి విచారణ జరిపిస్తానని అన్నాడు. ఆ ప్రకారం చెన్నపట్నంలో ఒక విచారణ సంఘాన్ని నియమించగా వారు సాక్ష్యాలు విచారించి హింసలు జరుగుతూ వున్నమాట నిజమేనని 1855 లో ఒక నివేదికను ప్రకటించారు. అంతట ఇలాంటి హింసలు యికముందు జరగకూడదని ప్రభుత్వంవారు శాసించారు. మద్రాసు టార్చరు కమిషను (హింసల విచారణ సంఘము) వారి విచారణలో రివిన్యూ శిస్తు వసూళ్ళలో యీ క్రింది హింసలు జరుగుతూ వున్నట్లు రుజువు అయింది.

శిస్తు బాకీ యివ్వలేని మనిషిని మండుతూవున్న ఎండలో నిలబెట్టి వుంచడము; భోజనానికిగాని, దేహబాధ తీర్చుకోవడానికిగాని వెళ్ళనివ్వకపోవడము; ఒకచోట ఖైదుచేసి వుంచడము; అతని పశువులను పట్టుకొని ఒక దొడ్లో పెట్టి మేతకు పోనివ్వకపోవడము; ఒక బంట్రోతును తైనాతీ [illegible] అతనికి బాకీదారుడుచేతనే రోజు భత్యాలు యిప్పిస్తూ వుండడము, [illegible] వ్రేళ్ళను చిరతలతో నొక్కడము అనగా రెండు కర్రలను కలిపి ఒక [illegible] తాడుకట్టి ఆ కర్రలమధ్య వ్రేళ్ళనుపెట్టి కర్రల కొనలను నొక్కడము; మనిషి మెడను వంచి కాలి వ్రేళ్ళకు అంటతీసి తాడుతోగాని, పై బట్టతోగాని విరిచి కట్టడము, రెండుచేతుల వ్రేళ్ళను ఒకదానిలో ఒకటి చొప్పించి ఇసకపోసి చేతులతో నొక్కడము, తొడపాసెము పెట్టడము; లేంపకాయలు వెయ్యడము, గుద్దడము లేక కొరడాలతో కొట్టడము; ముందుకు వెనకకు పరుగెత్తించడము; చెవులు ఎక్కతియ్యడము, మోకాళ్ళ సందున ఇటికలనుపెట్టి గొంతు కూర్చోబెట్టడము; మాలవాడినో, మాదిగవాడినో, పాకీవాడినో వీపుమీద ఎక్కించి కూర్చోబెట్టడము; ఇద్దరు

బాకీదారుల తలలను ఢీడిక్కొ కొట్టించడము లేదా వాళ్ల ఇద్దరి జుట్టు కలిపి వెనుకకు కట్టడము; బొండను వెయ్యడము, జుట్టును దున్నపోతు తోకకో, గాడిద తోకకో కట్టడము; ఎముకలనో, ఇతర అసహ్యకరమైన పదార్థాలనో మెడలో వెయ్యడము; ఒక్కొకప్పుడు యితర విధాలైన చిత్రహింసలు పెట్ట డముకూడా జరుగుతూ వుండేది.

నేరాలు ఒప్పించడానికీ, ఒప్పించడానికి పోలీసువాళ్ళు పెట్టే బాధలు యింకా చిత్రంగానూ, కఠినంగానూ, క్రూరంగాను వుండేవి. ఉదా హరణానికి : రక్తము ప్రవహించకుండా బాధ పెట్టేటట్టు జబ్బకుగాని, కాలికిగాని చేంతాడును పాము పెనవేసుకున్నట్లు గట్టిగా చుట్టడము, మీసాలు పట్టుకొని లేవదీయడము, చేతులు వెనక్కి విరిచికట్టి కొరడాదెబ్బలు తీయించ డము; ఇనుప ఖడ్డీలు ఎర్రగా కాల్చి వాతలు పెట్టడము; కుమ్మర పురుగును గాని, గులగుల పెట్టి దొలిచే యింకో పురుగునుగాని బొడ్డులోగాని, మర్మావ యవయముల దగ్గరగాని పెట్టి కట్టడము; ఉక్కిరిబిక్కిరి అయ్యేవరకూ మూతిలోగాని, చెరువులోగాని ముంచి యెత్తడము; వృషణములను నొక్క డము, కర్రలతో కొట్టడము; నిద్ర పోనియ్యకపోవడము; పవాణాలతో మావంలోకి పొడిచి కెలకడము; కంట్లో మిరియపుపొడికాని, కారంగాని కొట్టడము, ఇలాంటి చిత్రహింసలు పెడుతూవుంటే ఒక్కొకప్పుడు ఆ దురదృష్టవంతుడు చచ్చిపోవడంకూడా తటస్థించేదనే సంగతికూడా రుజువు అయింది. ఆరువందల యేళ్ళక్రిందట శ్రీనాథుడు వర్ణించిన ఒడ్డెరాజుల పరిపాలనలో జరిగే చిత్రహింసలకి ఒక శతాబ్దం లోపుగానే ఇంగ్లీషు పరి పాలనలోనే జరిగిన చిత్ర హింసలకి తారతమ్యం యేూరా?

---

(Forty years of Progress in the administrationof the Presidency of Madras: Srinivasa Raghava Iyengar, 1897)

# ఆంధ్రేతర రాష్ట్రములలో తెలుగు జనాభా

## (1951 సం॥ నాటి పరిశీలనము)

| | | |
|---|---|---|
| 1. | మద్రాసు, కూర్గు | 33,27,269 |
| 2. | హైదరాబాదు (తెలంగాణా జిల్లాలలో గాక)* | 9,23,384 |
| 3. | మైసూరు | 13,75,732 |
| 4. | మధ్యప్రదేశ్ | 1,72,567 |
| 5. | మధ్యప్రదేశ్‌లో తెలంగి | 2,309 |
| 6. | ఒరిస్సా | 3,42,623 |
| 7. | పశ్చిమబెంగాల్, చంద్రనగరము, సిక్కిము | 49,544 |
| 8. | బీహారు | 18,979 |
| 9. | ఉత్తరప్రదేశ్ | 2,145 |
| 10. | అస్సాము | 17 |
| 11. | బొంబాయి, కచ్ఛ్, సౌరాష్ట్రము | 3,06,949 |
| 12. | కేరళ, తిరువాంకూర్, కొచ్చిన్ | 23,742 |
| 13. | మధ్యభారత్ | 644 |
| 14. | పంజాబు, పెప్సు, ఢిల్లీ, హిమాచలప్రదేశ్, బిలాస్‌పూర్ | 10,070 |
| 15. | రాజస్థాన్, అజ్మీరు | 441 |
| 16. | వింధ్యప్రదేశ్ | 78 |
| 17. | అండమాన్, నికోబార్ దీవులు | 1,044 |
| | మొత్తము | 65,57,421 |

విజ్ఞాన సర్వస్వము - తెలుగు సంస్కృతి,
రెండవ సంపుటము, పుట 1485

# ఏనుగుల వీరాస్వామయ్యగారు బ్రౌను దొరగారికి వ్రాసిన లేఖ




[ఈ లేఖ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమునందలి కాశీయాత్ర చరిత్రనుండి సంగ్రహించబడినది. దీనితో పాటు శ్రీ దిగవల్లి శివరావుగారు సైగంథము తాలూకుపునర్ముద్రణములో చేసిన తర్జుమా కూడా ప్రకటించుచున్నాము. సంపాదకుడు.]

150 సం॥ల క్రిందట చెన్నపట్టణములో నుండిన ఆంధ్ర మహా పురుషుడు ఏనుగుల వీరాస్వామయ్యగారు, ఆంధ్ర భాషోద్ధారకుడైన సి. పి. బ్రౌను దొరగారికి వ్రాసిన లేఖ యిది. ఇందులో వారిద్దరి దస్తూరీలు ఉన్నవి. వీరాస్వామయ్యగారి ప్రజాసేవనుగూర్చిన వివరాలు ఈ గ్రంథము మూడవ భాగములో "మన చెన్నపట్టణము - దాని పూర్వ చరిత్ర" అనే ప్రకరణములో నున్నవి. చరిత్రాత్మకమైన యీ లేఖ, నా తర్జుమాతో 19-11-1941 తేదీ ఆంధ్ర పత్రిక వార పత్రికలో మొదటిసారి ప్రకటింపబడెను.

— ది. వేం. శి.

[illegible] I shall be most happy to attend to the [illegible]
Begging your Pardon for the liberty and [illegible] for your health and [illegible] — I have the honor to be
with [illegible] respect —
My Good & Learned Sir
Your Most Obt [illegible]
& obliged servant —
Veeraswamy.

P.S. I [illegible] to remind my request [illegible] regarding the [illegible] of my [illegible] who is now under Mr [illegible] —
Veeraswamy

Answered 25 Jan 1832 stating that we are not yet ready to print the book, wishing I have a sight of it, and deferring the work of transcribing the [illegible]. Of the portions herein named I possess the [illegible]

The following is a true copy of the text of the above letter of Mr. Veeraswamiah to C. P. Brown Esq. District Judge, Masulipatam. The Original in his handwriting is pasted in the MSS copy of Kasiyatra Charita No. 1407 in the Oriental Manuscripts Library, Madras.

Madras,
15th., December, 1831.

My Good Sir,

Allow me to inform you that I reached Madras quite safe with family in September last, and attend to my duties in the Supreme Court as my long absence put my office into great arrears of business. I was prevented from addressing to your good self more sooner and humbly beg your pardon for the same.

Since my arrival at Madras, I have seen the widow and sons of Langaru Paupiah and ascertained the particulars about the Books called స్కాందం.

They are as follows: స్కాందం. Consists of 6 సంహితలు, 60 ఖండలు, 1 lac గ్రంథం

The names of సంహితలు are as follows:

| | | |
|---|---|---|
| సనత్కుమార సంహిత | ౧ పిట్ర శ్లోకాలు | ౧౫౦౦౦ |
| సూత సంహిత | | ౬౦౦౦ |
| బ్రంహ్మ సంహిత | | ౩౦౦౦ |
| వైష్ణవ సంహిత | ౪ | ౫౦౦౦ |
| శంకర సంహిత | ౫ | ౩౦౦౦౦ |
| సౌర సంహిత | | ౧౦౦౦ |

Of the above six Samhitas Paupiah got the 5th, శంకర సంహిత translated in verse very correctly and delightfully. Indeed I have now with me. If you please I shall send all the six Samhitas to you by bungay or only the Gentoo translation of Sankar Samhita as shall be directed.

During last travel to Benares I took my route in going through Cuddapah, Hyderabad, Nagapore, Jabalpore, Mirjapore and Allahabad. In return I came by Gazpore,

Chaprah, Patna, Gyah, Calcutta, Pooree, Ganjam and all the northern districts and kept a correct journal of the same. I beg also to inform you that in that Journal I have been giving correct brief histories of all the Hindoo holy places rivers etc., and made several observations upon Hinduism, Mahammadism and Christianity, also upon Hindu mythology and astronomy. I have also commented shortly upon customs, manners, laws and late Governments of the several places I passed by and the causes of their varieties from one to the other.

As it seems there is a demand for copies of that work, I beg to know whether the press you have been proposing at Masulipatam will find leisure to present about three hundred copies of the same which I believe will be forth with subscribed and sold. The work now consists of about 480 sides in manuscripts in foolscap paper. If permitted I shall send a copy to you by Bungy post which you can at your leisure peruse and favour me with your opinion. I wish not I assure you to be benefited by a presenting of this work and shall be happy to assign over all the benefits arising by a sale of the copies and pay any loss that may incur in the event of there being any which I am sure will not be the event. Accept my thanks for all the kindness you were pleased to show during my stay at Masulipatam and please to command me for any thing you require at this place. I shall be most happy to attend the same.

Begging your pardon for the liberty and praying for your health and happiness.

I have the honour to be with great respect.

My good and Honoured sir,

Yours most obedient, dutiful and obliged servant,

(Sd.) Y. VEERASWAMY.

| | | |
|---|---|---|
| * బ్రాహ్మ్య సంహిత | ౩ | ౩౬౦౦ |
| * వైష్ణవ సంహిత | ౪ | ౫౦౦౦ |
| * శంకర సంహిత | ౫ | ౩౦౦౦౦ |
| * సౌర సంహిత | ౬ | ౧౦౦౦ |

ఈ ఆరు సంహితలలో పాపయ్యగారు అయిదవదైన శంకర సంహిత * నిర్దిష్టమైన చక్కని తెలుగు పద్యములలోని కనుపదింపజేశారు. దానిని నేను తెచ్చినాను. తమరు పంపమంటే ఆ ఆరు సంహితలను బంగీలో పంపుతాను; లేదా శంకర సంహిత తెలుగు పద్యము మాత్రమే పంపుతాను. ఏ సంగతిన్నీ తెలుప కోరుతాను.

ఈ సారి కాశీయాత్ర చేయడంలో నేను కడప, హైదరాబాదు, నాగపూరు, జబల్‌పూరు, మిరిజాపూరు, అలహాబాదుల మీదుగా పోయినాను. తిరిగి వచ్చేటప్పుడు నేను ఘాజీపూరు, చప్రా, పట్నా, గయ, కలకత్తా, పూరీ (జగన్నాధము) గంజాము మీదుగా అన్ని ఉత్తర జిల్లాలలో నుండి వచ్చాను. దీనిని గురించిన సరియైన వృత్తాంతము వ్రాస్తూ వచ్చాను. ఈ వృత్తాంతంలో హైందవ పుణ్యస్థలము లన్నిటియొక్క చరిత్రలు, మహా నదుల చరిత్రలు మొదలైనవి వ్రాశాను. హిందూ మహమ్మదీయ క్రైస్తవ మతములను గురించి, హిందూ పురాణములను గురించీ, జ్యోతిశ్శాస్త్రము గురించి చర్చించాను. వఱిన్ని నేను చూచిన ఆయా ప్రదేశములలోని ప్రజల యాచారాలు, వ్యవహారాలు, కులాలు, ధర్మాలు, ప్రభుత్వాలు ఒక చోటుకు ఇంకొక చోటుకు భేదము లుండడానికి గల కారణాలున్నూ వర్ణించాను.

ఈ పుస్తకము చాలమంది కావలెనంటున్నారు. మచిలీపట్టణంలో మీరు స్థాపిస్తామని సెలవిచ్చిన ముద్రాక్షరశాలలో యీ పుస్తకాన్ని అచ్చు

వేయించి మూడువందల ప్రతులు ప్రకటించడాని కవకాశ ముంటుందా? ఈ పుస్తకాలు శీఘ్రంగానే అమ్ముడై పోతాయని నా నమ్మకము. ఈ పుస్తక మిప్పుడు వ్రాతలో 480 అరఠావు లున్నది. తమ సెలవైతే బంగీ తపాలులో తమకొక ప్రతిని పంపుతాను. తమరు నెమ్మదిమీద చిత్తగించి దాని పైన తమ యభిప్రాయం దయచేయవచ్చును.

ఈ పుస్తకం ప్రకటించడంలో దీనివల్ల నేను లాభము పొందదలచుకోలేదని మనవి చేస్తున్నాను. దీని ప్రతులను అమ్మడంవల్ల వచ్చే లాభాన్ని యిచ్చివేయడానికి నాకు యేలాంటి అభ్యంతరమున్నూ లేదు. నష్ట మేమైనా వస్తే నేనే భరించగలను. నష్టము రాదనే నా దృఢ విశ్వాసము.

నేను మచిలీపట్టణమునన్న కాలములో తాము నా యెడల చూపిన దయకు నా కృతజ్ఞతాభివందనాలు స్వీకరింపగోరుతాను. ఈ యూరినుంచి తమ కేమి కావలసినా నాకు తెలిపితే నేను ఆ పనిని జాగ్రత్తగా చేస్తాను

ఇలాగ చనవు తీసికొన్నందులకు క్షమింపవేడుతూ తమ యారోగ్యము కొరకు, సౌఖ్యముకొరకు పరమేశ్వరుని ప్రార్థిస్తూ అతి గౌరవ పురస్సరంగా విరమించు తమ విధేయుడు, అనుగ్రహ పాత్రుడు, భృత్యుడు,

(Y) యే. వీ రాస్వామి

తాజా కలం.

ప్రస్తుతం స్టోనుహౌసు దొరగారి వద్దనున్న నా తమ్ముడ్ని గురించి నేను తమర్ని వేడుకున్న విషయం తమకు వినయముతో జ్ఞాపకం చేస్తున్నాను.

(Y) యే. వీ రాస్వామి

సి. పి. బ్రౌనుగారి నోటు :

ఆ పుస్తకాన్ని ప్రకటించడానికి యింకా సిద్ధంగా లేమనిన్నీ, ఆ పుస్తకమును పంపితే చూస్తాననిన్నీ స్కాందమును యీ క్రింది భాగాలను తెనిగించే పని ప్రస్తుతము నిలుపుతున్నాననిన్నీ, సూతసంహిత నా వద్ద నున్నదనిన్నీ తెలుపుతూ 1832 జనవరి 25 వ తేదీన జవాబు వ్రాయడ

ప్రక్క పేజీలోని పటములో

"జెంటూ టవున్" అనేది

తెలుగువారి పేట. ఇందులోని పేరులన్నీ తెలుగు పేర్లే.

దీని వివరాలు 3 వ భాగంలో "మన చెన్నపట్నం - దాని

పూర్వ చరిత్ర" అనే ప్రకరణంలో నున్నవి.

[illegible]




1773 సంవత్సరంనాటి చెన్నపట్నం